# వైఖానసాగమము

రచన (ఆంగ్ల) : ఆచార్య యస్.కె.రామచంద్రరావు
తెలుగు అనువాదం : ఆచార్య పి.యస్. అప్పారావు



తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి

# వైఖానసాగమము

రచన (ఆంగ్లం) :

ఆచార్య యస్. కె. రామచంద్రరావు

అనువాదం (తెలుగు) :

ఆచార్య పోణంగి శ్రీరామ అప్పారావు




ప్రచురణ

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

**2003**

# ముందుమాట

వైదిక వాఙ్మయంలో అర్చావిధానానికి ఆగమాలు మూలస్తంభాలు. మానవుని ప్రాపంచిక జీవనాన్ని క్రమబద్ధం చేసి మనస్సును భగవంతునిపై లగ్నం చేసి, తద్వారా మోక్షసాధనకు ప్రతీక ప్రధానంగా రూపొందించిన అర్చావిధానానికివి మూలసూత్రాలు. ప్రధానంగా ఆగమాలలో చెప్పబడ్డ క్రియలన్నీ యజ్ఞఫలాన్నే ప్రసాదిస్తాయి.

ఆగమాలు ప్రధానంగా వైఖానస పాంచరాత్ర శైవములని మూడు విధాలు. వైదిక మార్గంగా హోమాదులతో కూడింది వైఖానసాగమము. తాంత్రికంగా ముద్రావిధానంతో ఉండేది పాంచరాత్రాగమం. ఈ రెండు ఆగమాలు వైష్ణవ సిద్ధాంతాలకు అనుగుణంగానే రూపొందింపబడ్డాయి. ఇక శైవాగమంకూడ వైదిక పద్ధతులకు అనుగుణంగానే ఉంటుంది. ఈ మూడు ఆగమాలలో వైఖానసాగమము తిరుమల శ్రీ వేంకటేశ్వరుని అన్ని పూజలలోను ఆచరించబడుతున్నది.

ఈ వైఖానసాగమానికి సంబంధించిన మహర్షుల పురాతన గ్రంథాలు అనేకం. అందు చెప్పబడ్డ వైఖానససమాజ, తత్వచింతన, ఆగమ విశిష్టత, పూజావిధానాది అంశాల్ని వివరిస్తూ ఆంగ్లభాషలో ఎస్.కె. రామచంద్రరావుగారిచే వ్రాయబడ్డ గ్రంథం మొట్టమొదటి వివరణ గ్రంథం అని చెప్పవచ్చు. చక్కని సరళ భాషలో ఆచార్య పోణంగి శ్రీరామ అప్పారావు గారు తెలుగులోనికి అనువదించి ముద్రింపబడిన ఈ గ్రంథం ప్రతులు పూర్తి చెల్లిపోయినందువల్ల మళ్లీ ముద్రిస్తున్నాం.

ఈ అనువాదగ్రంథం ఆగమజ్ఞులకు ఓ కరదీపిక కావాలని మా ఆశ, విశ్వాసం.

**శ్రీ అజేయ కల్లం,** ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు



**ఆగమ ఆవిష్కారక త్రిమూర్తులు**

L to R శ్రీ P S R అప్పారావుగారు, శ్రీ S K రామచంద్రరావుగారు, శ్రీ A S నారాయణదీక్షితులుగారు

# ఆముఖం

మన దేశం యొక్క అమూల్యమైనవారసత్వాన్ని భద్రపరచటం కోసం, మన సంప్రదాయంలోని ముఖ్యములైన విలువలను ప్రజలు గుర్తించేటట్లు చేయుటం కోసం 'కల్పతరు రిసెర్చి అకాడమి' 1981 లో బెంగుళూరులో స్థాపించ బడింది. ఈ లక్ష్యంలో కల్పతరు రిసెర్చి అకాడమి చాలా ముఖ్యములైన పథకములను చేపట్టింది. వాటిల్లో ముఖ్యమైనవి- (1) అయిదు సంపుటాల 'ప్రతిమాకోశం' అనే విజ్ఞాన సర్వస్వం; ఇందులో మూడు సంపుటాలు ఇంతకు ముందే వెలుగు చూసినవి. (2) రెండవ పథకం పన్నెండు సంపుటాల 'ఆగమకోశం'. (3) ఇంక మూడవ పథకం ఆలయార్చనలోని 'మండలములు' గూర్చి; దీనికి సంబంధించిన రెండు సంపుటాలు ఇంతకు ముందే వెలువడినవి. (4) మరో పథకం 'శ్రీవిద్య' కు సంబంధించినది; దీని మీద ఒక సంపుటం ఇంతకు ముందే వెలువడినది.

ఆలయార్చనలోని క్రియాకలాపమునకు సంబంధించిన ప్రామాణికమైన సమాచారం-ఆలయ నిర్మాణం, ప్రతిమా ప్రతిష్ఠ (ఇవి ఆలయసంబంధి); ఆ సాహిత్య సంపద, అందలి వైవిధ్యం (ఇవి ఆగమసంబంధి) - అంటే ఆలయం, ఆగమం- ఈ రెండింటికి సంబంధించిన ప్రామాణికమైన సమాచారం అందించటమే ఆగమకోశం యొక్క ధ్యేయం. ఇందులో తొలి సంపుటం విషయ పరిచయాత్మకం, రెండవ సంపుటం 'శైవాగమ-శాక్తాగమాలు'కు సంబంధించినది. ఇందులో ఆ ఆగమాల సాహిత్యం, ఆ ఆగమానుయాయుల భావనలు విపులంగా వివరింపబడినవి.

ఇంక మూడవ సంపుటం-వైఖానసాగమం, రెండు వైష్ణవాగమాలలో వైఖానసాగమాన్ని గూర్చి భారతేతిహాసజ్ఞులకు **(Indologists)** తగిన పరిచయం లేదు (రెండవ ఆగమం- పాంచరాత్రాగమం; ఇది నాలుగవ సంపుటంగా వెలువడుతుంది). వైఖానస ఆగమాన్ని గూర్చి, దాని సాహిత్యం - తత్త్వచింతన - కర్మకాండలను గూర్చి సమగ్రమైన సమాచారం అందిస్తున్న ఈ సంపుటం-ఈ మార్గంలో బహుశః తొలి రచన. తొలి రెండు సంపుటాలవలెనే ఈ సంపుటం కూడా ప్రజల ఆదరాభిమానాలను చూరగొనగలదని విశ్వసిస్తున్నాము.

పలుదిశలనుంచి సహాయం అందిస్తున్న వారందరికి ఈ అకాడమి కృతజ్ఞతలు తెలియజేస్తున్నది. ఆగమకోశ సంపుటాలను రచించటానికి దయతో అంగీకరించిన - విద్యాలంకార - శాస్త్ర చూడామణి - సంగీతకలారత్న

బిరుదాంకితులు ఆచార్య యస్.కె. రామచంద్రరావుగారికి ఈ అకాడమి ఋణపడి ఉన్నది. తొలి రెండు సంపుటాలతో పాటు ఈ మూడవ సంపుటం కూడా వారి ప్రేమఫలమే. ఈ సంపుటాలను సమగ్రములుగా, ప్రామాణికములుగా, విషయపూర్ణములుగా రచించటంలో వారు శక్తివంచన లేకుండా కృషిచేసినారు.

న్యూఢిల్లీలోని కేంద్రప్రభుత్వం యొక్క మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వంలోని విద్యాశాఖ అధికారులకు-వారు అందించిన ఉదారమైన సహాయానికి, ప్రోత్సాహానికి ఈ అకాడమి కృతజ్ఞతలు తెలుపుకొంటున్నది.

ఈ సంపుటమును తక్కువ వ్యవధిలో, అందంగా ముద్రించిన పయోనిధి ప్రింటర్సు (ప్రై) వారి సహకారమునకు కృతజ్ఞతలు.

ఈ సంపుట ప్రచురణలో అనేక విధాలుగా సహాయపడిన స్నేహితు లకు, శ్రేయోభిలాషులకు నాపక్షాన అకాడమి పక్షాన హృదయపూర్వకములైన కృతజ్ఞతలు.

అక్షయములైన విలువలుకల గ్రంథాలను ప్రచురిస్తున్న 'కల్పతరు రిసెర్చి అకాడమి' కృషిని సహృదయులు గుర్తింపగలరని మాదృఢ విశ్వాసం. ఈ అకాడమి, తన ప్రచురణలను అన్నింటిని అందంగాముద్రించి, సరసమైన ధరలకు ప్రజలకు అందిస్తున్నదని విన్నవించుకొంటున్నాము. భారతీయ సనాతన సంస్కృతిని పెంపొందించటమే ఈ అకాడమి ప్రధానలక్ష్యం.

బెంగుళూరు,<br>
అశ్వీన 30, 1912<br>
22-10-1990

దైవజ్ఞ కె.యస్.సోమయాజి<br>
ప్రధానసంపాదకుడు, డైరక్టర్,<br>
కల్పతరు రిసెర్చి అకాడమి.

# ఆమోదం

అర్షవాఙ్మయం సువిస్తారమైనది. ఎందెందు వెదకినా తత్త్వచింతన - మోక్షప్రాప్తిమార్గాన్వేషణ - ఆధ్యాత్మిక సంపదలే అధికం. వీటికి-వేదవాఙ్మయ భాగాలైన సంహిత-బ్రాహ్మణ-అరణ్యక- ఉపనిషత్తులు మూలగ్రంథములుగానూ, కల్ప-ఛందో-వ్యాకరణాదులు అనుబంధములు గానూ వైదికసాహిత్యంలో సుస్థిర స్థావరమేర్పరుచుకొన్నవి.

వైదిక వాఙ్మయానికి అనుబంధాలైన కల్పసూత్రసాహిత్యం నుంచే ఆగమ సాహిత్యం ఆవిర్భవించినదని వైదికవేత్తల అభిమతం. ఆ అగమం ప్రధానంగా మూడు రకాలు- వైఖానస- పాంచరాత్ర-శైవములని. ఈ ఆగమాలలో బింబప్రతిష్ఠ-అర్చన-ప్రాయశ్చిత్తాదుల వివరణములే కాక జ్ఞానయోగ భాగాలు కూడా సువిశదంగా నిర్దేశింపబడినవి. ఈ ఆగమ గ్రంథములన్నింటినీ తరచి చూచినప్పుడు వాటి ధ్యేయం ఒక్కటిగానే గోచరిస్తున్నది.

'అభిరూప్యాచ్చబింబస్య, పూజాయాశ్చ విశేషతః ।
సాధకస్యవిశ్వాసాత్, సన్నిధౌ దేవతా భవేత్'॥ (6-76)

-అని కులార్ణవతంత్రం నిర్దేశిస్తున్నది. భగవచ్ఛాస్త్ర విహిత లక్షణ లక్షితమైన రామణీయకత బింబాభిరూప్యము. శ్రౌతసదృశ ప్రవర్తనా ప్రతిష్ఠాపకుడు అర్చకుడు. వర్ణాశ్రమధర్మ వివేక- ఆచరణము అతని తపోయోగం- వీటి సమ్మేళనమే అర్చాస్వరూప ఆవాసము. అందలి అర్చన-

అభీష్ట ఫలదానాచ్చ చతుర్వర్గ ఫలాశ్రయాత్ ।
వందనాత్ సర్వదేవానా మర్చనం సముదాహృతమ్ ॥ (17.71)

-అని కులార్ణవ తంత్రం విశదం చేసినది.

విశిష్టములైన ఇటువంటి అంశములను బోధించే ఆగమశాస్త్ర వైశిష్ట్యము వెలకట్టలేనిది, వర్ణనాతీతమైనది. వర్ణనాతీతమై ప్రకాశించే ఆగమ గ్రంథాల విషయవివరణ భారతీయులకు ఎంతో ఉపకారి కాగలదు.

అందుచేతనే భారతీయ సంస్కృతి పరిరక్షణకు, ప్రచారముకు, ఆగమ గ్రంథాల పరివ్యాప్తికి నడుంకట్టి దైవజ్ఞ శ్రీ కె. యస్. సోమయాజిగారి నిర్దేశకత్వంలో ముందంజవేస్తున్నది బెంగుళూరులోని కల్పతరు రిసెర్చి అకాడమి. దీని ధ్యేయం - ఆలయార్చనా విధానాలను, తత్సంబంధి విషయాలను నిర్దేశించే ఆగమాలను గూర్చి వేర్వేరు గ్రంథాలుగా పన్నెండు సంపుటాలతో

ఆగమకోశం ప్రచురించటం. ఆయా ఆగమాలకు సంబంధించిన విషయా లను సమ్యక్ దృష్టితో పరిశీలించి, గ్రంథస్థం చేయగలవారు లభించటం నిజంగా అదృష్టం. అటువంటివారే విద్యాలంకార, శాస్త్రచూడామణి, సంగీత కళారత్న బిరుదాంచితులు ఆచార్య యస్. కె. రామచంద్రరావుగారు. జాతిజీవనంతో ముడిపడి ఉన్న ముఖ్యమైన ఆగమాలను గూర్చి విశేష పరిశోధన చేసి, రచన కొనసాగిస్తున్నారు ఆచార్య రామచంద్రరావు గారు. వీరు పుంభావ సరస్వతీమూర్తి.

కల్పతరు రిసెర్చి అకాడమి వారి ఆధ్వర్యంలో పన్నెండు సంపుటా లలో నేటికి ఆరు ప్రచురింపబడినవి. ఈ వరుసలో మూడవది ఈ 'వైఖానసాగమము'- ఈ గ్రంథం ఆంగ్లభాషలో ఉన్నది.

జగత్ప్రసిద్ధిపొందిన కలియుగదైవం అయిన తిరుమల శ్రీవేంకటేశ్వర స్వామి వారి సన్నిధిలో అనునిత్యం వైఖానసాగమం ప్రకారమే అర్చన జరుగుతున్నది. ఎన్నో తరాలు మారినా వైఖానస అర్చకులే నేటికీ సంప్ర దాయరీతిలో అర్చనాదులు కొనసాగిస్తున్నారు. వైఖానసాగమ ప్రాచీనతను గూర్చి, వైఖానసులను గూర్చి తెలిసికోదలచిన జిజ్ఞాసువుల కోసమే ఈ 'వైఖానసాగమం' అనే గ్రంథం రచింపబడినదని చెప్పవచ్చు. సంస్కృతాంగ్ల భాషా పరిచయం లేని వారికి ఉపయోగపడవలెనన్న ఉద్దేశంతో దీని ఆంధ్రీకరణ తలపెట్టినాము.

ఆచార్య యస్.కె. రామచంద్రరావుగారు ఎంతో పరిశోధనచేసి, ఆంగ్లంలో రచించిన గ్రంథమును ఆంధ్రీకరించవలెనని శ్రీవారణాశి చిన చెంచయ్య, శ్రీ గరిమెళ్ళ రామమూర్తి గార్ల ద్వారా ఆచార్య పోణంగి శ్రీరామ అప్పారావు గారిని కోరినాము. వారు బహుకార్యనిమగ్నులైనా సహృదయంతో ఇందుకు అంగీకరించి, కార్యసాఫల్యం చేకూర్చినందుకు వారికి నా కృతజ్ఞతలు.

ఆచార్య అప్పారావుగారు తెలుగు భాషా బోధకులు, ఆంధ్రనాటక చరిత్ర నిర్మాతలు, పంచమవేదంగా ప్రసిద్ధి పొందిన భరతముని నాట్యశా స్త్రమును, నందికేశ్వరుని అభినయదర్పణమును తెలుగులో ప్రామాణికంగా అందించిన పండితులు. వారికి వాదోడుగా నిలిచిన విద్వచ్ఛిరోమణి, బ్రహ్మశ్రీ తెలకపల్లె విశ్వనాథశర్మగారు. ఈ ఇరువురి సహృదయ సహకారం వల్లనే మా చిరకాలవాంఛ ఈనాటికి సఫలమైనది. ఆగమవిషయాలను విశదం చేసిన వారు శ్రీ వేదాంతం శ్రీ విష్ణుభట్టాచార్యులు, యమ్.ఏ., యమ్.ఫిల్. (రిసెర్చి స్కాలర్, రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం, తిరుపతి)

తెలుగు అనువాదమును చూచిన వేంటనే, తిరుమల తిరుపతి దేవస్థానం పక్షాన దీనిని ప్రచురించుటావికి అంగీకరించిన సహృదయులు, టి. టి. డి. కార్యనిర్వహణాధికారి శ్రీ ఎమ్. వి. యస్. ప్రసాద్, ఐ.ఎ.ఎస్. గారు.

ఈ బృహత్ కార్యక్రమములో చేదోడు వాదోడుగా నిలచిన శ్రీ డి. విఖనసాచార్యులు, శెక్రటరీ, శ్రీ విఖనస ట్రస్టు మరియు శ్రీ వైఖానస దివ్యసిద్ధాన్త వివర్ధినీ సభవారికి మరియు సహాయపడిన మహానుభావులు ఎందరో, వారి అందరకు తిరుమల శ్రీనివాసుడు పరిపూర్ణ ఆయురారోగ్య ఐశ్వర్యాదులు కలిగించవలెనని సదా ప్రార్థిస్తూ ---

వైఖానసార్యదివ్యాజ్ఞా వర్ధతామభివర్ధతామ్.

13.8.1992
అంగిరస శ్రావణ
పూర్ణిమ.

పైడిపల్లె శ్రీనివాస నారాయణ దీక్షితులు
అర్చక మిరాశీదారు,
తిరుమల తిరుపతి దేవస్థానం.
వైస్ ప్రెసిడెంటు, శ్రీవిఖనస ట్రస్టు,
తిరుమల.

# పరిచయం

ఆగమకోశమందలి రెండు వైష్ణవాగమాలలో ఈ సంపుటం 'వైఖానసం'; తరువాత వెలువడే సంపుటం పాంచరాత్రం. దేవాలయాలలో విష్ణుపూజ క్రీ. పూ. రెండవ శతాబ్దము నుంచీ ఉన్నదని తెలియవస్తున్నది (ఇందుకు శాసనాధారములు, తదితర ఆధారములు ఉన్నవి). ప్రాచీన దేవాలయాలు విష్ణు దేవతాకములని తెలియవస్తున్నది - ఉత్తరభారతంలోని భీతర్‌గాం, దేవ్‌గర్ దేవాలయాలు ఇందుకు ఉదాహరణములు. క్రీ.శ. మూడు నాలుగు శతాబ్దములలో గుప్తరాజులు వీటిని నిర్మించారు. ఇందులో ఆశ్చర్యపడవలసినదిలేదు. మన దేశంలో భక్తి సంప్రదాయం దేవాలయ సంస్కృతికి మార్గదర్శకమైనది (అయితే విష్ణుపూజనమే ప్రాధాన్యం వహిం చింది). ఈ అంశం మహాభారతంలో సూచింపబడింది. అందుకు భగవద్గీత ఉదాహరణమైంది.

దక్షిణభారతాన్ని పరిపాలించిన శాతవాహన చక్రవర్తి- రెండవ శాతకర్ణి (క్రీ.పూ. 184-125 ప్రాంతాలు) యొక్క రాణి అయిన నాగనిక వేయిం చిన నానాఘాట్ శాసనమును పట్టి విష్ణువు, వేదవిహితమైన దేవుడుగా అర్చింపవలసిన వాడని తెలియవస్తున్నది. ఆ శాసనంలో ఇంద్రుడు, లోక పాలురు, యముడు, వరుణుడు, కుబేరుడుతో పాటు సంకర్షణ-వాసుదేవుల ప్రశంసకూడా ఉన్నది. "సంకర్షణ-వాసుదేవులు భాగవత సంప్రదాయంలో భగవంతుడుగా ఎన్నబడిన దేవదేవుని 'వ్యూహ' రూపములనీ" వారు వృష్ణి వంశ వీరులైన బలరామ-కృష్ణులకు ప్రాతినిధ్యం వహిస్తున్నారనీ అందరకు తెలిసిన సత్యమే.

క్రీ.పూ. 2వ శతాబ్దంనాటి ఇంకో శాసనం నారాయణునకు ఆల యము (= నారాయణ వాటిక)ను పేర్కొన్నది (ఘోసుండి, ఇ.ఎల్. 12-పుట-204). ఈ ఆలయాన్ని భాగవతుడైన గజాయనుడు అనే రాజు నిర్మించినాడు. అతడు అశ్వమేధయాగం చేసినాడు (కారితోఽయమ్‌రాజ్ఞా భాగవతేన గజాయనేన........అశ్వమేధయాజినా). దేవాలయాలలో ప్రతిమా ర్చన విషయంలో వైదిక కర్మకాండ చోటు చేసుకోవాలి అనే వైఖానసభావన యొక్క ప్రాచీనతను ఈ శాసనం సూచిస్తున్నది. ఈ భావన తొలి గుప్తరాజులలో కూడా గోచరిస్తున్నది. వారు భాగవతులేకాక,'కర్మకాండ' లో విశ్వాసం కలవారుకూడా. ఉదాహరణకు-రెండవ చంద్ర గుప్తుడు (= విక్రమాదిత్యుడు) 'పరమభాగవతుడు', అశ్వమేధయాగంచేసినవాడు.

'బాయన' (రాజస్థాన్‌లోని భారత్‌పూర్) లో లభించిన విక్రమాదిత్యుని బంగారు నాణెముల మీద చతుర్భుజుడైన విష్ణువు, రాజునకు చక్రమును బహూకరిస్తున్నట్లుగా ఉన్నది. అంతేకాదు, దానిక్రింద 'చక్ర విక్ర' అనే బిరుదుకూడా ఉన్నది. 'విష్ణువు స్వయంగా అర్చకుని తన భక్తునిగా చేసు కొంటాడు' అనే వైఖానసవిశ్వాసమునకు ఇది ఉదాహరణగా ఉన్నది కదూ? ఉదయగిరి (భిల్సాదగ్గర) లో 'వాసుదేవ విష్ణువునకు నిర్మింపబడిన దేవాలయం ఉన్నది. ఇది క్రీ.శ. 402 లో నిర్మింపబడినది. ఇక్కడ ఉన్న ఒక శాసనం ఉత్తర భారతంలో, గుప్తరాజుల పరిపాలనా కాలంలో భాగవత సంప్రదాయమునకు గల జనప్రియత్వమును సూచిస్తున్నది.

ఇంక దక్షిణ భారతం. వైఖానసాగమం పూర్తిగా దక్షిణ భారతం యొక్క బహూకరణ. గాంగ రాజుల పరిపాలన ప్రారంభమైన నాటికే విష్ణ్వర్చన ప్రజల ఆసక్తిని చూరగొన్నది. తొలి గంగరాజుల పేర్లు - మాధవ (క్రీ.శ 350 లో మరణం), హరివర్మ, విష్ణుగోప, తాడంగల మాధవ (క్రీ.శ. 440-469) మున్నగునవి పైసత్యమును స్పష్టం చేస్తున్నవి. ఈ రాజులు తమను 'నారాయణ చరణానుధ్యాతలు'గా వర్ణించుకొన్నారు. కన్నడ శాసనాలలో మొదటిది (క్రీ. శ. 450 ప్రాంతాలనాటిది) అయిన హాల్మిడి శాసనంలో విష్ణుస్తోత్రపరమైన ప్రార్థనా శ్లోకమున్నది.

"జయతి శ్రీపరిష్వంగ శార్ఙ్గవాన్పతి రచ్యుతః ।
దానవాక్ష్ణోఃయుగాంతాగ్నిః శిష్టానాంతు సుదర్శనః ॥"

-లక్ష్మీదేవి చేత కౌగలింపబడినవాడు, శార్ఙ్గధరుడు, ప్రభువు, దానవుల అక్షులకు యుగాంత- అగ్ని, శిష్టులకు సుదర్శనుడు అయిన అచ్యుతుడు జయించునుగాక! (శార్ఙ్గమానతి రచ్యుతః అని ముద్రిత పాఠం: దీని అర్థం బోధపడటం లేదు. ఇది లేఖకదోషం అయి ఉంటుందనీ, శార్ఙ్గవాన్ పతిః అచ్యుతః అని ఉండటం సమంజసమనీ బ్రహ్మశ్రీ తెలకపల్లె విశ్వనాథశర్మగారి సూచన-కాగా, అనువాదం అవిధంగానే సాగినది - ఆంధ్రానువాదకుడు).

పై శ్లోకంలో విష్ణువు 'అచ్యుతుడు'గా పేర్కొనబడినాడు. ఆయన శ్రీయుతుడు; కాగా 'లక్ష్మీవిశిష్టాద్వైతం' అనే వైఖానస భావనకు మూల బీజములు ఈ శ్లోకంలో గోచరిస్తున్నవి.

ఒక గొప్ప సామ్రాజ్యమును స్థాపించవలెనన్న తలంపుతో పల్లవులు, వింధ్య పర్వతశ్రేణిని దాటి దక్షిణ భారతంలో అడుగుపెట్టినప్పటినుంచి

దక్షిణ భారతంలో వైష్ణవోద్యమం బలంపుంజుకొన్నది. తాలగుండ శాసనం (క్రీ.శ. 450 ప్రాంతాలు) వేయించిన కదంబ రాజు యొక్క ముత్తాత అయిన మయూరశర్మ, పవిత్ర గ్రంథ సముదాయమును అధ్యయనం చేయటం కోసం పల్లవుల రాజధాని అయిన కాంచీపురం వెళ్ళినాడు. తాలగుండలో మహాదేవునకు ఒక ఆలయం ఉన్నట్లు పై శాసనం తెలుపుతున్నది. పల్లవుల వలె, కదంబ రాజులు కూడా వైదిక సంస్కృతికి బాగా దోహదం చేశారు. పెక్కు దేవాలయముల నిర్మాణములను ప్రోత్సహించినారు. పల్లవరాజైన మొదటి మహేంద్రవర్మకు 'చైత్తకారి' (= ఆలయ నిర్మాత) అనే బిరుదు ఉన్నది. అయన, చెంగల్పట్టు, ఉత్తర-దక్షిణ అర్కాటులు, తిరుచ్చిరపల్లి జిల్లాలలో దేవాలయములు నిర్మించినాడు.

తొలి బాదామి చాళుక్యులు వ్యక్తిగతంగా వైష్ణవులని చెప్పవచ్చు. ఈ వంశపు రాజులలో సుప్రసిద్ధుడు అయిన మంగళీశుడు (క్రీ.శ. 596-619) ఒక శాసనంలో, తనను 'పరమ భాగవతుడు'గా వర్ణించుకొన్నాడు (అయినా ఈతడు మహాకూటేశ్వర భక్తుడు కూడా). ఈతడు, మహోదాత్తము, రాయితొలిచి నిర్మించినది అయిన విష్ణుగృహమును నిర్మింపజేసినాడు. అక్కడ ఉన్న ఇటువంటి మూడు నిర్మాణములలో ఇదే మొదటిది (ఇది, మంగళీశుడు సింహాసనం ఎక్కటానికి ముందే క్రీ.శ. 578లో పూర్తి అయినది). ఇది ప్రధానంగా విష్ణ్వాలయం అయినప్పటికీ, విష్ణువునకు కుడి ప్రక్క బ్రహ్మ, ఎడం ప్రక్క శివుడు ప్రతిష్ఠితులై ఉన్నారు- ఇది 'త్రైపురుషాలయం'. ఇటువంటి ఇంకో ఆలయాన్ని వినయాదిత్యుని (క్రీ.శ. 691-696) రాణి నిర్మింపజేసినది. వైఖానససూత్రం ప్రకారం ఇది మధ్యమ తరగతికి చెందిన ఆలయం. ఉత్తమ తరగతి ఆలయంలో విష్ణువుయొక్క పరివార దేవతలు కూడా ఉంటారు. ఇంక, అధమ తరగతి ఆలయంలో విష్ణువు ఒక్కడే ఉంటాడు. (రాయి తొలిచి నిర్మించిన ఆలయం =గుహాలయం = Rock-cut-temple).

మంగళీశుడు చూపిన మార్గమును పల్లవరాజైన మహేంద్రవర్మ (క్రీ.శ. 580-630) అనుసరించినాడు. ఈయన మండగపట్టులో సుప్రసిద్ధమైన రాయి తొలిపించి దేవాలయాన్ని నిర్మింపజేసినాడు (బ్రహ్మేశ్వర - విష్ణు - లక్షితాయతనం). అంతేకాదు, ఈతడు మహేంద్రవాడిలోని మహేంద్ర విష్ణు గృహమును, మామండూరులోని విష్ణువు యొక్క గుహాలయమును, ఇంకో ఏడు రాయితొలిపించిన (= గుహ) ఆలయాలను నిర్మింపజేసి

నాడు. వెనువెంటనే సింగప్పెరుమాళ్ కోయిల్‌లో నరసింహగుహాలయం, సింగావరంలో రంగనాథాలయం, మామల్లపురంలో ఆదివరాహ-మహావరాహ-రామానుజ ఆలయాలు వెలసినవి. ఈనిర్మాణములన్నీ వైష్ణవ మత వ్యాప్తిని విశదం చేస్తున్నవి. అంతే కాదు వైఖానస సూత్రం ప్రకారం ఉత్తమ తరగతి ఆలయాలను నిర్మించాలనే ప్రయత్నం దృఢంగా గోచరిస్తున్నది.

పాండ్యరాజులు (క్రీస్తునకు కొన్ని శతాబ్దముల పూర్వం పతంజలి కాత్యాయనులు పేర్కొన్న ప్రాచీన రాజవంశీయులు) కూడా వైష్ణవం వైపు మొగ్గు చూపిన వారే - వీరు కావేరీనదికి, సముద్రమునకు మధ్య ఉన్న భూభాగమును మధురై రాజధానిగా పాలించినారు. తమిళ రచన అయిన 'పురనా నూరు' ప్రశంసించినట్లుగా, వారిలో ఒక రాజు (కుడుమి) నకు ఉన్న బిరుదును పట్టి (పలయాగశాలై కుడుమి పెరువాళుడి) ఆ రాజులు వేద సంప్రదాయమునకు చెందినవారు. ఆ రాజులు గొప్ప యాగములు చేసినారు. వీర కేరళ విణ్ణగర్, విష్ణుగృహం వంటి దేవాలయములను నిర్మింపజేసినారు. అర్వాచీన రాజులలో, అంటే క్రీ.శ. 1251 లో సింహాసనమధిష్ఠించిన మొదటి జటావర్మ సుందర పాండ్య 'తిరువరంగ' (=శ్రీరంగ) ఆలయమును స్వర్ణఖచితం చేసినాడు (కోయిల్ పొన్ వేంద పెరుమాళ్). తొలిరాజులలో ఒకడైన నెడురింజడైయన్, కోయంబత్తూరు దగ్గరలో ఉన్న 'పెరూర్'లో విష్ణ్వాలయమును నిర్మించినాడు. ఆయన మంత్రి అయిన మధురకవి మధురై దగ్గరలో ఉన్న ఆనైమలైలో నరసింహ పెరుమాళ్ ఆలయాన్ని భూగర్భం నుంచి త్రవ్వించి వెలికి తీయించినాడు. అదే సమయంలో, సేలం జిల్లాలోని నామక్కల్‌లో రాయి తొలిచి నిర్మించిన రెండు విష్ణ్వాలయములు వెలసినవి.

దక్షిణ భారతంలో వైష్ణవ మత వ్యాప్తికి పన్నెండుగురు ఆళ్వారులు అధికంగా సహాయపడినారు. వారు విష్ణ్వాలయములను దర్శించటమే కాక వాటిని గూర్చి తమిళంలో స్తోత్రములను గానం చేసినారు. ఆ తమిళ స్తోత్రములన్నింటిని కలిపి 'ప్రబంధం' అంటారు. ఈ ఆళ్వారులు పల్లవ రాజులకు సమకాలికులు; క్రీ.శ. 5-8 శతాబ్దముల మధ్య జీవించినారు. వీరు ఇంచుమించుగా 22 ఆలయాలను దర్శించినారు; అందులో ముఖ్యమైనవి తిరుప్పాడగం (పాండవదూత), తిరుటంక (విలక్కోళి పెరుమాళ్), అష్టభుయగరమ్ (అష్టభుజుడు-తొండయ్యార్ పాలకుడైన దంతివర్మ అర్చించిన మూర్తి), ఊరగం (ఉళగళంద పెరుమాళ్) , అత్తియూర్ (తిరుక్కచ్చి లేదా

కాంచీపురం, వరదరాజ), పరమేశ్వర విణ్ణగరం (విష్ణుగృహం, వైకుంఠనాథ పెరుమాళ్ ఆలయం - ఇటువంటి ఆలయాన్ని పల్లవరాజైన రెండవ పరమేశ్వర వర్మ కాంచీపురంలో నిర్మించినాడు. ఈయన తండ్రి అయిన రాజసింహ నరసింహవర్మ కాంచీపురంలోనే సుప్రసిద్ధమైన రాజసింహేశ్వర ఆలయం నిర్మించినాడు. అది ఇప్పుడు కైలాసనాథ ఆలయంగా పేరు పొందినది). పై ఆలయాలు అన్నీ ఉత్తరమున స్వర్ణముఖీ నది, దక్షిణమున పెన్నానది మధ్య గల తొండనాడు లేదా తొండై మండలంలో ఉన్నవి; ఇది పల్లవ రాజ్యం. అనాడు కాంచీపురంలో ఆ చుట్టు ప్రక్కల పెక్కు ఆలయాలు నిర్మించబడినవి. తొండనాడులో ఆళ్వారులు దర్శించిన మరి కొన్ని ప్రదేశాలు - తిరువెహ్కా (యథోక్తకారి), తిరువెళుక్కై (ముగుంద నాయక), తిరునీరగం (జగన్నాథ పెరుమాళ్), కారగం (కరుణాకర పెరుమాళ్), పవళవణ్ణార్, సింగవేల్ కున్రం (అహోబిలం).

తొండనాడుకు ఉత్తరాన 'వడనాడు' ఉన్నది. అచ్చటి వెంగడం పర్వతం మీద, ఒక విష్ణ్వాలయం అతి ప్రాచీన కాలం నుంచీ ఉన్నది. దీనిని ఆళ్వారులు అందరూ - తొండరడిప్పొడి, మధురకవి తప్ప - దర్శించినారు. ఆ ఆలయం గర్భగుడిలో విష్ణువు ఒక్కడే ఉన్నాడు. వైఖానస శాస్త్రం ప్రకారం ఇది అధమ తరగతికి చెందిన ఆలయం అయినప్పటికీ చాలా పవిత్రమైనదిగా విశ్వసింపబడినది. తొండనాడుకు దక్షిణాన పెన్నా - కావేరీ నదుల మధ్య ఉన్న శోళనాడు (చోళదేశం) ఉన్నది. ఈ శోళనాడులోనే తిరువరంగం అనబడే నేటి శ్రీరంగం (రంగనాథాలయం) ఉన్నది. ఈ రంగనాథ దేవాలయమును ఆళ్వారులందరూ దర్శించినారు. ఈ శోళనాడులో ఆళ్వారులు దర్శించిన విష్ణ్వాలయాలు మరి కొన్ని ఉన్నవి. ఉదా: తిరుక్కుడందై (కుంభకోణం) తిరుక్కణ్ణాపురం, కావేరినదికి దక్షిణాన సముద్రం వరకు వ్యాపించిన పాండినాడు (పాండ్యదేశం) లోని తిరుమాలిరుం శోలై, తిరుక్కోట్టియూర్, తిరుక్కురంగుడి - ఈ ప్రదేశాలలో ఉన్న విష్ణ్వాలయాలను కూడా ఆళ్వారులు దర్శించినారు. మధ్య దేశమైన నదునాడులో ఉన్న తిరుక్కోవలూర్‌ను కూడా ఆళ్వారులు దర్శించినారు. దక్షిణ భారతంలో ఉన్న ఈ విష్ణ్వాలయాలనే కాక ఆళ్వారులను ఆరాధించే వైష్ణవులు - అయోధ్య, ద్వారక, బదరి, నైమిశారణ్యం, గోవర్ధనం, గోకులం - ఈ ప్రదేశాలలో ఉన్న విష్ణ్వాలయాలను కూడా ముఖ్యమైనవిగా పరిగణిస్తారు. ఇవి అన్నీ ఉత్తర భారతంలో ఉన్నవి; సుప్రసిద్ధములైన విష్ణ్వాలయములలో ఇవి కూడా ఉన్నవి. అయితే ఆళ్వారులు వీటిని కూడా దర్శించి ఉండటం

సంభావ్యం కాకపోవచ్చు. కాని, విష్ణ్వాలయాలు ఉన్న పవిత్ర ప్రదేశాలుగా ఇవి ఆళ్వారులకు తెలిసే ఉంటాయి.

ఆళ్వారుల తమిళ ప్రబంధంలోని (నాలుగువేల స్తోత్రాల సంపుటి) స్తోత్రాలను పట్టి; ఆనాడు, ఆ ఆలయాలలో అర్చన ఏవిధంగా జరిగేదో తెలిసికొనటం కష్టం. అయినప్పటికీ, వాటిల్లో, వేదమంత్రాల పఠనము నకు సంబంధించిన సూచనలు బహుళంగా గోచరింపగలవు. విష్ణ్వర్చన వేదసంస్కృతి ప్రకారం జరుగుతున్నదని తొలి ఆళ్వారులు గుర్తించినట్లు కన్పట్టుతున్నది. కాగా, ఆళ్వారులు దర్శించిన పెక్కు ఆలయాలలో వైఖానస పద్ధతితో అర్చన జరుగుతూ ఉండేదని చెప్పవచ్చు. ఈ ఊహ సత్య సమ్మతమైనదని అనటానికి బలమైన ఆధారం తిరువెంగడం (తిరుమల) లోని సుప్రసిద్ధ శ్రీ వేంకటేశ్వరాలయంలో అనాది నుంచీ ఈనాటి వరకు వైఖానస అర్చకులే అర్చనాదులు నిర్వహిస్తూ ఉండటం. ఆళ్వారుల దృష్టిని ఆకర్షించిన పెక్కు దేవాలయాలలో -తిరుక్కడల్ మల్లై లేదా మామల్లై (మహాబలిపురం), తంజై, తిరుక్కురుంగుడి, తిరుక్కాడిగై (చోళసింహపురం), తిరువాలితిరునగరి, తిరుప్పుల్లాని (దర్భశయనం), శ్రీ విల్లిపుత్తూర్, శిరివ రమంగై (వానమామలై) మున్నగు ప్రదేశాలలోని ఆలయాలలో -నేటికీ వైఖానస అర్చకులే ఉన్నారు (ఆళ్వారులు దర్శించిన ఆలయాల వివరణకు టి.కె.టి. వీరరాఘవాచార్య రచించిన 'తిరుపతి చరిత్ర' 2వ సంపుటం -పుటలు 977-988 చూడవలెను. ఇది తిరుమల తిరుపతి దేవస్థానం వారి చేత 1954లో ప్రచురింపబడినది).

ఆగమానికి చాలా సంబంధంగల వైఖానస సమాజం యొక్క చరిత్రను తృప్తికరంగా పునర్నిర్మించగల అవకాశాలు గాని, వైఖానస సాహిత్యానికి తగిన ఆదరణకాని లేకపోవటం దురదృష్టం. వైఖానస గ్రంథాలు, చాల తక్కువ వెలుగులోకి వచ్చాయి; విలువైన పెక్కు గ్రంథాలు ఇంకా అముద్రితంగానే ఉన్నాయి. ముద్రింపబడిన గ్రంథాలు కూడా చక్కగా సంస్కరణ పొందలేదు. అయినప్పటికీ, వేదవిహితములైన యజ్ఞ పద్ధతులకు, దేవాలయాలలో జరిగే ప్రతిమార్చనకు మధ్యగల తారతమ్యాలను అర్థం చేసుకొనటానికి వైఖానస భావన సహాయపడుతుందనటంలో ఎటువంటి సందేహం అక్కరలేదు. ఈ గ్రంథంలో, వైఖానస భావనలోని ప్రధానాంశాలను విశదం చేయటానికి నేను ప్రయత్నించాను.

తిరుమల మీది శ్రీ వేంకటేశ్వరాలయంలో వంశపారంపర్యంగా అర్చకులు

అయిన శ్రీ నారాయణ దీక్షితులు, మాడంబాకం శ్రీనివాస భట్టాచార్యులు పెక్కు వైఖానస గ్రంథాలను పరిశీలనార్థం నాకు అందజేసినందుకు వారికి నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. అట్లాగే సహాయపడిన, తిరుమల తిరుపతి దేవస్థానంలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ అయిన శ్రీ డి. విఖనసాచార్యులకు, తిరుమలలోని శ్రీ వైఖానస దివ్యసిద్ధాంత వివర్ధినీ సభా కార్యదర్శికి నాకృతజ్ఞతలు.

ఈ గ్రంథరచనకు నాకు అవకాశం కల్పించిన కల్పతరు రిసెర్చి అకాడమి డైరక్టర్ దైవజ్ఞ శ్రీ కె.యస్.సోమయాజికి, ఈ గ్రంథాన్ని చక్కగా ముద్రించిన పయోనిధి ప్రింటర్స్ అధినేత శ్రీ వేంకటరామయ్యకు నేను ఋణపడి ఉన్నాను.

- ఎస్.కె. రామచంద్రరావు.

# ఉపోద్ఘాతము

జగత్ప్రసిద్ధిపొందిన తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి అలయార్చకులు వైఖానసులు. వైఖానసులు వేదమార్గానుయాయులు; వారి అర్చన వేదవిహితమైనది. వేదవాఙ్మయం సువిస్తారమైనది. అవాఙ్మయానికి సంబంధించిన అనేక పదాలు ఈ 'వైఖానసాగమం'లో ప్రసక్తములైనవి. వాటిని గురించి సంక్షిప్తంగా అయినా తెలిసికొనటం ఫలదాయకం కాగలదు.

ప్రపంచంలో ఏ 'మతం' అయినా మూడు ప్రధాన అంశాలను గూర్చి, వాటి పరస్పర సంబంధాన్ని గూర్చి చర్చించటం పరిపాటి (ఈ సంబంధాన్ని గూర్చిన భేదాభిప్రాయాలే వేర్వేరు మతస్థాపనలకు దారి తీసినవి):

1. ప్రకృతి(= అచిత్ =nature);

2. పురుషుడు (=చిత్ = జీవాత్మ = self);

3. పురుషోత్తముడు ( = పరమాత్మ = పరంబ్రహ్మ = Supreme Being = Almighty)

కాగా తెలిసికోవలసినది 'జ్ఞేయం' = పరమాత్మ, తెలిసికొనేవాడు 'జ్ఞాత' = జీవాత్మ, తెలిసికొనటం 'జ్ఞానం' = శ్రుతి = వేదం.

అయితే ఈజ్ఞానం మూడు విధాలుగా లభిస్తుంది; వీటిని 'ప్రమాణములు' అంటారు.

1. ప్రత్యక్షం - ఇంద్రియగోచరములయ్యే విషయాలు (Testimony of sense perception or self experience);

2. అనుమానం-కనిపించే దానిని బట్టి ఇంకొక విషయాన్ని ఊహించటం (Inference or reasoning);

3. శ్రుతి = వేదం లేదా శాస్త్రం (Eternal truths revealed to the Seers).

పై మూడు ప్రమాణములలో మూడవది అయిన 'శ్రుతి' ఉత్తమమైనది. భగవద్గీతలో కృష్ణ భగవానుడుకూడా 'శాస్త్రం' ఉత్తమ ప్రమాణమని పేర్కొన్నాడు (XVI 23-24).

'శ్రుతి' అంటే భారతీయ పరిభాషలో 'వేదం'. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం-ఈ మూడింటిని 'వేదత్రయి' అంటారు. ఇంక అథర్వణ

వేదం నాలుగవది; ఇందులోని మంత్రాలకు యజ్ఞాదులలో వినియోగం తక్కువ. దీనితో వేదాలు నాలుగు అయినవి (చతుర్వేదములు). అర్వాచీన కాలంలో మహాభారతము, నాట్యశాస్త్రము పంచమవేదాలుగా ప్రసిద్ధిపొందినవి; అది విషయాంతరం. వేదాలకు 'నిగమములు' అనీ, 'సంహితలు' అనీ, పేర్లు ఉన్నవి. వీటిని 'అపౌరుషేయములు' అంటారు. అంటే, అవి ఇతర మత గ్రంథాలవలె మానవప్రోక్తములు కావనీ, మహర్షులకు, వారి సమాధినిష్ఠలలో సాక్షాత్కరించిన విశ్వసత్యములు అనీ అర్థం.

వేదాలలో ఋగ్వేదం మొదటిది: ఇది క్రీస్తుపూర్వం పదివేల సంవత్సరాల నాటిదని విజ్ఞుల అభిప్రాయం; కాగా, ప్రపంచ వాఙ్మయంలో ఇది మొదటిదవుతున్నది . అంతేకాదు. దీనికి కాలనిర్ణయం చేయుటం సాధ్యం కాదని, ఇది అనాది అని కూడా చెబుతారు. ఋగ్వేదం ఛందోమయం. ఇందులో పది 'మండలములు', వాటిల్లో 1017 'సూక్తములు' ఉన్నవి. ఒక్కొక్క సూక్తంలో మూడు నుంచి ఏభై వరకు మంత్రములు లేదా స్తోత్రములు ఉంటాయి. ఒక్కొక్క మంత్రంలో పాదానికి ఆరు నుంచి ఇరవైనాలుగు వరకు అక్షరాలు ఉంటాయి. గాయత్రి మంత్రమునందు 24 అక్షరాలు ఉన్నవి (గాయత్రీచ్ఛందస్సులో పాదమునకు ఆరు అక్షరాల చొప్పున నాలుగు పాదాలకు మొత్తం 24 అక్షరాలు ఉంటాయి; కాని ఇందులో పాదానికి ఎనిమిది అక్షరాల చొప్పున మూడు పాదాలలో 24 అక్షరములున్నవి). ప్రతి సూక్తమునకు మంత్రమునకు ద్రష్ట, ఛందస్సు, దేవత ఉంటారు. ఉదా: గాయత్రి మంత్రమునకు ద్రష్ట విశ్వామిత్రుడు, ఛందస్సు గాయత్రి, దేవత సవిత.

యజుర్వేదం రెండు భాగాలుగా ఉన్నది.- కృష్ణయజుర్వేదం, శుక్లయజుర్వేదం. శుక్ల యజుర్వేదం మంత్ర భాగం కాగా, కృష్ణయజుర్వేదం వ్యాఖ్యానాత్మకమైన బ్రాహ్మణభాగంతో మిశ్రితమైఉన్నది. ఈ వేదంలో గద్యభాగాలు ఎక్కువ (ఆగమాలు ప్రధానంగా కృష్ణయజుర్వేదమునకు సంబంధించినవి).

ఆయా యజ్ఞయాగాదులు జరుగుతున్నవుడు సామవేదంలోని ఆయా మంత్రములను గానం చేస్తారు. కాగా, ఇందులో అధిక భాగం ఋగ్వేదం నుంచి గ్రహింపబడింది.

అధర్వణవేదంలో శాంతిక - పౌష్టిక - అభిచారిక విషయాలు- ఐహిక

పరమైనవిగా - వివరింపబడినవి.

ఈ నాలుగు వేదాలకు సంబంధించి, వరుసగా, నాలుగు ఉపవేదాలున్నవి - ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వవేదం, స్థాపత్యశాస్త్రం.

**సంహితలు** అంటే మంత్రభాగములు; ఇవి, బ్రహ్మచర్యంలో గురువుదగ్గర అభ్యసించవలసినవి.

యజ్ఞయాగాది కర్మకాండకు సంబంధించిన వివరములు కలవి బ్రాహ్మణములు. ఈ యజ్ఞవిధులు గృహస్థాశ్రమమునకు సంబంధించినవి.

అరణ్యకములు బ్రాహ్మణములకు పూరకములే కాక తత్త్వచింతనలో ఉపనిషత్తులకు సన్నిహితములు కూడా. ఇవి వానప్రస్థులకు సంబంధించినవి.

ఉపనిషత్తులు జ్ఞానకాండకు, ఉపాసనాకాండకు సంబంధించినవి; పరబ్రహ్మ గవేషణకు చెందినవి. ఉపనిషత్తుల దృష్టిలో భగవంతుడు ఒక్కడే. ఆయన స్వయంభువు. ఆది మధ్యాంతరహితుడు. సర్వశక్తిమయుడు, సర్వవ్యాపి, సర్వాధారుడు.

ఉపనిషత్తుల సంఖ్యావిషయంలో భేదాభిప్రాయములున్నవి; ఒక లెక్కప్రకారం అది నూట ఎనిమిదికాగా, మరియొక లెక్క ప్రకారం వేయికి పైగా ఉన్నవి. అందులో ప్రధానమైనవి పన్నెండు - ఈశ - కేన - ప్రశ్న - కఠ - ఐతరేయ - తైత్తిరీయ - ముండక - మాండూక్య - ఛాందోగ్య- బృహదారణ్యక - శ్వేతాశ్వతర - కౌషీతకీ ఉపనిషత్తులు -వీటిలో మొదటి పదింటికి శంకరాచార్య ప్రభృతులు తమతమ ప్రబోధములకు అనుగుణంగా భాష్యాలు వ్రాసినారు.

స్మృతులు రెండు రూపాలుగా ఉన్నవి: సూత్రాలు (సూత్రరూపంలో ఉన్న అపస్తంబ సూత్రం, బోధాయన సూత్రం మున్నగునవి); స్మృతులు (ఛందో రూపంలో ఉన్న మనుస్మృతి, పరాశరస్మృతి మున్నగునవి). కలియుగానికి పరాశరస్మృతి ప్రధానమని చెప్పబడినప్పటికీ మనుస్మృతియే ప్రాధాన్యం వహించింది. ఇవి ఆయా సమాజాలలోని వర్గాల వారికి వేర్వేరుగా, మొత్తం సమాజానికి సమష్టిగా సంబంధించిన ధర్మాచరణ విధిని వివరిస్తున్నవి.

స్మృతులు బోధించిన ధర్మాలను ఆచరణ రూపంలో చూపించేవి రామాయణ మహాభారతములు (రామాయణం కావ్యంగా, భారతం ఇతిహాసంగా

సుప్రసిద్ధములు).

సుబోధములు కాని ఈ వేదాలను చక్కగా అర్థం చేసుకొనటానికి ఆరు శాస్త్రాలు ఉన్నవి; వీటినే 'షడంగములు' లేదా 'వేదాంగములు' అంటారు; ఇవి వేదాలు అన్నింటికీ వర్తిస్తాయి.

"శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా ।
కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః ॥

1. శిక్ష-సమ్యగుచ్చారణ విధిని బోధిస్తుంది (ఉదాత్త-అనుదాత్త స్వరిత-ప్రచయ-హ్రస్వ- దీర్ఘ-ప్లుతాది భేదాల జ్ఞానం).

2. వ్యాకరణం (పదముల సాధుత్వ - అసాధుత్వములను తెలుపుతుంది).

3. ఛందస్సు (పద్య నిర్మాణ క్రమమును వివరిస్తుంది).

4. నిరుక్తం (పదముల వ్యుత్పత్తిని బోధిస్తుంది).

5. జ్యోతిషం (గణిత-జాతక-ముహూర్త భాగములు కలది- వీటిని స్కంధ త్రయం అంటారు; ఖగోళవిజ్ఞానం గణితంలో భాగం).

6. కల్పం లేదా కల్పసూత్రాలు-వీటిని శ్రౌత సూత్రాలు అనికూడా అంటారు. కాని, వీటిని క్రింది విధంగా విభజించటం పరిపాటి:

(1) శ్రౌత సూత్రాలు (యజ్ఞవిధులు); (2) గృహ్యసూత్రాలు (గార్హస్థ్య సంస్కారాలు, విధులు); (3) ధర్మసూత్రాలు; (4) శుల్బసూత్రాలు (శ్రౌతసూత్రాలకు సంబంధించిన యజ్ఞవేదికాది నిర్మాణములు, రేఖా గణితం, వృత్త చతురశ్రాదుల వివరణ మున్నగునవి).

వేదాన్ని పరమప్రమాణంగా సమ్మతించే వైదిక దర్శనములు ఆరు: న్యాయం (గౌతము), వైశేషికం (కణాద), సాంఖ్యం (కపిల), యోగం (పతంజలి), పూర్వమీమాంస (జైమిని), ఉత్తర మీమాంస (బాదరాయణ లేదా వ్యాస). బ్రహ్మజ్ఞానార్థులైన వారికి మొదటి అయిదు దర్శనములు వివేకం, వైరాగ్యం, ధర్మాచరణ మున్నగునవి కలిగిస్తాయి. ఇంక ఆరవది ఉపనిషత్తుల సమన్వయ శాస్త్రం; బ్రహ్మజ్ఞాన బోధకం. దీనిని వేదాంత శాస్త్రం అని కూడా అంటారు. న్యాయవైశేషికాలను ఒక జంటగా, సాంఖ్యయోగాలను ఒక జంటగా, పూర్వ-ఉత్తర మీమాంసాలను ఒక జంటగా పేర్కొంటారు. న్యాయ-వైశేషికాలకు

సమష్టిగా తర్కశాస్త్రమని పేరు.

దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసే నిమిత్తం, మానవుల నైతిక జీవనమును సముద్ధరించే నిమిత్తం ధరించే భగవంతుని అవతార విశేషాలను వర్ణించేవి పురాణాలు. భాగవతం మున్నగు పురాణాలు పదునెన్మిది; అట్లాగే ఉపపురాణాలు మరో పదునెన్మిది ఉన్నవి.

"ఏకంసత్; విప్రాః బహుధావదంతి" అని ఋగ్వేదం - "ఒక్కటే (పరమాత్మ) ఉన్నది; దానిని విప్రులు (= వేదవేత్తలు) అనేక నామరూపాలతో పేర్కొంటున్నారు". అంటే ఒకే ఒక పరమాత్మ అనేకనామాలతో అనేకరూపాలతో సేవింపబడుతున్నాడన్నమాట! ఇది ఏకత్వంలో భిన్నత్వం. అయితే ప్రతిమతానుయాయి తనమతం చెప్పిన లేదా తాను నమ్మిన దైవం ఒక్కడే పరమాత్మ అని విశ్వసిస్తున్నాడు; కాగా, ఇది భిన్నత్వంలో ఏకత్వం.

'మతం' అంటే విశ్వాసం లేదా భావన అని అర్థం. ఆయా విశ్వాసాలకు అనుగుణంగా ప్రధానంగా పూజవిధానాలను నిర్దేశించేవి ఆగమాలు. అందులో ప్రధానమైనవి వైష్ణవాగమాలు (పాంచరాత్ర - వైఖానసములు), శైవాగమాలు(ప్రధానమైనవి ఇరవై ఎనిమిది), శాక్తేయాగమాలు. సత్యము, సమగ్రము అయిన విషయ పరిజ్ఞానం కలిగించేది అని 'ఆగమ' పదం యొక్క అర్థం. కాగా వేదత్రయి సారములే ఆగమాలు. అంతేకాదు. ప్రజలకు అందుబాటులో ఉన్న వేధాలుగా ఈ ఆగమాలు ప్రసిద్ధిపొందినవి.

ప్రతి ఆగమంలోనూ నాలుగు భాగాలు ఉంటాయి.

1. చర్య (నిత్యజీవనవిధానం),

2. క్రియ (భగవంతుని పూజించేవిధానం),

3. యోగం (ఇంద్రియజయం),

4. జ్ఞానం (ప్రకృతి-పురుష-పురుషోత్తమ - మోక్షములకు సంబంధించినది).

యంత్రాలు, మంత్రాలు, ఉపాసన- వీటి సహాయంతో మానవునిలో మరుగుపడిఉన్న అతీంద్రియ శక్తులను సాధించటానికి ఉపయోగ పడేవి తంత్రములు - **తంత్రరాజతంత్రం**, ప్రపంచసార **తంత్రం** (శంకరాచార్య విరచితం) మున్నగునవి.

అయాదేవతలను స్తుతించేవి 'స్తోత్రములు; ఇవి సాధారణంగా సంస్కృతంలో ఉంటాయి. దివ్యప్రబంధంగా ప్రసిద్ధిపొందిన ఆళ్వారుల స్తోత్రాలు మాత్రం తమిళ భాషలో ఉన్నవి.

ఉపనిషత్తులు, బాదరాయణ ప్రణీతమైన బ్రహ్మసూత్రములు, భగవద్గీత- ఈమూడింటిని కలిపి 'ప్రస్థాన త్రయం' అంటారు. వీటిని తమ తమభావనలకు అనుగుణంగా వ్యాఖ్యానిస్తూ ఆదిశంకరులు అద్వైతం (జీవాత్మ - పరమాత్మ అభేద దృష్టి), రామానుజులు విశిష్టాద్వైతం (భేద దృష్టి), మధ్వాచార్యులు ద్వైతం (ద్వైతదృష్టి), వల్లభాచార్యులు శుద్ధాద్వైతం (పుష్టిమార్గం ) ప్రచారం చేశారు. ఇంక వైఖానసుడైన శ్రీనివాసమఖి ఇటీవల 'లక్ష్మీ విశిష్టాద్వైతం' స్థాపనకు ప్రయత్నించినాడు. లక్ష్మీసహితుడైన విష్ణువు యొక్క తత్త్వమే 'లక్ష్మీవిశిష్టాద్వైతం' - అంటే విష్ణువును లక్ష్మీ సహితంగా అర్చించినప్పుడే అది ఫలవంతమవుతుందన్నమాట!

తొలి ఆగమాలకు 'సంహితలు' అనే పేరున్నది; ఇవి సర్వజనులకు అందుబాటులో ఉన్న 'శ్రుతులు'గా తలంపబడినవి. ఆగమాలను స్వయంగా భగవంతుడే బోధించెనని ఆయా ఆగమానుయాయులు అందరూ విశ్వసిస్తున్నారు. అయితే ఇప్పుడు మనకు లభ్యమవుతున్న రచనలు అతి ప్రాచీనములని చెప్పజాలము.

వైఖానసాగమానికి మొదటి పేరు 'వైఖానస శాస్త్రం'; ఇది తరువాతి కాలంలో వైఖానస సూత్రంగా ప్రసిద్ధి పొందింది. దీనిని విష్ణువు స్వయంగా, తన మానస పుత్రుడైన విఖనమునికి బోధించినాడు. ఆ విఖనముని తన శిష్యులు- అత్రి, భృగువు, మరీచి, కాశ్యపుడు- అనే నలుగురకు బోధించినాడు. అంతట ఆ నలుగురు వేర్వేరుగా రచనలు చేసినారు. ఈ నలుగురి రచనలే తరువాతి కాలంలో 'వైఖానసాగమం'గా ప్రసిద్ధి పొందినవి. 'తొలి శ్రుతి' నాలుగు వేదములైనట్లే, ఈ నలుగురి రచనలవల్ల **వైఖానససూత్రం** కూడా చతురాత్మకమైనది. వైఖానస సూత్రశాస్త్రాలు దైవదత్తములనీ, అందుచేత అవి ఉత్తమోత్తములనీ, తదనుయాయులు ఉత్తమోత్తములనీ పేర్కొంటూ, అందుకు దశవిధ హేతువులను నిరూపించినాడు **శ్రీనివాసమఖి** తన 'దశవిధ హేతునిరూపణం'లో.

దైవపూజ మూడు విధాలు: 1.మానసీ పూజ, 2. హోమపూజ,

3. బేరపూజ.

మానసీపూజ: ధ్యానమథనం ద్వారా ఇష్టదైవమును తనహృదయమందు మూర్తి మంతం చేసుకొని ఊహామాత్రంగా పూజాదికం నిర్వర్తించటం మానసీపూజ.

హోమపూజ: జ్వలించే అగ్నిలో భగవంతుని మూర్తిమంతం చేసుకొని అగ్ని హోత్రం నిర్వహించటం; అంటే భగవంతుని అగ్నిమయుడుగా ఆరాధించటం హోమపూజ అవుతుంది.

బేరపూజ: చక్కగా ప్రతిష్ఠింపబడిన బేరమునకు (= ప్రతిమకు) పూజ చేయటం బేరపూజ. పూజా విధానాలలో ఇది ఉత్తమంగా పరిగణింపబడినది. కారణం- చూడటానికి అందంగా ఉండే ప్రతిమ మనస్సును ఆకర్షిస్తుంది; హృదయానికి ఉల్లాసం కలి గిస్తుంది; అప్పుడు భక్తి సులువుగా కుదురుకొంటుంది.

భగవంతుడు నిష్కలుడు, సకలుడు కూడా. అందుచేత భగవదర్చన రెండు విధాలు అవుతున్నది. నిష్కలుడు, నిరాకారుడు అయిన భగవంతుని అర్చించటం నిరాలంబార్చన లేదా అమూర్తార్చన; మానసీ హోమపూజాలు ఈ విధానముకు చెందినవి. ఇంక ప్రతిమారాధన సాలం బార్చన లేదా సమూర్తార్చన అవుతుంది; ఇదే బేరపూజ. అమూర్తార్చన సంకల్పధనులకు వానప్రస్థాది శ్రేష్ఠ ఆశ్రమవంతులకు శ్రేష్ఠమైనది. ఇక సమూర్తార్చన సంసారనిష్ఠులకు శ్రేష్ఠం. ఈ సమూర్తార్చన రెండు విధాలు- గృహార్చన, ఆలయార్చన. గృహార్చన కంటే ఆలయార్చన క్రమంగా ప్రాధాన్యం వహించింది. విష్ణ్వాలయంలో వేదోక్తవిధివిధానంతో, వేదమంత్ర సహితంగా వైఖానసులు అర్చన చేస్తారు. వీరు వేద విహితములైన నిత్యహోమాదులు నిర్వర్తించి, పిమ్మట గృహమందు, తరువాత ఆలయమందు నిత్యం విష్ణువును అర్చించుతారు. దేవతలందరిలో అగ్నికనిష్ఠుడు; విష్ణువు జ్యేష్ఠుడు; వీరిరువురి మధ్య సకలదేవతలు ఉంటారు. కాగా, ఈ ఇరువురిని అర్చించే వైఖానసులు సర్వదేవతలను అర్చించినవారవుతున్నారు.

వైఖానసులది కేవలం 'అర్చకసమాజం'. 'విష్ణుబలి' అనే సంస్కారం ద్వారా వైఖానసులు పుట్టుకతోనే 'వైష్ణవులు' అవుతారు. అంతేకాదు గర్భవైష్ణవులైన వీరికి పుట్టుకతోనే అర్చక అర్హత లభిస్తుంది. అతడు విష్ణ్వాలయంలో అర్చనకు అర్హుడవుతాడు. అయితే ఆ అర్హతకు విశే కాది అష్టాదశ సంస్కారవత్త్వం, ఆగమవిజ్ఞానం, ధర్మాచరణ ప్రాతిపదికలు

కావాలి. విగ్రహంలో దైవత్వం ఆవాహన తరువాతనే ఉంటుందనీ, ఇంక అర్చకునిలో దైవత్వం సదా సన్నిహితంగా ఉంటుందనీ, ప్రసన్నాత్మకుడైన అర్చకుడు సాక్షాత్తుగా చరరూపి అయిన హరియే అనీ, అందుచేత అర్చకుడు కుటుంబంతో నిశ్చింతగా జీవిస్తూ, నిర్మలంగా అర్చన చేయటానికి తగిన వసతులు కల్పించవలసిన బాధ్యత పాలకులమీద, కార్యనిర్వాహకవర్గం మీద ఉన్నదనీ ఆగమాలు స్పష్టం చేసినవి. భక్తులు దేవాలయంలో ఉన్నప్పుడు పాటించవలసిన విధి నిషేధములు కూడా విశదం చేయబడినవి. ఆగమాలు, దేవాలయాలను ఉత్తమ -మధ్యమ-అధమవర్గములుగా విభజించినవి. ఉత్తమోత్తమ ఆలయంలో పంచమూర్తులు ఉంటారు. తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామి వారి ఆలయంలోని మూర్తులు: 1. ధ్రువబేరం; 2.మనవాళ పెరుమాళ్ లేదా భోగశ్రీనివాసమూర్తి( కౌతుకబేరం); 3.శ్రీ మలయప్పన్ (ఉత్సవబేరం); 4. ఉగ్ర శ్రీనివాసమూర్తి(స్నపన బేరం); 5. కొలువుశ్రీనివాసమూర్తి(బలిబేరం).

వైఖానస సాహిత్యం సువిస్తారమైనది. విఖనసముని శిష్యులకు బోధించిన సూత్రం కోటిన్నర గ్రంథములు ప్రమాణంకలది (పాదానికి ఎనిమిది అక్షరాల చొప్పున మొత్తం నాలుగు పాదాలకు 32 అక్షరాలు ఉండే అనుష్టుప్ ఛందస్సులోని ఒక వృత్తమునకు 'గ్రంథము' అని పేరు). కాని, ఆయన శిష్యులు నలుగురు (అత్రి, మరీచి, భృగువు, కాశ్యపుడు) కూర్చిన వైఖానశాస్త్రంలో నాలుగు లక్షల గ్రంథములు మాత్రమే ఉన్నవి. వీటిల్లో కూడా అధికభాగం లభించలేదు. లభించిన భాగాలు కూడా అసమగ్రంగా ఉన్నవి; అందులో ముద్రణ భాగ్యమునకు నోచుకొన్న కొన్నిరచనలు చక్కగా సంస్కరింపబడలేదు. ఇట్టి పరిస్థితులలో వైఖానసులను గూర్చి, వారిసాహిత్యాన్ని గూర్చి విశేషపరిశ్రమచేసి, లభించిన ఆధారాలను శోధించి, విశ్లేషించి, వైఖానసాగమం యొక్క స్వరూపస్వభావాలను విశదంచేయుటంలో కృతకృత్యులైనారు విద్యాలంకార, శాస్త్ర చూడామణి - సంగీత కళారత్న ఆచార్య యస్.కె. రామచంద్రరావు గారు.

ఆచార్య రామచంద్రరావుగారి గ్రంథం ఆంగ్లభాషలో ఉన్నది. 222పేజీల ఈ గ్రంథంలో చివరి 60 పేజీలు సంస్కృత గ్రంథాలనుంచి ఉద్ధరింపబడిన భాగాలు. తొలి 120 పేజీలలో కూడా సంస్కృత భాగాలు అధికంగా ఉన్నాయి. ఈ గ్రంథాన్ని అనువాదం చేయవలసినదిగా ఆత్మీయులు శ్రీ గరిమెళ్ల రామమూర్తిగారు కోరినారు; నాచేత ఈ అనువాదం చేయిస్తానని వారు శ్రీమాన్ శ్రీనివాస నారాయణ దీక్షితులుగారికి, శ్రీ వారణాశి

చినచెంచయ్య గారికి తిరుపతిలో వాగ్దానంచేసి వచ్చినారు. అందుచేత ఈ పనికి అంగీకరించక తప్పలేదు. విద్వచ్ఛిరోమణి బ్రహ్మశ్రీ తెలకపల్లె విశ్వనాథ శర్మగారు (పాలెం సంస్కృత కళాశాల ప్రిన్సిపాలుగా రిటైరైనారు) నా సంస్కృతానువాదాలను ప్రత్యక్షరం పరిశీలించి సరిదిద్దినారు. వారికి నా కృతజ్ఞతలు.

"ప్రజాపతి ఒక్క సారిగా తన శరీరమును విదళింపగా ఆయన నుండి అరుణులు మున్నగువారు ఎగిరిపడినారు" అని తైత్తిరీయారణ్యకం చెప్పిన కథ ఆధునికులు చెప్పే 'Big Bang Theory' ని పోలి ఉన్నదని శ్రీ శర్మగారు సూచించినారు.

ఇంక నా అనువాదవిధానం:
అనువాదమంతా వ్యావహారిక భాషలోనే సాగింది.

"నామూలం లిఖ్యతే కించిన్నానపేక్షిత ముచ్యతే" అని వ్యాఖ్యాతృ శిరోమణి మల్లినాథ సూరి ప్రతిజ్ఞ. ఇది దృష్టిలో పెట్టుకొనియే ఆంగ్ల గ్రంథమును యథాతథంగా అనువదించాను.

ప్రతి సంస్కృత భాగమునకు - అవి శ్లోకములైనా, లేదా వచనమైనా-వెనువెంటనే తెలుగు అనువాదం ఇవ్వబడినది. ( - ఈ గుర్తు అనువాద ప్రారంభంలో ఉంటుంది). 7వ అనుబంధం నుంచి సంస్కృత భాగాలు ఎడంవైపు పుటలలోనూ, ఆయా భాగాలకు పరిమితములైన తెలుగు అనువాదాలు కుడివైపు పుటలలోనూ ముద్రింపబడినవి: దీనిని గ్రహించవలెను.

తమ గ్రంథమును అనువదించటానికి దయతో అంగీకరించినారు ఆచార్య ఎస్.కె.రామచంద్రరావు గారు. ఈ గ్రంథానువాదమునకు అవకాశం కల్పించినవారు శ్రీమాన్ పైడిపల్లె శ్రీనివాస దీక్షితులుగారు. శ్రీ వారణాసి చిన చెంచయ్యగారు, శ్రీ గరిమెళ్ల రామమూర్తిగారు. ఈ నా అనువాదాన్ని ప్రచురించటానికి అంగీకరించిన వారు తిరుమల తిరుపతి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ ఎమ్.వి.యస్.ప్రసాద్ I.A.S గారు, మొత్తం గ్రంథాన్ని డి.టి.పి. పద్ధతిలో చక్కగా కంపోజ్ చేసి ఇచ్చినవారు "ట్వంటీ ఫస్టు సెంచరీ బిజినెస్ కమ్యూనికేషన్స్" హైదరాబాదు అధినేత శ్రీ వి.శ్రీనివాస్.

ఈ సహృదయులందరకు నా నమస్సుమనస్సులు.

తిరుమల.
21.7.1992.

- పోణంగి శ్రీరామ అప్పారావు

# విషయసూచిక




నారాయణః పితా యస్య
యస్య మాతా హరిప్రియా
భృగ్వాదిమునయః శిష్యాః
తస్మై విఖనసే నమః ॥

- (చూ.పుట -42)

# అధ్యాయం-1

## చారిత్రక నేపథ్యం

వైఖానసులు, దేవాలయ అర్చకులకు సంబంధించిన ఒక చిన్న సమాజానికి చెందిన వారు. వీరు, ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళనాడులలోని గ్రామాలలో, పట్టణాలలో వ్యాపించి ఉన్నారు. ఈ సమాజం దక్షిణ భారతదేశానికి పరిమితమైనప్పటికి కేరళలో, కర్నాటకలోని సముద్ర తీరప్రాంతంలో వైఖానసులు కానరారు. వైఖానసులు కృష్ణయజుర్వేదంలోని తైత్తిరీయ శాఖకు చెందిన బ్రాహ్మణులు. వీరు, సువిశాలములైన మూడు రాష్ట్రాలలో వ్యాపించి ఉన్నప్పటికీ, ఆచారాలను, సంప్రదాయాలను ఒకే విధంగా పాటిస్తున్నారు. వివాహాదులు తమ సమాజానికి మాత్రమే పరిమితంచేసుకొని, సమాజంలోని వారంతా కలిసికట్టుగా ఉంటారు. వీరిది నిస్సందేహంగా ప్రాచీనమైన సమాజం. వీరు మతపరమైన అనుష్ఠానాదులు అధికంగా పాటిస్తారు. అంతేకాదు. వీరు పూర్తిగా వేదవిహితధర్మానుయాయులు.

సాధారణంగా వైఖానసులు కూడా శ్రీవైష్ణవులుగా పరిగణింపబడుతూ ఉంటారు. కాని, వీరు ఎల్లప్పుడు తమ ప్రత్యేకతను నిలువుకొంటూ పాటించే ఆచారవ్యవహారాలలో, విశ్వసించే తత్త్వచింతనలో శ్రీవైష్ణవుల కంటె పూర్తిగా భిన్నంగా ఉంటారు. వీరు, రామానుజుల వారిని (క్రీ.శ. 1017-1137) కానీ, ప్రాచీన ఆళ్వారులను కానీ తమగురుపరంపరలో గణింపరు. అంతేకాదు, వీరు ఆళ్వారులను తమ దేవాలయాలలో పూజింపరు; ఈ ఆళ్వారులు రచించిన తమిళకీర్తనలను పూజా సమయంలో ఏ సందర్భంలోను పాడరు. శ్రీనివాసమఖి (క్రీ.శ.1059) అనే వైఖానస ఆచార్యుడు వైఖాన శాస్త్రాలు ఆధారంగా బ్రహ్మసూత్రాలకు స్వయంగా ఒక వ్యాఖ్యానం రచించాడు; దీని పేరు "లక్ష్మీవిశిష్టాద్వైతభాష్యం". ఇచ్చట 'విశిష్టాద్వైతం' అనే పదం ప్రయుక్తమైనప్పటికీ, శాస్త్రీయ పరంగా, మతపరంగా ఇందులోని ప్రవచనాలు రామానుజుల 'శ్రీభాష్యం' లోని ప్రవచనాలకంటె పూర్తిగా భిన్నమైనవి. శ్రీనివాసమఖి తాను తనభాష్యానికి పెట్టిన పేరును ఇట్లా విశదీకరించినాడు.

"లక్ష్మీవిశిష్టః నారాయణః అద్వైతం యత్ర ।
మతే తత్ లక్ష్మీవిశిష్టాద్వైతమ్".

-లక్ష్మీ తత్త్వంతోకూడిన నారాయణుడు ఏ ఆరాధనావిధానంలో అద్వైతం (= అభిన్నం) గా ఉంటాడో ఆ విధానం లక్ష్మీ విశిష్టాద్వైతం.

వైఖానసదృష్టిలోని విశిష్టత ఏమంటే-అంతిమ మోక్షానికి భక్తి ఒక్కటేచాలదు; భక్తితో 'సమూర్తార్చన' చేయాలి. వారి దృష్టిలో భక్తి, ఉపాసన-ఇవిరెండూ ఒక్కటికావు. ఉపాసన యజనంతో సమానం-కాగా వైఖానసుల దృష్టి రామానుజుల దృష్టికంటె భిన్నమైనది; అంతేకాదు. ఉత్తమమైనదికూడా. 'భగవత్ సమూర్తయజనం' అనేది బ్రహ్మవిద్యాజ్ఞానం కంటె కూడా ఎక్కువ ఫలవంతమైనదిగా తలంపబడినది. ఈ సత్యాన్నే శ్రీనివాసమఖి 'ఉత్తమబ్రహ్మవిద్య' అనే తన గ్రంథంలో నిరూపించినాడు.

నాథముని (క్రీ.శ.824-924), యామునాచార్యులు (మరణం-క్రీ.శ.1038), రామానుజులు (క్రీ.శ. 1017-1137)- ఈ ముగ్వురి నాయకత్వంలో శ్రీవైష్ణవసమాజం రూపుదిద్దుకొనటానికి ముందే ఏర్పడిన వైఖానస సమాజం స్వతంత్రమూ, విశిష్టమూ అయిన ఒక మతసమాజం. బహుశః, వైఖానసపద్ధతిలో పూజలు జరిగే ఆలయాలను సందర్శించటం వల్లనే ఆళ్వారులు వైష్ణవోద్యమాన్ని నడపటానికి స్ఫూర్తి పొంది ఉంటారు. ప్రధానంగా, వేదం ప్రతిపాదించిన విష్ణువును సమూర్తంగా అర్చించటం అనేసంప్రదాయాన్ని నెలకొల్పిన ఘనత వైఖానసులకే దక్కుతుంది. అందు చేత-తిరుమల తిరుపతి, మహాబలిపురం, శ్రీకాకుళం, అమరావతి, వేదాద్రి, ధర్మావరం, చోళసింహపురం, విజయనగరం, తిరుచ్చిరపల్లి, రామనాథపురం, పిఠాపురం, కాకినాడ, వినుకొండ, ఖాద్రి, ఉత్తరమేరూర్, తంజావూరు, తిరుక్కురుంగుడి, మధురై, దర్భశయనం, కొండవీడు, నెల్లూర్, తిరుమశాయి, సెంజి, వెల్లూర్, వేంకటగిరి, కార్వేటి నగరంవంటి ప్రదేశాలలో ఉన్న ప్రాచీన విష్ణుదేవాలయాలలో వైఖానసపద్ధతిన పూజలు జరగటంలో ఆశ్చర్యంలేదు. ముఖ్యంగా గమనింపవలసిన విషయం రామానుజులతో, ఆళ్వారులతో సంబంధం ఉన్న శ్రీపెరుంబుదూర్, పూనమల్లి, వానమామలై, అళహరికోయిల్, తిరువాలి, తిరునగరి వంటి ప్రదేశాలలో ఉన్న ఆలయాలలో కూడా నేటికీ వైఖానస అర్చకులే ఉన్నారు-రామానుజులు పాంచరాత్రవిధి అర్చనను ప్రోత్సహించినప్పటికీ.

వైఖానసులు తమ పూజావిధిని అంతటినీ వేదమంత్రాలతోనే సాగిస్తారు; తమిళప్రబంధాల పఠనానికి వారిపూజావిధిలో స్థానంలేదు. వేదవిహిత సంస్కారాలను వారు చాలా శ్రద్ధగా పాటిస్తారు; తైత్తిరీయబ్రాహ్మణ గ్రంథాలు విధించిన పద్ధతిగా ఆలయంలో, ఇంటిలో అగ్నిహోత్రాది కర్మలను నిష్ఠతో నిర్వహిస్తారు. విఖనసమహర్షి, గృహస్థులు పాటించవలసిన మతవిధులను బాధ్యతలను నిర్దేశించే 'కల్పసూత్రాలు' రచించటమేకాక, విగ్రహారాధనకు సంబంధించిన 'దైవికసూత్రాలు' కూడా రచించారని వైఖానసులు విశ్వసిస్తారు. ఈ విశ్వాసం-ఒకప్రక్క వేదవిహిత సంస్కారాలకు మతవిధులకు, ఇంకోప్రక్క ఇంటిలో ఆలయంలో విగ్రహారాధనకు వైఖానసులు సమాన ప్రాముఖ్యం ఇచ్చారన్నసత్యాన్ని నిరూపిస్తున్నది. వారిదృష్టిలో ఈ రెండూ పరస్పరం పూరకాలు (మరీచి, అత్రి, భృగువు, కాశ్యపుడు-ఈనలుగురు విఖనసశిష్యులు దైవికసూత్రాన్ని విస్తృతపరిచారు).

పాంచరాత్ర అనుయాయుల, శైవుల అభిప్రాయం దీనికంటె భిన్నమైనది; ఆగమసంప్రదాయం వేదసంప్రదాయంకంటె భిన్నమైనదని వీరు విశ్వసించారు. వైదికసంస్కృతి త్వరితగతిని ప్రాతబడుతున్న సమయంలో ఆలయార్చనకు ప్రత్యేకమైన ఆగమపద్ధతియే శరణ్యమని వీరివిశ్వాసం. 'ఆగమం' అనేపదం 'నిగమం' (= వేదం) అనే పదానికి భిన్నంగా వ్యవహారంలోకి వచ్చి ఉంటుంది. సాధారణంగా వైఖానసగ్రంథాలు 'ఆగమం' అనే పదాన్ని వాడవు. కాని ఇటీవలి కాలంలో శైవాగమం, పాంచరాత్రాగమం, శాక్తాగమం అనే వాటి నుంచి ఇది భిన్నమని స్పష్టం చేయటంకోసమో అన్నట్లుగా 'వైఖానసాగమం' అనేపదం వాడుకలోకివచ్చింది. తమ శ్రుతి 'భగవత్ శాస్త్రం' అని మాత్రమే వైఖానసుల విశ్వాసం. వైఖానసులకు వేదప్రామాణ్యం మీద ఉండే అచంచల విశ్వాసాన్ని బోధాయనులవంటి ప్రాచీన శాస్త్రకారులు కూడా గుర్తించారు (ఉదా: బోధాయన ధర్మసూత్రాలు-3,3,17-శాస్త్రపరిగ్రహః సర్వేషాం వైఖానసానాం). వారి దృష్టిలో, విగ్రహారాధన వైదికమైన యజ్ఞయాగాదులకు బదులుగా అర్వాచీన కాలంలో వచ్చింది కాదు; విగ్రహారాధన వేదవిహితమైన మతవిధి మాత్రమే. అందుచేతనే సూత్రం ఇట్లా నిర్దేశించింది:

"తస్మాదగ్నౌ నిత్యహోమాంతే విష్ణోర్నిత్యార్చా (ర్చ్య) గృహే దేవాయతనే భక్త్యా భగవంతం నారాయణమర్చయేత్".

-అందువల్ల, నిత్యాగ్నిహోత్రం తరువాత, గృహమందు దేవాలయమందు నిత్యం విష్ణువును అర్చించాలి; భగవంతుడైన నారాయణుని భక్తితో అర్చించాలి.

ఈ దృష్టితోనే భాగవతపురాణం (11,27,7) అర్చన ముప్విధాలని పేర్కొన్నది - 1. వైదికం ( వల్లభునిసుబోధినీ వ్యాఖ్య సూచించినట్లుగా వైఖానస పద్ధతికావచ్చు); 2. తాంత్రికం (బహుశః పాంచరాత్రపద్ధతి కావచ్చు), 3. మిశ్రం (సామాన్యులు పాటించే నామసంకీర్తనాది విధులు).

ఆ భాగవతపురాణమే మరల రెండు విధానాలను వివరించింది-వేదం, తంత్రం. ఈ వివరణ వేదంలోనూ, పాంచరాత్రంలోనూ విధింపబడిన ఆచారాలకు సంబంధించినదని వ్యాఖ్యాత వీరరాఘవుడు వివరించినాడు (ఉభాభ్యాం వేదపాంచరాత్రోక్తాభ్యాం). బహుశః పాంచరాత్రమన్నది అష్టాక్షరి, ద్వాదశాక్షరి మంత్రాలకు సంబంధించినది కావచ్చు(మహాభారతం-అశ్వమేధ పర్వం- అనుగీత-109, 89 తోపోల్చి చూడండి). విష్ణుపురాణంలో ఉన్న ఒకచిత్రమైన శ్లోకాన్ని శ్రీనివాసమఖి తన తాత్పర్యచింతామణిలో ఉద్ధరించి, వ్యాఖ్యానించినాడు (ఉత్తమబ్రహ్మవిద్యాసారం-62 తో పోల్చి చూడండి).

యజ్వభిర్యజ్ఞపురుషో వాసుదేవశ్చ సాత్త్వతైః ।
వేదాంతవేదిభిర్విష్ణుః ప్రోచ్యతే యో నతోఽస్మి తమ్ ॥

- ఏ దేవుని యజ్వలు (వేదవిహిత యజ్ఞములనాచరించే వారు) యజ్ఞపురుషుడని, సాత్త్వతులు (పాంచరాత్రాను యాయులు) వాసుదేవుడని, వేదాంతవేదులు (వైఖానసులు) విష్ణువు అని వర్ణిస్తారో ఆదేవదేవునకు నమస్కరిస్తున్నాను.

ఇచ్చట, యజ్వలు, వేదాంత వేదులు భిన్నులని శ్రీనివాసమఖి స్పష్టం చేసినాడు. యజ్వలు కూడా వైఖానసులలో ఒక వర్గం; వీరు విగ్రహారాధన రహితమైన వేదవిహిత కర్మలను ఆచరిస్తారు-కాగా వీరిది 'అమూర్తార్చన'. ఇంక వేదవేత్తలు అయిన వైఖానసులు 'సమూర్తభగవద్యజనపరులు'.

అగ్నిహోత్రవిధిని పాటించేవారు, విగ్రహారాధకులు-ఇట్లారెండు వర్గాలుగా శ్రీనివాసమఖిచేసిన విభజన బహుశః కల్పసూత్రాల దశనుంచి, భగవత్ శాస్త్రదశకు వైఖానస సమాజం పరిణామంచెందటాన్ని సూచిస్తున్నది. దేవదేవుని స్థండిలం (వేదిక) మీద, లేదా సలిలంలో, లేదా సూర్యమండల మధ్యవర్తిగా లేదా స్వీయహృదయంలో పూజించుకోవచ్చును అని శాస్త్రాలు ఉద్ఘోషిస్తున్నాయి. ఈ పూజ హుతసహితం, లేదా మంత్రజపరూపం, లేదా ధ్యానపరాయణం కావచ్చు. కాని వీని అన్నింటి కంటె ఉత్తమమైనది అర్చన (విగ్రహారాధన)-కారణం, ఇందులో హుతం, జపం, ధ్యానంతోపాటు విశిష్టమైన భక్తికూడా ముడివడి ఉన్నది.

సాకారం చ నిరాకారం భవత్యారాధనం ద్విధా ।
ప్రతిమారాధనం శ్రేష్ఠం సాకారమభిధీయతే ॥
స్థండిలే సలిలే వాపి హృదయే సూర్యమండలే ।
ఆరాధనం నిరాకారం తయోః సాకారముత్తమమ్ ॥
సంసారాశ్రమనిష్ఠానాం పురుషాణాం విజానతామ్ ।
ఇహ చాముత్ర చ హితం యథేష్టఫలదాయకమ్ ॥
సకలం సర్వసంపూర్ణం సాకారమభిధీయతే ।
చక్షుషోః ప్రీతిజననం మనసో హృదయస్య చ ॥
యథోపయోగ శక్యత్వాత్ కర్తుం పూజాం సుమాదిభిః ।
అభీక్ష్ణదర్శనౌచిత్యాత్ సౌలభ్యేన విశేషతః ॥
విశేషభక్తి హేతుత్వాత్ ప్రతిమారాధనం వరమ్।

(భృగువు-ఖిలాధికారం-20;16-23)

- సాకారం, నిరాకారం అని ఆరాధనావిధానం రెండువిధాలు. ప్రతిమారాధనం సాకారమనీ, శ్రేష్ఠమనీ చెప్పబడుతున్నది. స్థండిలం (= మట్టి లేదా బియ్యపు పిండి మున్నగు వాటితో నిర్వరచిన వేదిక) మీద, లేదా సలిలంలో, లేదా హృదయంలో, లేదా సూర్య మండలంలో భావనచేసి ఆరాధించటం నిరాకారమవుతుంది. ఈ రెండింటిలో సాకారం ఉత్తమం; గృహస్థాశ్రమంలో ఉండే విజ్ఞతగల మనుష్యులకు ఈ లోకంలో, పరలోకంలో హితకరమైనది; ఇష్టఫలదాయకమైనది. సాకార విధానం సకలమైనది, సర్వసంపూర్ణమైనది (= ఇతరాపేక్ష లేనిది) అని చెప్పబడుతున్నది. కనులకు, మనస్సునకు, హృదయమునకు ప్రీతికలిగించేది, కుసుమాదులతో యథోపయోగంగా పూజించుటకు వీలుకలది కావటంచేత, సులభంగా మరలమరల చూచుటకు యోగ్యం కావటంచేత, విశేషంగాభక్తికి కారణంకావటంచేత ప్రతిమారాధన శ్రేష్ఠమైనది.

సమూర్తార్చన సామాన్యజనులకు కూడా చక్కగా సరిపోతుంది. అందుచేతనే వైఖానసులు వైదిక సంస్కృతిలోని ప్రథమదశ (వేదం) నుంచి ద్వితీయ దశకు (వేదాంతం) చేరుకొన్నారు. వారు వేదవిహితకర్మలను (శ్రౌతపద్ధతికంటె స్మార్తపద్ధతితో) ఆచరిస్తూనే సమూర్తార్చనకు అధికంగా విలువఇచ్చారు. వారికార్యస్థానం యజ్ఞశాలనుంచి ఆలయానికి మారింది.

అయితే వారు యజ్ఞసంబంధి నేపథ్యాన్ని పూర్తిగా త్రెంచుకోలేదు. పూజనుకూడా 'యజనం' గానే భావించారు. 'యజనం' అనే పదవ్యుత్పత్తిలో దేవతా పూజనం అనే అర్థం కూడా ఉంది (సంగతి దేవపూజాయాం యజనః). అనేకవిధాలైన యజనకర్మలలో యజమానుడు (యజ్ఞం చేయించే వ్యక్తి) ఉండి తీరాలి; కాని, యజమానుడు లేకుండానే దేవపూజ జరిగే అవకాశం ఉండటం దీనిలోని విశిష్టత.

"తదర్చనం ద్విధా ప్రోక్తం-అమూర్తం చ సమూర్తకమ్।
అగ్నౌ హుతమమూర్తం స్యాత్ సమూర్తం బేరపూజనమ్ ॥
అమూర్తం యజమానస్య హ్యభావే చ వినశ్యతి ।
అచ్ఛిన్నం శాశ్వతం నిత్యం ప్రతిమారాధనం పరమ్॥"

(యజ్ఞాధికారం-1,10-11)

- దేవార్చనరెండు విధాలు-అమూర్తం, సమూర్తం. అగ్నియందు (దేవత నావాహనం చేసి) పూజించటం అమూర్తం; బేర (= విగ్రహ) పూజనం సమూర్తం. అమూర్తపూజ యజమానుడు లేకపోతే నాశంపొందుతుంది (= సాధ్యం కాదు). ఇంక ప్రతిమారాధనం అవిచ్ఛిన్నం, శాశ్వతం, నిత్యం, విశిష్టం.

అగ్నిష్టోమాది యజనకర్మలు అవిచేసే అగ్నిహోత్రికి (యజమానికి) జీవిత పర్యంతమే ఫలవంతములౌతాయి; దాని సత్ఫలితాలు ఆ అగ్నిహోత్రికి, వాని సన్నిహితకుటుంబానికి మాత్రమే పరిమితాలు. కాని, దేవాలయనిర్మాణం, విగ్రహప్రతిష్ఠ అనేవి దాతకు, అర్చకునకు మాత్రమేకాక ఆ దేవాలయాన్ని సందర్శించిన వారికి, ఆవిగ్రహాన్ని పూజించిన వారికి-అంటే అందరికీ సత్ఫలితాలను కలుగజేస్తాయి. ప్రతియజ్ఞం యజమానికి ఒక్కొక్క ఫలితం ఇవ్వటానికి మాత్రమే నిర్దిష్టమైంది; తదితరఫలితాలను ఇచ్చే శక్తి దానికి ఉండదు. కాని, దేవాలయంలో విగ్రహపూజ భక్తులకు 'సర్వకామప్రదం' అవుతుంది; అంతేకాదు, అది సర్వక్రతుఫలప్రదం కూడా. (యజ్ఞాధికారంలో ప్రథమపటలం).

"స్థాపితా ప్రతిమా విష్ణోః సమ్యక్సంపూజ్య మానవః ।
యంయంకామయతే కామం తం తమాప్నోత్యసంశయమ్ ॥
యథా హి జ్వలనో వహ్నిస్తమోహానిం తదర్థినామ్ ।
శీతహానిం తదన్యేషాం స్వేదం స్వేదాభిలాషిణామ్ ॥

కరోతి క్షుధితానాం చ భోజ్యం పాకక్రియాం శిఖీ ।
తథైవకామాన్ భూతేశః స దదాతి యథేప్సితమ్ ॥
కల్పద్రుమాదివ హరేర్యదిష్టం తదవాప్యతే ॥ ”
(ప్రకీర్ణాధికారం-35-23-29)

- చక్కగాపూజించి ప్రతిష్ఠించిన విష్ణుప్రతిమ మానవుడు ఏయే కోరికలను కోరుతాడో వాటినెల్ల తప్పక ప్రసాదిస్తుంది. సంశయంలేదు. అది ఎట్లాఅంటే జ్వలిస్తున్న అగ్ని-వెలుగుకోరేవారికి చీకటిని పారద్రోలుతుంది. ఇతరులకు చలినిపోగొడుతుంది. స్వేదం కోరేవారికి స్వేదంకలిగిస్తుంది. ఆకలి గొన్నవారికి పాకక్రియద్వారా ఆకలిని పోగొడుతుంది. అట్లాగే భూతేశుడు ఎవరు కోరినకోర్కెలను వారికి తీరుస్తాడు; కల్పద్రుమంనుంచి కావలసినది లభించునట్లుగానే, హరినుంచి ఇష్టమైనది తప్పకలభిస్తుంది.

యజ్ఞకర్మకు, విగ్రహారాధనకు మధ్యగల పోలికలను వైఖానసగ్రంథాలు నిరూపించిన విషయం తరువాత ప్రస్తావించగలను. గృహంలో 'గార్హపత్యాగ్ని'ని ఒక ప్రత్యేకస్థలంలో ఆధానంచేసి, అది నిత్యం అక్కడనే జ్వలించేటట్లు చేస్తారు; ఇది, 'ధ్రువబేరం' గా విగ్రహాన్ని అచంచలంగా ప్రతిష్ఠించటంవంటిది (=మూలవిరాట్ స్థాపన). గార్హపత్యాగ్నినుంచి వెలిగించబడి, దైనందినకర్మలకు ఉపయుక్తమయ్యే 'ఆహవనీయాగ్ని' నిత్యార్చనకుపయుక్తమయ్యే 'కౌతుకబేరం' వంటిది. ఇంక మూడవది అయిన 'దక్షిణాగ్ని' ఊరేగింపునకు ఉపయుక్తమయ్యే 'ఔత్సవబేరం' వంటిది (ఉత్సవమూర్తి); ఇది ప్రత్యేకసమయాలలో విశేషార్చనకు ఉపయుక్తమవుతుంది.

ఇట్లా సమగ్ర దేవాలయ సంస్కృతి రూపొందటానికి క్షేత్రం సిద్ధమైంది. అంటే విగ్రహారాధనను యజ్ఞంగా అంగీకరించి, వేదవిహితమైన యజ్ఞకర్మకు ఒక క్రొత్తరూపం ఇవ్వటంజరిగింది. కాగా, యజ్ఞవిధిలోని అయాఅంశాలు దేవాలయంలోని విగ్రహారాధనలో పొందుపర్చబడినవి. నిత్యం గృహంలో జరిగే 'అగ్నిహోత్రపరిచర్య' స్థానాన్ని నిత్యం ఆలయంలో జరిగే 'పూజ' ఆక్రమించింది. 'పంచపర్వార్చన' అనే అయిదు ప్రత్యేకార్చనలు, వర్షాకాలం నాలుగు మాసాలలో జరిగే చాతుర్మాస్యార్చనలు-ఇవి ప్రాచీనములైన దర్శపూర్ణమాస, ఆగ్రయణములకు క్రొత్తరూపాలు. పూర్వం, సంవత్సరానికి ఒక సారి చాలారోజులపాటు శ్రద్ధతో వైభవోపేతంగా సోమయాగం సాగితే, ఇప్పుడు ఆలయంలో సంవత్సరానికి ఒకసారి 9 లేదా 10 రోజులపాటు కాలోత్సవం లేదా బ్రహ్మోత్సవం అత్యంత వైభవోపేతంగా జరుగుతున్నది.

పూర్వపు పంచాగ్నులు (సభ్య, ఆహవనీయ, అన్వాహార్య, గార్హపత్య, ఆవసథ్య అనే అయిదు అగ్నులు) నేడు పంచవిగ్రహాలుగా (విష్ణు, పురుష, సత్య, అచ్యుత, అనిరుద్ధ అనే పంచమూర్తులు-ధ్రువ, కౌతుక, స్నపన, ఉత్సవ, బలి అనే పంచబేరములందు) నిలిచాయి. యజ్ఞాంశములైన దీక్ష, ఋత్విక్కులు, హవిస్సు, త్రిషవనం (మూడుసార్లు స్నానం లేదా పూజ), పరిక్రమం లేదా ప్రదక్షిణం, అవభృథస్నానం- ఇవి ఈ నూత్నసంప్రదాయంలో కూడా పాదుకొన్నాయి.

యజ్ఞకర్మదశనుంచి, దేవాలయపూజాదశవరకు గల పరిణామక్రమం వైఖానస గ్రంథాలలో స్పష్టంగా కానవస్తుంది; కాని, విగ్రహారాధన వైదిక సంస్కృతిలోని ముఖ్యభాగమే అనీ, ఇది క్రొత్త సంప్రదాయంకాదనీ ఆ గ్రంథాలు వాదిస్తాయి. వైఖానస ఋషులప్రసక్తి ఋగ్వేదంలో (8, 70, 3 మరియు 9, 66), శుక్ల యజుర్వేదంలో (8, 38), సామవేద బ్రాహ్మణంలో (తాండ్య-14, 4, 7 మరియు 14, 8, 28), తైత్తిరీయ సంహిత (7, 1, 4,3)లో ఉన్నది. దీనినిబట్టి వైఖానసుల విశ్వాసాలు భిన్నములైనవని, తరువాతి స్మృతి గ్రంథాలను బట్టి వారి జీవన విధానం ప్రత్యేకమైనదని గోచరించగలదు.

ఉదా: మనుస్మృతి, వైఖానససూత్రాన్ని చాలా ప్రామాణిక గ్రంథంగా గణించింది (6, 1); అంతేకాదు, 'వైఖానస' అనేపదం ప్రత్యేక తత్త్వచింతన గల యతులకు, మునులకు వర్తిస్తుందని వివరించింది (6, 21-వైఖానసమతే స్థితః). బోధాయన (11, 6, 17), గౌతమ (3, 25, 34) వంటి స్మృతికర్తలుకూడా వైఖానససూత్ర ప్రామాణ్యాన్ని అంగీకరించి, వైఖానసులను వానప్రస్థులుగా పేర్కొని, శ్రామణకాగ్నిని వారిప్రత్యేకతగా గుర్తించినారు. ("వైఖానసోఽపి వానప్రస్థఏవ; సంజ్ఞాంతర కరణం సమ్యగ్వ్యవహారార్థం" అనే బోధాయన ధర్మసూత్రానికి గోవిందస్వామి వ్యాఖ్యను పరిశీలించండి).

శ్రామణకపద్ధతిలో అగ్న్యాధానం చేయటాన్ని (శ్రామణకేన అగ్నిం ఆధాయ) గౌతమ- బోధాయనులుకూడా గుర్తించినారు; ఇది వైఖానసపద్ధతి అని హరదత్తుడు వ్యాఖ్యానించినాడు (వైఖానసం శాస్త్రం శ్రామణకం).

వైఖానసులకు వేరే శాస్త్రంతో పాటు వేరే ధర్మంకూడా ఉన్నదని మనుస్మృతివ్యాఖ్యాత కుల్లూకభట్టు పేర్కొన్నాడు (6, 21- వైఖానసో వానప్రస్థః, తత్ ధర్మప్రతిపాదక శాస్త్రదర్శనే స్థితః). శ్రామణక పద్ధతి అగ్న్యారాధనలో పెక్కు విగ్రహపూజాంశములు ఇమిడి ఉండవచ్చు; ఇవే,

వైఖానసులను తక్కిన వాలఖిల్య, వాతరశనులనుంచివేరు చేస్తున్నవి.

శ్రామణకాగ్నిని గూర్చికాని, దాన్ని ఆధానంచేసే పద్ధతిని గూర్చికాని వివరించటం ప్రస్తుతాంశపరిధిలోనివి కావు; శ్రామణకాగ్ని తపస్సుకు లేదా ఒక ప్రత్యేక నియమానికి సంబంధించినదని, వైఖానసమహర్షికి సంబంధించినదని గుర్తించటం ప్రస్తుతానికి చాలు.

"తపసాం శ్రమణ మేతన్మూలం తస్మాదేతద్విధానమేతదగ్నించ।
శ్రామణకమిత్యాహ భగవాన్ ।"

- దీనికి మూలం తపస్సులలో శ్రమించటం. అందువల్ల ఈ విధానానికి, ఈ అగ్నికి శ్రామణకమనేపేరు భగవంతుడైన విఖనసుడు చెప్పినాడు.

విఖనసమహర్షియే 'శ్రామణకాగ్ని' అనే పదాన్ని సృష్టించినాడని ఇది సూచిస్తున్నది. ఇది, సాధారణంగా ఇళ్ళల్లో ఉపయుక్తమయ్యే లౌకికాగ్నికాదు; వేదవిహితవిధితో పవిత్రీకరించబడిన అగ్ని ఇది (శ్రామణకేన వైదికేన, న లౌకికేన ఇతి అర్థః-యాజ్ఞవల్క్య స్మృతిమీది మితాక్షర వ్యాఖ్య-ప్రాయశ్చిత్త భాగం-45తో పోల్చిచూడండి). ఇది వేదబుక్ నుంచి ఉద్భవించింది (శ్రావణీక అనేది పర్యాయపదంగా, ఇట్లాకానవస్తున్నది-శ్రావణం శ్రుతిః, తత్రభవః శ్రావణీకోమార్గః- బాలంభట్టు). అంతేకాదు, పూజించేవానితో తాదాత్మ్యం చెప్పబడింది (అగ్నిం అప్యాత్మసాత్ కృత్వా- యాజ్ఞవల్క్య స్మృతి, 54 దీని మీదివ్యాఖ్య-అగ్నిం ఆత్మని సమారోప్య-దీనితో పోల్చిచూడండి). వైఖానసుల ఆరాధన ఒకే అగ్నికి పరిమితమైనట్లుగా గోచరిస్తున్నది (ఏకాగ్ని రనికేతః స్యాత్- అపస్తంబ ధర్మసూత్రం-1, 2 , 21, 21; శ్రామణకంనామ వైఖానససూత్రం, తదుక్తేన ప్రకారేణ ఏకాగ్నిః ఆధేయాత్-సత్యాషాఢ శ్రౌతసూత్రం -2, 7, 5-వీనితో పోల్చిచూడండి). అంతేకాదు, చివరకు ఈ ఆరాధన అగ్ని రహితంగాకూడా సాగింది (శ్రామణకేనాగ్నిం ఆధాయాహితాగ్నిః వృక్షమూలికః ఊర్ధ్వం షడ్భ్యో మాసేభ్య అనగ్నిః అనికేతనః-వాసిష్ఠ స్మృతి-9, 7, 8). ఏకాగ్నిని, అమూర్తంగా పూజించటం అనే వైఖానసవిధి, బహుశః 'ఏకాయన' సిద్ధాంతానికి, 'ఏకాంతులు' లేదా 'భాగవతులు' అనేవర్గానికి దారితీసి ఉంటుంది.

## వైఖానసులు:

'వైఖానస' అనేపదం ప్రాచీనకాలంనుంచీ వాడుకలో ఉంది. ఒక

ప్రత్యేక మతానుయాయులుగా వైఖానసుల ప్రాచీనతను ఇది సూచిస్తున్నది. అయితే, ఆనాటివారి ఆచారవ్యవహారములు ఎటువంటివో మనకు తెలియదు. 'వైఖానస' అనేపదం బ్రాహ్మణములలో, స్మృతులలో, రామాయణ మహాభార తాలలో కానవస్తున్నది. తొలి ఉదాహరణలు వైఖానసులను అరణ్యములందలి ఆశ్రమాలలో నివసించే వయోవృద్ధులైన గృహస్థులుగా, బ్రాహ్మణములలో విధించిన విధంగా నిష్ఠతో యజ్ఞాదులను నిర్వహించే వారినిగా వర్ణిస్తు న్నవి. వైఖానసులు ఇంద్రునకు (= విష్ణువునకు) ప్రీతిపాత్రులైన ఋషులుగా సామబ్రాహ్మణం పేర్కొన్నది (తాండ్యబ్రాహ్మణం - 14, 4, 7తో పోల్చి చూడదగును -వైఖానసా వా ఋషయః ఇంద్రస్య ప్రియా ఆసన్).

సాధారణంగా వైఖానసపదం 'వానప్రస్థ' అనే పదానికి పర్యాయపదంగా గ్రహించబడుతున్నది (వర్ణాశ్రమాలలో వానప్రస్థం మూడవది; తక్కినవి బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, సన్న్యాసం). ఉదా: త్రికాండశేషం ఇట్లా వివరి స్తున్నది: నిరంతరకార్యశీలమైన సమాజజీవనాన్ని ఐచ్ఛికంగా విడిచిపుచ్చి, పట్టణాలకు సుదూరంగా ఉండే ఆశ్రమంలో, భార్యాసహితుడై జీవించే వానిని 'వానప్రస్థుడు' అంటారు. సుప్రసిద్ధము, కాళిదాసకృతము అయిన అభిజ్ఞాన శాకుంతల నాటకంలో వైఖానసుని, కఠోరవ్రత దీక్షాపరునిగా పేర్కొన్నది. వైఖానసమతస్థుడు, అనేక మతధర్మాలను పాటించటంతోపాటు, అరణ్యం లోని కందమూలాలతో, పండిరాలిపడిన ఫలాలతో తన ఆకలినితీర్చుకోవాలి అని మనువు నిర్దేశించినాడు (ధర్మం వైఖాన సాశ్రయం):

"పుష్పమూలఫలైర్వాపి కవలై ర్వర్తయేత్ సదా।
కాలపక్వైః స్వయంశీర్ణై ర్వైఖానసమతే స్థితః॥"

-సకాలంలో పక్వములై, వాటంతటఅవే రాలి పడిన పుష్పం, మూలం, ఫలం-వీటిముద్దలతో నిరంతరం దేహయాత్రసాగించే వారు వైఖానసులు.

గ్రామాదులలో పండే ధాన్యాదులను వైఖానసుడు ఉపయోగించరాదు (గ్రామ్యా ఓషధీః పరివర్జయేత్) అని, వల్కలములనే ధరించాలని, కాసెకో కగా కుశలనే ఉపయోగించాలని హారీతశాస్త్రం నిర్దేశించింది.

మహాభారతంలోని ఆనుశాసనిక పర్వం ఇట్లా నిర్దేశించింది:

"తేషు వైఖానసా నామ వానప్రస్థాః శుభేక్షణే।
తీవ్రేణతపసా యుక్తా దీప్తిమంతః సుతేజసః॥"

- వారిలో వైఖానసులనబడే వానప్రస్థులు తీవ్రమైన తపోయుక్తులు. దీప్తిమంతులు. సుతేజస్కులు.

వైఖానసులను దేవీభాగవతం ఇట్లా వర్ణించింది (1, 19, 18):

"వైఖానసా యే మునయో మితాహారా జితవ్రతాః।
తేఽపిముహ్యంతి సంసారే జానంతోఽప్యసత్యతామ్॥"

వైఖానసమునులు మితాహారులు. జితవ్రతులు (కఠిన నియమములను లొంగదీసుకొన్నవారు); కాని ఈ సంసారం (జగత్) అసత్యమని తెలిసికూడా అందులోనే వ్యామోహపడి ఉంటారు.

గృహస్థుల త్రేతాగ్ని స్థానంలో శ్రామణకాగ్నిని ఆధానంచేయటం వైఖానసుల ప్రత్యేకత అని తొలి గ్రంథాలనుపట్టి తెలియవస్తున్నది.

వశిష్ఠస్మృతి ఇట్లా తెలుపుతున్నది:

"శ్రామణకేనాగ్నిమాధాయ ఆహితాగ్నిః వృక్షమూలికః"।

- వైఖానసుడు, శ్రామణిక పద్ధతిలో వృక్షమూలమందు అగ్న్యాధానం చేసే ఆహితాగ్ని. పై సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ యజ్ఞస్వామి ఇట్లా అన్నాడు:

శ్రామణకంనామ వైఖానసం శాస్త్రమ్। తదుక్తేన విధినా।

- శ్రామణకం అంటే వైఖానసశాస్త్రం; ఆ శాస్త్రంలో చెప్పబడిన విధిని అనుసరించి (అగ్న్యాధానంచేయాలి).

శ్రమణ అనేపదం తపోయోగశీలుడు, నియమనిబంధన యుక్త జీవనుడు అయిన పరివ్రాజకుని సూచిస్తుంది. కాని, అతడు సన్న్యాసివలె వేద సంస్కృతిని విడనాడడు. అగ్నిహోత్రాన్ని కొనసాగిస్తాడు. ఐహికవాంఛలు లేకుండా, ధర్మపథం తప్పకుండా జీవిస్తాడు. శ్రమణుడు లేదా శ్రమణకుడు సాధించే శ్రామణకాగ్నియొక్క వివరాలు వైఖానససూత్రాలు విశదంచేశాయి; వీనిని గూర్చి తరువాత వివరిస్తాను.

వైఖానసమునినిగూర్చి బోధాయనుడిట్లా వివరించినాడు:

"వానప్రస్థో వైఖానసశాస్త్రసముదాచారో వనే మూలఫలాశీ
తపఃశీలః సవనేషూదక ముపస్పృశన్ శ్రామణకేనాగ్ని
మాధాయాగ్రామ్యభోజీ దేవపితృమనుష్యభూతర్షిపూజకః
సర్వాతిథిః ప్రతిషిద్ధవర్జ్యభైక్ష్యముపయుంజీత । న ఫాలకృష్ట

మధి తిష్ఠేత్ గ్రామం వా ప్రవిశేత్।”

- (వైఖానసముని) వానప్రస్థుడు, వైఖానసశాస్త్ర సంప్రదాయపరుడు. వనమందలికందమూలాల- ఫలములను తింటూ, తపశ్శీలుడై, త్రిషవణము లలో(= త్రిసంధ్యలందు) స్నానం చేస్తూ, శ్రామణక విధానంతో అగ్నిని ఆధానంచేయాలి. గ్రామములందు లభించేవానిని భుజింపరాదు. దేవతలను, పితరులను, మనుష్యులను, భూతములను, ఋషులను పూజించాలి (ఇవి పంచమహా యజ్ఞములు). అందరూ (=సర్వజాతులు) వానికి అతిథులే. నిషిద్ధవస్తువులు (= ఉల్లిపాయలు మున్నగునవి) లేని భిక్షను తినాలి. అతడు గ్రామంలో ప్రవేశింపరాదు (= సేద్యంచేయబడిన భూమిని త్రొక్కరాదు).

కాగా వానప్రస్థాశ్రమజీవనంలో కొందరు మునులు పాటించే ప్రత్యేక ధార్మిక విధానం 'వైఖానసం' అని చెప్పవచ్చు. లభ్యమైన వైఖానస సూత్రాలు ఈ ధార్మికవిధానాన్ని విశదపరుస్తున్నవి. గృహస్థుడై, సోమయాజి అయిన వ్యక్తి పుత్రపౌత్రవంతుడై, గృహనిర్వహణ బాధ్యతలు సంతానమునకు అప్పగించి, సాధారణ గృహస్థజీవితం నుంచి విశ్రాంతి పొందాలి. తరువాత, భార్యా సహితుడై, వనంలోని ఒకఆశ్రమంలో నివసిస్తూ, భగవంతుడైన నారాయణుడే ఆదేశించినట్లుగా ఆయనను సేవించటానికి నిర్ణయించుకోవాలి (భగవత్ ఆజ్ఞయా భగవత్ ప్రీత్యర్థం శ్రీమన్నారాయణ కైంకర్యరూపమ్). అప్పుడాతడు 'వనాశ్రమముని' అవుతాడు. అతడు పది 'నియమము' లను (స్నానం, శుచిత్వం, అధ్యయనం, తపస్సు, ఔదార్యం, నిత్యపూజ, ఆయాసమయాలలో ఉపవాసం, బ్రహ్మచర్యం, విధ్యుక్తధర్మాచరణ, మౌనం), పది 'యమము' లను (సత్యం, అక్రూరత, సదాచారం, క్షమ, ఇంద్రియ జయం, ప్రీతిపూర్వకమైనదయ, జాగ్రత్త, సరళత, అహింస, మధురదృష్టి) పాటించాలి. ఉభయ సంధ్యలందును శ్రామణకాగ్నిని నెలకొల్పాలి. దర్శ పూర్ణమాసం, చాతుర్మాస్యం, నక్షత్రేష్టి, ఆగ్రయణేష్టి వంటి విహితకర్మలు నెరవేర్చాలి. అతడు రోజులో ఒక్కపూటే కందమూలాలు ఫలాలు భుజించాలి. రాత్రి ఉపవాసం చేయాలి (రాత్రౌ నాశ్నీయాత్). భార్యను తల్లివలె భావించాలి; ఏవిధమైన మోహం ఉండరాదు. భార్యతో కలిసి ఉంటున్నా, ఆమెకు దూరంగా నిద్రించాలి (పత్నీం వినా ఏకః శయితః; మాతృ వత్ నిష్కామః ప్రేక్షేత). అతడు స్వయం నియంత్రితుడు. ఏ రూపంలోనూ ధనం కూడబెట్టరాదు (ధాన్యధనసంచయం న కుర్వీత). సుఖాలను లేదా లాభాలను ఆశించకుండా, సకలజీవులపట్ల దయకలవాడై, పవిత్రమూ శాంతమూ అయినజీవితం గడపాలి.

ఈ మునులలో రెండువర్గాలవారిని పేర్కొన్నాయి ప్రాచీన గ్రంథాలు. సపత్నీకుడు (భార్యతో నివసించేవాడు), అపత్నీకుడు (భార్యలేని వాడు). సపత్నీకులలో మరలనాలుగు వర్గాలువారున్నారు: 1. ఔదుంబరులు(శ్రామణకాగ్నిని మాత్రమే ఆధానంచేసేవారు); 2. వైరించులు (నారాయణుని ఆరాధిస్తూ నిష్ఠతో జీవించేవారు); 3. వాలఖిల్యులు (జటా జూటాలు కలవారై, నారచీరలు ధరిస్తూ అర్కాగ్నిని-సూర్యుని అగ్నిగా-ఆరాధించేవారు); 4. ఫేనవులు ( పిచ్చివారిలా జీవిస్తూ రాలిపడిన ఆకులను తింటూ, కటికనేలమీద పండుకొంటూ, చాంద్రాయణవ్రతపరులై, మోక్షం మాత్రం కోరేవారు).

ఇంక అపత్నీకులలో చాలావర్గాలవారు ఉన్నారు. మునులలో, యజుర్వేదంలో నిర్దేశింపబడిన, 'అరుణకేతుకం' అనే కర్మకాండను నిర్వహించే వర్గం ఇంకోటి ఉంది. సృష్టిప్రారంభంలో ఐదురకాల మునులు ఉద్భవించారు (తైత్తిరీయ ఆరణ్యకం-1, 25, 23)- 1. అరుణులు-దైవాన్ని నమ్ముకొని, తక్కినవిషయాలలో ఆసక్తిచూపని వారు; 2. కేతువులు-ఉదార గుణోపేతులు, దైవభక్తులలో అగ్రగణ్యులు; 3. వాతరశనులు- దిగంబరులు, ఉపవాస దీక్షితులు అయిన పరివ్రాజకులు; 4. వైఖానసులు-ఇంద్రియాలను జయించినవారు; 5. వాలఖిల్యులు.

ఆపో వా ఇదమాసన్ సలిలమేవ వా
స ప్రజాపతిరేకః పుష్కరపర్ణే సమభవత్।
తస్యాంతర్మనసి కామః సమవర్తత।
ఇదం సృజేయ మితి। ——స తపస్తప్త్వా।
శరీరమధూనత। తస్య యన్మాంసమాసీత్ తతో ఽరుణాః
కేతవో వాతరశనా ఋషయ ఉదతిష్ఠన్। యే ఽనఖాస్తే
వైఖానసాః। యేవాలాస్తే వాలఖిల్యాః।

- ఆదిలో ఈ సృష్టి అంతా జలమయంగా ఉన్నది. అందులో తామరాకుపై ప్రజాపతి ఒక్కడే సంభవించెను. ఈ విశ్వమును సృజించవలెనన్న కోరిక ఆయన మనస్సులో ఉదయించినది. — ఆయన తపస్సుచేసి తనశరిరమును ఒక్కసారి గట్టిగా విదలించినాడు. ఆయనలోని మాంసము నుంచి అరుణులు, కేతువులు, వాతరశనులు, ఋషులు ఎగిరిపడినారు (=

వెలువడినారు). ఆయన నఖములు వైఖానసులు గాను, వాలములు (= వెంట్రుకలు) వాలఖిల్యులు గాను మారినవి.

వేదధర్మాన్ని చక్కగా పాటిస్తూ, యజ్ఞాదులను వనవాస జీవితాన్ని మిళితం చేసిన తొలిమునులే తమపూర్వీకులని అర్వాచీన వైఖానసుల నమ్మకం. వేదవాఙ్మయంలోని కల్పసూత్రసముదాయంలో వైఖానసులకు ప్రత్యేక కల్పసూత్రములున్నవి; ఇవి నేటికీ ప్రచారంలో ఉన్నవి. వేదపురుషునకు ఛందస్సులు పాదాలు, కల్పాలు హస్తాలు; మతరహిత, మతసహిత సర్వకార్యాలు ఈ రెండింటి వల్లనే సంభావ్యములవుతున్నవి. నాలుగు వేదాలలో ప్రతి వేదానికి అనేక శాఖలున్నవి; ఒక్కొక్కశాఖకు ఒక్కొక్క కల్పసూత్రం ప్రత్యేకంగా ఉంది -ఇవి ఆయాశాఖానుయాయుల నిత్యనైమిత్తిక కర్మకాండను నిర్దేశిస్తున్నవి. మతజీవితానికి సంబంధించిన సర్వ క్రియా కలాపాలను కల్పసూత్రాలు నిర్దేశిస్తున్నవి. ఈ క్రియాకలాపంలో మూడు ప్రధాన భాగాలున్నవి: 1. ప్రధానములైన యజ్ఞాదులకు సంబంధించిన శ్రౌతకర్మ; 2. గృహస్థలేదా స్మార్తధర్మాలు, వాటికి సంబంధించిన కర్మలు; 3. సాంఘిక విభాగాలకు సంబంధించిన ధర్మం, దాని బాధ్యతలు. ఇంకో విభాగంకూడా అధికంగా ఉంది- ఈ విభాగం పేరు 'శుల్బసూత్రములు'. అగ్ని (హోమ) కుండనిర్మాణం, దానికొలతలు, యజ్ఞసమయంలో ఉపయుక్తములయ్యే పరికరాలు-వీటిని ఈ శుల్బసూత్రాలు నిర్దేశిస్తున్నవి. పై నాలుగు విభాగాలను వివరించే గ్రంథం 'పరిపూర్ణ గ్రంథం' అవుతుంది. కాని ఒకే గ్రంథం వ్యక్తిగత, గృహస్థ, సాంఘిక ధర్మాలను కూలంకషంగా చర్చించటం అరుదు. గృహస్థధర్మాలను, బాధ్యతలను వివరించేవానిని 'గృహ్యసూత్రములు' అంటారు. ఇవి బాగా ప్రచారంలో ఉన్నవి. ఇవి కాక, శ్రౌతసూత్రాలు కూడా ఉన్నవి.

ఋగ్వేదానుయాయులలో రెండు వర్గాలవారు ఉన్నారు- (1) శ్రౌతసూత్రాలను పాటించేవారు ఆశ్వలాయనులు (ఉత్తరభారతంలోని పంచగౌడులు, గోదావరి నదికి దక్షిణంగాఉన్న పంచద్రావిడులు సాధారణంగా దీనికి సంబంధించిన వారుగా ఉంటారు); (2) సాంఖ్యాయనులు (ఉత్తరభారతంలోని కొన్ని ప్రాంతాలలో, కేరళలో వీరు ఉన్నారు).

యజుర్వేదంలో రెండు ప్రధాన భాగాలున్నవి-శుక్లం, కృష్ణం. శుక్లయజుర్వేదానుయాయులకు కాత్యాయన శ్రౌతసూత్రాలు ఉన్నవి (కాఠీయ లేదా పారస్కర సూత్రాలు). వీటిని అనుసరించే వారు కాణ్వులు, మాధ్యం

దినులు-వీరు అధికంగా దక్షిణ భారతంలో ఉన్నారు. కృష్ణయజుర్వేదంలో మూడు ప్రధానభాగాలు ఉన్నవి-తైత్తిరీయం, చరకం, మైత్రాయణీయం. చరకులకు 'చరకం' అనే కల్ప సూత్రాలున్నవి (వీరు ప్రస్తుతం కాశ్మీర్‌లో ఉన్నారు). మైత్రాయణీయులకు చాలా ప్రాచీనమైన 'మానవం' (దీని అనుయాయులు గుజరాత్‌లో, మహారాష్ట్రంలో ఉన్నారు), 'వరాహం' (దీని అనుయాయులు ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్ణాటక, గుజరాత్‌లలోని కొన్ని ప్రాంతాలలో ఉన్నారు), శ్రౌత, గృహ్యసూత్రాలు ఉన్నవి. తైత్తిరీయులకు నాలుగు కల్పసూత్రాలు ఉన్నవి- అపస్తంబం (దీని అనుయాయులు తమిళ నాడులో, ఆంధ్రప్రదేశ్‌లో అధికం), భారద్వాజం (తమిళనాడులోని కొన్ని ప్రాంతాలలో), వాధూలం (కేరళలో), వైఖానసం (ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తమిళనాడులలో). ఈ చివరి కల్పసూత్రం అన్నివిషయాలతో సమగ్రమైనది.

సామవేదంలో మూడు ప్రధానభాగాలున్నవి: రాణాయనీయం, కౌథుమం, జైమినీయం. రాణాయనీయభాగానికి ద్రాహ్యాయన శ్రౌతసూత్రాలు (పంచగౌడ-పంచద్రావిడులలో కొందరు అనుసరిస్తారు); కౌథుమభాగానికి లాట్యాయన శ్రౌతసూత్రాలు, గోభిల గృహ్యసూత్రాలు (ఉత్తరభారతంలోని కొన్ని ప్రదేశాలలో); జైమినీయ భాగానికి ప్రత్యేకమైన కల్పసూత్రాలు (దక్షిణభారతంలో, ముఖ్యంగా, కేరళ కర్ణాటక తమిళనాడులలో) ఉన్నవి.

అధర్వణ వేదంలో ఒక్క శౌనక భాగం మాత్రమే లభ్యమయింది. దీనికి సంబంధించినవి వైతాన శ్రౌతసూత్రాలు, కౌశిక గృహ్యసూత్రాలు (కాశ్మీర్, గుజరాత్‌లలో కొన్ని వర్గాలవారు). ధర్మసూత్రాలలో-అపస్తంబం (కృష్ణయజుర్వేదంలోని తైత్తిరీయ భాగానికి చెందినది- దక్షిణభారతంలోనే అనుయాయులు ఉన్నారు); హిరణ్యకేశి (పై భాగానికి చెందినదే, కొంకణ దేశీయులు అనుసరిస్తారు)-ఇవి ప్రచారంలో ఉన్నవి.

అట్లాగే మూడు శుల్బసూత్రాలు మాత్రమే ప్రచారంలో ఉన్నవి; ఈ మూడూ యజ్ఞయాగాదులను నిర్దేశించే యజుర్వేద భాగానికి చెందినవి - అపస్తంబ, బోధాయన, కాత్యాయన సూత్రాలు. తక్కిన మూడు వేదాలకు శుల్బసూత్రాలు ఉండటం సంభావ్యం కాదు; కారణం శుల్బసూత్రాలు యజ్ఞయాగాదుల నిర్వహణకు సంబంధించినవి మాత్రమే కావటం.

కాగా, వైఖానస కల్పసూత్రం శ్రౌత, గృహ్య, ధర్మవిభాగాలకు సంబంధించినదై సమగ్రకల్పసూత్రంగా ఉన్నది. శుల్బసూత్రం అనే విభాగం

వైఖానస కల్పసూత్రంలో లేక పోయినా సాధారణంగా ఈ విభాగంలో చెప్పబడే విషయాలు శ్రౌతగృహ్యావిభాగాలలోనే పొందుపరుపబడినవి. 'వైఖానస భగవచ్ఛాస్త్రం' గా ప్రసిద్ధికెక్కిన వైఖానస కల్పసూత్రంలో 32 ప్రశ్నలు (అధ్యాయాలు) ఉన్నాయి-ఇందులో 7 ప్రశ్నలు గృహ్య లేదా స్మార్త విషయాలను, 3 ప్రశ్నలు ధర్మవిషయాలను, ఒక ప్రశ్న గోత్రప్రవరలను (వంశకర్తలైన ఋషి పరంపరలను), 21 ప్రశ్నలు శ్రౌతవిషయాలను వివరిస్తున్నవి. ఈ శాస్త్రం వైఖానసులకు ప్రధానశాస్త్రం; అయా అంశాలను నిర్దేశించే తక్కిన గ్రంథాలకు ఈ భగవచ్ఛాస్త్రమే ఆకరం. నృసింహవాజపేయయాజి (కాలం సరిగా తెలియదు; కాని క్రీ.శ. 5వ లేదా 6వ శతాబ్దమువాడని విశ్వసింపబడుతున్నాడు) 7 గృహ్యసూత్ర ప్రశ్నలకు, 3 ధర్మసూత్ర ప్రశ్నలకు, ఒక ప్రవరసూత్ర ప్రశ్నకు విపులమైన చక్కని టీక రచించినాడు. ఇది వైఖానసాగమానికి ప్రధానమైన ఆధారము. వైద్యనాథుని వర్ణాశ్రమాచారకాండ, సుప్రసిద్ధమైన స్మృతి రత్నాకరం- ఇవి ఒకప్పుడు ప్రచారంలో ఉన్న 18 కల్పసూత్రాలను రెండు వర్గాలుగా విభజించినవి.

"బోధాయనీయాపస్తంబీయం సత్యాషాఢం గార్గ్యమాగస్త్యం
శాకల్యమాశ్వలాయనం శాంభవీయం కాత్యాయనమితి నవానిపూర్వ సూత్రాణి ।
వైఖానసీయం శౌనకీయం భారద్వాజం యాజ్ఞవల్క్యం జైమినీయం
వాధూలం మాధ్యందినం కౌండిన్యం కౌషీతకీయమితి నవాన్యపర సూత్రాణి" ।

-ఆనందసంహిత-6,2-3

ఇందులో ప్రథమవర్గంలోని తొమ్మిది (బోధాయన - అపస్తంబ - సత్యాషాఢ - గార్గ్య - అగస్త్య - సాకల్య - అశ్వలాయన - శాంభవ - కాత్యాయనములు), సామాన్య లేదా పూర్వసూత్రాలు-అంటే, ఇవి వేదాలనుంచి వెలసిన సూత్రాలు; ఇవి గృహంలోనూ, బహిరంగంగానూ జరిగే యజ్ఞయాగాదులను మాత్రమే వివరిస్తున్నవి. ఇక రెండవ వర్గంలోని 9 సూత్రాలు (వైఖానస, శౌనక, భారద్వాజ, యాజ్ఞవల్క్య, జైమిని, వాధూల, మాధ్యందిన, కౌండిన్య, కౌషీతకములు) అసామాన్య లేదా అపరసూత్రాలు; ఇవి వేదాలలోని, ఉపనిషత్తులలోని తాత్త్వికచింతనను వివరించినవి; విష్ణువు మున్నగు దేవతలను పూజించటాన్ని, దైనందిన వ్యవహార విధులను కూడా ఇవి వివరించినవి.

పై వర్గవిభజనకు హేతువు ఏమిటో స్పష్టంగా లేదు. పై శ్లోకాలలో ప్రయుక్తములైన పూర్వ- అపరపదాలు ఆయా రచనలు వెలసిన కాలక్రమాన్ని తెలుపుతున్నవని భావించాలి. అయితే పూర్వ- అపర పదాలకు పర్యాయపదాలుగా ప్రయుక్తములైన సామాన్య-అసామాన్యపదాలు, బహుశః ఆ గ్రంథాలలోని విషయాలను సూచించేవికావచ్చు. వేదాలలో చెప్పబడిన యజ్ఞయాగాది కర్మకాండను ఒక క్రమపద్ధతిలో నిర్ధరించటానికి కల్పం, వేదాంగంగా వెలసింది.

"కల్పో వేదవిహితానాం కర్మణా మానుపూర్వ్యే కల్పనాశాస్త్రమ్।"

-వేదవిహితములైన కర్మలను సక్రమంగా కల్పించే శాస్త్రం కల్పశాస్త్రం. ప్రాచీనకాలంలో ప్రచారంలోఉన్న సోమయాగం, బృహస్పతి సవనం, ద్వాదశాహం, సత్రం, వాజపేయం, రాజసూయం, సౌత్రామణీ, అహీనం, అశ్వమేధంవంటి యజ్ఞాదులను వివరించే శ్రౌతసూత్రాలు బహుశః పూర్వకాలానికి చెందినవి కావచ్చు. ధనం, పశువులు, సంతానం, జయం, ఆహారం, తదితర ఐహిక లాభాలు-వీటిని దృష్టిలో పెట్టుకొని, ఈ యజ్ఞాదులను చేసేవారు. ప్రతిప్రధాన క్రతువునకు ముందుగా సన్నాహం, సంస్కారం, పవిత్రీకరణం వంటి బహుళ క్రియాకలాపం నిర్వహింపవలసి ఉంటుంది. -ఇవి చేయటంవల్ల యజమాని పైని పేర్కొన్న లాభాలకు అర్హుడు అవుతాడు. కాలక్రమంలో ప్రధాన క్రతునిర్వహణ కష్టసాధ్యం కావటం, తత్ఫలితంగా క్రతువులు అరుదు కావటం జరిగింది. ప్రధాన క్రతువు స్థానంలో సన్నాహం, సంస్కారం, పవిత్రీకరణం వంటివి ప్రాధాన్యం సంతరించుకొన్నాయి. అట్లాగే క్రతువుల స్థానాన్ని దేవతా పూజ ఆక్రమించుకొన్నది. అసామాన్య కల్పసూత్రాలు ఈ సన్నాహ-సంస్కార-పవిత్రీకరణ విధులను, పూజావిధులను నిర్దేశిస్తూ ఉండటంవల్ల, పూర్వకల్ప సూత్రాల 'సామాన్యత్వం' మరుగున పడిపోయింది.

కల్పసూత్రాల ద్వారా వర్గీకరణ ఎటువంటిది అయినా వేదవిహిత కర్మకాండ, విష్ణువుయొక్క ప్రతిమారాధన- ఈ రెండింటినీ అసందిగ్ధంగా బోధించే వైఖానసకల్పసూత్రాలు ప్రామాణ్యం సంతరించుకొన్న శాస్త్ర సముదాయమని చెప్పకతప్పదు. ఇచ్చట మనం, కల్పదశనుంచి ఆగమదశకు పరిణామం గుర్తించగలం. తరచుగా ఇంద్రునితో, అగ్నితో అభేదం చెప్పబడే విష్ణువు వేదప్రోక్త దేవతలలో ప్రధానుడు; ఆయన మూర్తీభవించిన యజ్ఞంగానే గణింపబడినాడు (యజ్ఞో వై విష్ణుః).

"మంథమాత్మానం విష్ణుం జన్యమగ్నిం చ ధ్యాయన్" (1,10,5).

- మనస్సు అనే అరణిలో, ధ్యానమనే మథనంలో అభివ్యక్తమైన విష్ణువే యజ్ఞాగ్ని; విష్ణువుతో పాటు అగ్నిని కూడా సేవించాలి.

విష్ణుపూజ ఒకగొప్ప యజ్ఞం నిర్వహించటంతో సమానం. అందుచేత, ఇంటిలో దేవాలయంలో పూర్తిగా వేదవిహిత విధిపూర్వంగా విష్ణుపూజ చేయవలెనని వైఖానసకల్పసూత్రాలు నిర్దేశిస్తున్నవి. కాగా, వేదవిహిత కర్మకాండ, క్రమంగా, విష్ణుపూజకంటె తక్కువ స్థాయికి పోవటంలో ఆశ్చర్యంలేదు; కాని వేదవిహిత కర్మకాండ మాత్రం ఎన్నడూ పూర్తిగా విస్మరింపబడలేదు. ఆగమానుయాయులలో బహుశః వైఖానసులు మాత్రమే కల్పసూత్రాలమీద అధికంగా ఆధారపడతారు. ఆదిశైవులు లేదా శివద్విజులు అనబడే శైవాగమానుయాయులు బోధాయన కల్పసూత్రాలను అనుసరిస్తారు (వైఖానససూత్రాలవలె ఇవి కూడా కృష్ణ యజుర్వేద తైత్తిరీయ శాఖకు చెందినవి). శైవాగమం కల్పసూత్రాలనుంచి విడివడి, స్వతంత్రంగా అభివృద్ధి చెందింది; కాని వైఖానసాగమం బాగా కల్పసూత్రాల పరిధిలోనే ఉన్నది.

ఇంతకుముందే పేర్కొన్నట్లుగా వైఖానసకల్పసూత్రంలో మూడు ప్రధాన భాగాలున్నవి-శ్రౌతం, స్మార్తం (= గృహ్యం), ధర్మం. శుల్బసూత్రాలు మొదటి రెండు భాగాలలో మాత్రమే ఇమిడి ఉన్నవి. ప్రథమభాగం 'అగ్న్యాధానం' తో ప్రారంభమై, 'సోమసంస్థానం' తో ముగుస్తుంది. పెక్కు యజ్ఞ యాగాదులను, నిత్యనైమిత్తిక క్రియాకలాపాలను ఈ భాగం వివరించింది. అంతేకాదు, చిన్న పెద్ద లోపాలు సంభవించినప్పుడు వాటికి ప్రాయశ్చిత్త క్రియలను కూడా వివరించింది. అయితే శ్రౌతభాగాలకు అంతగా విలువలేదు; కారణం, అవి కామ్యములను (స్వార్థప్రేరితములైన యజ్ఞయాగాదులను) మాత్రమే నిర్దేశించటం.

"యోఽగ్నిం చినుతే తస్య సర్వం సుకృతం భవతి ।
నిత్యకర్మభిః శ్రేయః స్యాత్ శ్రౌతైః స్మార్తైశ్చ ।
సర్వేభ్యః కామేభ్యాం దర్శ పూర్ణమాసా ।
షోడశినా వీర్యకామో యజతే ।
వాజపేయేన బ్రాహ్మణో రాజన్యో వర్ధికామో యజేత ।
అతిరాత్రేణ బ్రహ్మవర్చకామో యజతే ।"

-ఎవరు అగ్నిచయనం చేస్తారో వారికి సర్వపుణ్యములు చేకూరుతాయి.

శ్రౌత (= సోమయాగాది) -స్మార్త (= పంచమహాయజ్ఞ) నిత్యకర్మలను అనుష్ఠించటం చేత శ్రేయస్సులభిస్తుంది. అన్ని కామనలకు దర్శ-పూర్ణమాస ములు (అమావాస్య-పూర్ణిమలలో చేయదగిన యజ్ఞములు = యజుర్వేద ప్రారంభంలో ప్రతిపాదింపబడిన ప్రకృతి యాగములు) ఉపయోగపడగలవు. బలపరాక్రమకామన షోడశి యాగంచేత సిద్ధిస్తుంది. వృద్ధికాములైన బ్రాహ్మ ణులు, రాజన్యులు వాజపేయంతో యజించాలి. ఇంక బ్రహ్మవర్చస్సు కోరేవారు అతిరాత్రమనే యజ్ఞంతో యజించాలి.

స్వార్థాన్ని అణచివేయటం వైఖానసవ్రతంలో ప్రధానవిధి. మతవిధు లను విధ్యుక్తధర్మంగానే నెరవేర్చాలి. అందుచేత వైఖానసాగమం శ్రౌత సూత్రాలను వెనుకకు నెట్టింది ; కాని వేదసంబంధాన్ని కొనసాగించటం కోసం గృహ్యసూత్రాలను ఆదరించింది.

గృహ్యసూత్రాలు గృహస్థవిధులకు సంబంధించినవి. వ్యక్తి దేహాన్ని సంస్క రించి, ఆధ్యాత్మిక ప్రగతికి తోడ్పడేవిధంగా పరిశుద్ధంచేసే 18 సంస్కారాలను ఇవి వివరిస్తున్నవి. నిషేకం (ఋతుసంగమనం), గర్భాధానం నుంచి సమావర్తనం (చదువుపూర్తికావటం) వరకు, జాతకాది- శ్మశానాంతం వరకు ఉండే కర్మకాండనంతా ఇవి నిర్దేశిస్తున్నవి. మతసంస్కారాలలో 'విష్ణుబలి' అనేది వైఖానసుల ప్రత్యేకత. దీనిని గూర్చి తరువాత వివరిస్తాను. గృహంలో ప్రతిమను నెలకొల్పటం, దానిని పూజించటం (గృహార్చాబింబ ప్రతిష్ఠ, అర్చన), తత్సంబంధినియమాలను పాటించటం (సప్తవిధపాకయజ్ఞం, నవ గ్రహ యజ్ఞం మొ.)- వీటిని కూడా ఈ గ్రంథాలు వివరిస్తున్నవి. ఇవి దైవిక నిర్దేశాలుగా గణింపబడినవి. వ్యక్తికి ద్విజత్వాన్ని చేకూర్చటానికి ఉద్దిష్టములైన 18 సంస్కారాలకంటె ఇవి భిన్నములైనవి.

మూడు 'ప్రశ్నల' తో సమగ్రంగా ఉన్న ధర్మసూత్రాలు వివిధవర్గాల, కులాల ప్రజల మతజీవనవిధానాన్ని, ఆయా వర్ణాశ్రమాలకు ఉచితములైన బాధ్యతలను విధులను, వానప్రస్థుల, సన్న్యాసుల ప్రత్యేకతలను, తదితర విషయాలను వివరిస్తున్నవి. అంతేకాదు. అష్టాంగయోగమునుగూర్చి, తది తర ఆధ్యాత్మిక సాధనలను గూర్చి కూడా ఇవి వివరిస్తున్నవి. ఇంక ప్రవరసూత్రం వైఖానస సమాజానికి చెందిన ఆయా ఋషిపరంపరలను వివరిస్తున్నది. సారాంశమేమనగా, వైఖానసుని వ్యక్తిగత, గృహస్థ, సాంఘిక సంబంధి సర్వ విధులను వైఖానస కల్పసూత్రం నిర్దేశిస్తున్నది. వైఖానసుడు తన విధులను బాధ్యతలను, ఆయా సందర్భాలకు తగినట్లుగా వేదమంత్ర

పురస్సరంగా, తెలివిగా, శక్తిమంతంగా నెరవేర్చగలగటానికి ఈశాస్త్రం ఉద్దిష్టమైంది.

"కల్ప్యతే సామర్థ్యవాచినో వ్యుత్పన్నో౽యం కల్పశబ్దః। సామర్థ్యం చేహ వేదార్థజ్ఞాపకత్వమేవ । తాదృశ సామర్థ్య జనకశాస్త్రం సౌలభ్యపదచ్ఛందోబద్ధమేవ ప్రణేయమానం కల్పసూత్రం భవతి."

-సామర్థ్యం అనే వ్యుత్పత్తి అర్థంనుంచి కల్పశబ్దం ఉత్పన్నమైనది (క్లృపూ సామర్థ్యే); అటువంటి సామర్థ్యం కలిగించే శాస్త్రం సులభములైన పదములతో, ఛందస్సులలో కూర్చబడి, కల్పసూత్రం అనబడుతున్నది.

మతసంబంధి కర్మకాండలో వేదమంత్రాలను ప్రయోగించటానికి కారణం చేసే క్రియాకలాపం లాభదాయకం శక్తిమంతం కావాలన్న కోర్కె. అదృశ్యశక్తులమీద ప్రభావం చూపటం, కర్తయొక్క సంకల్పాన్ని కోర్కెను ప్రకటించటం, మంత్రస్వభావాన్ని నిర్దేశించటం, క్రియాకలాపాన్ని పవిత్రీకరించటం - వేదమంత్రప్రయోగంలోని పరమార్థమని జె. గొండా తన విశ్లేషణలో వివరించినారు (జె. గొండ రచించిన "వైఖానసశాస్త్రాలలో వేదమంత్రప్రయోగం" అనే వ్యాసాలతో పోల్చిచూడాలి.) ఇట్లా వేదమంత్రాలను ఉపయోగిస్తూ ఉండటంవల్ల, తరువాత ఏర్పడిన మత సమాజాలలో వేదసంబంధం నిరంతరంగా కొనసాగటమేకాక, ఆ వేదమంత్రాలకు నూత్నప్రయోజనం చేకూరింది. మతరంగస్థలం యజ్ఞశాలనుంచి దేవాలయ ఆవరణలోనికి మారింది. అయితే వేద మంత్రాలు మాత్రం ఉపయుక్తమవుతూనే ఉన్నవి. అర్చకులు పూర్వంవలెనే తమ ఇళ్ళల్లో వేదవిహితకర్మలను ఆచరిస్తూనే ఉన్నారు. అంతేకాదు, వేదవిహిత కర్మలు పూజావిధానంలో చోటుచేసుకొన్నవి. తెలియక చేసిన పాపాలనుంచి విముక్తి పొందటం, ఇహపరాలలో శాంతిసౌఖ్యాలు సాధించటం-ఇవి వేదవిహితకర్మలను ఆచరించటంలోని పరమార్థం.

కల్పసూత్రాలమీద ఆధారపడిన వైఖానస శాస్త్రాలను క్రీ.శ. 1896 ప్రాంతాలనాటికే జర్మని దేశపు ఇండోలజిష్టులు కనుగొన్నారు. ('U' ber das grhya und dharma ṣutra der vaikhanasa, Leipzig-తో పోల్చి చూడాలి.) వీటిని 1913లో, దేవనాగరిలిపిలో టి. గణపతి శాస్త్రి గారు ప్రచురించారు (Tiruvantapuram Sanskrit Series). వైఖానస

గృహ్యసూత్రం, ధర్మ-ప్రవరప్రశ్నలతో పాటు, కుంభకోణంలో, 1915లో తెలుగులిపిలో, నారాయణభట్టాచార్య సంపాదకత్వంలో ప్రచురింపబడింది. 1925లోను, 1927లోను వైఖానస గృహ్య-ధర్మసూత్రాలను డబ్ల్యూ. కలాండ్ ప్రచురించినారు. (Utrecht1925 ; పునర్ముద్రణ1989లో మెహర్ చంద్ లక్ష్మణ దాస్ ప్రచురణలు).

డా. ఎగ్గెర్స్, వైఖానస ధర్మ సూత్రాలను 1929లో ప్రచురించాడు (Das Dharma Sutra des Vaikhanasa, Gottingen). ఇటీవల, 1967లో 'తాత్పర్యచింతామణి' అనే శ్రీనివాసమఖి వ్యాఖ్యతో, అర్. పార్థసారథి భట్టాచార్యసంపాదకత్వంలో తిరుమల తిరుపతి దేవస్థానంవారు వైఖానస గృహ్యసూత్రాలను రెండుసంపుటాలుగా ప్రచురించారు. విజయవాడలోని వైఖానస మహామండలి, వైఖానస స్మార్తసూత్రాన్ని, నృసింహవాజపేయ యాజి భాష్యంతో, అర్. పార్థసారథి భట్టాచార్య సంపాదకత్వంలో రెండు సంపుటాలుగా, తెలుగులిపిలో, 1984-87 సంవత్సరాలలో ప్రచురించింది. వైఖానస కల్పసూత్రంలోని శ్రౌతభాగం 1987లో తెలుగులిపిలో అర్. శ్రీనివాసాచార్య సంపాదకత్వంలో గుంటూరుజిల్లా దుగ్గిరాలలో ప్రచురింపబడింది. వైఖానస సూత్రానుక్రమణిక, మూడు సంపుటాలుగా నల్లూరులోని వైఖానస భగవచ్ఛాస్త్రగ్రంథమాల వారిచేత 1982లో ప్రచురింపబడింది.

## విష్ణుపూజ

విష్ణువును ఉత్తమోత్తముడైన వేదప్రోక్తదైవంగా ఆరాధించటంలో వైఖానసులు ఎటువంటి సంశయానికి తావుఇవ్వరు. సంప్రదాయానుసారంగా అగ్నికి ఆహుతులు సమర్పించిన తరువాత, ఇంటిలో ఉభయ సంధ్యలందును విష్ణువును పూజించాలని వారి గృహ్య (= స్మార్త) సూత్రం నిర్దేశిస్తున్నది (ప్రశ్న 4, ఖండం 10). ఇట్లా చేయటంవల్ల సమస్తదేవతలు ఆరాధింపబడినట్లే. దేవతలందరిలోను అగ్ని తక్కువస్థాయివాడని, విష్ణువు అందరికంటె అధికుడని, ఈ ఇరువురి మధ్య సమస్తదేవతలు ఉంటారని ప్రాచీన శాస్త్రాలైన బహ్వృచ్ఛ్రుతి, ఐతరేయబ్రాహ్మణములను (1, 1, 1) అనుసరించి గృహ్యసూత్రం పేర్కొంటున్నది.

"అథాగ్నౌ నిత్యహోమాంతే విష్ణోర్నిత్యార్చా సర్వదేవార్చా భవతి (95)। అగ్నిర్వై దేవానామవమో విష్ణుః పరమస్తదంతరేణ సర్వా అన్యాదేవతా ఇతి బ్రాహ్మణమ్(96). తస్మాత్ పరమం విష్ణుం ప్రతిష్ఠాప్య సాయం

ప్రాతర్హోమాంతే ఒర్చయతి(97)(విమానార్చనాకల్పే).
అగ్నిర్వైదేవానామవమః విష్ణుః పరమః తదంతరేణసర్వా అన్యాదేవతాః ।
తస్మాత్పరం నాపరమస్తి కించిత్ యస్మాన్నాణీయో నాజ్యాయోఽస్తి కశ్చిత్ । వృక్ష ఇవస్తబ్ధో దివి తిష్ఠత్యేస్తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్ ।

-నిత్యహోమాంతమందు విష్ణువును నిత్యం అర్చించాలి, ఇందువల్ల సర్వ దేవతలు అర్చింబడినట్లే (95).

- దేవతలందరిలో అగ్ని తక్కువస్థాయికి చెందుతాడు. (=మనకు దగ్గరగా అందుబాటులో ఉండే దేవత); ఇంక విష్ణువు అందరికంటె అధికుడు. ఈ ఇరువురి మధ్య సర్వదేవతలు ఉంటారు అని బ్రాహ్మణం నిర్దేశించింది (96). అందుచేత ఉత్తమోత్తముడైన విష్ణువును ఇంటిలో ప్రతిష్ఠించి, సాయం కాలం, ప్రాతఃకాలం, హోమాంతమందు అర్చించాలి (97).
(విమానార్చనాకల్పం).

- దేవతలందరిలో అగ్ని తక్కువవాడు, విష్ణువు పరముడు. ఈ ఇరువురి మధ్య తక్కిన దేవతలందరూ ఉన్నారు. విష్ణుతత్వంకంటె ఉత్కృష్టమైనది కాని నికృష్టమైనదికాని ఇంకోటి ఏదీ లేదు. అంతకంటె పెద్దదికాని, చిన్నదికాని మరేదీ లేదు. ఆ విష్ణువు దివియందు వృక్షంవలె స్తబ్ధుడు (= నిండు)గా ఉన్నాడు. కానీ, ఆ పురుషుని వల్ల సర్వమూ పూర్ణంగా ఉన్నది.

ఋగ్వేదంలో స్తుతింపబడిన దేవతలందరిలోను (ఇంద్రుడు, అగ్ని, విష్ణువు, వరుణుడు, వాయువు, పర్జన్యుడు, పృథ్వి, బృహస్పతి, సవిత, సూర్యుడు, అశ్వినులు, రుద్రుడు, ఉషస్సు మొ. ) విష్ణువు ఒక్కడే, వేదకాలస్థానాన్ని ఇతిహాసపురాణకాలాల స్థానం అతిక్రమించినప్పటికీ, జనసమూహాలచేత ఆరాధింపబడుతున్నాడు. వేదప్రోక్తదైవమైన విష్ణువును ఆరాధ్యదైవంగా స్థిరపరచిన ఖ్యాతి వైఖానసులకే దక్కుతుంది. వేదప్రోక్తదైవమైన రుద్రుడు, చిరకాలానికి, రూపాంతరంపొంది, శైవాగమాలలో శివుడుగా ప్రత్యక్షమైనాడు. అట్లాగే విష్ణువు కూడా అనేక దశలద్వారా పరిణామం చెంది, భాగవతుల 'నారాయణుడు'గా, పాంచరాత్రానుయాయుల 'వాసుదేవుడు'గా రూపొంది నాడు. ఇంక వైఖానసులు మాత్రం విష్ణువును వేదప్రోక్తదైవంగానే నిలుపుకొని విష్ణువును పేర్కొనే ఋగ్వేదఋక్కులతోనే ఆ విష్ణువును పూజించాలని నిర్ణయించుకొన్నారు (షడ్-వైష్ణవం). నారాయణుడు, వాసుదేవుడు అనే

పేర్లను విష్ణువు యొక్క పర్యాయ పదాలుగా వారు అంగీకరించినప్పటికీ వేదవాఙ్మయమంతా పేర్కొన్న 'విష్ణువు' అనే ఆ ఒక్క నామమునకే వారు ప్రాధాన్యమిచ్చారు. ఇందుకు బలంగా వారు క్రింది విషయాన్ని ఉదాహరిస్తారు. వహ్ని, అగ్ని - ఇవి రెండూ పర్యాయపదాలు. కానీ హోమం చేసేటప్పుడు సరి అయిన పద ప్రయోగం, 'అగ్నయే స్వాహా' అవుతుంది కాని 'వహ్నయే స్వాహా' మాత్రంకాదు.

ఋగ్వేదవిష్ణువు-సువిశాలములైన తనమూడు పదములచేత లోకాలను అన్నింటిని అక్రమించినాడు (త్రీణిపదా విచక్రమే విష్ణుః - 1, 22, 18); మూడు పదముల చేత మూడు లోకాలను సృష్టించినాడు (ఏకో విమమే - 1, 154, 3); మూడు లోకాలకు ఆధారభూతుడు (ఏకో దాధార భువనాని విశ్వా - 1, 154, 4); సర్వప్రాణులు ఏకగ్రీవంగా స్తుతించే అద్వితీయ వీర్యవంతుడు (విష్ణోర్నుకం వీర్యాణి ప్రావోచమ్-1,154, 1); దివ్యము, అమరము అయిన అమృతంతో నిండిన ఆయనమూడు పదములు సకలజీవులకు ఆధారము (యస్యత్రిపూర్ణామధునా పదాని అక్షీయమానా స్వధయా మధంతి - 1,154, 4); ఆయన సర్వాంతర్యామి, అంతేకాదు సర్వమునకు బాహ్యంగాకూడా ఉంటాడు (1, 155, 5); ఆయన చర్మచక్షువులకు కానరాని పరమ పద నివాసి (తత్ విష్ణోః పరమం పదం- 1, 22, 20); కాని వివేకవంతులైన ఋషులు, వైకుంఠధామందాటి చూడగల తమ దివ్యదృష్టితో, ఆయనను ఎల్లప్పుడూ దర్శిస్తూనే ఉంటారు (సదా పశ్యంతి సూరయః దివీవచక్షురాతతమ్); ఆయన సజ్జనులకు బంధువు (సహి బంధుః ఇత్థ- 1, 154, 5); ఆయన సుకృతులలో సుకృత్తరుడు. (విష్ణుః సుకృతే సుకృత్తరః - 1, 156, 5); అంతేకాదు దయామూర్తి అయిన రక్షకుడు (విష్ణుః గోపాః - 3, 55, 10).

ఋగ్వేదంలో సుపరిచితుడైన దైవం ఇంద్రుడు. ఆయన విష్ణువునకు నర్మసఖుడు (ఇంద్రస్యయుజ్యః సఖా-1, 22, 19). ఇంద్రుడు, శూరుడైన వృత్రాసురుని సంహరించటంలో విష్ణువు సహాయపడినాడు (6, 20, 2; 7, 99, 5 ; 8, 100, 12; 4, 18, 11). అంతేకాదు, ఆయనకు ఇంద్రునకు అభేదం చెప్పబడింది (1, 155, 1). ఇంద్రునకు విష్ణువునకు కలిపి (ఇంద్ర-విష్ణు), ఇంద్రరూపంలో ఉన్న విష్ణువునకు, విష్ణురూపంలో ఉన్న ఇంద్రునకు ఋగ్వేదంలో వేరు వేరుగా ప్రార్థనలున్నవి. నీలాకాశానికీ, నల్లని మేఘాలకు అధిపతి అయిన ఇంద్రునితో సారూప్యం ఆపాదింప

బడటం వల్లనే కావ్యేతిహాసపురాణ కాలంనాటి విష్ణువునకు శ్యామవర్ణం స్థిరపడింది (అట్లా వచ్చినవే ఇంద్రనీలం, ఇంద్రగోపం, ఇంద్రావారుణి, ఇంద్రాభం మున్నగుపదాలు). అర్వాచీనకథలలోని నర-నారాయణ, అర్జున, వాసుదేవ-కృష్ణ మున్నగు పదాలు ప్రాచీనమైన ఇంద్ర-విష్ణుసారూప్యాన్ని స్థిర పరుస్తున్నవి. ఇంద్రునకు 'హరి' అనేపేరు, విష్ణువునకు 'ఉపేంద్రుడు' అనే పేరు సుప్రసిద్ధాలు.

వేదవాఙ్మయంలో విష్ణువు సూర్యశక్తికి ప్రతీక. నిజానికి సూర్యుడు తన కిరణాలతో విశ్వమంతటా వ్యాపించినట్లుగా, విష్ణువు విశ్వమంతా వ్యాపించి ఉన్నాడని ప్రాచీన వ్యాఖ్యాత అయిన యాస్కుడు విష్ణు పదాన్ని నిర్వ చించినాడు (అధయద్ విషితో భవతి, తద్ విష్ణుఃభవతి, విష్ణుః విశతేః వా వ్యశ్నోతేః వా- నిరుక్తం- 12, 18, 2). విష్ణువుయొక్క మూడు పదములు సూర్యుని యొక్క గమనత్రయికి సంకేతాలు. యాస్కుడు పేర్కొన్న ప్రాచీన ప్రామాణికుడు అయిన ఔర్ణనాభునిప్రకారం విష్ణువు యొక్క మూడు పదాలు ఉదయిస్తున్న సూర్యుని, మధ్యాహ్న సూర్యుని, సాయంసంధ్యలో అస్తమిస్తున్న సూర్యుని నిర్దేశిస్తున్నవి. యాస్కుడే పేర్కొన్న ఇంకా ప్రాచీన ప్రామాణికుడు అయిన శాకపూని ప్రకారం విష్ణువు యొక్క మూడు పదములు సూర్యపయనంలోని మూడు మజిలీలను - భూమి, అంతరాళం, స్వర్గం - ఈ మూడింటిని తెలుపుతున్నాయి. అంతేకాదు, విష్ణువు యొక్క ఈ మూడుపదములు భూమిమీద అగ్నిని, అంతరాళంలోని విద్యుత్తును, స్వర్గంలోని సూర్యకాంతిని నిర్దేశిస్తున్నవి. ఆదిత్యమండలం విష్ణువుయొక్క ఉన్నత ధామం (విష్ణోఃపరమంపదం-శతపథ బ్రాహ్మణం-3, 7, 1, 17). ఆదిత్యునితో లేదా ఆదిత్యమండలంతో విష్ణువుయొక్క సాహచర్యం కావ్యేతిహాసకాలంలోని పెక్కుకథలలోనూ, 'నారాయణుడు సవితృమండల మధ్యవర్తి' (ధ్యేయఃసదా సవితృమండల మధ్యవర్తీ) అనే వర్ణనలోనూ, పద్మానికి విష్ణువునకు చెప్పబడే సంబంధంలోనూ, 'సూర్యనారాయణ' అనే రూపకల్పనలోనూ గోచరింపగలదు.

ఇంద్రునకు సూర్యునితో అభేదాన్ని నిర్దేశించే ఉదాహరణలు అనేకం ఉన్నవి. సూర్యరూపంతాల్చినప్పుడు, యజ్ఞంచేసినప్పుడు ఇంద్రుడు లేదో పంతుడవుతాడు (శతపథబ్రాహ్మణం-3, 4, 2, 15 ; ఏషవైంద్రోవా ఏషతపతి). ఆదిత్యుని గూర్చి యజ్ఞం జరుగుతున్న చోటికి విష్ణువు వస్తాడు (ఋగ్వేదం-1, 155, 6 ; ప్రత్యేత్యావహమ్). అగ్ని రూపమైన యజ్ఞం

స్వయం విష్ణుస్వరూపం (యజ్ఞో వై విష్ణుః), లేదా విష్ణుస్థానం (విష్ణోః స్థానోఽసి-యజుర్వేదం). అగ్నికి విష్ణువుతోనూ, సూర్యుని తోనూ సారూప్యత కలదనటానికి ఋగ్వేదంలో అనేకములైన ఉదాహరణలున్నవి. (ఉదా: విష్ణుః ఇత్థా పరమస్యవిద్వాన్ - 10, 1, 3 ; మూర్ధాభువో భవతి నక్తం అగ్నిః, తతః సూర్యోజాయతే ప్రాతరుదయన్ - 10, 88, 6 ; 5, 38, 1 ; 3, 27, 12). ఇంద్ర లేదా సూర్య లేదా విష్ణు స్వరూపుడుగా అగ్ని స్తుతింపబడినాడు.

"త్వమగ్న ఇంద్రో వృషభః సతామసి
త్వం విష్ణురురుగాయో నమస్యః । (2, 1, 3).

- ఓ అగ్నీ! నీవు సత్పురుషులలో శ్రేష్ఠుడవు (= ధర్మరక్షకుడవు) అయిన ఇంద్రుడవు. నీవే మూడు విక్రమములు చేసిన విష్ణుడవు, నమస్కరింపదగినవాడవు.

ఈ ఉదాహరణలో దేవుడు ఒక్కడే అని గుర్తింపబడినప్పటికీ, ఆయన కున్న అనంతశక్తులవల్ల, ఆయనను అనేకరూపాలలో ఆరాధిస్తున్నారు అనే యాస్కుని అభిప్రాయాన్ని ఇది బలపరుస్తున్నది (మాహాభాగ్యద్ దేవతాయాః ఏక ఆత్మా బహుధాస్తూయతే - నిరుక్తం-7, 4, 5). ఆ దేవదేవుడు-భూమి మీద అగ్నిగా, అంతరాళంలో వాయువుగా లేదా ఇంద్రుడుగా, స్వర్గంలో సూర్యుడుగా గోచరిస్తాడని కూడా యాస్కుడు పేర్కొన్నాడు (నిరుక్తం - 7, 5, 1 ; దీనితో బృహద్దేవత - 1, 69, 70పోల్చిచూడాలి-తిస్ర ఏ వేహ దేవతాః.............తత్ తత్ స్థానవిభాగేన తత్ర తత్రేహ దృశ్యతే). దైవంతో తాదాత్మ్యం చెందటానికి యజ్ఞం అనేది ప్రాచీన కాలపు సాధనం. మానవభక్తుల పూర్వులు యజ్ఞంద్వారా 'యజ్ఞదైవము'ను విష్ణువును యజ్ఞమూర్తిగా పూజించినారు (యజ్ఞేన యజ్ఞమయజయంతదేవాః - పురుషసూక్తం). యజ్ఞకర్మ అర్వాచీనకాలంలో ఆరాధనవిధికి తావు ఇచ్చింది. ఋగ్వేదంలోని ఒక ఋక్కు విష్ణువిగ్రహాన్ని పూజించటాన్ని సమర్థిస్తున్నదని వైఖానస వ్యాఖ్యాతలు పేర్కొన్నారు (ఋగ్వేదం - 1, 155, 1).

"ప్రవహః పాంతమంధసో ధియాయతే
మహే శూరాయ విష్ణవే చార్చత ।
యా సానుని పర్వతానామదభ్యా
మహస్తస్థతురర్వతేవ సాధునా ॥"

- ఇంద్రవిష్ణువులను ఇరువురిని సంబోధిస్తూ దీర్ఘతమ ఔచిత్యముని చెప్పిన ఈ ప్రార్థన అధ్వర్యువులను ఇట్లా హెచ్చరిస్తున్నది. - స్తుతి ప్రియుడైన వీరుని (= ఇంద్రుని), విష్ణువును అర్చింపుడు (ప్రార్చత). ఇరువురూ అజేయులు; క్రమశిక్షణ పొందిన అశ్వాన్ని రౌతు అధిరోహించినట్లుగా ప్రకాశవంతములైన పర్వత సానువుల (మేఘాల) (సానుని పర్వతానాం) మీద ఇరువురూ ఉంటారు. 'ప్రార్చత' అనేది నిస్సందేహంగా 'అర్చన' అనే అర్థంలోనే ప్రయుక్తమైంది (అర్చ పూజాయాం); దీనికి వేరే అర్థం ఉండే అవకాశమే లేదు. 'బాగాసంపాదించు' (ప్రకర్షేణ సంపాదయత) అని సాయనుడు చెప్పిన అర్థం సమర్థనీయంకాదు - కారణం ఈ అర్థం ఈ ప్రకరణానికి సరిపోదు; వ్యుత్పత్తి అర్థంకూడా ఇది కాదు. బృహద్దేవతలోని ఈ ప్రార్థనకు సంబంధించిన ప్రస్తావన (4, 20) పూజ యొక్క పరమార్థం విష్ణుధామం చేరుకోవటం అని స్పష్టం చేస్తున్నది. 'అర్చయత' (పూజయత) అనే ప్రయోగం నిత్యార్చనను నిర్దేశిస్తున్నది. 'ప్ర' అనే ఉపసర్గ-విష్ణువుయొక్క ఘనతను గుర్తించి, శ్రద్ధాభక్తులతో, విధి విధానంతో పూజించవలెనని సూచిస్తున్నది (ప్రకర్షేణ, జ్ఞాన భక్త్యాది విశిష్టధర్మపురస్సరమ్). శౌనకుని ఋగ్విధానం కూడా ఈ అర్థాన్నే తెలుపుతున్నది (శౌనకోఽహం ప్రవక్ష్యామి, నిత్యం విష్ణ్వర్చనం పరం, ప్రవః పాంతం అంధసో ధీయా యేత్యర్థ ఋచవిధానతః). ఋగ్వేదానికి చెందిన ఐతరేయ బ్రాహ్మణం సంకలనమైన కాలానికే, విష్ణువు దైవంగా అర్చింపబడుతున్నాడు. కాని, అదే సమయంలో, కృష్ణయజుర్వేదానికి సంబంధించిన తైత్తిరీయ బ్రాహ్మణం వివిధ యజ్ఞయాగాది విధులనే నిర్దేశిస్తున్నది- ప్రథమకాండలో - అగ్న్యాధానం, గవామయనం, వాజపేయం, సోమం, నక్షత్రేష్టి, రాజసూయం; ద్వితీయ కాండలో-అగ్నిహోత్రం, ఉపహోమం, సౌత్రామణి, బృహస్పతిసవం, వైశ్యసవం; తృతీయకాండలో-నక్షత్రేష్టికి సంబంధించిన వివరాలు (బహుశః ఈ భాగం తరువాతి కాలంలో చేర్చబడి ఉంటుంది). రెండవవర్గానికి చెందిన వైఖానసులు విష్ణుపూజను యజ్ఞాదులతో సమన్వయం చేసే మార్గం కనుగొన్నారు.

వైఖానస కల్పసూత్రాలను (శ్రౌత-స్మార్తభాగాలను) పరిశీలించినప్పుడు యజ్ఞాదులభావనయే అధికంగా కనిపిస్తుంది ; విష్ణుభక్తి నేపథ్యప్రాయం మాత్రమే. అయితే తరువాతికాలంలో రూపొందిన వైఖానససమాజం పై ప్రాధాన్యాన్ని తారుమారు చేసింది. విష్ణువును విశ్వమునకాధారుడైన పురుషునిగా గుర్తించింది (శతపథబ్రాహ్మణం - 12, 3, 4, 1 లో

పోల్చిచూడవలె) ; ఆ విష్ణువే సమస్తవిశ్వాకారం అనీ (శ.బ్రా-13, 6, 1, 1), ఉత్తమోత్తముడు, అనంతుడు, సర్వాంతర్యామి అయిన బ్రహ్మమే విష్ణువు అనీ (తైత్తిరీయారణ్యకం - 10, 11), వివిధవర్గాలకు చెందిన మునులు (హంసలు, పరమహంసలు, వాలఖిల్యులు, వైఖానసులు) విష్ణుపూజాసక్తులు అనీ (మహాభారతం - 12, 325, 4 ; 12, 336, 14 - తో పోల్చిచూడాలి), పురుషసూక్తం (ఋగ్వేదం-10, 90) విశిష్టమైనది అనీ - ఈ సమాజం గుర్తించింది. విష్ణుభక్తి అప్పటికే పాదుకొన్నది ; కాని అది ఇంకా ఒకరూపంతాల్చలేదు, సుప్రసిద్ధంకాలేదు. ఇంక వైఖానసులు విష్ణుభక్తికి ఒక నిర్దిష్టరూపం సంతరించి, దారి చూపారు. ఈ వర్గంబుఘులే, ముఖ్యంగా ఇంద్రునకు (విష్ణువునకు) ప్రీతిపాత్రులు అని ఛాందోగ్యబ్రాహ్మణం విశదపర్చింది.

"వైఖానసా వై ఋషయః ఇంద్రస్యప్రియా ఆసన్."

-వైఖానస ఋషులు ఇంద్రునకు ప్రీతి పాత్రులుగా ఉండిరి.

కానా వైఖానసులు వేదపరిధిలోనే యజ్ఞపురుషునిగా విష్ణువువల్ల అవక్రమైన భక్తిని చూపటంలో ఆశ్చర్యంలేదు. యజ్ఞ విధులను నిర్వర్తించకపోవటం అనే లోపం విష్ణుభక్తి అనేదాని వల్ల పరిపూర్ణమవుతుంది. వైఖానస స్మార్త సూత్రంలో ఇట్లాఉంది (4వ ప్రశ్న- 12వ కాండ-118-119):

"తం యజ్ఞపురుషం ధ్యాయన్ పురుషసూక్తేన సంస్తూయ ప్రణామం కుర్యాత్ । యజ్ఞేషు విహీనం తత్ సంపూర్ణం భవతీతి శ్రుతిః ।"

- ఆ యజ్ఞ పురుషుని (విష్ణువును) ధ్యానించి, పురుషసూక్తంతో సంస్తుతించి, ప్రణామం ఆచరించాలి. యజ్ఞాలు చేయని లోపం దీనివల్ల సంపూర్ణమవుతుందని శ్రుతి పేర్కొన్నది.

నాలుగు విధాలుగా విష్ణువును చేరుకోవచ్చును అని మరీచి యొక్క 'విమానార్చనాకల్పం' పేర్కొన్నది (1926 నాటి ప్రచురణలో 95వ పటలం):

(1) జపంద్వారా విష్ణువుయొక్క ఆధిక్యాన్ని గణించటం.
(2) అగ్నిహోత్రంలో హోమం చేయుటం.
(3) ఇంటిలో లేదా ఆలయంలో విగ్రహాన్ని పూజించటం.
(4) ధ్యానం.

"అథ భగవత్సమాశ్రయణం (సమారాధనం) చతుర్విధమ్భవతి

జప-హెూతార్చన-ధ్యానమితి ।
సావిత్రీపూర్వం వైష్ణవీమృచం, అష్టాక్షరం వా భగవంతం
ధ్యాత్వా అభ్యసేత్ స జపః ।
అగ్నిహోత్రాది హోమే యద్ధూయతే తద్ధుతం హోమః ।
(పూజా) గృహే దేవాయతనే వా వైదికేన మార్గేణ ప్రతిమాదిషు
పూజయేత్ తదర్చనమ్ । నిష్కళ సకల విభాగం చ జ్ఞాత్వా
అష్టాంగ యోగమార్గేణ పరమాత్మానం జీవ ఆత్మనా
చింతయేత్ తద్ ధ్యానమ్ ఇతి । "

- భగవత్సమాశ్రయణం (సమారాధనం) నాలుగువిధాలు - జపం, హోమం, అర్చన, ధ్యానం.

భగవంతుడైన విష్ణువును మనస్సునందు నిలుపుకొని, గాయత్రీ మంత్రాను ష్ఠానపూర్వకంగా విష్ణుసూక్తమును లేదా అష్టాక్షరీ మంత్రమును జపించుటయే 'జపం'.

అగ్నిహోత్రాది హోమములందు హుతం చేయుటం 'హోమం'.

పూజాగృహంలో లేదా దేవాయతనంలో వైదికమార్గంలో ప్రతిమాదు లను పూజించటం అర్చన.

విష్ణుతత్త్వం యొక్క సకల నిష్కలరూప విభాగం ఎరిగి, అష్టాంగయోగ మార్గంలో పరమాత్మను జీవాత్మరూపంగా చింతించటం ధ్యానం. (చింతన =contemplation ; ధ్యానం = meditation).

వైఖానస సూత్రం ఇట్లా పేర్కొన్నది:

"అథాతోఽనుష్ఠానకల్పం వ్యాఖ్యాస్యామః ।
సర్వే వైదికాచారాస్తపో యజ్ఞాశ్చ విష్ణుపూజావిధేర్భేదాః ।
ఇతి వైఖానససూత్రమ్ ।

- ఇంక అనుష్ఠానకల్పాన్ని వ్యాఖ్యానిస్తాము. తపం, యజ్ఞం మున్నగు సమస్తవైదికాచారాలు విష్ణుపూజావిధి భేదాలే అని వైఖానససూత్రం ప్రతి పాదిస్తున్నది. భృగువువంటి మహర్షులు ఇట్లా పేర్కొన్నారు:

"ఉత్సవే దేవదేవేశం యే సేవంతే తే సర్వే పదేపదే ।
యజ్ఞఫలం లభేరన్నితి భృగ్వాదయో వదంతి ॥"

- దేవదేవుడైన విష్ణువును ప్రత్యేకోత్సవాదులందు సేవించేవారు, సేవాసమయాలలో ప్రతిపదమునందును యజ్ఞాదులను చేయటంవల్ల లభించే ఫలాన్ని పొందుతారని భృగువుమున్నగువారు చెప్పినారు.

దేవపూజ రెండు విధాలు: సమూర్తం, అమూర్తం. అగ్నిలో హోతం చేయటం రెండవవిధానంకాగా, ఇంటిలో లేదా ఆలయంలో ప్రతిష్ఠింపబడిన విష్ణుప్రతిమను పూజించటం మొదటివిధం. ఈరెండింటికి పోలికలు కొట్ట వచ్చినట్లు గోచరిస్తాయని అత్రిమహర్షి పేర్కొన్నాడు. అగ్న్యాధానంవంటిది విగ్రహప్రతిష్ఠ; యజ్ఞకర్మలోని క్రమవిధానం విగ్రహారాధనలోని క్రమవిధానాన్ని పోలి ఉంటుంది. అవభృథస్నానంతో యజ్ఞవిధిపూర్తి అయినట్లే శ్రద్ధతో, వైభవంతో పూజ పరిసమాప్తి పొందుతుంది.

"దేవార్చనం ద్విధాప్రోక్త మమూర్తం చ సమూర్తకమ్ ।
అమూర్తం గార్హపత్యాది సర్వాగ్నిషు హుతం స్మృతమ్ ॥
తస్యాధానాదికం సర్వం సూత్రే విఖనసోదితమ్ ।
తత్ సూత్రోక్త విధానేన సర్వమాఘార పూర్వకమ్ ।
అస్మిన్ కర్మణి తచ్ఛిష్టం హోమకర్మ సమాచరేత్ ॥

సమూర్తమాలయే బింబం నిత్యం విధివదర్చనమ్ ।
అగ్న్యాధానం ప్రతిష్ఠా స్యాదిష్టిః పర్వార్చనాదికా ।
యాగశ్చావభృథాంతః స్యాదుత్సవస్తద్విధానతః ॥
విష్ణోరేతత్ సమూర్తం యః పూజనం భక్తితశ్చరేత్ ।
అతీంద్రియం స గచ్ఛేత్ తదక్షయం పరమంపదమ్ ॥

- (సమూర్తార్చన-27వ అధ్యాయం)

-దేవార్చన రెండువిధాలు అని చెప్పబడింది-అమూర్తం, సమూర్తం. గార్హపత్యంమున్నగు అన్ని అగ్నులయందు హోమంచేయటం అమూర్తార్చన. దానియొక్క అధానాదికం అంతా విఖనస ముని చెప్పిన సూత్రమందు న్నది. ఆ సూత్రోక్తవిధానంతో సర్వమూ అఘారహోమపూర్వకంగా చేయాలి. ఈ కర్మతోపాటు శేషించిన కర్మలను కూడాచేయాలి. ఆల యంలో బింబాన్ని (ప్రతిమను) విధివిధానపూర్వకంగా నిత్యం అర్చించటం సమూర్తార్చన. ప్రతిమా ప్రతిష్ఠయే అగ్న్యాధానం. పర్వాదులందు చేసే ప్రత్యేకార్చనలే దర్శపూర్ణమాసేష్టులు. వైఖానసవిధానంప్రకారంచేసే ప్రత్యే కోత్సవాలే అవభృథస్నానాంతములగు యాగములు. ఈవిధంగాచేయుటయే

విష్ణువుయొక్క సమూర్తపూజ. విష్ణువును ఇట్లా భక్తితో ఎవడుపూజిస్తాడో, అతడు అతీంద్రియము, అక్షయముఅయిన పరమపదాన్ని చేరుకొంటాడు.

విష్ణువును విగ్రహరూపంలో పూజించటంలో వైఖానసులు ఎక్కువ మక్కువ చూపినప్పటికీ, వేద (అర్ష) సంప్రదాయాన్ని సంపూర్ణంగా పాటించటంలో జాగ్రత్తపడ్డారు. వారిగ్రంథాలు, కాలక్రమంలో, స్వతంత్ర శాస్త్రాలుగా రూపొందినప్పటికీ వాటికి మూలం వేదవాఙ్మయమే అనీ, వేదవిహితమైన ధర్మాలు వాటిల్లో నిక్షిప్తములై ఉన్నవనీ, వాటికి ఏ దోషం అంటదనీ, అసలు వాటిలో ఏ విధమైన దోషంలేదనీ వైఖానసుల విశ్వాసం. వారి శాస్త్రాలు బోధించే విష్ణుపూజను, నిజానికి వేదాలే బోధించాయనీ, దానిని వేదఋషులు అనుసరించారనీ వారు నమ్ముతారు.

"వైఖానసం మహాశాస్త్రం సర్వవేదేషూద్ధృతం సర్వవేదార్థసార భూతం అప్రతర్క్యమనిందితం వైదికైరుపసేవితం విష్ణోరారాధనాయ శాబ్దం ప్రమాణమవలంబ్య విష్ణునా విఖనసఉక్తమ్...।

-వైఖానసమహాశాస్త్రం-సర్వవేదాలనుంచి ఉద్ధరింపబడింది. అది సర్వ వేదార్థసారభూతం. తర్కింప (= ఊహింప)రానిది, నిందింపరానిది, వైదికులు సేవించేది. విష్ణువును అరాధించటంకోసం, శబ్దప్రమాణాన్ని అవలంబించి, విష్ణువుచేత విఖనసమునికి ఉపదేశింపబడినది.

విష్ణువునుపూజించటంలో వైఖానసులు వశిష్ఠుడువంటి ఋషులు సన కుడు వంటి యోగులు చూపినదారిలో పయనిస్తున్నారనీ, విష్ణుభక్తికి కట్టుబడి, వేదవిహిత సంప్రదాయానుయాయులైన ప్రాచీనులను అనుసరి స్తున్నారనీ ప్రాచీనస్మృతికర్తలు ఎరుగుదురు (వృద్ధహారీతసంహిత-11, 8).

"శ్రౌతం మహర్షిభిః ప్రోక్తం వశిష్ఠాద్యైః పురాతనైః ।
వైఖానసైశ్చ భృగ్వాద్యైః సనకాద్యైశ్చ యోగిభిః ।
వైష్ణవైర్వైదికైః పూర్వైః యద్యదాచరితంపురా ॥" (హారీత)
"వేదాంతవేదిభిర్విప్రైః తద్వైఖానససూత్రిభిః ।
యాజయే ద్యజ్ఞపురుషం విష్ణుం..." (వృద్ధ-మనువు)

- పురాతనులైన వశిష్ఠాదిమహర్షులచేత ఉపదేశింపబడినది శ్రౌతం (= వేదమార్గోక్తయజ్ఞాదులు). భృగువుమున్నగు వైఖానసులచేత, సనకాది యోగు లచేత, పూర్వులైన వైదికులచేత, వైష్ణవులచేత ఏది ఆచరింపబడినదో...

వైఖానససూత్రానుయాయులు వేదాంతవేత్తలు అయినవిప్రులు యజ్ఞపురుషుడైన విష్ణువును యజింపవలెను.

వేదవిహిత మార్గంలో విష్ణుప్రతిమను పూజించటమనే సంప్రదాయాన్ని సంస్థాగతం చేయటమేకాక అటువంటి పూజచేయవలసిన అవశ్యకతను, దాని ఫలితాలను విశదంచేసిన ఖ్యాతి వైఖానసులకే దక్కుతుంది. ఉదాహరణకు- భృగువుయొక్క 'క్రియాధికారం'లో వివిధ పూజావిధానాలను, వాటి ప్రయోజనాల తారతమ్యాలను వివరించే పెద్ద సంభాషణ ఒకటి ఉంది. దేవత్వానికి మూడు ప్రధానమార్గాలు గుర్తింపబడినవి: 1. మానసికం (విగ్రహంలేదు), 2. హోమపూజ (ఇక్కడకూడ విగ్రహంలేదు), 3. బేరపూజ (విగ్రహపూజ).

మానసికపూజ: విష్ణువును తన హృదయంలోనే మూర్తిమంతంచేసుకొని, ఊహామాత్రంగా క్రియాకలాపాన్ని నిర్వర్తించటం. హృదయంలో విష్ణువును మూర్తిమంతం చేయటమంటే, అచ్చట విష్ణువు విగ్రహరూపం తాల్చటమే; అట్లా మూర్తిమంతమైన విగ్రహానికేపూజ. ఆయన సర్వాభరణభూషితుడుగా, నాలుగు హస్తాలతో, శంఖచక్రాలతో ఉంటాడు. నిర్మలస్ఫటికంవలె ప్రకాశిస్తూఉంటాడు. ఇంక భక్తుడు ప్రణవాన్ని (ఓమ్), వ్యాహృతులను (భూః, భువః, సువః) పఠిస్తూ స్వీయహృత్పద్మంలోని అష్టదళాలను వికసింపజేసి, వాటిపై అష్టదిక్పాలురను నిలుపుతాడు. ఈ భక్తుడు తనను సూర్యరశ్మిచేతనిండిన ప్రకృతిగా భావించి, సూర్యమండలాన్ని దర్శిస్తాడు. అచ్చట సూర్యమండలాంతర్గతుడుగా చల్లని అమృతం వర్షిస్తున్న చంద్రుడు ఉంటాడు. ఆ చంద్రునిమధ్యలో, త్రికోణంలో ఇమిడి ఉన్న అగ్నిగోళం, జ్వలిస్తున్న మాలలతో దర్శనమిస్తుంది. ఆ గోళంమధ్యలో నిర్మలం, ఉత్తమం, శుభకరం, కాంతిపుంజంవలె నిశితం, పీతవర్ణం, ధూమరహితం అయిన వెలుగు గోచరిస్తుంది. ఆ వెలుగు మధ్యలో సువర్ణమణిమండితమైన చతురశ్రపీఠం ఉంటుంది. ఆపీఠం మీద నిలిచి, విష్ణువు దర్శనమిస్తాడు. అప్పుడు భక్తుడు మానసికపూజ ప్రారంభిస్తాడు.

హోమపూజ: జ్వలింపజేసిన అగ్నిలో హోమపూజ సాగుతుంది. జ్వలించే అగ్నిలో ఒక కాంతి చక్రం జ్వలింపబడుతుంది. దానిమధ్యలో విష్ణువు అగ్నిదేవుడుగా, మూర్తిమంతంగా గోచరిస్తాడు. అప్పుడు అగ్నిహోత్రం ప్రారంభమవుతుంది.

బేరపూజ: ప్రతిష్ఠింపబడిన విష్ణువిగ్రహానికి పూవులు, తదితర పూజాద్ర

వ్యాలు సమర్పించబడతాయి. పూజావిధానాలలో ఇది ఉత్తమంగా పరిగణింప బడుతుంది. కారణం- చూడటానికి అందంగా ఉండే విగ్రహం మనస్సును ఆకర్షిస్తుంది. హృదయానికి ఉల్లాసం కలిగిస్తుంది. భక్తి సులువుగా సహజంగా కుదురుకొంటుంది. ఈ మార్గంలో విష్ణువును సులువుగా చేరుకోవచ్చు.

మానసీ హోమపూజేతి బేరపూజేతి సా త్రిధా ।
హృత్పుండరీకముకుల ముద్ధృత్య ప్రణవేన తు ॥ (7)
వ్యాహృత్యా వికసీకృత్య తత్రేంద్రాదిదిగీశ్వరాన్ ।
ప్రతిష్ఠాప్యార్చయే త్ప్రాతు మనఃపూజేతి చోదితా ॥ (8)
దళేష్వష్టసు సంస్థాప్య ద్వాత్రిం శత్స్వ పరేష్వపి ।
అన్యాన్దేవాన్సమభ్యర్చ్య అత్మానంప్రకృతిం స్మరేత్ ॥ (9)
రశ్మిమాలాలంకృతం ధ్యాత్వా తన్మధ్యే రవిమండలమ్।
తన్మధ్యే శశిబింబంచ ప్రవత్పియూషశీతలమ్ ॥ (10)
తస్యమధ్యగతం ధ్యాయేత్ త్రికోణం వహ్నిమండలమ్ ।
దుర్నిరీక్ష్యం సురైః సర్వైః జ్వాలమాలా సమావృతమ్॥ (11)
తస్యమధ్యేప్రభాం ధాయేన్నిర్ధూమాం నిష్కలాం శుభామ్ ।
నీవారశూకవత్తన్వీం పీతాభాస్వత్యమానమాం ॥ (12)
ప్రభామధ్యగతం పీఠం చతురశ్రం హిరణ్మయం ।
నానామణిగణజ్వాలా దుష్ప్రేక్ష్యం శుభముజ్జ్వలమ్ ॥ (13)
తస్యమధ్యగతం ధ్యాత్వా నారాయణ మనామయం ।
శుద్ధస్ఫటిక సంకాశం శంఖచక్రధరం పరం ॥ (14)
ఆసనాద్యుపచారాణి మనసా తస్య భావయేత్ ।
ఏషాతు మానసీపూజా హోమపూజాతు కథ్యతే ॥ (15)
అగ్నిహోత్రాదిహోమేషు సూత్రోక్తేన విధానతః।
ధ్యాత్వాగ్నిమండలం తస్య ధ్యాయేన్మధ్యే ప్రభాంశుభాం ॥ (16)
ప్రభామధ్యగతం ధ్యాయేదాసీనం వా జనార్దనమ్ ।
తప్తహాటకసంకాశం చతుర్హస్తం ద్విశీర్షకమ్ ॥ (17)
సప్తహస్తం త్రిచరణం దుష్ప్రేక్ష్యం సప్తజిహ్వకం ।
స్రుక్స్రువౌ చాక్షమాలాంచ శక్తిం దక్షిణపాణిషు ॥ (18)
చామరం వ్యజనం చైవ ఘృతపాత్రంతు వామకః ।
ధ్యాత్వా యథోక్తహవిషా యజేత్ తద్ధోమపూజనమ్ ॥ (19)

ఏషా సా హోమపూజాచ బేరపూజా ధువోచ్యతే ।
ఉక్తప్రమాణప్రతిమాం హాటకాదిమయీం పరామ్ ॥ (20)
ప్రతిష్ఠాప్యార్చయేత్ సా బేరపూజేతి చోదితా ।
యథోపయోగ శక్యత్వాత్ కర్తుం పుష్పాదిపూజనం ॥ (21)

చక్షుషః ప్రీతికరణాన్మనసో హృదయస్యచ ।
ప్రీత్యా సంజాయతే భక్తిః భక్తస్య సులభోహరిః ।
తస్మాత్ త్రయాణామేతేషాం బేరపూజా విశిష్యతే ॥

-పూజమూడువిధాలు: మానసీ పూజ, హోమపూజ, బేరపూజ. ప్రణవంతో హృత్పుండరీకముకులాన్ని, లేవనెత్తి, వ్యాహృతులతో వికసింపజేసి, ఆ పుండరీకంమీద ఇంద్రాది దిక్పాలురను ప్రతిష్ఠించి, అర్చించాలి; ఇది మానసీపూజ. ఎనిమిది దళములందు, 32 కేసరములందు ఇతరదేవతలను స్థాపించి, అర్చించి, ఆత్మను ప్రకృతి (=మూలం) గా భావించాలి. అప్రకృతిమధ్య రశ్మిమాలాలంకృతమైన రవి మండలాన్ని ధ్యానించాలి. దాని మధ్యలో స్రవిస్తున్న పీయూషం కలదై, చల్లని శశిబింబాన్ని, దాని మధ్యలో త్రికోణ వహ్నిమండలాన్ని ధ్యానించాలి. జ్వాలమాలాసమావృతమైన ఆమండలం సురలందరకు కూడా దుర్నిరీక్ష్యమైనది. దాని మధ్యలో నిర్ధూమం, నిష్కలం, శుభకరం అయిన ప్రభను ధ్యానించాలి. అది నీవారశూకవత్తుగా (= వరిగింజపైని నూగువలె) సూక్ష్మమైనది. అనుపమానమై వసువుపచ్చగా భాసిస్తుంది. ప్రభామధ్యగతంగా చతురశ్రం, హిరణ్మయం, నానామణిగణకాంతులచేత దుష్ప్రేక్ష్యం, శుభం, ఉజ్జ్వలం అయిన పీఠాన్నిభావించాలి. ఆపీఠం మధ్యలో అనామయుడు, శుద్ధస్ఫటిక సంకాశుడు, శంఖచక్రధరుడు, పరమాత్ముడు అయిన నారాయణుని ధ్యానించి, మనస్సుతో ఆసనాది ఉపచారాలు సమర్పించాలి ఇది మానసపూజ.

ఇంక హోమపూజను చెబుతాను. సూత్రోక్తవిధానంతో అగ్నిహోత్రాది హోమములందు అగ్నిమండలాన్ని ధ్యానించి, దాని మధ్యఉన్న శుభమైన ప్రభను ధ్యానించి, ఆ ప్రభామధ్యగతుడై ఆసీనుడైఉన్న జనార్ధనుని ధ్యానించాలి. ఆయన తప్త హాటక సంకాశుడు, చతుర్హస్తుడు, రెండుశిరస్సులు కలవాడు, సప్తహస్తుడు, త్రిచరణుడు, దుష్ప్రేక్ష్యములైన సప్తజిహ్వలు కలవాడు. కుడి వైపునాలుగు చేతులందు స్రుక్, స్రువం, అక్షమాల, శక్తి ఉంటాయి. చామరం, వ్యజనం, ఘృతపాత్రం వామ హస్తము లందుం

టాయి. ఇట్టి వానిని ధ్యానించి, యథోక్తహవిస్సుతో యజించాలి. ఇది హోమపూజ.

ఇంక బేరపూజ. ఉక్తప్రమాణంతో, హాటకాదిమయము, ఉత్తమము అయిన ప్రతిమను ప్రతిష్ఠించి, అర్చించాలి. ఇది బేరపూజ. శక్తిని అనుసరించి, యథోపయోగంగా పుష్పాదులతో ఆ ప్రతిమను పూజించాలి. చక్షువులకు, మనస్సుకు, హృదయానికి ప్రీతి కలిగిస్తుంది ఆప్రతిమ. ప్రీతివల్ల భక్తి కుదురు కొంటుంది. భక్తునకు హరి సులభుడు. అందుచేతముచ్విధము లైన పూజలలో బేరపూజ విశిష్టమైనది.

# అధ్యాయం-2

## వైఖానస సమాజం

వైఖానస సమాజంలోని వారంతా దేవాలయ అర్చకులే. పుట్టుకచేతనే తాము దేవాలయ అర్చకులుగా నిర్ణయింపబడినామనీ, జీవితంలో ఇంకేవిధమైన వృత్తిని చేపట్టరాదనీ వారు నమ్ముతారు. విష్ణువును ఏదో ఒక ముఖ్యమైన అవతారరూపంలో అర్చించటానికే వారిజీవితాలు అంకితములైనవి. నేడు కూడా, ఏ కొందరో తప్ప, తక్కిన వైఖానసులందరూ దేవాలయ అర్చకులుగానే తమజీవనంసాగిస్తున్నారు; వైఖానస సూత్రంలో నిర్దిష్టమైన క్రియాకలాపాన్ని అత్యంత నిష్ఠతో నిర్వహిస్తున్నారు; శాస్త్ర నియమాలను శ్రద్ధతో అనుసరిస్తున్నారు. వారు వేద సంప్రదాయంలోని అగ్నిహోత్రాది కర్మలను, ఆగమసంప్రదాయంలోని విగ్రహారాధనను సమన్వయపరిచారు; జీవితంలో 18 సంస్కారాలను పాటిస్తారు. సమయం అనుకూలించినప్పుడు 26 యజ్ఞాలను నిర్వహిస్తారు (5 మహాయజ్ఞాలు, 7 పాకయజ్ఞాలు, 7 హవిర్యజ్ఞాలు, 7 సోమయజ్ఞాలు). అంతేకాదు, వేదప్రామాణ్యాన్ని నమ్ముతూ, నిత్యనైమిత్తిక కర్మలలో వేదమంత్రాలను ఉపయోగిస్తున్న కారణంచేత "మేము వైదికులం" అని వారు చెప్పుకొంటారు.

వైఖానససమాజానికి మార్గదర్శకమైన శాస్త్రాల ప్రత్యేక విశిష్టతలను తన 'దశవిధ హేతునిరూపణం' లో శ్రీనివాసమఖి (క్రీ.శ.1050 ప్రాంతాలు) ఇట్లావిశదం చేసినాడు:

**1. అఖిల జగత్కారణ భూతేన విఖనసా ప్రణీతత్వాత్.**

- ఈ శాస్త్రం అఖిల జగత్కారణభూతుడైన విఖనస (బ్రహ్మ) ప్రణీతము కావటంచేత.

**2. సర్వ సూత్రాణా మాదిమత్వాత్.**

- వైఖానససూత్రాలు తదితర సర్వసూత్రాలకంటె ముందరివి (కృష్ణ యజుర్వేద తైత్తిరీయ శాఖకు చెందినవి కావటం చేత వైఖానససూత్రాలు తదితర సూత్రాలకు మొదటివి).

**3. ప్రధానాది కర్మసు శ్రుతిమార్గానుసారిత్వాత్.**

- ప్రధానములైన కర్మలన్నింటి యందును వేదమార్గాన్ని అనుసరించ టంచేత -(శుద్ధ ఆచమనం మొదలు అన్నికర్మ లందును చతుర్వేదవిహిత మార్గాన్ని అనుసరిస్తారు వైఖానసులు) (ఋగ్వేదః ప్రీణాతు....మొ॥)

4. సమంత్రక సర్వక్రియావత్వాత్.

- అన్ని క్రియలు వెదమంత్రసహితములు కావటంవల్ల (ప్రారంభ క్రియ అయిన హస్తశోధన కూడా వేదమంత్రపూర్వకంగా ఉంటుంది) (ఇంద్రో ఽహం ఉభాభ్యాం...మొ.)

5. నిషేకాది సంస్కారత్వాత్.

- నిషేకమున్నగు (= వేదోక్తములైన గర్భాధానాది) సంస్కారాలన్నింటితో కూడినవి కావటంచేత (నిషేకం మొదలు అంత్యక్రియల పర్యంతం జరిగే సంస్కారాలు అన్నీ వేదవిహితమార్గంలో, వేదమంత్ర పురస్సరంగా సాగుతాయి).

6. అష్టాదశ శరీర సంస్కారాత్మకత్వాత్.

- పదునెనిమిది శరీరసంస్కారములు కలిగి ఉండటం చేత (18 సంస్కారాల ద్వారా వైఖానసులు తమ మనస్సులను, శరీరాలను శుద్ధి పరచుకొంటారు).

7. సాంగక్రియా కలాపత్వాత్.

- వైఖానసకల్పసూత్రం సమస్తవిషయాలతో సమగ్రమైన శాస్త్రం కావటంచేత ("ఈ సూత్రంలో చెప్పబడని అంశాలను ఇతరసూత్రాలనుంచి గ్రహించవచ్చు" అనే సాధారణ సూక్తికి ఇచ్చట అవకాశంలేదు).

8. మన్వాద్యైః స్వీకృతత్వాత్.

- మనువు మున్నగు సూత్రకర్తలు వైఖానస కల్పసూత్రాల ప్రామాణ్యాన్ని అంగీకరించటంచేత.

9. అఖిలజగదేక కారణభూత శ్రీమన్నారాయణైకపరత్వాత్.

- ఈ సూత్రాలు, అఖిలజగత్సృష్టికి ఏకైకకారణమైన శ్రీమన్నారాయణునందే పరములు కావటం చేత.

10. తత్సూత్రోక్త ధర్మానుష్ఠానవతామేవ భగవత్ప్రియ తమత్వో పపత్తేశ్చ.

- వైఖానస సూత్రోక్త ధర్మానుష్ఠానుయాయులు భగవంతునకు ఎక్కువ ప్రియతములు కావటంచేత. ఒక రాజుకు, విష్ణువు స్వయంగా చెప్పినట్లు వరాహపురాణంలో ఒక శ్లోకం ఉంది:

"అశ్వత్థః కపిలాగావః తులసీ విఖ నామునిః ।
చత్వారో మత్ప్రియా రాజన్ తేషాం వైఖానసో వరః ॥"

- ఓ రాజా! అశ్వత్థవృక్షం, కపిలగోవులు, తులసి, విఖనసముని- ఈ నలువురు నాప్రేమకు పాత్రులు. ఈ నలువురిలో వైఖానసుడు శ్రేష్ఠుడు.

తొలివైఖానసులు ఎవరైనప్పటికీ, విఖనసుడే తమవంశకర్త అని వైఖానసులు విశ్వసిస్తారు. విఖనసపదం సాధారణంగా సృష్టికర్తఅయిన బ్రహ్మను సూచిస్తుంది. కాని ఒక విశిష్టదృష్టిలో, ఈ పదం విష్ణువుకే వర్తిస్తుంది; ఈయన నాభినుంచే కదా బ్రహ్మ ఉద్భవించింది ! విఖనసుడు బోధించిన విధివిధానాలనే వైఖానసులు అనుసరిస్తారు కావున, వారు విఖనసుని సంతతి వారనటం సమర్థనీయమే. వీరి జీవన విధానాన్ని నిర్దేశించేదే వైఖానస శాస్త్రం లేదా వైఖానస సూత్రం. మరీచియొక్క ఆనందసంహిత ఇట్లా చెప్పినది:

"ఆదికాలేతు భగవాన్ బ్రహ్మేతు విఖనాముని: ।
యజుః శాఖానుసారేణ చక్రే సూత్రం మహత్తరమ్" ॥

- ఆదికాలంలో యజుర్వేద శాఖగా వైఖానససూత్రాన్ని రచించిన విఖనసుడు స్వయంగా బ్రహ్మయే. భృగువుయొక్క క్రియాధికారం విష్ణువునకు విఖనసునకు అభేదం చెప్పినది (36,28-29):

"విఖనా వై విష్ణుః తజ్జా వైఖానసా స్మృతాః ।
విష్ణువంశజశ్చ విఖనా మునీనాం ప్రథమో మునిః ।
తేనోపదిష్టం యత్సూత్రం తత్సూత్రే ష్వోత్తమం స్మృతమ్ ॥"

- విఖనుడే విష్ణువు; ఆయన వంశస్థులే వైఖానసులు. విష్ణువంశజుడైన విఖనుడు మునులలో ప్రథముడు; ఆయన ఉపదేశించిన సూత్రం, సూత్రములన్నింటిలోను ఉత్తమమైనది.

"విఖనా ఇతి ప్రోక్తో మనసః ఖననాత్ సుతః ।
బ్రహ్మణః సువిశేషేణ మునీనాం ప్రథమోమునిః" ॥

- తన మనస్సును విశేషంగా ఖననం (= త్రవ్వటం) అంటే తపస్సు చేయుటం వల్ల ఆయన 'విఖనుడు' అయినాడు. బ్రహ్మ (=విష్ణువు) యొక్క సుతుడైన విఖనుడు మునులలో ప్రథముడు. మహాభారతంలోని శాంతిపర్వంలో ఇట్లా ఉన్నది:

"విశేషేణఖననాత్ యస్మాత్ భావనామునిస్సృష్టయే ।
తస్మాద్విఖనసో నామ స ఆసీదండజః ప్రియః ॥
స్రష్టుం స తు సముద్యుక్తో బ్రహ్మయోనిమయః ప్రభుః ।
ఖనిత్వాచాత్మనాఽఽత్మానం ధర్మాదిగుణసంయుతమ్ ।
ధ్యానమావిశ్య యోగేన హ్యాసీద్విఖనసో మునిః ॥"

- మానసముని సృష్టికై మనస్సును విశేషించి ఖననంచేయటం చేత విఖనసుడు అనే ముని బ్రహ్మకు ప్రీతిపాత్రుడు అయినాడు. ప్రభువైన ఆయన బ్రహ్మయోనిమయుడై సృష్టి చేయుటకు సముద్యుక్తుడైనాడు. తన ఆత్మచేతనే ధర్మాది గుణసంయుక్తమైన తన ఆత్మనే ఖననంచేసి (= త్రవ్వి), యోగశక్తితో ధ్యానమును ఆవేశింపజేసుకొని విఖనముని అయినాడు.

పైకి లేదా లోనికి త్రవ్వటం (ఖననం) అనే అర్థం 'విఖనస' పదానికి తొలుత ఉన్నదనిపిస్తున్నది. అంతేకాదు. ఈ పదానికి చాలా అర్థాలు కూడా చెప్పబడినవి. ఆనందసంహిత ఇట్లా పేర్కొన్నది:

"వేదాంత తత్త్వమీమాంసా ఖననం కృతవాన్ హరిః ।
నామ్నా విఖనసం చక్రే తత్పదాన్వర్థయోగతః ॥"

- హరి, వేదాంత తత్త్వమీమాంసాఖననం చేయటం (త్రవ్వి పైకి తీయటం) చేత, విఖనసుడు అయినాడు. కాగా విఖనసపదం అన్వర్థం.

"ఖననా ద్విఖనామునిః ।
ఖననం తత్త్వమీమాంసేత్యాహుః ।
నిగమార్థానాం ఖననాదితి నః శ్రుతమ్ ॥

'ఖననం' వల్ల విఖనముని అయినాడు. ఖననమనగా తత్త్వశాస్త్రచర్చ అని అర్థం; కాని, నిగమముల (= వేదాల) అర్థాలను ఖననం చేసినాడు

(త్రవ్వి పైకి తీసినాడు) అని మేము విన్నాము. ఆనందసహిత ఇంకా ఇట్లా పేర్కొన్నది :

"అంతర్హితానాం ఖననాద్వేదానాం తు విశేషతః ।
స విభుః ప్రోచ్యతే సర్వైర్విఖనా బ్రహ్మవాదిభిః ।
వైఖానసశ్చ భగవాన్ ప్రోచ్యతే స పితామహః ॥"

- అంతర్హితంగా ఉన్న వేదాల అర్థాలను విశేషంగా ఖననం చేయటం (= త్రవ్వి పైకితీయటం) వల్ల, ఆ ప్రభువును బ్రహ్మవాదులందరూ 'విఖనుడు' అని పిలిచారు. ఆయనయే భగవంతుడైన వైఖానసుడు. ఆయనయే పితామహుడు.

విఖనసపదం బ్రహ్మను సూచిస్తుంది అన్నప్పుడు నృసింహపురాణం ఇట్లా వివరించింది: బ్రహ్మలు ఇరువురు - అగ్రజుడు, అనుజుడు. వీరిలో - అగ్రజుడు విష్ణుమానసపుత్రుడు, ఒకే శిరస్సుకలవాడు, సూత్రకర్త. ఇంక విష్ణువుయొక్క నాభి నుంచి పుట్టిన అనుజుడు చతుర్ముఖుడు, ప్రపంచములను అందలి జనులను సృష్టించినవాడు. అగ్రజుడైన విఖనసుడు, ఆరు అవతారాల తరువాత అనుజుడు అయినాడు. భృగువు, మరీచి, అత్రి, కాశ్యపుడు - వీరికి విష్ణుపూజా పద్ధతి ప్రథమ విఖనసు(=అగ్రజు)ని నుంచి సంక్రమించింది.

యజుర్వేదంలోని అరుణకేతు (అపో వా ఇదం అసన్ సలిలం ఏవ-దీనితో ప్రారంభమయ్యే) భాగాన్ని వ్యాఖ్యానించే సందర్భంలో వైఖానసులతోపాటు పెక్కువర్గాల మునులు సృష్టిప్రారంభంలోనే ఉద్భవించారని చెప్పే ఇంకో అర్థం కుతూహలాన్ని రేకెత్తిస్తున్నది. 'పశ్యక' (= ద్రష్ట) అనే పదం 'కశ్యప' అయినట్లే, 'వినఖ' అనే పదం 'విఖన' అయింది.

"న విద్యతే ఖాని ఇంద్రియాణి యేషాం తే నఖాః ।
న నఖాః అనఖాః నఞ్ ద్వయేన పామ్యేంద్రియవత్వం
ఫలితమ్ ॥"

-'ఖ' అనగా జ్ఞానేంద్రియాలు; అవిలేనివారు నఖులు ; నఖులుకాని వారు 'వినఖులు'. న, వి అనే వ్యతిరేక పదద్వయంచేత 'ఉత్తమఇంద్రియాలు కలవారు' అని ఫలితార్థం.

మహాభారతంలోని శాంతి పర్వంలో ఇట్లా ఉన్నది:

"ఏతే వైఖానసానాం తు ఋషీణాం భావితాత్మనామ్ ।

వంశకర్తార ఉచ్యంతే సాత్త్వికాహార భోజినామ్ ॥"

- సాత్త్వికాహారం భుజించునట్టి, ఆత్మభావనచేయగలిగినట్టి వైఖానస ఋషులయొక్క వంశకర్తలను వివరిస్తాను.

వైఖానస పూజా విధానం 'సౌమ్యం' అని వర్ణింపబడింది. కాగా, విఖనస (దీనినుంచి ఏర్పడిన వైఖానస) పదానికి చాలా అర్థాలున్నవి.

1. విఖనసుడు స్వయం విష్ణువు.
2. విష్ణునాభీకమలంనుంచి ఉద్భవించిన, సృష్టికర్త అయిన బ్రహ్మ.
3. విష్ణుమానసపుత్రుడై, విష్ణువు ద్వారానే పూజావిధానం గ్రహించిన మహాముని.
4. వైఖానస భక్తుల వంశకర్త.
5. తనపేరుతో సూత్రాలను వెలయించిన భగవానుడు.
6. వానప్రస్థాశ్రమంలో ఉన్నముని.

పై అర్థాలను అన్నింటిన ఇముడ్చుకొన్నది కావటంచేతనే వైఖానస సమాజానికి ఆపేరు వచ్చిఉంటుంది. వైఖానసుల ప్రత్యేకత, వారు వైఖానస సూత్రావలంబకులు కావటమే. ఈ సూత్రంలో సర్వమూ విష్ణుమయమే. అంతేకాదు, విష్ణువు స్వయంగా విఖనసునకు బోధించిన సూత్రమిది.

"ఆదికాలే తు భగవాన్ బ్రహ్మ తు విఖానాముని: ।
యజుఃశాఖానుసారేణ చక్రే సూత్రం మహత్తరమ్ ।
తత్సూత్రవిధ్యమష్ఠానాత్ స్మృతా వైఖానసాస్తు తే ।
యత్సూత్రాద్యంతమధ్యేషు భగవాన్ విష్ణు రవ్యయః ॥"

(నృసింహవాజపేయయాజి పేర్కొన్న 'పురాతంత్రం')

విఖనోమునయే పూర్వం సూత్రం భగవతేరితమ్ ।
తస్మాద్భగవతః సూత్రం లోకే వైఖానసం స్మృతమ్ ॥

- ఆదికాలమందు భగవంతుడైన బ్రహ్మయే విఖనముని. ఆయన యజుశ్శాఖానుసారంగా మహత్తరమైన సూత్రాన్ని నిర్మించినాడు. ఆ సూత్ర విధులను అనుసరించటం చేత వారు వైఖానసులు అయినారు. ఆసూత్రం యొక్క ఆది-మధ్య-అంతములందు (అంటే సర్వత్రా) అవ్యయుడు, భగవంతుడు అయిన విష్ణువు ప్రతిపాదింపబడినాడు.

- పూర్వం భగవంతుడు విఖనమునికి ఈ సూత్రం ఉపదేశించినాడు. అందుచేత లోకంలో వైఖానససూత్రంగా ప్రసిద్ధిపొందినది భగవత్సూత్రమే.

వైఖానసులు, వైఖానసమునిని (లేదా ఆదిమ వైఖానసుని) తమ నిత్యప్రార్థనా సమయంలో ఇట్లా స్తుతిస్తారు:

"ఓమ్ వైఖానసాయాఽచ్యుతసంశ్రయాయ తపోగ్ర
నిష్ఠాయ చ బ్రహ్మ దర్శినే స్వాహా ।
హేమాచ్ఛాదం స్ఫటికసదృశం విద్యుదుత్పత్తిభాజం ।
దివ్యానాథం రురుమయ మహావాహనం దోశ్చతుష్కమ్ ।
బింబీజంతం విఖనస మహం ప్రాప్తవంతం భజామి ॥
కూర్మాసనే సమాసీనం కుండలాద్యైః విభూషితమ్ ।
శ్రావణే శ్రవణర్క్షేయం విష్ణుపూజా విశారదమ్ ।
కమండల్వక్షమాలాభిర్దండేన సువిరాజితమ్ ।
ధ్రువస్య దక్షిణే భాగే విఖనోముని మాశ్రయే ॥

ఓమ్ విఖనసే నమః । ఓమ్ తపోయుక్తాయ నమః ।
ఓమ్ సిద్ధిదాయ నమః । ఓమ్ సర్వదర్శినే నమః ॥"

-(నృసింహవాజపేయయాజి యొక్క శ్రీభగవదర్చా ప్రకరణ అనుక్రమణిక - 3వ ఖండం)

- ఓమ్. అచ్యుతసంశ్రయుడు, తపోగ్రనిష్ఠుడు, బ్రహ్మదర్శి అయిన వైఖానసుని కొరకు స్వాహా.

హేమవస్త్రుడు, స్ఫటికసదృశుడు, బ్రహ్మయొక్క నక్షత్రముల యొక్క ఉత్పత్తికి కారకుడు, దివ్యానాథుడు, రురువు (అనే జింక) వాహనంగా కలవాడు, చతుర్బాహుడు, 'ఓం' బీజవంతుడు, ప్రాప్తవంతుడు (= మనకు లభించినవాడు) అయిన విఖనసుని నేను సేవిస్తాను.

- కూర్మాసనస్థితుడు, కుండలాది విభూషితుడు, శ్రావణమాసమందు శ్రవణఋషిగా పూజింపబడేవాడు, విష్ణు పూజా విశారదుడు, కమండలు - అక్షమాలా దండవిరాజితుడు, ధ్రువునకు దక్షిణ భాగమందున్న విఖనమునిని ఆశ్రయిస్తున్నాను. ఓమ్. విఖనసునకు నమస్కారం. ఓమ్. తపోయుక్తునకు నమస్కారం. ఓమ్. సిద్ధిదాతకు నమస్కారం. ఓమ్. సర్వదర్శికి నమస్కారం.

విఖనసముని ఇంకా ఇట్లా వర్ణింపబడినాడు:

"నారాయణః పితా యస్య యస్య మాతా హరిప్రియా ।
భృగ్వాదిమునయః శిష్యా స్తస్మై విఖనసే నమః ॥"

-ఎవనికి నారాయణుడు తండ్రి, హరిప్రియ (= లక్ష్మీదేవి) తల్లి, భృగుప్రభృతి మునులు శిష్యులు అయినారో - అటువంటి విఖనసునకు నమస్కారం.

బ్రహ్మ, విష్ణువు నుంచి వైఖానస సూత్రాన్ని పొందిన కథను అత్రిమహా ముని వివరించినాడు. సృష్టిప్రారంభంలో వేదవిహితమైన పూజా విధానాన్ని విష్ణువు, సృష్టికర్త అయిన బ్రహ్మకు బోధించినాడు; ఈ బోధన వేయి కోట్ల శ్లోకాలతో చాలా విస్తారమైనది (సహస్రకోటిభిః శ్లోకైః సంఖ్యాతం బహువిస్తారం). కానీ, బహువిస్తారమైన ఈ గ్రంథం కాలక్రమంలో అంత రించింది. అప్పుడు, బ్రహ్మ, జడలతో కాషాయ వస్త్రాలతో దండంతో మునిగా నైమిశారణ్యానికి వెళ్ళి కఠోరనిష్ఠతో తపస్సుచేసినాడు. అట్లా పెక్కు సంవత్సరాలు విష్ణువును గూర్చి తపస్సుచేసి, ఆ తపోమహిమవల్ల పూజావిధానంతో కూడిన విస్తారమైన ఆగమాన్ని పూర్వం విష్ణువును గూర్చి బోధించిన దానిని, మరల పొందినాడు (అపశ్యత్ విష్ణూక్తం ఆగమం విస్తారాత్). ఈ సమయంలో ఆ బ్రహ్మ విఖనసుడుగా లేదా మహామునిగా ప్రసిద్ధుడు. విఖనసుడు విస్తారమైన ఆ ఆగమాన్ని సారరూపంగా సంక్షిప్త పరచినాడు (సంక్షిప్య సారం ఆదాయ).

"ధాతా విఖనసో నామ మరీచ్యాదిస్తుతా న్మునీన్ ।
అబోధయదిదం శాస్త్రం సార్ధకోటి ప్రమాణతః ॥"

-చక్కగా సానబెట్టిన వజ్రంవలె (సానోల్లిఖిత రత్నవత్) ఉన్న సార భూతమైన ఆ సూత్రాన్ని విఖనస బ్రహ్మ, సుప్రసిద్ధులైన మరీచిమున్నగు మునులకు బోధించినాడు. ఈ సంక్షిప్తగ్రంథంలో కోటిన్నర శ్లోకాలున్నవి.

అట్లాసంక్షిప్తం చేయబడిన బోధనలను నలుగురు మునులు గ్రహించినారు - మరీచి, భృగువు, అత్రి, కాశ్యపుడు. వీరు విఖనస సంతతి కావున, వైఖాన సులుగా గుర్తింపబడినారు. వీరు నలుగురు తాముగ్రహించిన దానిని, నాలుగు లక్షలశ్లోకాలకు కుదించినారు (చాతు ర్లక్షేషు గ్రంథేషు సంక్షిప్య సంహితాః). అంతేకాదు, వైఖానస సమాజం ఏర్పడటానికి వీరే మూలపురుషులు.

బ్రహ్మ, విఖనసుడు ఉన్న నైమిశారణ్యంలో, స్వాయంభువ మన్వంత రంలో శ్రావణ పూర్ణిమదినాన, సింహలగ్నంలో సోమవారం ప్రవేశించినాడని ఆనందసంహిత పేర్కొన్నది.

వైఖానస సమాజం రూపొందటాన్ని గూర్చి భృగువుయొక్క ప్రకీర్ణాధికారం (30వ అధ్యా. 19-76 శ్లో.) ఇంకో కథ వివరించింది. సృష్టికి ముందు బ్రహ్మ నిద్రపోయినాడు. నిద్రలేవగానే సృష్టి ప్రారంభించాలనుకొన్నాడు. కాని, నిద్రమత్తులో, సృష్టికి అత్యావశ్యకములైన వేదాలను అయన మర్చిపోయి నాడు. వేదాలను జ్ఞప్తికి తెచ్చుకోవాలని, సృష్టి ప్రారంభించాలని అయన చేసిన యత్నం ఫలవంతంకాలేదు. విచారం, నిస్సహాయత వెనగొనటంతో, వేదత్రయిరూపుడైన విష్ణువును బహుకాలం మనస్సులో ధ్యానించినాడు. అట్లా విష్ణువును అర్చించి, వేదభిక్షను వేడినాడు (వేదభిక్షాం ప్రాయచ్ఛ మే). అట్లా విష్ణువును అర్చింపగానే బ్రహ్మయొక్క బుద్ధి వికసింపనారంభించినది. హృదయం స్వస్థత పొందినది. సాంగంగా వేదాలు అయన స్మృతిపథంలో వెలసినవి. తన హృదయాన్ని ఖననం చేసి (= త్రవ్వి) విస్మృతములైన వేదాలను తిరిగి పొందటంచేత బ్రహ్మకు విఖనసుడు లేదా వైఖానసుడు అనే పేరు వచ్చింది.

అప్పుడు బ్రహ్మ, వేద విహిత మార్గంలో సృష్టిచేయటానికి సమర్థుడై నాడు. ప్రపంచ సృష్టి జరిగిన తరువాత బ్రహ్మ, పదిమంది మునులను (దక్షుడు, మరీచి, భృగువు మున్నగువారిని), సమావేశపరచి వారికి వేద విజ్ఞానమును ప్రసాదించినాడు. వైఖానస శాస్త్రాల ఉత్పత్తి ఇట్లా జరిగింది. విఖనసుడు తన మానస పుత్రులకు చేసిన బోధనలివి. విఖనసుని ఆ మానస పుత్రులే వైఖానసులు. ఈ మునులు ప్రజాహితాన్ని కోరి, గృహస్థ క్రియాకలాపానికి గృహ్యసూత్రాలను, వేదవిహితకర్మలకు శ్రౌతసూత్రాలను, సాంఘిక వ్యవస్థకు సంబంధించిన ధర్మసూత్రాలను సంకలనం చేశారు (వేదా నుగాని శాస్త్రాణి చక్రుః లోకహితైషిణః). వీరి బోధనలను విని, వాటిని అనుసరించిన వారు ప్రథమ వైఖానస సమాజానికి చెందినవారు.

"అగ్నిః వైఖానసం శాస్త్రం విష్ణుః వేదాశ్చ శాశ్వతాః ।
గాయత్రీ వైష్ణవా విప్రాః పప్తైతే బహు పావనాః ॥"

-అగ్ని దేవుడు, వైఖానసశాస్త్రం, విష్ణువు, శాశ్వతములైన వేదాలు, పవిత్రమైన గాయత్రీమంత్రం, విష్ణుభక్తులు, ద్రష్టలైన. విప్రులు- ఈ సప్తకం వైఖానసుల దృష్టిలో అతి పవిత్రమైనది.

వైఖానస పూజాపద్ధతి రూపొందిన విధమును భృగుసంహితలోని క్రియా ధికారం (36వ అధ్యా) మరింత విపులముగా వివరించింది. కల్ప ప్రారంభంలో, క్షీరసాగరమందు విష్ణువు యోగనిద్రలో ఉన్నప్పుడు విష్ణువు యొక్క నాభినుంచి ఉద్భవించిన కమలమందు బ్రహ్మ గోచరించినాడు. చతు ర్ముఖుడైన ఆ బ్రహ్మ వెంటనే విష్ణువును ధ్యానించినాడు. అప్పుడు విష్ణువు, ప్రపంచాన్ని, అందులోని జీవరాసులను సృష్టించవలసినదిగా బ్రహ్మను ఆదేశించి నాడు. అంతేకాదు, సృష్టిక్రమంలో సహాయకారిగా ఉండటానికి వేదాలను ప్రసాదించినాడు. బ్రహ్మ సర్వప్రపంచాన్ని, సర్వజీవరాసులను, దేవతలందరిని సృజించి, వేదమంత్రాలతో విష్ణువును పూజించినాడు. అయితే, సృష్టిచేయ టంలో తనకు గల మహిమను తలచుకొని, బ్రహ్మ గర్విష్ఠి అయినాడు. బ్రహ్మను సరిదిద్దటానికి, విష్ణువు, మధుకైటభులనే రాక్షసులను సృష్టించగా వారు బ్రహ్మను పరాభవించి, వానినుంచి వేదాలను అపహరించి వాటిని సముద్రపుటడుగున దాచినారు. అంతట, శక్తి హీనుడైన బ్రహ్మ, దుఃఖ సముద్రమగ్నుడైనాడు. వేదమంత్రాలు తనకు జ్ఞప్తిలో లేకపోవటంచేత విష్ణువును అర్చించటం ఎట్లాగా అని ఆశ్చర్యపడినాడు. అప్పుడు, ద్వాదశాక్షర, అష్టాక్షరమంత్రజపంతో తనను అయిదు రోజులపాటు అర్చించవలసినదిగా విష్ణువు బ్రహ్మను ఆదేశించినాడు (ఓమ్. నమోభగవతే వాసుదేవాయ, ఓమ్ నమో నారాయణాయ). ఇదే పాంచరాత్ర అర్చనగా రూపొం దింది. అంతట విష్ణువు మత్స్యరూపం తాల్చి, సముద్రపు అడుగునకు పోయి, మధుకైటభులను సంహరించి వేదాలను వెలికి తెచ్చి, బ్రహ్మకు ఇచ్చినాడు. మిక్కుటమైన సంతోషంతో, బ్రహ్మ, వేదమంత్రాలతో విష్ణువును, వైఖానసపద్ధతిలో అర్చించటం ప్రారంభించినాడు.

ఇంకోసారి కూడా బ్రహ్మకు గర్వం బలిసింది. వానిని చక్కబరచటానికి విష్ణువు సోమకాసురుని సృష్టించినాడు. ఆ సోమకుడు బ్రహ్మను ఓడించి, వాని నుంచి వేదాలను సంగ్రహించినాడు. చింతాక్రాంతుడైన బ్రహ్మ విష్ణువును చేరి "నానుంచి వేదాలు మరల అంతర్హితములైనవి, మరి నిన్ను ఎట్లా పూజించాలో తెలుపుము" అని ప్రార్థించినాడు. అప్పుడు విష్ణువు, "మంత్ర రహితంగా, తాంత్రికపద్ధతితో అర్చింపుము" అని బ్రహ్మతో చెప్పినాడు. ఈ పద్ధతినే 'ఆగ్నేయ పద్ధతి' అంటారు. విష్ణువు ఆరణ్యక వరాహ(= అడవిపంది) రూపంతాల్చి, తన నిశితదంష్ట్రలతో, సోమకుని చంపి, వేదాలను తిరిగి బ్రహ్మకు ప్రదానంచేసినాడు.

"పూజయామాస విధి వ త్పునర్వేదోదితాధ్వనా ।
యద్వేదమంత్రైః క్రియతే తద్వైఖానస మీరితమ్ ॥"

- అప్పుడు బ్రహ్మ వేదోక్త మార్గాన, వేదమంత్రాలతో విధిపూర్వకంగా విష్ణువును పూజింపదొడగినాడు. వేదమంత్రాలతో చేసే పద్ధతియే వైఖానస పద్ధతి అని చెప్పబడినది.

ఈకథ, వైఖానస అర్చనకు, వేదమంత్రాలకు ఉండే సాన్నిహిత్యాన్ని వివరించుటయే కాక వేదమంత్రాలతో విష్ణువును అర్చించిన బ్రహ్మ వైఖానస సమాజానికి మూల పురుషుడని విశదం చేస్తున్నది. అగాధమైన సముద్ర పుటడుగున దాచబడిన వేదాలను విష్ణువు స్వయంగా త్రవ్వి వెలుగులోనికి తెచ్చి, స్వయంగా బ్రహ్మకు ఇచ్చినట్లు స్పష్టమవుతున్నది. కాగా, వేదాలను త్రవ్వి వెలుగులోనికి తెచ్చిన విష్ణువే విఖనసుడని, ఆయన త్రవ్వి వెలుగులోనికి తెచ్చిన వేదాల ప్రాముఖ్యాన్ని గుర్తించిన వైఖానసులు ఆయన సంతతివారని చెప్పవచ్చు. విష్ణువు యొక్క అంశగా వెలసిన తొలి మునియే వైఖానసుల మూల పురుషుడు. అతడు విష్ణుబోధనలను, సూత్రాలుగా రూపొందించినాడు - అవియే వైఖానసులకు అధారసూత్రాలు.

ఆనంద సంహిత (17వ అధ్యా.) మరో కథను వివరించినది. విఖనస ముని తోతాద్రిమీద పెక్కు సంవత్సరాలు నిష్ఠతో తపస్సు చేసి తరువాత, విష్ణువు యొక్క అవతారములైన నరనారాయణులను సందర్శించి వారిని సేవించటానికి హిమాలయాలలోని బదరీవనానికి తరలి వెళ్ళినాడు. భార్య అయిన యోగప్రభతో కలిసి, బదరీవన సమీపంలో ఆశ్రమం నిర్మించుకొని, అక్కడ కొంతకాలం నివసించినాడు.

"క్వచిత్కాలాంతరే విష్ణుః నరనారాయణాత్మకః ।
బదరీషండమాసాద్య లోకరక్షాం చకార హ ॥
తస్యావతారం జ్ఞాత్వా తు విఖనాముని పుంగవః ।
తత్రగత్వాజగన్నాథం నరనరాయణాత్మకం ।
ప్రణమ్య శిరసా భూమౌ శ్రీ విష్ణోరాజ్ఞయా మునిః ॥"

- "కొంతకాలం గడచిన తరువాత, విష్ణువు నరనారాయణావతారము లెత్తి, బదరీ వనంలో ఉంటూ, లోకరక్షాచిత్తుడైనాడు. ఆ అవతార విషయం తెలిసికొన్న విఖనసముని పుంగవుడు బదరీవనానికి వెళ్ళి నరనారాయణాత్మ కుడైన జగన్నాథునకు శిరస్సుతో భూమి మీద ప్రణమిల్లి, శ్రీ విష్ణువు

యొక్క అజ్ఞతో ......"

అంతట, వేదవిహితమార్గాన, విగ్రహారాధన (= ప్రతిమార్చన) చేయటాన్ని ప్రజలకు బోధించవలసినదని నరనారాయణులు విఖనసమునినికోరినారు. అప్పుడు విఖనసుడు దేశ సంచారం చేస్తూ విగ్రహారాధనను గూర్చి ప్రచారం చేసినాడు. అట్లా సంచరిస్తూ, నైమిశారణ్యంలో అత్రి, భృగువు, మరీచి, కాశ్యపుడు, అనే నలుగురు మునులకే కాక ఇంకో ఐదుగురకు (వసిష్ఠ - అంగీరస - పులహ - పులస్త్య- క్రతువులకు) కూడా వైఖానసశాస్త్రాలను బోధించినాడు. వీరిలో మరీచి మున్నగు నలుగురు మునులు, తరువాత కాలంలో వైఖానసశాస్త్రకర్తలైనారు.

"కశ్యపో ఒత్రిర్మరీచిశ్చ వసిష్ఠాంగిరసౌ హ్యాహం (భృగుః) ।
పులస్త్య పులహౌ శ్చైవ క్రతుశ్చ నవసంఖ్యకాః ।
ఏతే విఖనసః శిష్యాః లోకానుగ్రహకారిణః ॥" -(సమూర్తార్చన)

- కశ్యపుడు, అత్రి, మరీచి, వసిష్ఠుడు, అంగీరసుడు, నేను (= భృగువు), పులస్త్యుడు, పులహుడు, క్రతువు - ఈ తొమ్మిది మంది విఖనస శిష్యులు, లోకానుగ్రహకారులు.

"స్వయంగా విష్ణువంశజులము కావటంచేత పుట్టుక తోనే మేము విష్ణు భక్తులము (గర్భ వైష్ణవజన్మనామ్). అట్లా పుట్టుకతోనే విష్ణుభక్తులం కావటంచేత ఇంక జీవితంలో మాకు వేరే 'దీక్ష' అక్కరలేదు" అని వైఖానసుల భావన. వైఖానస గృహ్యలలోని క్రియాకలాపాలలో, ఈ సమాజానికి విశిష్టమైన సాంఙ్ఞామాత్రపు సంస్కారం ఒకటి ఉన్నది. దీనినే 'విష్ణుబలి' లేదా 'గర్భచక్రసంస్కారం' అంటారు. స్త్రీ గర్భంధరించిన 8వ నెలలో శుక్లపక్షంలో 'విష్ణుబలి' అనే ఈ సంస్కారాన్ని, గర్భంలో ఉన్న శిశువు యొక్క రక్షణ కొరకు నిర్వర్తిస్తారు (గర్భాధానాద్యష్టమే మాస్యేవ, శుక్ల పక్షే - నృహింసవాజపేయయాజి యొక్క వైఖానస స్మార్త సూత్ర వ్యాఖ్యానం - 3, 13, 115 - దీనితో భృగువు యొక్క క్రియాధికారం - 36, 42 ను పోల్చి చూడదగను). ఈ సంస్కారం సీమంతం తరువాత జరుగుతుంది. ఇది విష్ణువునకు సమర్పితం (విష్ణుదేవాత్మకో బలిః ఉపాహ్రియతే అస్మిన్). ఇందువల్ల గర్భంలో ఉన్న శిశువు విష్ణుభక్తుడవుతాడు (గర్భస్థ శిశోః గర్భవైష్ణవత్వసిద్ధ్యర్థమ్). ఈ క్రియాకలాపంలో అగ్నిహోత్రం, గర్భిణికి విష్ణుచక్రంతో పవిత్రమైన పాయస

ప్రదానం ఉంటాయి. ఈ పాయసంలో కొంతభాగం, ముందుగా, అగ్నికి సమర్పిస్తారు. గర్భిణీ స్త్రీ పాయసం త్రాగుతూ ఉండగా క్రింది శ్లోకం పఠిస్తారు:

"త్వత్సుతో భాగ్యవాన్ ధన్యో గర్భవైష్ణవసంజ్ఞితః ।
అప్రాకృతో మహాత్మాసౌ గర్భచక్రేణ లాంఛితః ॥"

- (వైఖానస సూత్రానుక్రమణిక - 2 వ భాగం)

- నీ సుతుడు భాగ్యవంతుడు, ధన్యుడు, గర్భవైష్ణవసంజ్ఞితుడు, అప్రాకృతుడు, మహాత్ముడు, గర్భచక్రలాంఛితుడు - అగును గాక !

ఈ క్రియాకలాపంలోని ఆశయాన్ని క్రియాధికారం ఇట్లా వివరిస్తున్నది:

"నారాయణః స్వయం గర్భే ముద్రాం ధారయతే నిజాం ।
తత్కరస్థేన చక్రేణ శంఖేన ప్రథితౌజసా ॥
కరోతి చక్ర శంఖాంకం శిశోర్వై బాహుమూలయోః ।
వైఖానసేన సూత్రేణ స్యాదయం గర్భవైష్ణవః ॥"

- (క్రియాధికారం - 36, 43, 44)

నిసర్గ వైష్ణవా శుద్ధా జన్మనా ఽఽచార్య సంజ్ఞితాః ।
విఖనా ఇతి వై విష్ణుః తజ్జా వైఖానసా స్మృతాః ॥

- (అందే - 36. 28)

- ప్రఖ్యాత తేజోబలవంతుడు అయిన నారాయణుడు స్వయంగా, గర్భస్థునకు స్వీయ శంఖ చక్రాలతో ముద్రధారణ చేస్తాడు. అంటే శిశువు యొక్క బాహుమూలములను శంఖ చక్రాంకితములను చేస్తాడు. అప్పుడు ఆ శిశువు వైఖానస సూత్రం ప్రకారం 'గర్భవైష్ణవుడు' అవుతాడు.

-నిసర్గవైష్ణవులు శుద్ధులు; జన్మతోనే 'ఆచార్య' సంజ్ఞ పొందుతారు. విఖనుడేవిష్ణువు, కావున ఆయన సంతానమే వైఖానసులు.

వైఖానస గృహ్య సూత్రానికి (3, 13) శ్రీనివాసమఖి రచించిన తాత్పర్య చింతామణి వ్యాఖ్య ప్రకారం - 'విష్ణుబలి' అనే ఈ సంస్కారం గర్భాన్ని రక్షించటానికి ఉద్దిష్టమైంది (గర్భరక్షణార్థం అయం సంస్కారః ఉద్దిష్టః).

"రక్షణం తు శిశోః జ్ఞానోదయసమకాల ఏవ వైష్ణవత్వ సంపాదనమ్।"

యొక్క అజ్ఞతో ......"

అంతట, వేదవిహితమార్గాన, విగ్రహారాధన (= ప్రతిమార్చన) చేయుటాన్ని ప్రజలకు బోధించవలసినదని నరనారాయణులు విఖనసమునినికోరినారు. అప్పుడు విఖనసుడు దేశ సంచారం చేస్తూ విగ్రహారాధనను గూర్చి ప్రచారం చేసినాడు. అట్లా సంచరిస్తూ, నైమిశారణ్యంలో అత్రి, భృగువు, మరీచి, కాశ్యపుడు, అనే నలుగురు మునులకే కాక ఇంకో ఐదుగురకు (వసిష్ఠ - అంగీరస - పులహ - పులస్త్య- క్రతువులకు) కూడా వైఖానసశాస్త్రాలను బోధించినాడు. వీరిలో మరీచి మున్నగు నలుగురు మునులు, తరువాత కాలంలో వైఖానసశాస్త్రకర్తలైనారు.

"కశ్యపో உత్రిర్మరీచిశ్చ వసిష్ఠాంగిరసౌ హ్యాహం (భృగుః) ।
పులస్త్య పులహ శ్చైవ క్రతుశ్చ నవసంఖ్యకాః ।
ఏతే విఖనసః శిష్యాః లోకానుగ్రహకారిణః ॥" -(సమూర్తార్చన)

- కశ్యపుడు, అత్రి, మరీచి, వసిష్ఠుడు, అంగీరసుడు, నేను (= భృగువు), పులస్త్యుడు, పులహుడు, క్రతువు - ఈ తొమ్మిది మంది విఖనస శిష్యులు, లోకానుగ్రహకారులు.

"స్వయంగా విష్ణువంశజులము కావటంచేత పుట్టుక తోనే మేము విష్ణు భక్తులము (గర్భ వైష్ణవజన్మనామ్). అట్లా పుట్టుకతోనే విష్ణుభక్తులం కావటంచేత ఇంక జీవితంలో మాకు వేరే 'దీక్ష' అక్కరలేదు" అని వైఖానసుల భావన. వైఖానస గృహ్యాలలోని క్రియాకలాపాలలో, ఈ సమాజానికి విశిష్టమైన సాంజ్ఞామాత్రపు సంస్కారం ఒకటి ఉన్నది. దీనినే 'విష్ణుబలి' లేదా 'గర్భచక్రసంస్కారం' అంటారు. స్త్రీ గర్భంధరించిన 8వ నెలలో శుక్లపక్షంలో 'విష్ణుబలి' అనే ఈ సంస్కారాన్ని, గర్భంలో ఉన్న శిశువు యొక్క రక్షణ కొరకు నిర్వర్తిస్తారు (గర్భాధానాద్యష్టమే మాస్యేవ, శుక్ల పక్షే - నృహింసవాజపేయయాజి యొక్క వైఖానస స్మార్త సూత్ర వ్యాఖ్యానం - 3, 13, 115 - దీనితో భృగువు యొక్క క్రియాధికారం - 36, 42 ను పోల్చి చూడదగను). ఈ సంస్కారం సీమంతం తరువాత జరుగుతుంది. ఇది విష్ణువునకు సమర్పితం (విష్ణుదేవాత్మకో బలిః ఉపాహ్రియతే అస్మిన్). ఇందువల్ల గర్భంలో ఉన్న శిశువు విష్ణుభక్తుడవుతాడు (గర్భస్థ శిశోః గర్భవైష్ణవత్వసిద్ధ్యర్థమ్). ఈ క్రియాకలాపంలో అగ్నిహోత్రం, గర్భిణికి విష్ణుచక్రంతో పవిత్రమైన పాయస

ప్రదానం ఉంటాయి. ఈ పాయసంలో కొంతభాగం, ముందుగా, అగ్నికి సమర్పిస్తారు. గర్భిణీ స్త్రీ పాయసం త్రాగుతూ ఉండగా క్రింది శ్లోకం పఠిస్తారు:

"త్వత్సుతో భాగ్యవాన్ ధన్యో గర్భవైష్ణవసంజ్ఞితః ।
అప్రాకృతో మహాత్మాసౌ గర్భచక్రేణ లాంఛితః ॥"

- (వైఖానస సూత్రానుక్రమణిక - 2 వ భాగం)

- నీ సుతుడు భాగ్యవంతుడు, ధన్యుడు, గర్భవైష్ణవసంజ్ఞితుడు, అప్రాకృతుడు, మహాత్ముడు, గర్భచక్రలాంఛితుడు - అగును గాక !

ఈ క్రియాకలాపంలోని ఆశయాన్ని క్రియాధికారం ఇట్లా వివరిస్తున్నది:

"నారాయణః స్వయం గర్భే ముద్రాం ధారయతే నిజాం ।
తత్కారస్థేన చక్రేణ శంఖేన ప్రథితౌజసా ॥
కరోతి చక్ర శంఖాంకం శిశోర్వై బాహుమూలయోః ।
వైఖానసేన సూత్రేణ స్యాదయం గర్భవైష్ణవః ॥"

- (క్రియాధికారం - 36, 43, 44)

నిసర్గ వైష్ణవా శుద్ధా జన్మనా ఽఽచార్య సంజ్ఞితాః ।
విఖనా ఇతి వై విష్ణుః తజ్జా వైఖానసా స్మృతాః ॥

- (అందే - 36. 28)

- ప్రఖ్యాత తేజోబలవంతుడు అయిన నారాయణుడు స్వయంగా, గర్భస్థునకు స్వీయ శంఖ చక్రాలతో ముద్రధారణ చేస్తాడు. అంటే శిశువు యొక్క బాహుమూలములను శంఖ చక్రాంకితములను చేస్తాడు. అప్పుడు ఆ శిశువు వైఖానస సూత్రం ప్రకారం 'గర్భవైష్ణవుడు' అవుతాడు.

-నిసర్గవైష్ణవులు శుద్ధులు; జన్మతోనే 'ఆచార్య' సంజ్ఞ పొందుతారు. విఖనుడేవిష్ణువు, కావున ఆయన సంతానమే వైఖానసులు.

వైఖానస గృహ్య సూత్రానికి (3, 13) శ్రీనివాసమఖి రచించిన తాత్పర్య చింతామణి వ్యాఖ్య ప్రకారం - 'విష్ణుబలి' అనే ఈ సంస్కారం గర్భాన్ని రక్షించటానికి ఉద్దిష్టమైంది (గర్భరక్షణార్థం అయం సంస్కారః ఉద్దిష్టః).

"రక్షణం తు శిశోః జ్ఞానోదయసమకాల ఏవ వైష్ణవత్వ సంపాదనమ్।"

- ఈ సంస్కారం వల్ల గర్భస్థ శిశువునకు, జ్ఞానోదయ సమయంలోనే వైష్ణవత్వసిద్ధి చేకూరటమే కాక రక్షణ కూడా జరుగుతుంది.

ఈ సంస్కారం వల్ల వైఖానసుడుగా జన్మించబోయే శిశువు గర్భంలోనే విష్ణువుచేత స్వయంగా పవిత్రీకరించబడినాడు. ఇంక విష్ణుభక్తుడు కావటానికి కాని, అర్చకత్వ అర్హతపొందటానికి కాని, అతనికి వేరే సంస్కారం లేదా దీక్ష అక్కరలేదు. జన్మతోనే వానికి అర్చకత్వ అర్హత సిద్ధించింది.

ఈ సంస్కారవిధానంవల్ల లభించే అర్చకత్వ సిద్ధి తక్కిన సమాజాలలోని అర్చకత్వ సిద్ధులకు భిన్నంగా ఉంది. ఉదా: పాంచరాత్రానుయాయులను పరిశీలించవచ్చు. ఈ సంప్రదాయంప్రకారం ఎఱ్ఱగా కాల్చిన లోహపు శంఖచక్రాలతో బాలుని బాహువులమీద ముద్రలు వేస్తారు (= తప్తముద్రాంకధారణ). కొన్ని వర్గాలలో శిశువు జన్మించిన పదకొండవనాడే శీతలముద్రాంకణంచేస్తారు (లోహపు శంఖచక్రాలను తెల్లని రంగులోముంచుతారు). వైఖానసునకు ఈ సంస్కారం అక్కరలేదు. అంతేకాదు, ఈ సంస్కారం వానికి నిషిద్ధంకూడా. ఒకవేళ ఇష్టపడికాని, తెలియకకాని, పేరాశతోకాని, బలవంతంగాకాని బాహ్యమైనసంస్కారం పొందిన వైఖానసుడు అర్చకుడు కాజాలడు. అంతేకాదు. దేవాలయంలో ప్రవేశించటానికికానీ, విష్ణువిగ్రహాన్ని తాకటానికి కానీ అర్హుడు కాడు. అయితే, ఈ అర్హతను ప్రాయశ్చిత్త విధి ద్వారా పోగొట్టుకోవచ్చు.

"శ్రీవైఖానససూత్రస్థః తప్తముద్రో భవేద్యది ।
ఆలయం న విశేత్ పశ్చాత్ పూజనం నైవ కారయేత్ ॥
అజ్ఞానాద్వా బలాన్మోహాద్యపి చక్రాంకితో భవేత్ ।
వైఖానసో ఽపి సో ఽవద్యః అనర్హః సర్వకర్మసు ॥
అజ్ఞానాదర్థలోభాద్వా మోహాద్వా పరపీడనాత్ ।
తప్తముద్రా భవేద్యస్య ప్రాయశ్చిత్తం విధీయతే ॥"

- (ఆనందసంహిత).

మత్పుత్రాణాం న చిహ్నాని దీక్షితాశ్చిహ్నధారిణః

- (క్రియాధికారం-36, 38)

అహమేవ గురుస్తేషాం గర్భవైష్ణవజన్మనాం ।
తాపాదిపంచసంస్కారక్రియా నార్హంతి మామకాః ॥

- (క్రియాధికారం-36, 51)

మద్భక్తియుక్తస్య మదౌరసస్య నిషేకకర్మాది విరాజితస్య ।
న తప్తముద్రా నమంత్రదీక్షా న గురు ర్మయా వినా ॥
- (క్రియాధికారం-36, 54).

- వైఖానససూత్రస్థుడు తరువాత తప్తముద్రాంకితుడైతే అతడు ఆలయంలో ప్రవేశించరాదు, పూజచేయరాదు. అజ్ఞానంవల్ల కాని, బలాత్కారంవల్లకాని, మోహంవల్లకాని, అతడు తప్తముద్రధారణచేస్తే, అతడు వైఖానసుడైనప్పటికీ అవద్యుడు (= నింద్యుడు), సర్వకర్మలకు అనర్హుడు అవుతాడు. అజ్ఞానంవల్ల, లేదా అర్థలోభంవల్ల, లేదా మోహం వల్ల లేదా పరుల బలవంతంవల్ల తప్తముద్రితుడైతే, వానికి ప్రాయశ్చిత్తం చెప్పబడింది.

- నాకుమారులకు దీక్షితులైన చిహ్నధారులకు వలె ఏ చిహ్నములు అక్కర లేదు.....

- గర్భవైష్ణవజన్ములకు నేనే గురువును. నావారు తాపాది పంచ సంస్కారక్రియలకు అర్హులుకారు....

- నాభక్తియుక్తులకు, నాఔరసులకు, నిషేకకర్మాది విరాజితులకు తప్తముద్రకాని, మంత్రదీక్షకాని అక్కరలేదు; వారికి నాకంటె గురువు వేరేలేదు.

ప్రతివైఖానసుడు పుట్టుకతో సహజంగానే అర్చకుడు;. అతడు వైఖానస సూత్రాలకు అనుగుణంగా జీవించినంతకాలం, వానికి ఈ అర్హత ఎప్పుడూ ఉంటుంది. అర్చకత్వ సిద్ధి సాధారణంగా మూడువిధాల చేకూరుతుంది. -1. మానసికం (మనస్సును పరిశుద్ధంగా ఉంచుకొనటం); 2. వాచికం (చక్రాబ్జ మండలాలను ఏర్పరచి, అచ్చట తత్తదుచితములైన మంత్రాలను పఠించటం); 3. శారీరకం (గురువు తప్తముద్రాంకితం చేయటం.) వైఖానసుడు మొదటి రెండు విధానాలను అంగీకరించి, వైఖానససూత్రానికి భిన్నమైన మూడవ పద్ధతిని త్రోసిపుచ్చినాడు.

ప్రకీర్ణాధికారం (క్రియాపాదం-30వ అధ్యా-5-11) వంటిగ్రంథాలు వైఖానస-పాంచరాత్ర పూజావిధానాలమధ్యగల తేడాలను వివరించినవి:

"వైష్ణవం ద్వివిధం శాస్త్రం మునిభిః పరికీర్తితమ్ ॥
వైఖానసం వైదికం స్యాత్ వైదికై రర్చితం ద్విజైః ॥
పాంచరాత్ర మథాగ్నేయం అవైదికమతార్చికమ్ ।
తాపాది పంచసంస్కారదీక్షావద్భిః సమర్చితమ్ ॥
అశ్రీకరం ప్రోక్తం కేవలమాముష్మిక ఫలప్రదమ్ ।

సౌమ్యం సర్వత్ర సంపూజ్యం గ్రామాదిషు విశేషతః ॥
వైఖానసం పాంచరాత్రం వైదికం తాంత్రికం క్రమాత్ ।
ఐహికాముష్మికఫలప్రదం సౌమ్యం ప్రకీర్తితమ్" ॥

- వైష్ణవం రెండువిధాలు అని మునులుచెప్పినారు -వైఖానసం వైదికమైనది; వైదికులైన ద్విజులచేత అర్చింపబడే విధానమిది. పాంచరాత్రం ఆగ్నేయం; అవైదికులైన ఋత్విక్కులు కల విధానమిది. అంతేకాదు పాంచరాత్రం తాపాది పంచసంస్కార దీక్షలతో కూడినది; ఇది అశ్రీకరమనీ, కేవలం అముష్మిక ఫలప్రదమని చెప్పబడింది. ఇంక వైఖానసం 'సౌమ్యం'; ఇది సర్వత్ర సంపూజ్యం. విశేషించి గ్రామాదులలో ఆదరింపదగినది. వైఖానసం వైదికం; పాంచరాత్రం తాంత్రికం. ఇందులో సౌమ్యం (అంటే వైఖానసం) ఐహిక-అముష్మిక ఫలప్రదం.

కేవలం జీవిక కోసం వృత్తిగా అర్చకత్వం స్వీకరించే అర్చకుల (= దేవలకుల) కంటె తాము భిన్నులమని వైఖానసుల నమ్మకం.

"వైఖానసాస్తు యే విప్రా హరిపూజన తత్పరాః।
న తే దేవలకాః ప్రోక్తా విష్ణుపాదాబ్జ సంశ్రయాత్"॥

- హరిపూజా తత్పరులైన వైఖానసవిప్రులు విష్ణుపాదాబ్జములను ఆశ్రయించటం వల్ల, దేవలకులు కాజాలరు.

వైఖానస విప్రులు తమ సర్వస్వమూ విష్ణుపూజకు అంకితం చేసుకొని సర్వకాలములందు విష్ణుపూజలో మునిగి ఉంటారు. కావున వారిని వృత్తిగా అర్చకత్వం స్వీకరించిన వారినిగా తలంచరాదని హారీతుడు పేర్కొన్నాడు.

"బ్రహ్మచారీ గృహస్థశ్చ విప్రో వైఖానసస్తథా ।
కుర్వంతో నిజకర్మాణి విష్ణుమేవం భజంతి తే ॥"

- వైఖానస సమాజంలోని విప్రుడు, అతడు బ్రహ్మచారి అయినా లేదా గృహస్థుడు అయినా అతడు చేసే నిత్యకర్మానుష్ఠానమే విష్ణుపూజ అవుతుంది.

'దేవలక' అనే పదం కులానికి లేదా సమాజానికి సంకేతంకాదు; అర్చకత్వం వహించటానికి కారణం తన సేవలకు ప్రతిఫలం ధనరూపంలో లభించాలనే ఆశయం కల వ్యక్తిని మాత్రమే ఈ పదం సూచిస్తుంది. ఏ బ్రాహ్మణుడైనా, ధనసంపాదన దృష్టితో వరుసగా మూడుసంవత్స

రాలపాటు దేవాలయంలో పూజలుచేస్తే అతడు 'దేవలకుడు' అవుతాడు. అప్పుడు, అతడు, సాధారణకర్మకాండ నిర్వహించటానికికూడా అర్హత కోల్పో తాడు. అంటే వైఖానసుడు అర్చకుడుగా ఉండటానికే జన్మించినాడు; అతడు జీవితంలో వేరే వృత్తిని ఏ విధంగానూ స్వీకరించరాదు. కాని, ఇతర బ్రాహ్మణులు, ధనరూపంలో అందే లాభాలను దృష్టిలో పెట్టుకొనే, అర్చకులవుతారు.

'సంకర్షణ సంహిత' అనే పాంచరాత్ర శాస్త్రం దేవలకులను గూర్చి ఇట్లా పేర్కొన్నది:

"కర్మదేవలకాః కేచిత్ కల్పదేవలకాః పరే ।
శుద్ధదేవలకాశ్చాన్యే త్రిధా దేవలకాః స్మృతాః ।
అర్థార్థీ కాలనిర్దేశీ యో దేవం పూజయేత్ స హి ॥
కర్మదేవలకోనామ సర్వకర్మబహిష్కృతః ॥
పాంచరాత్ర విధానజ్ఞో దీక్షావిరహితోఽర్చకః ।
చతుర్వేదాధికారోఽపి కల్పదేవలకః స్మృతః ॥
ఆగమోక్తవిధానజ్ఞో భద్రకాల్యుపజీవకః ।
శుద్ధదేవలకః ప్రోక్తః సర్వకర్మబహిష్కృతః ॥"

- దేవలకులు మూడురకాలు: 1. కర్మదేవలకులు, 2. కల్పదేవలకులు, 3. శుద్ధదేవలకులు. అర్థార్థియై, కాలనియమంతో దైవపూజచేసేవాడు కర్మదేవలకుడు; అతడు సర్వకర్మ బహిష్కృతుడు. పాంచరాత్ర విధానజ్ఞుడైనప్పటికీ, చతుర్వేదాధికారి అయినప్పటికీ దీక్షావిరహితుడైన అర్చకుడు కల్పదేవలకుడు. ఆగమోక్తవిధానజ్ఞుడై, భద్రకాళీ ప్రభృతులను అర్చించేవాడు శుద్ధదేవలకుడు; ఇతడు కూడా సర్వకర్మ బహిష్కృతుడు.

ఆనందసంహిత (4, 79 శ్లో.) వేరేవిధమైనవిభజనను పేర్కొన్నది (విష్ణుధర్మోత్తరపురాణం ప్రకారం):

దేవార్చనపరో యోఽపి పరాయ విత్తకాంక్షయా ।
చతుర్వేదధరో విప్రః స చండాలసమో భవేత్ ॥

- చతుర్వేదపండితుడైనప్పటికీ విత్తకాంక్షతో, పరులకోసం దేవార్చనచేసే విప్రుడు చండాలసముడవుతాడు.

అర్చకుడు ఎట్లా ఉండాలో వైఖానసశాస్త్రాలు నిర్దేశిస్తున్నవి:

"అధ్యాత్మగుణసంయుక్తో విప్రః స్వాధ్యాయసంయుతః ।
వృత్తవాన్ సత్యవాదీ చ జ్ఞానశీలశ్చ యోగవిత్ ।
గృహస్థో బ్రహ్మచారీ వా భక్త్యావార్చన మారభేత్ ॥"
(క్రియాధికారం, 9వ అధ్యా 23-24).

- అధ్యాత్మ గుణసంపన్నుడు, స్వాధ్యాయపరుడు, శీలవంతుడు, సత్యవాది, జ్ఞానశీలుడు, యోగవిదుడు అయినవిప్రుడు అతడు గృహస్థుడైనా బ్రహ్మచారి అయినా భక్తితో అర్చన ఆరంభించాలి.

అతడు పూర్వాహ్నమును అర్చనలో గడపి, మధ్యాహ్నభోజనమైన తరువాత వేదాలను లేదా వేదాంగాలను పఠించాలి (భోజనానంతరం వేదాన్ వేదాంగాన్యధ వా పఠేత్). అతడు బ్రాహ్మణములందు చెప్పబడిన సర్వకర్మలను నిర్వర్తించాలి; ఉత్తమోత్తమమైన జీవనవిధానం పాటించాలి.

"నిత్యాచారవిహీనస్య సమస్తా నిష్ఫలాః క్రియాః ।
విష్ణుభక్తి విహీనస్య యథా సర్వం సునిష్ఫలమ్ ॥"

- విష్ణుభక్తి విహీనుని సేవనిష్ఫలమైనట్లే, నిత్యాచారాలను పాటించని సమస్త క్రియలు నిష్ఫలములు.

## వైఖానసుల దృక్పథం.

వేదమందు చెప్పబడిన విష్ణువు ఒక్కడే పూజనీయుడు అని విశ్వసించే వైఖానసులు విశిష్టదృక్పథం కలవారని ఇంతకుముందు గుర్తించినాము. వైఖానసులు, శ్రీవైష్ణవులలో ఒక శాఖగా ఇప్పుడు గుర్తింపబడినప్పటికీ, పాంచరాత్రికులవలె రామానుజులవారిని కానీ, ఆళ్వారులనుకానీ గురువులుగా లేదా మార్గదర్శకులుగా వీరు గుర్తింపరు. అంతేకాదు వీరు విశిష్టాద్వైత తత్వాన్ని కూడా గుర్తింపరు. వైఖానస పూజావిధానంలో భాష్యకారులను (= రామానుజులను) పూజించేప్రసక్తి కానీ, ఆళ్వారులద్రావిడప్రబంధాలను పారాయణంచేసే సన్నివేశంకానీ లేవు. వీరి పూజావిధానమంతా ఋగ్వేదంనుంచి, యజుర్వేదంనుంచి ఎన్నుకోబడిన ప్రార్థనలతో, ముఖ్యంగా కృష్ణయజుర్వేద శాఖకు చెందిన బ్రాహ్మణములలో నిర్దిష్టములైన అగ్నిహోత్ర కార్యములతో కూడి ఉంటుంది. తాంత్రికసంబంధి 'అంతర్‌యాగం' కానీ, బీజాక్షర ప్రయోగంకానీ, భక్తుడు తన హృదయంనుంచి ప్రతిమలోనికి దైవత్వాన్ని నీ వైఖానస పూజావిధానంలో కానరావు.

నిరాకారంగా ఉన్న దైవత్వాన్ని స్థండిలం (= నేలమీదమట్టిపరచి, దానిమీద బియ్యపుపిండి పరచి ఏర్పరచే చిన్న వేదిక) మీదకానీ, మార్తాండ మండలంలో కానీ, ఔపాసనాగ్నిలో కానీ, జలంలో కానీ, హృదయంలోకానీ ఆరాధించటాన్ని వైఖానసశాస్త్రాలు అంగీకరించాయి. అయితే, ఈ విధానాలన్నింటికంటె దైవత్వాన్ని సాకారంగా పూజించటంవైపే ఈ శాస్త్రాలు మొగ్గుచూపాయి. దైవత్వానికి ప్రతిబింబమైన 'అర్చామూర్తి' భక్తుని ఏకాగ్రతకు సులువైన ఆలంబనమేకాక, అసలు దైవస్వరూపంగానే వానికి గోచరిస్తుంది. శాస్త్రవిహితంగా ప్రతిష్ఠింపబడినప్పుడే, ఆప్రతిమ పూజార్హమవుతుంది. అంతేకాదు, ఒకసారి సుప్రతిష్ఠితమైతే, ఆప్రతిమలో దేవత్వం ఎల్లకాలం నిలిచే ఉంటుంది (ప్రతిష్ఠాయ ప్రతిమాసు సర్వదా సన్నిధాన సంభవాత్). 'ప్రతిష్ఠ' అనే పదానికి "ప్రతిమలో దైవత్వాన్ని నిక్షేపించటం" అని వ్యుత్పత్తి అర్థం; ప్రతిమాప్రతిష్ఠచేసే ఆచార్యుని విశిష్టమైన ధ్యాననిష్ఠవల్ల ఈ దైవత్వనిక్షేపం సాధ్యపడుతుంది. కాగా, వైఖానసులకు ప్రతిమారాధన కేవలం ప్రతీకాత్మకంమాత్రమే కాదు; ఆప్రతిమసాక్షాత్తుగా దైవస్వరూపమే. ఈ ఆరాధన, నిష్ఠతో కూడినప్పుడు మరింత సుసంపన్నమవుతుంది.

"తదారాధనం ద్వివిధమ్-అమూర్తం సమూర్త మితి. అగ్నౌ హుతం అమూర్తం. ప్రతిమారాధనం సమూర్తం; తచ్ఛ్రేష్ఠం. యజమానాభావే పి అవిచ్ఛిన్నం భవతి". -(విమానార్చనాకల్పం-1 )

- విష్ణ్వారాధన రెండువిధాలు- అమూర్తం, సమూర్తం. అగ్నిలో హోమం చేయటం అమూర్తం. ఇంక ప్రతిమారాధన సమూర్తం; ఇదే శ్రేష్ఠమైనది. యజమానుడు లేనప్పుడు కూడా అది అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంది.

"సాకారం చ నిరాకారం హరేరారాధనం ద్విధా ।
ప్రతిమారాధనం ముఖ్యం సాకార మభిధీయతే ॥
స్థండిలే చ జలే చైవ హృదయే సూర్యమండలే ।
ఆరాధనం నిరాకార మతః సాకార ముత్తమమ్ ॥"

-(క్రియాధికారం-9వ అధ్యా..)

- హరిపూజ రెండువిధాలు- సాకారం, నిరాకారం. ముఖ్యమైన ప్రతిమారాధన సాకారమవుతుంది. స్థండిలమందు, జలంలో, హృదయంలో, సూర్యమండలమందు దైవత్వాన్నిభావించి పూజించటం నిరాకారమవుతుంది. ఈ రెండింటిలో సాకారపూజ ఉత్తమం.

అయితే, అంతిమ మోక్షసాధనకు నిరాకారమైన పరబ్రహ్మభావనయే ప్రధానమవుతుంది. కాని, అది సిద్ధించటానికి ముందు, పరబ్రహ్మస్వరూపమైన ప్రతిమయొక్క ఆరాధన అవశ్యకం. సహజములైన మానవబుద్ధి పరిమితులను దృష్టిలో ఉంచుకొంటే, ఇది తప్పనిసరి అని తోచగలదు. ఇంద్రియాలకు గోచరించే రూపాదులను దర్శించి, స్పందించటానికి అలవాటు పడినమనకు, గట్టిపట్టుదల నిరంతరాభ్యాసం ఉంటే తప్ప అగోచరమైన పరబ్రహ్మముమీద దృష్టినిలపటం కష్టసాధ్యమేకాదు, అసాధ్యంకూడా. శాస్త్రవిహితంగా ప్రతిష్ఠింపబడిన ప్రతిమను, శాస్త్రానుసారంగా సమగ్రంగా ఆరాధించినప్పుడు పవిత్రత మన మనస్సులలో పాదుకొంటుంది; భక్తి మన హృదయాలలో స్థిరపడుతుంది. దైవస్వరూపమైన అప్రతిమ మనకు ఐహిక సుఖాలను అనుగ్రహిస్తుంది; ఆముష్మిక ప్రాప్తికి మార్గాన్ని సుగమంచేస్తుంది. అందుచేతనే ప్రతిమారాధనకు పూనుకోవాలనీ, సంసారసాగరమగ్నులైన వారికి ఇది అత్యావశ్యకమనీ శాస్త్రాలు బోధిస్తున్నవి.

"సగుణే బ్రహ్మణి బుద్ధిం నివేశ్య పశ్చాత్ నిర్గుణం
బ్రహ్మఽఽశ్రిత్య మోక్షే నిత్యం యత్నం కుర్యాదితి
విజ్ఞాయతే." -(వైఖానస స్మార్తసూత్ర వ్యాఖ్య-8, 11, 13)

- సగుణరూపుడైన బ్రహ్మమునందు బుద్దినిల్పి, తరువాత నిర్గుణుడైన బ్రహ్మమును ఆశ్రయించి, మోక్షంకొరకు నిత్యం ప్రయత్నించాలని తెలియుచున్నది.

"సాలంబం సగుణం శ్రేష్ఠం సకలం కౌతుకార్చనం ।
సకామానాం సముచితం సంసారాశ్రమిణాం సదా ॥"
-(క్రియాధికారం-7, 12).

- కోరికలుగల గృహస్థులకు ఎల్లప్పుడు సాలంబం, సగుణం అయిన కౌతుకమును అర్చించటమే శ్రేష్ఠం, సముచితం.

"ఆవాహ్య కౌతుకం తస్మాన్నిత్యం విధివదర్చయేత్ ।
సకామాకామయో ర్యోగ్యం ఐహికాముష్మికప్రదం ।"
-(క్రియాధికారం-7, 1)

-కావున, కౌతుకమును ఆవాహనంచేసి, నిత్యం, విధిపూర్వకంగా అర్చించాలి. ఇది సకాముకులకు, అకాముకులకుకూడా యోగ్యమైనదే; అంతేకాదు, ఇది ఐహికాముష్మిక ప్రదంకూడా.

వైఖానసశాస్త్రాలు తాంత్రిక సంప్రదాయాన్ని వ్యతిరేకించినప్పటికీ-ఆరాధనా సమయంలో భక్తునకు దైవంతో తాదాత్మ్యం కలగటం అనే-ఒక్క విషయంలో మాత్రం తాంత్రిక సంప్రదాయానుసరణం గోచరిస్తున్నది. ఆరాధ్యం, ఆరాధకుడు-ఈ ఇరువురి తాదాత్మ్యభావన లేకపోతే మానవుడు దైవంతో తాదాత్మ్యంచెందటం అనేది అసాధ్యం అని తాంత్రికులవిశ్వాసం. ఇందుకు ఆరాధకుడు మూడు దశలను దాటవలసి ఉంటుంది: (1) తనసర్వస్వం భగవంతునకు చెందినదనే విశ్వాసం (తస్యైవాహమ్) కుదురుకొనటం-అయితే-ఈ దశలో భగవంతుడే తాను అని ఆరాధకుడు అనుకొనడు. (2) రెండవ దశలో భగవద్దర్శనమవుతుంది-'నేను నీవాడను' (తవేవాహమ్) అని భగవంతునితో విన్నవించుకొంటాడు ఆరాధకుడు. (3) ఇంక చివరిదైన మూడవదశలో 'నీవేనేను' (త్వమేవాహమ్) అనేవిశ్వాసం కుదురుతుంది. అప్పుడు భగవంతునకు, ఆరాధకునకు మధ్య భేదం నశిస్తుంది.

ఆవాహనం చేసే క్రమాన్ని వైఖానసశాస్త్రాలు ఇట్లా నిర్దేశిస్తున్నవి: ఆవరణ దేవతాపూజ, ద్వారపాలకపూజ అయినతరువాత, అర్చకుడు, తెర వెనుక, ప్రతిమ ఎదుట నిలిచి ఆత్మసూక్తంపఠిస్తూ, ధ్యాన నిమగ్నుడు కావాలి. ఆ స్థితిలో అతడు స్వయంగా విష్ణువు అవుతాడు. అప్పుడు విష్ణువుతోడి ఈ తాదాత్మ్యం ప్రతిమకు ఆపాదింపబడుతుంది. తరువాత న్యాసాదులు సాగుతాయి.

పూజాసమయంలో అర్చకుడు దైవత్వంతో తాదాత్మ్యం చెందుతాడన్న భావనవల్లనే అర్చకునిలో దైవత్వం ఉంటుందన్న విశ్వాసం కలిగింది. ఉదాహరణకు: భృగువు యొక్క క్రియాధికారం (36, 59-60) ప్రకారం విష్ణువునకు రెండు రూపాలు ఉన్నవి- (1) ప్రతిమ; (2)అర్చకుడు. ఆవాహన తరువాతనే ప్రతిమలో దైవత్వం సిద్ధిస్తుంది. కాని, అర్చకునిలో దైవత్వం ఎల్లప్పుడూ ఉంటుంది. అందుచేతనే అర్చకుడు జంగమరూపి అయిన దైవంగా గుర్తింపబడినాడు.

రూపద్వయం హరేః ప్రోక్తం బింబమర్చక ఏవ చ ।
బింబం త్వావాహనాదూర్ధ్వం సదా సన్నిహితోఽర్చకః ॥
అర్చకస్తు హరిః సాక్షాచ్చరరూపీ న సంశయః ।

-హరికి రూపద్వయం చెప్పబడింది -(1) బింబం (= ప్రతిమ), (2)అర్చకుడు. ఆవాహన తరువాతనే హరి, బింబంలో ఉంటాడు; కాని ఆహరి అర్చకునిలో ఎల్లప్పుడూ ఉంటాడు. అర్చకుడు చరరూపిఅయిన హరియే అనటంలో సంశయంలేదు.

'ఆత్మసూక్తం' అనేది త్రిష్టుప్ చందస్సులో ఉన్న తొమ్మిది మంత్రాల సంపుటి (వైఖానససంహిత- మంత్రప్రశ్న-5, 49; అర్చనాసారసంగ్రహం, మరియు కాశ్యపుని ఆచారకాండ). ఈ సూక్తప్రయోగం వైఖానస పూజలో అసాధారణమైనది. విష్ణువుయొక్క 'సకలరూపాన్ని ఆవాహనం చేసేటప్పుడు ఈ సూక్తపఠనం జరుగుతుంది. ఇందువల్ల అర్చకుని యొక్క ఆత్మ విష్ణువుయొక్క సకలరూపాన్ని తనలో ఇముడ్చుకొనటానికి సమర్థ మవుతుంది. అర్చకునియొక్క ఆత్మ , పరమాత్మతో అంటే విష్ణువుతో తాదాత్మ్యం చెందటానికి ఈ విధానం ఉద్దిష్టమైంది. 'ఆత్మాత్మా' అని ప్రారంభంకావటంచేతనే కాక, జీవాత్మ పరమాత్మగా పరిణతి చెందటానికి సంబంధించినది కావటంచేత కూడా ఈ సూక్తం 'ఆత్మసూక్తం' అనబడింది.

"ఆత్మాత్మా పరమాంతరాత్మా మహ్యంతరాత్మా
యశ్చాదిరాత్మా స తు నోఽంతరాత్మా ।
వ్యావేష్టి విశ్వం సకలం బిభర్తి
యో వ్యక్త పుణ్యః స తు నః ప్రధానః" ॥(1)

-ఏది ఆత్మకుఆత్మయో, పరమమైన అంతరాత్మయో, భూమికి అంత రాత్మయో, ఏది ఆదిఆత్మయో, అదియే మన అంతరాత్మ. అది విశ్వవ్యాప్తమైనది; అది అన్నింటిని భరించేది. ఏది పుణ్యరూపంగా వ్యక్తమవుతుందో అదే మనకు ప్రధానం.

"ప్రాణః ప్రణీతిః స ఉదానఆదిః
వరదో వరాహో వ్యానశ్చ మే స్యాత్ ।
తపసాంచ మూర్తిః కపిలో మునీంద్రో
యశ్చాపానో హయశిర్షా నః" ॥ (2)

- (పంచవాయువులలో) ప్రాణం మన మార్గదర్శి. 'ఉదానం'వరదమైన ఆదివరాహం. 'వ్యానం' మునీంద్రుడైన కపిలుడు. 'అపానం' హయగ్రీవుడు.

"యత్సవ అశ్నాత్యజరః సమగ్రం
శ్రియం ఊర్జయుక్త స తు మే సమానః ।
బలం అసురం యత్సతతం విహంతా
బ్రహ్మే బుద్ధిమ గోప ఈశ్వరః" ॥(3)

-ఊర్జ(= బలానికిమూలం) యుక్తము, అజరము (= జీర్ణించనిది) అయిన నా సమానవాయువు సమగ్రంగా, సర్వస్వమును హరించును. అను రీబలమును నిరంతరం హరించును. నాబుద్ధియే బ్రహ్మ, మరియు రక్షకుడైన ఈశ్వరుడు.

"సవితా చ వీర్య ఇందుశ్చ ధాతు
రసయుతం భూతా భూతాః ఉదరం నభో వా ।
భూమిర్యథాంఘ్రి ర్యవృధేఽహ మీశః" ॥ (4)

--సవిత (= సూర్యుడు) నా వీర్యం. నాశరీరంలో ధాతుగణం చంద్రుడు. నా శరీరంలోని ఇతరరసాలు అన్నీ పంచభూతాలు. నా ఉదరం ఆకాశం. నా పాదాలు భూమి - ఇట్లాపెరిగిన నేనే ఈశ్వరుడను.

"అస్థీని మే స్యురథ పర్వతాఖ్యా
భుజగశ్చ కేశా దివి యే చరంతః ।
ద్యా నేత్రరూపా పృథుపృశ్నిముఖ్యా
రుధిరం చ సారం సకలం చ తోయమ్ ॥" (5)

-నా అస్థికలు పర్వతాలు. నాకేశములు దివిలో సంచరించే భుజంగాలు. ద్యావాపృథ్వులు నా నేత్రములు. నాలోని సారభూతమైన రక్తమంతా జలము (పృశ్ని = భూమి).

"స్నాయవో మే అసన్నదిర్భృగుమ హృదయమస్తు
సవ అన్యే మునయోఽఖిగభూతాః।
వేదా మే అస్యం జిహ్వా మే సరస్వతి
దంతా మరుత ఉపజిహ్వా ఉపశ్రుతిః" ॥ (6)

-నా స్నాయువులు (నరములు) లోకంలోని నదులు. నాహృదయం భృగువు (= పర్వతసానువు). నా అవయవాలు తక్కిన (వైఖానస) మునులు. నా ముఖం వేదం. నాజిహ్వా సరస్వతి. నాదంతాలు మరుత్తులు. ఉపజిహ్వా (= కొండనాలుక) ఉపశ్రుతి (=ఉపవేదాలు).

"వృషణౌ మిత్రావరుణావుపస్థాః ప్రజాపతిః
అంత్రా మే వేదాః శ్రుతి స్మృతి మేధా ధారణే ।
స్వేదం మే వర్షం మూత్రకోశం సముద్రమ్
పురీషం కాంచనమ్"॥(7)

-నావృషణాలు మిత్రావరుణులు. ఉపస్థ ప్రజాపతి. నా అంత్రములు (= ప్రేవులు) వేదమంత్రాలు. నా మేధాశక్తి శ్రుతి. నా ధారణాశక్తి స్మృతి. నా స్వేదం వర్షం. నా మూత్రకోశం సముద్రం. నా పురీషం (= మలం) కాంచనం.

"సావిత్రీ గాయత్రీ మర్యాదా వేదీ
హృత్పుండరీక విమలే ప్రవిష్టః ।
సకలః సలక్ష్మీః సవిభూతికాంగో
యత్రైవ పుణ్యం మద్యధిష్ఠానమస్తు" ॥(8)

--సవితను ఉద్దేశించిన గాయత్రీమంత్రం పవిత్రమైన వేదిక. విమలమైన నాహృత్పుండరీకంలో, సకలరూపుడై శ్రీయుక్తుడై విభూతితో, విష్ణువు ప్రవేశించునుగాక! సర్వపుణ్యములు నన్ను ఆవేశించునుగాక!

"సర్వేషాం దేవానాం ఆత్మకః.
సర్వేషాం మునీనా మాత్మకః
తపోమూర్తిరిహ పుణ్యమూర్తిరాసన్". (9)

- నేను సకలదేవాత్మకుడను. సకలమున్యాత్మకుడను. నేను తపోమూర్తిని, పుణ్యమూర్తిని అగుదును గాక!

పరమాత్మయును, ఆనందస్వరూపుడును, విశ్వవ్యాపకుడును అయిన విష్ణువును, ('విష్ణువు' అనేపదానికి 'సర్వవ్యాపకుడు' అని అర్థం) అర్చకుని హృదయంలోనికి లేదా ప్రతిమలోనికి ఆవాహనం చేయటంచేత, దైవాన్ని ఒక్కచోటనే ధ్యానించటానికి వీలుపడుతుంది-దావానలం, అరణ్యమంతా వ్యాపించినప్పటికీ, ప్రధానంగా ఒక్కచోటనే తీవ్రంగా కనిపిస్తుంది కదా!

సందర్భోచితములైన మంత్రాలతో ప్రతిమలోకానీ, ఏకాగ్రమైన భక్తిభావనతో ధ్యానవిష్ణులో ఉన్న హృదయంలో కాని ఆవాహనం చేయబడిన విష్ణువు-ప్రతిమలో లేదా హృదయంలో తన సన్నిధిని అనుభూతికి తెచ్చి, ఆయాపూజలను స్వీకరిస్తాడు (క్రియాధికారం-7, 36-38 తో పోల్చిచూడవలెను).

వైఖానసపూజ ప్రధానంగా విష్ణు దైవాత్మకం. ఈ విష్ణువు సర్వవ్యాపకుడుగా పూజింపబడతాడు (విషి= వ్యాప్తౌ; విషి అనేక్రియకు వ్యాపించటం అని అర్థం). విష్ణువును ఆవాహనం చేయటం అంటే ఆయనను సపరివా

రంగా వేంచేయుమని అర్థించటమే. కావున విష్ణుపూజ సర్వదేవతారాధన అవుతుంది (విష్ణోః అర్చా సర్వదేవార్చా భవతి). (ఆయన ప్రధానపరివార దేవతల పేర్లకు, ఆలయంలో వారివారి స్థానాలకు 'ఆగమకోశ సంపుటా లలో 'అవరణ', పరివారాలయ' అనేపదాలక్రింద చూడాలి). విష్ణువును, 'విష్ణువు' గానే ఆరాధించాలి ('వాసుదేవుడు' గా కాదు) అనే వైఖానసుల విశ్వాసం సమగ్రము సర్వవ్యాపకము అయిన విష్ణుతత్త్వం యొక్క విశిష్టతను నిర్దేశిస్తున్నది.

ఈ విశిష్టతను, వైఖానసదేవాలయాలలో ప్రచారంగా ఉన్న, ఒక సంప్రదాయంలో చూడవచ్చు- ప్రతి ఆలయంలోనూ, 'ధ్రువబింబం' అనబడే అచరమైన, ప్రధానమైన శిలాప్రతిమతో పాటు, మరోమూడు ప్రతిమలు ఉంటాయి. యథావిధిగా, అర్చామూర్తిగా ప్రతిష్ఠింపబడిన శిలాప్రతిమ సాక్షా త్తుగా, సర్వశక్తిమంతుడైన విష్ణుస్వరూపమే. వేదాలలో పేర్కొనబడిన "విష్ణువు మూడు పదములతో విక్రమించటం" అనే అంశమును (త్రీణిపదా విచక్రమే విష్ణుః) ఆలయంలోని మూడు ప్రతిమల ద్వారా ప్రధానప్రతిమ నిరూపిస్తున్నది-ఇది సమగ్రతకు, సర్వవ్యాపకతకు నిదర్శనం. ఈ మూడిం టిలో 'కౌతుకబేరము' నకు నిత్యార్చన జరుగుతుంది. రెండవది అయిన 'స్నపన బేరము' నకు నైమిత్తికార్చనలు జరుగుతాయి. ఇంక మూడవది అయిన 'ఔత్సవబేరము' ప్రజల 'కామ్యార్చన' కు ఉపయుక్తమవుతుంది.

ప్రతీకాత్మకమైన ఈ 'చతుర్మూర్తి' తత్త్వం ఆసక్తికరమైనది. ప్రధాన ప్రతిమ విష్ణువు; ఆయన సర్వవ్యాపకుడు అయినప్పటికీ ఆ ప్రతిమ అచలము; భక్తులపూజలను స్వీకరించటం కోసం విష్ణుతత్త్వం లేదా శక్తి ప్రధాన ప్రతిమనుంచి అర్చాపీఠం మీద ఉన్న 'కౌతుకబేరం' లోనికి ప్రసరిస్తుంది; ఇది మొదటి పదం. తరువాత పూజ కొనసాగుతున్నప్పుడు-అంటే స్నానంచేయిం చటం వంటి క్రియలు జరుగవలసినప్పుడు ప్రధానప్రతిమ నుంచి విష్ణుతత్త్వం 'స్నపనబేరం' లోనికి ప్రసరిస్తుంది; ఇది రెండవపదం. ఈ స్నపనబేరం, గర్భగుడికి వెలుపల ఉన్న స్నపనమండపంలో ఉంటుంది. ఇంకమూడవపదం- ఔత్సవబేరమును ఆలయంలోపలి ఆవరణలో త్రిప్పటం లేదా నగరవీథులలో ఊరేగించటం. అంటే, ఇప్పుడు, విష్ణుతత్త్వం ఆలయం ఆవరణను దాటి వెలుపల ప్రసరించినదన్నమాట!

"నిత్యప్రధానపూజార్థం కౌతుకం సంకల్పయేత్ ।
స్నపనం స్నపనార్థం చాప్యుత్సవార్థం తథోత్సవమ్ ॥"

- ప్రధానమైన నిత్యపూజనిమిత్తం కౌతుకమును ఏర్పరచవలెను. స్నపనం (= స్నానం) కోసం స్నపనమూర్తిని, ఉత్సవాలకోసం ఉత్సవమూర్తిని ఏర్పాటు చేయవలెను.

ఈ మూడు ప్రతిమలకు తోడు బలియాత్ర కొరకు 'బలిమూర్తి' అనే నాలుగో ప్రతిమకూడా ఉంటుంది-ఆయా ఆవరణలలో ఉన్న పరివార దేవతలకు బలి సమర్పించటానికి ఇది ఉపయుక్తమవుతుంది.

"నిత్యం తు బలియాత్రార్థం బలిబింబం చ ముఖ్యతః ।"

- నిత్యం, బలి (= నైవేద్య) సమర్పణ యాత్ర లో 'బలిమూర్తి' ముఖ్యం.

"సర్వత్ర సర్వభోగార్థం భోగబేరం చ కంచనా"

-అంతటా సర్వభోగాలనిమిత్తం భోగబేరమును (= భోగమూర్తిని) ఏర్పాటు చేసుకోవలెను (ఈ భోగబేరమే కౌతుకబేరము)·

ఆలయపూజలో చతుర్మూర్తులు, లేదా పంచమూర్తులు ఉన్నంత మాత్రాన, అవి వేర్వేరు దేవతామూర్తులని తలంచరాదు. గర్భగుడిలో-ప్రధానము,అచలము అయిన ధ్రువబింబమే విష్ణువు యొక్క అర్చామూర్తిగా ఆరాధింపబడుతుంది. ఇది తక్కిన మూడు లేదా నాలుగు ప్రతిమలకు 'ఆదిమూర్తి' అవుతుంది. నిత్యార్చనకు ఉపయుక్తమయ్యే 'కౌతుకబేరం' ప్రధాన ప్రతిమయొక్క అంశయే అనీ, ప్రధాన ప్రతిమ తరువాత ఇదే ముఖ్యమనీ, ఈ ప్రతిమలు అన్నీ కలిసి, నిజానికి, ఏకసంపుటియే అని వైఖానసుల విశ్వాసం; ఇందుకు శాస్త్రాలు ప్రమాణం. కావుననే, కౌతుకబేరం, అన్నివిధాల ధ్రువబింబానికి అనురూపంగా ఉంటుంది.

"ధ్రువకౌతుకయోరైక్యే ధ్రువార్చన ముదాహృతమ్." -(క్రియాధికారం-8, 146).

- ధ్రువ - కౌతుకబేరముల ఐక్యము ధ్రువార్చనమనబడుతున్నది.

"ధ్రువబేరానురూపం చ కౌతుకం పరికల్పయేత్". -(క్రియాధికారం-3, 21).

- కౌతుకమును ధ్రువబేరము (= మూలవిరాట్టు) నకు అనురూపంగా కల్పించాలి (బేరం= శరీరం; ఆలయసంప్రదాయంలో బేరం, విగ్రహం,

ప్రతిమ, బింబం, మూర్తి, విగ్రహం-ఇవి సమానార్థకాలు). కౌతుకబేరం నుంచి స్నపనబేరం, స్నపనబేరంనుంచి ఔత్సవబేరం వెలసినట్లే, పంచమూర్తి సంప్రదాయంలో ఔత్సవబేరంనుంచి 'బలిబేరం' వెలసింది.

కాశ్యపుని జ్ఞానకాండ ఇట్లా వివరిస్తున్నది: ఆలయంలో పూజార్హవైన మూడు ప్రతిమల మధ్య భేదం ఏదైనా ఉన్నదంటే అది, గృహంలో హోమాదులకు సంబంధించిన త్రేతాగ్నుల మధ్య ఉన్నభేదం వంటిదే (యథైకస్మిన్ గృహే త్రేతాగ్నిం కల్పయతి తథైకస్మిన్ విమానే కౌతుకమౌత్సవమర్చేతి త్రీణి బేరాని కల్పయేత్-అధ్యా. 54, టి.టి.డి. ప్రచురణ-1960. పుట 95). ధ్రువబేరం 'ఔపాసనాగ్ని' వంటిది. ప్రతిమయొక్క వేదిక 'అగ్న్యాయతనము' నకు సంబంధించిన హోమకుండం. ఔపాసనాగ్నినుంచి గార్హపత్య-ఆవహనీయ అగ్నులు వెలిగింపబడునట్లే, ధ్రువబేరంలోని శక్తి, కౌతుక-ఔత్సవబేరములలోకి సంక్రమిస్తుంది.

"యథా గార్హపత్యాదౌ ఆహవనీయాది ష్వగ్నిం ప్రణీయ జుహోతి ।
తథా ధ్రువబేరాత్ కౌతుక బింబాదిషు సమావాహ్యార్చయత్ ॥"
-(కాశ్యపీయ జ్ఞానకాండ)

యజ్ఞాదులందు గార్హపత్యాది అగ్నులనుంచి ఆహవనీయాదికుండములకు అగ్నులను కొనిపోయి, హోమాదులను చేసినట్లే, ధ్రువబేరం (= మూలవిరాట్టు) నుంచి శక్తులను కౌతుబింబాదులందు ఆవాహనంచేసి, అర్చించాలి.

ఒకే దైవానికి అయిదు ప్రతిమలను నిలిపే సంప్రదాయాన్ని హోమాది క్రియలలోని పంచాగ్ని సంప్రదాయంతో లేదా ఒకే శరీరంలోని పంచప్రాణాలతో పోల్చినాడు భృగువు:

"యథా కర్మణ ఏకస్య కల్పితా పంచవహ్నయః ।
యథా చైకశరీరస్య వాయు పంచక కల్పనమ్ ।
తథైవైకవిమానస్య పంచబేరాణి కల్పయేత్ ॥"
-(క్రియాధికారం-9, 7-9)

ఒకే యజ్ఞమునకు దక్షిణాగ్ని గార్హపత్యాగ్ని మున్నగు పంచాగ్నులు ఉన్నట్లే ఒకే శరీరానికి పంచవాయువులు ఉన్నట్లే ఒకే విమానానికి (= ఆలయంలో) పంచబేరములను కల్పించాలి.

భృగువు, మూడు (ధ్రువ-కౌతుక-ఔత్సవ) బేరముల సంప్రదాయాన్ని కూడా గుర్తించి, దానిని త్రేతాగ్ని సంప్రదాయంతో పోల్చినాడు:

"అన్యథా నార్చయేత్ విద్వాన్ స్నాపనౌత్సవకౌతుకాన్ ।
త్రేతాగ్నిరివ కర్తుస్తదేకైకం తత్సమం విదుః ॥"

-(యజ్ఞాధికారం-17, 9).

- విద్వాంసుడు స్నాపన-ఔత్సవ-కౌతుకబేరములను వేర్వేరు విధాలుగా అర్చింపరాదు. ఈ మూడున్నూ త్రేతాగ్నులతో సమానములు. కావున మార్పులు చేయరాదు.

గృహంలో ఒక్క ఔపాసనాగ్నినే నిలుపుకొనటానికి అవకాశమున్నట్లే, అర్చకుడు ఒక్క ధ్రువబేరమును మాత్రమే నిలుపుకొనటానికి అవకాశం ఉన్న దని భృగువు అంగీకరించినాడు. అయితే ఐహికవాంఛలులేని వారికి మాత్రమే ధ్రువబేరార్చన చెప్పబడింది (ధ్రువబేరార్చనం ప్రోక్తం నిరాషీ కర్మ కరిణామ్-7, 11). ఇంక కాముకులైన సంసారాశ్రమిణులకు (= గృహస్థులకు) కౌతుకబేరార్చనమే యుక్తం (సకామానామ్ సముచితం సంసారాశ్రమిణాం ఇదమ్-7, 12).

దైవపూజావిషయంలో నాలుగు లేదా అయిదు ప్రతిమలను నెలకొల్పు కొనటం సంప్రదాయమైనట్లే దైవత్వానికి చతుర్మూర్తిత్వం లేదా పంచమూర్తిత్వం కల్పించటం సంప్రదాయమైనది. ధ్రువబింబం అనేది విష్ణుమూర్తి యొక్క ప్రధానమైన అంశము. విష్ణువుయొక్క తక్కిన నాలుగు అంశములు పూజావిషయంలోనే కాక, తత్త్వలమైన మోక్ష మార్గాన్వేషణ దశలలో కూడా ప్రసక్తములవుతాయి - పురుషుడు, సత్యుడు, అచ్యుతుడు, అనిరుద్ధుడు. ప్రధానము, సమగ్రము అయినదైవం (= ఆదిమూర్తి) గా విష్ణువు భావింపబడితే నాలుగు అంశములు 'వ్యూహములు' (ఇది అర్వాచీనకాలపు పదం) అంటే మోక్షమార్గదశలు అవుతాయి-ఇది ఇందులోని భావన. అట్లాకాక విష్ణువు కూడా తక్కిన నలుగురితో కలిపి లెక్కింపబడితే, అది పంచమూర్తి భావన అవుతుంది- ఈ భావనే ప్రాచుర్యం వహించింది. మరీచి యొక్క విమానార్చనాకల్పం (89వ పటలం) లో ఇట్లా ఉన్నది: ఈ అయిదు మూర్తులు అయిదు ప్రతిమలవలెనే అయిదు హోమాగ్నులతో (సభ్యం, ఆహవనీయం, అన్వాహార్యం, గార్హపత్యం, అవసథ్య), పంచభూతములతో (పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం), పంచవాయువులతో (ప్రాణం,

అపానం, వ్యానం, ఉదానం, సమానం) సంపదిస్తున్నవి.

మహాభారతం (అశ్వమేధికపర్వం-అనుగీతభాగం-వైష్ణవధర్మం-నకులోపాఖ్యానం-9- నృసింహవాజపేయి వ్యాఖ్యానుసారంగా) పంచమూర్తి విభజనను పేర్కొని, ఇది పాంచరాత్ర సంప్రదాయంలోని చతుర్మూర్తి (వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు) భావనకంటె భిన్నమని వివరించినది. "దైవత్వాన్ని ఏ విధంగా ఆరాధించాలి, ఈ విషయంలో వైఖానసుల, పాంచరాత్రికుల అభిప్రాయాలేమిటి?" అని యుధిష్ఠిరుడు అడిగినప్పుడు శ్రీకృష్ణుడు ఇట్లా సమాధానం చెప్పినాడు:

"శ్రుణు పాండవ! తత్సర్వమర్చనాక్రమమాత్మనః ।
స్థండిలే పద్మకం కృత్వా సాష్టపత్రం సకర్ణికమ్ ॥
అష్టాక్షర విధానేనాథవా ద్వాదశాక్షరైః ।
వైదికై రథవా మంత్రైః మమసూక్తేన వా పునః ॥
స్థాపితం మాం తతస్తస్మిన్నర్చయీత విచక్షణః ।
విష్ణుంచ పురుషం సత్య మచ్యుతం చ యుధిష్ఠిర ॥
అనిరుద్ధం చ మాం ప్రాహుర్వైఖానసవిదో జనాః ।
అన్యేత్వేవం విజానంతి మాం రాజన్ పాంచరాత్రికాః ॥
వాసుదేవం చ రాజేంద్ర సంకర్షణమథాపివా ।
ప్రద్యుమ్నం చానిరుద్ధం చ చతుర్మూర్తిం ప్రచక్షతే ॥
తాశ్చాన్యాశ్చ రాజేంద్ర సంజ్ఞాభేదేన మూర్తయః ।
విద్ధ్యనర్థాంతరా ఏవం మామేవం చార్చయేత్ బుధః ॥"
-(ప్రకీర్ణకాధికారం-33, 18-20 తో పోల్చిచూడదగును).

భవంతి మూర్తయ స్తస్మాచ్చతస్రో విష్ణుమైః విజైః ।
చాతురాత్మ్యాదాదిమూర్తే శ్చతస్ర స్తత్ర మూర్తయః ॥
విష్ణుశ్చైవ మహావిష్ణుః సదావిష్ణు రితిక్రమాత్ ।
వ్యాపినారాయణ ఇతి తన్నామాని తతఃక్రమాత్ ॥
విష్ణోరంశస్తు పురుషో మహావిష్ణోస్తు సత్యకః ।
సదావిష్ణో రచ్యుతః స్యాత్ వ్యాపినోఽంశో ఽనిరుద్ధకః ॥
ధర్మాదిభి ర్భహ్మసుతై శ్చతుర్ధా భేద ఈరితః ॥

-ఓ పాండవ! (యుధిష్ఠిర!) నన్ను అర్చించే క్రమం సర్వం చెబుతాను

విను. స్థండిలమందు, కర్ణికలతో కూడిన అష్టదళ పద్మాన్ని చిత్రించాలి. విచక్షణులు, దానిమీద అష్టాక్షర విధానంతో లేదా ద్వాదశాక్షర విధానంతో లేదా వైదికమంత్రాలతో లేదా నా (= విష్ణు) సూక్తంతో నన్ను స్థాపించి, అర్చించాలి. ఓ యుధిష్ఠిరా! విష్ణువు, పురుషుడు, సత్యస్వరూపుడు, అచ్యుతుడు, అనిరుద్ధుడు-అని వైఖానసవిదులు నన్ను పేర్కొంటారు. ఇంక పాంచరాత్రికులు నన్ను వేరువిధంగా, అంటే-వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అని చతుర్మూర్తిగా పేర్కొంటారు. ఇంకా ఇతరులు అనేక సంజ్ఞలతో పిలుస్తారు. అయితే ఈ మూర్తులు అన్నీ అనర్థాంతరములు (అర్థభేదం లేనివి) అని తెలిసి బుధుడు నన్నే అర్చించాలి.

-"విషయభేదం చేత నామూర్తులు నాలుగు అవుతున్నాయి"; అంటే ఆదిమూర్తి యొక్క చాతురాత్మ్యం చేత నాలుగుమూర్తులు ఏర్పడుతున్నవి-విష్ణువు, మహావిష్ణువు, సదావిష్ణువు, వ్యాపి అయిన నారాయణుడు.విష్ణువు యొక్క అంశమే పురుషుడు. మహావిష్ణువుయొక్క అంశమే సత్యకుడు. సదావిష్ణువు యొక్క అంశమే అచ్యుతుడు. వ్యాపియొక్క అంశమే అని రుద్ధుడు.ధర్మం మున్నగు బ్రహ్మగుణములు కారణంగా, ఇట్లా నాలుగు భేదాలు చెప్పబడినవి.

కాగా, వైఖానసుల పంచమూర్తి సంప్రదాయం చాలా ప్రాచీనమైనదని తెలియవస్తున్నది. కాని, వైఖానస-పాంచరాత్రిక భావనలు భేదములు లేనివి (= అనర్థాంతరములు) అని మహాభారతం పేర్కొన్నది-వైఖానసశాస్త్ర రచయిత అయిన శ్రీనివాసమఖి పై మహాభారత శ్లోకాలను వైఖానసగృహ్య సూత్రం (దశవిధహేతు నిరూపణం) మీది తాత్పర్యచింతామణి వ్యాఖ్యలో ఆదరబుద్ధితో ఉద్ధరించినప్పటికీ కూడా-సమర్థనీయం కాజాలదు (అయితే మహాభారత శ్లోకాలలోని చివరి శ్లోకాన్ని మాత్రం అతడు పేర్కొనలేదు).

వైఖానసులకు ప్రత్యేకమైన భావనను, సంక్షిప్తంగా ఇట్లా పేర్కొనవచ్చు: ఐహికదుఃఖబంధముల నుంచి విముక్తిపొంది, మోక్షమును సాధించటానికి ప్రతిమార్చనమే రాజమార్గం. పరమాత్మ అయిన విష్ణువుయొక్క అనుభూతిని జీవాత్మ స్వయంగా పొందటమే మోక్షం.

> "తదారాధనేన సంసారార్ణవనిమగ్నో జీవాత్మా
> పరమాత్మానం నారాయణం పశ్యతి. నిత్యం గృహే
> దేవాయతనే వా భక్త్యా భగవంతం నారాయణ మర్చయేత్
> తత్ విష్ణోః పరమం పదం గచ్ఛతీతి విజ్ఞాయతే. "

-(వైఖానసకల్పసూత్రంలో).

-ఆ ఆరాధనవల్ల సంసారసాగర నిమగ్నమైన జీవాత్మ పరమాత్మ అయిన నారాయణుని దర్శించగలదు. గృహమందు లేదా దేవాలయంలో భక్తితో, భగవంతుడైన నారాయణుని నిత్యం అర్చించాలి; అట్లా అర్చించితే, విష్ణువు యొక్క పరమపదం తప్పక చేకూరగలదని వైఖానసకల్పసూత్రం బోధిస్తున్నది.

ఐహికబంధములనుంచి విముక్తిపొందిన జీవాత్మ, నాలుగు క్రమదశలలో విష్ణులోకం పొందుతుంది (ఇది వైష్ణవానందం). ఈ దశలు విష్ణులోక మార్గంలోని మజిలీల వంటివి. ఇందులో తొలిదశ 'ఆమోదం'. ఇక్కడ పరమాత్మకు 'విష్ణువు' అని పేరు. ఈదశలో జీవాత్మ పరమాత్మ ఒకేలో కంలో ఉంటారు (ఇది సాలోక్యం). తరువాతి దశ 'ప్రమోదం'. ఇక్కడ మహావిష్ణువు పరమాత్మ; ఈదశలో జీవాత్మ, పరమాత్మకు అతిసన్నిహితంగా ఉంటుంది (ఇది సామీప్యం). దీనిపైదశ 'సమ్మోదం'. ఇచ్చట పరమాత్మ సదావిష్ణువు. ఈ దశలో జీవాత్మ, పరమాత్మతో సమానమైన రూపం పొందుతుంది (ఇది సారూప్యం). ఇంక అత్యున్నతమైన దశ 'వైకుంఠం'. ఇచ్చట వ్యాపి నారాయణుడు పరమాత్మ. ఈ దశలో జీవాత్మ పరమాత్మలో విలీనమవుతుంది (ఇది సాయుజ్యం).

విష్ణువుయొక్క నాలుగు అంశములు-విష్ణులోకప్రాప్తిలోని నాలుగు దశలకు సంబంధించి- క్రమంగా పురుషుడు, సత్యకుడు, అచ్యుతుడు, అనిరుద్ధుడు- అనే పేర్లుపొందాయి. ఈ అంశములు నాలుగు-ఆయాదశలలోని ప్రధాన దైవత్వ గుణములను, అచ్చట జీవాత్మ పొందే అనుభూతులను వేర్వేరుగా తెలుపుచున్నవి- తొలిదశలో ధర్మం, రెండవదశలో జ్ఞానం, మూడవదశలో ఐశ్వర్యం, నాలుగవదశలో వైరాగ్యం. విష్ణులోక మార్గంలోని నాలుగుమజి లీలు బ్రహ్మముయొక్క నాలుగు పదములుగా చెప్పబడినవి. పరబ్రహ్మములో ఆమోదం ఒకవంతు. ప్రమోదం సగపాలు. సమ్మోదం మూడువంతులు. ఇంక వైకుంఠం పూర్తిగా పరబ్రహ్మమే. ఇది విష్ణువుయొక్క 'పరమపదం'. విష్ణువు, తొలిమజిలీనుంచి, మూడు పదములుదాటినప్పుడే దీనిని చేరుకొనటం జరుగుతుంది (త్రీణిపదా విచక్రమే విష్ణుః).

వైఖానసపద్ధతి ఆలయార్చనలో, విష్ణువుయొక్క నాలుగు అంశములు, విష్ణువు చుట్టూరా సన్నిహిత ఆవరణలో నాలుగు మూర్తులుగా దర్శన మిస్తాయి. ధ్రువబేరానికి పురుషుడు తూర్పున, సత్యకుడు దక్షిణమున, అచ్యుతుడు పశ్చిమమున, అనిరుద్ధుడు ఉత్తరమున ఉంటారు. వారి ఆకృతులు

కూడా వేర్వేరుగా రూపొందింపబడినవి. మధ్యలోఉన్న విష్ణువు శ్యామవర్ణుడు, పీతాంబరుడు, శుభప్రదములైన సర్వాభరణ భూషితుడు, శ్రీవత్సలాంఛనుడు (కుడి ఎదమీద). ఆయన చతుర్భుజుడు-పై రెండుచేతులలో శంఖం, చక్రం ఉంటాయి. సహజములైన క్రింది రెండు చేతులలో -కుడిచేయి అభయహస్తం, ఎడంచేయి కటిమీద ఉంటుంది (కట్యవలంబితం). ఆయనకు కుడిప్రక్కన శ్రీదేవి, ఎడం ప్రక్కన భూదేవి ఉంటారు. తక్కిన అంశములు కూడా చతుర్భుజములతో, శంఖ-చక్రములతో ఉంటాయి.

విష్ణువునకు తూర్పున ఉన్న 'పురుషుడు' ప్రాఙ్ముఖుడు, శుభ్రవర్ణుడు, పీతాంబరుడు, శ్రీ -భూ (= మేదినీ) సహితుడు. విష్ణువునకు దక్షిణ దిశలో ఉన్న 'సత్యకుడు' దక్షిణాభిముఖుడు, నీలవర్ణుడు, రక్తాంబరుడు, ధృతి-పౌష్టిసంయుతుడు. విష్ణువునకు పశ్చిమదిశలో ఉన్న 'అచ్యుతుడు' పశ్చిమాభిముఖుడు, కనకవర్ణుడు, నీలాంబరుడు, పవిత్ర- క్షోణీసంయుతుడు. ఇంక విష్ణువునకు ఉత్తరదిశలో ఉన్న అనిరుద్ధుడు ఉత్తరాభిముఖుడు. పగడపు రంగులో ఉంటాడు. అయిదు లేదా ఏడు లేదా తొమ్మిది పడగలుకల పాముచుట్ట మీద ఉంటాడు. ప్రమోదదాయిని, మహీ-వీరు ఆయన దేవేరులు.

పైనాలుగు రూపాలు, విష్ణువునకు ప్రతీక అయిన ధ్రువబింబం యొక్క నాలుగు అంశములతో సంపదిస్తాయి-పురుషుడు కౌతుకబేరంతో, సత్యకుడు ఔత్సవబేరంతో, అచ్యుతుడు స్నపన బేరంతో, అనిరుద్ధుడు బలి బేరంతో. అయితే అసలు పూజాసమయంలో అనిరుద్ధుడు ఉండడు. కౌతుక-ఔత్సవ-స్నపన-బలిబేరములు-క్రమంగా విష్ణువుకు, పురుషునకు, సత్యకునకు, అచ్యుతునకు ప్రాతినిధ్యం వహిస్తాయి. ఇంక అనిరుద్ధుడు- బలివేదిక మీద, అగ్నికుండంలో, విమానంలో, అర్చకునిలో ఉంటాడని విశ్వసిస్తారు.

విష్ణువు - పంచమూర్తిగా, పంచప్రతిమారూపుడుగా, దేవీయుతుడుగా, పరివారదేవతాయుతుడుగా తలంచబడినప్పటికీ, వైఖానసులదృష్టి, క్రింది విధంగా, ఆదర్శప్రాయమైనది.

"సర్వాధారం సనాతన మప్రేయ మచింత్యం నిర్గుణం నిష్కలం క్షీరే సర్పిః, తిలేతైలం, పుష్పేగంధం, ఫలేరసం, కాష్ఠే అగ్నిమివ సర్వవ్యాపినం పరమాత్మానం మనసా సంకల్ప్య అవాహయేత్. ఆవాహనముద్వాసనం విష్ణోరయుక్త మితి, యథా హ్యేరణ్యాం వ్యాప్తే వహ్ని ర్మథనాత్సన్నిహితో భవతి తథైవ ధ్యానమథనేన భక్తస్యహృది విష్ణుః సన్నిహితో భవతి".

-(విమానార్చనాకల్పం-31వ పటలం).

-సర్వాధారం, సనాతనం, అప్రమేయం, అచింత్యం, నిర్గుణం, నిష్కలం అయిన పరమాత్మ- క్షీరంలో నేయివలె, తిలలలో తైలం వలె, పుష్పంలో గంధంవలె, ఫలంలో రుచివలె, కాష్ఠంలో అగ్నివలె సర్వవ్యాపిగా ఉంటాడు. అట్టి పరమాత్మను, మనసా సంకల్పించి, ఆవాహనం చేయాలి. విష్ణువును ఆవాహనంచేసి, మరల ఉద్వాసన చెప్పటం అయుక్తం (అనే శంక కలుగవచ్చు). 'అరణి'లో వ్యాపించి ఉన్న వహ్ని, మథనంవల్ల సన్నిహితం (లభ్యం) అవుతుంది. అట్లాగే ధ్యానమథనంవల్ల, భక్తుని హృదయంలో విష్ణువు సన్నిహితుడు అవుతాడు (అప్రమేయం = ప్రత్యక్షాది ప్రమాణములతో నిరూపించుటకు వీలుకానిది).

"కాష్ఠఽగ్ని ర్మథనాదుజ్జ్వలన్నివ నిష్కలాఽత్మకో ।
విష్ణు ర్ధ్యానమథనేన భక్త్యా సంకల్పనా త్సకలో భవతి ॥"

-(విమానార్చనాకల్పం-80వ పటలం).

-మథనంవల్ల కాష్ఠమందు అగ్ని ప్రజ్వలించునట్లే, నిష్కలాత్మకుడైన విష్ణువు, ధ్యానం అనే మథనం వల్ల, భక్తివల్ల, సంకల్పబలంవల్ల, సకలరూపంలో గోచరిస్తాడు.

ధ్యానం కుదరటం కోసమే ప్రతిమారాధనం అవశ్యకం. ఋగ్విధానకర్తఅయిన శౌనకుడు ఇట్లా ఉపదేశించాడు:

"సురూపాం ప్రతిమాం విష్ణోః ప్రసన్నవదనేక్షణాం ।
కృత్వాత్మనః ప్రీతికరీం సువర్ణరజతాదిభిః ॥
తామర్చయేత్తాం ప్రణమేత్తాం భజేత్తాం విచింతయేత్ ।
విశత్యపాస్తదోషస్తు తామేవ బ్రహ్మరూపిణీమ్ ॥"

-సురూపము, ప్రసన్నవదనము, ప్రసన్నములైన చూపులుకల ప్రతిమను సువర్ణం లేదా రజితం లేదా ఇతరములతో తయారుచేయించుకోవాలి; అట్లా తయారైన ప్రతిమ, మనస్సునకు ప్రీతికరం కావాలి. అటువంటి ప్రతిమను అర్చించాలి. దానికి ప్రణమిల్లాలి. దానిని భజించాలి, ధ్యానించాలి. అప్పుడు దోషరహితుడైన భక్తుడు బ్రహ్మరూపమైన అప్రతిమలో ప్రవేశిస్తాడు (ఈ శ్లోక భాగం 'భారతంలోనిది' అని, వైఖానసగృహ్యసూత్ర వ్యాఖ్య అయిన తాత్పర్యచింతామణిలో, శ్రీనివాసమఖి వేర్కొన్నాడు- 4,10 ; సంపుటం 2, పుట 620).

# అధ్యాయం-3

## వైఖానస-ఆగమం

మరీచి రచించిన 'విమానార్చనాకల్పం' (100 పటలం) చివరి భాగంలో ఇట్లా ఉంది:

"విష్ణువు, పురుష-సత్య-అచ్యుత-అనిరుద్ధ రూపాలకు బీజభూతంకావట మేకాక, తన వేదప్రకృతిని విఖనసమునిగా పరిణమింపజేసినాడు. పురుషుడు మున్నగువారు నలుగురు విష్ణువు యొక్క రూపాంతరాలు అయినట్లే, భృగువు-మరీచి-అత్రి-కాశ్యపుడు అనే నలుగురు తొలిముని అయిన విఖనసుని యొక్క రూపాంతరాలు. సృష్టి ప్రారంభంలోనే విష్ణువు, విఖనసమునికి వైఖానసశాస్త్రం బోధించినాడు; తరువాతి కాలంలో అదే 'వైఖానస సూత్రం' గా ప్రసిద్ధిపొందింది. ఈ వైఖానససూత్రం సర్వవేదాలసారం. ఆ వేదాలు బోధించే 'గుహ్యసిద్ధాంత సముపేతం. తరువాత, విఖనసముని ఈ శాస్త్రాన్ని భృగువుమున్నగు నలుగురు మునులకు బోధించినాడు. విఖనసముని బోధించిన శాస్త్రం ఒకకోటి ఏభైవేల 'గ్రంథముల' సంపుటి ('గ్రంథం' అనేది పాదానికి ఎనిమిది అక్షరాలు ఉండే అనుష్టుప్ ఛందస్సులోని ఒక వృత్తం). పిమ్మట ఈ నలుగురు మునులు వేర్వేరు గ్రంథాలు రచించారు. భృగువు రచన 'అధికారములు', మరీచి రచన 'సంహితలు', అత్రి రచన 'తంత్రములు', కాశ్యపుని రచన 'కాండములు' అనే పేర్లతో ప్రసిద్ధిచెందినవి. ఈ నాలుగు రచనల వైశాల్యం నాలుగులక్షలగ్రంథములు".

అసలు, విష్ణువు విఖనసునకు బోధించిన లేదా విఖనసుడు భృగువు మున్నగు వారికి బోధించిన శాస్త్రస్వరూప స్వభావాలు ఎట్టివో తెలుసు కొనటం సాధ్యంకాదు. మనకు లభించిన శాస్త్రం (అంటే కొన్ని 'గ్రంథము'ల సంపుటి) మాత్రం సూత్రాలరూపంలో ఉన్న, విఖనసముని రచనగా ప్రసిద్ధి పొందిన, పరిష్కరింపబడిన 'వైఖానసకల్పసూత్రం'. ఇది సంకలితమైన కాలాన్ని నిర్ణయించి చెప్పటం కూడా సాధ్యంకాదు. కాని, ఇది చాలా ప్రాచీనమైన శాస్త్రం అనటంలో సందేహంలేదు. అంతేకాదు, 'కల్పము'నకు సంబంధించిన సర్వవిషయాలను (శ్రౌత-స్మార్త లేదా గృహ్య-ధర్మ- శుల్బ సూత్రాలను) వివరించే సమగ్రశాస్త్రమిది. తరువాతికాలంలో వెలసిన వైఖానసగ్రంథాలకు, నిర్దేశక సూత్రాలకు ఇది ఆధారమని అందరూ

అంగీకరించారు. విఖనసముని యొక్క నలుగురు శిష్యులు రచించిన గ్రంథాలు సమగ్రరూపంలో మనకు లభించకపోవటం విచారకరం. మరీచి, భృగువు రచనలుగా పేరు పొందిన పద్య-గద్య గ్రంథాలను (ఉదా: . మరీచి యొక్క 'విమానార్చనాకల్పం', భృగువుయొక్క 'క్రియాధికారం', 'ప్రకీర్ణాధికారం') వైఖానసులు ఆదరంతో చదువుతున్నారు. తరచుగా ఇవి ముద్రణ భాగ్యం పొందుతున్నవి. ఇంక, చాలావరకు, తక్కినగ్రంథాల ఉనికి, ఆగ్రంథాలనుంచి నృసింహ వాజపేయయాజీ, శ్రీనివాసమఖి వంటి వ్యాఖ్యాతలు, టీకాకారులు ఉద్ధరించిన భాగాలవల్లనే-తెలియవస్తున్నది.

విఖనసముని కల్పసూత్రాలే, తరువాతి కాలంలో వెలసిన వైఖానస రచనలకు ప్రేరకములనే విశ్వాసం సత్యసమ్మతమైనదే. కాగా, విఖనసముని రచన అయిన సూత్రాలకు, ఆయన శిష్యుల రచనలకు భేదం ఉన్నది.

"మూలమస్యాపి శాస్త్రస్య సార్ధకోటిప్రమాణతః ।
ఉపాదిశత్స భగవాన్ అస్మభ్యం నైమిశే వనే ॥
ఇతి సంక్షేపతః ప్రోక్తం మహత్వం సూత్రశాస్త్రయోః ।"
-(ప్రకీర్ణాధికారం-30, 93-94)

-ఈ శాస్త్రంయొక్క మూలం కోటిన్నరగ్రంథముల ప్రమాణంకలది. దీనిని భగవానుడగు విఖనసముని నైమిశారణ్యంలో మాకు ఉపదేశించినాడు. సూత్ర-శాస్త్రముల మహత్వం ఇట్లా సంక్షిప్తంగా చెప్పబడింది.

దృక్పథంలోనూ, విశదీకరణలోనూ కల్పసూత్రం ఆగమశాస్త్రంకంటె భిన్నమైనది. వైఖానసభగవచ్ఛాస్త్రం (= ఆగమం) సంకలితమైనప్పుడు-కల్పసూత్రంలో లేని విషయాలను వివరించటం, కల్పసూత్రంలో కేవలం సూచనామాత్రంగా ఉన్న విషయాలను వివరించటం-ఇవి దాని ప్రధాన లక్ష్యాలు. ఆగమానికి ఆవశ్యకములైన విషయాలను వివరించవలసి ఉండటం చేత భృగువు మున్నగు నలుగురు మునులు, తమగురువైన విఖనసముని బోధించిన కల్పసూత్రానికి తోడుగా శాస్త్రగ్రంథాలను రచించారు. ఉదాహరణకు-కల్పసూత్రరచన తరువాతి కాలంలో వెలసిన వైఖానస సాహిత్యమంతా విఖనసముని యొక్క సూత్రగ్రంథంలోని క్రింది సూచన ప్రకారం ఉద్భవించినదే:

"తం యజ్ఞపురుషం ధ్యాయన్, పురుషసూక్తేన సంస్తూయ, ప్రణామం కుర్యాత్, యజ్ఞేషు విహీనం తత్ సంపూర్ణం భవతీతి శ్రుతిః. ద్విజాతిరతంద్రితో నిత్యం గృహే దేవాయతనే వా భక్త్యా భగవంతం నారాయణ

మర్చయేత్తద్విష్ణోః పరమం పదం గచ్ఛతీతి విజ్ఞాయతే."

-(వైఖానసగృహ్యసూత్రం-4, 12, 8-11).

-యజ్ఞంలో ఏవేని లోపాలు జరిగితే, ఆ యజ్ఞపురుషుని (= విష్ణువును) మనస్సులో ధ్యానించి, పురుషసూక్తంతో సంస్తుతించి, ప్రణమిల్లితే, ఆ లోపం తొలగి అది సంపూర్ణం అవుతుందని శ్రుతి చెబుతున్నది. అందుచేత, ద్విజులు, ఏమరుపాటులేకుండా గృహంలో లేదా దేవాయతనంలో, భక్తితో, నిత్యం, భగవంతుడైన నారాయణుని అర్చించాలి. అట్లాచేసిన వ్యక్తి విష్ణువు యొక్క పరమపదాన్ని తప్పక చేరుకొంటాడు.

ఈ సందర్భంలో, వ్యాఖ్యాత అయిన నృసింహ వాజపేయయాజీ, ఇట్లా వివరించినాడు: యజ్ఞసమయంలో అగ్నికి ఆహుతులు సమర్పించటం అనేది విగ్రహం వినా, దైవాన్ని అర్చించటమే (ఇది అమూర్తార్చన) అవుతుంది. విష్ణువును ప్రతిమారూపంలో అర్చించటం, లేదా సాకారంగా ధ్యానించటంవల్ల కలిగే సత్ఫలమే యజ్ఞకర్మవల్లకూడా లభిస్తుంది. నిజానికి దైవత్వం అనేది సార్వకాలికం, చైతన్యవంతం, ఆనందరూపం. ఆ దైవాన్ని ప్రతిమారాధన ద్వారా, లేదా యజ్ఞకర్మ ద్వారా తప్పకపొందవచ్చు.

"అథాగ్నౌ నిత్యహోమాంతే విష్ణోః నిత్యార్చా సర్వదేవార్చా భవతి".

-(వైఖానసగృహ్యసూత్రం-4, 10, 1).

-నిత్యంచేసే హోమంచేసిన తరువాత, విష్ణువును నిత్యం అర్చించితే సర్వదేవతలను అర్చించినట్లే అవుతుంది.

దేవతలలో అగ్ని కనిష్ఠుడు; ఆయన దేవతలయొక్క దూతమాత్రమే. ఇంక విష్ణువు దేవతలలో జ్యేష్ఠుడు. ఆయనయే సాక్షాత్తు యజ్ఞపురుషుడు; సకలజగత్తునకు అంతర్యామి. ద్విజుడు, తనగృహంలో నిత్యం హోమకార్యం నిర్వర్తించిన తరువాత విష్ణువును అర్చించాలి. ఇట్లా చేయటంవల్ల దైవత్వం యొక్క కనిష్ఠత్వం, జ్యేష్ఠత్వం అనే రెండుతత్త్వాలను పరిగ్రహించినట్లు అవుతుంది. అంతేకాదు, ఈ అర్చన సర్వప్రాయశ్చిత్తకరము, ఐహికాముష్మిక ఫలసిద్ధిదము కూడా అవుతుందని వ్యాఖ్యాత పేర్కొన్నాడు. శ్రౌతసూత్రాలలో నిర్దేశింపబడిన మహాయజ్ఞాలు చేయవలసిన అవసరమే లేదు ఈ అర్చనచేస్తే. అంటే యజ్ఞాదులకంటె ప్రతిమార్చనకు గల ప్రాశస్త్యాన్ని ఈ అంశం నిరూపిస్తున్నది. అంతేకాదు, ఆచరణ-క్రమంగా, త్వరగా అప్రస్తుతం

అసాధ్యం అవుతున్న కల్పసూత్రం యొక్క పరిధినుంచి భగవచ్ఛాస్త్రం (= ఆగమం) వెలయటానికి గల కారణాన్ని సమర్థిస్తున్నది. ఇంకా ఇట్లా నిర్దేశించినాడు:

"తస్మాత్ గృహే పరమం విష్ణుం ప్రతిష్ఠాప్య, సాయం ప్రాతర్హోమాంతేఽర్చయతి."

(వైఖానసగృహ్యసూత్రం-4, 10, 3)

-కావున, గృహంలో పరమదైవం అయిన విష్ణువును ప్రతిష్ఠించి, ఉదయ-సాయం సంధ్యలలో హోమంపూర్తి అయిన తరువాత, అర్చించాలి.

మతానికి, సమాజానికి సంబంధించిన ప్రవర్తన నియమావళిని వివరించే గృహ్యసూత్రంలో-గృహంలో విష్ణుప్రతిమను అర్చించటం అనే అంశం ప్రాధాన్యం వహించటం సహజమే. పైసూత్రంలోని 'గృహే' (= ఇంటిలో) అనే దానిని 'స్వగృహే' (= స్వగృహంలో) అని వివరించినాడు వ్యాఖ్యాత. ఇంతకు ముందు గృహంలో లేదా దేవాలయంలో అర్చన చేయవచ్చునని చెప్పినప్పటికీ 'స్వగృహం' అనటంచేత పదిమందీ అర్చించటానికి అవకాశం ఉన్నదేవాలయం పరిగణనలోనికి రాదు. కల్పసూత్ర రచననాటికి దేవతలకు పితరులకు కూడా ఆలయాలు వెలసిఉన్నవనటంలో సందేహంలేదు. కాని దేవాలయంలో అర్చన విషయంలో పాటించవలసిన విధులను కల్పసూత్రం నిర్దేశింపలేదు. వైఖానసగృహ్యసూత్రం (4, 2) లో నిత్యార్చనకు సంబంధించిన భాగంలో గృహమందలి అర్చనమాత్రమే నిర్దేశింపబడింది. అయితే ఈ అర్చన హోమాంతమందు విధిగా జరుగుతుందే కాని, హోమానికి ప్రత్యామ్నాయం మాత్రంకాదు.

కాగా, ఆగమం ఆవిర్భవించటానికి దారితీసిన పరిస్థితులను ఇప్పుడు సమీక్షింపగలము. యజ్ఞాదులు (అధికభాగం యజుర్వేదానికి సంబంధించినవి), ఆచారకాండ (అధికభాగం బ్రాహ్మణములకు సంబంధించినవి) బహుళ ప్రచారంలో ఉన్న సమయంలో కల్పసూత్రసముదాయం రూపుదిద్దుకొన్నది. కల్పసూత్రంలోని శ్రౌత-గృహ్యసూత్రాలకు అనుషంగికమైన 'ధర్మసూత్రం'-సమాజం ద్విజలతో, ద్విజులు కాని వారితో కూడిఉన్నదని గుర్తించింది. యజ్ఞాదులు, ఆచారకాండ ద్విజాతికి సంబంధించినవి కావటంచేత శ్రౌత-గృహ్యసూత్రాలు సహజంగా ఈ ద్విజులకే అవశ్యకములు అవుతున్నవి. కాని వేదవిహితములైన యజ్ఞాదులకాలం వేగంగా అంతరిస్తూ ఉండటంచేత

కల్పసూత్రంలోని శ్రౌతభాగం వ్యవహారంనుంచి క్రమంగా తొలగిపోసాగింది.

అయితే యజ్ఞయాగాదులకు సంబంధించిన వేదసంస్కృతి అంతరించి పోకుండా ఉండటానికి ఒకప్రక్క ప్రయత్నం జరుగుతున్నప్పటికీ, నాడు శ్రుతుల మీదకంటె స్మృతుల మీదనే ఎక్కువ మొగ్గుచూపటం జరిగింది. అందుచేత కల్పసూత్రంలోని గృహ్యసూత్రభాగం, స్మృతులు ఆధారం కావటంచేత తరువాతికాలంలో 'స్మార్త' భాగంగా ప్రసిద్ధికెక్కి, సహజంగానే ప్రాముఖ్యం వహించింది. సుమారు 20 కల్పసూత్రాలు, అధికభాగం అసమగ్రాలుగా ఉన్నప్పటికీ, నేడు లభిస్తున్నవి. ఇందులో, పెక్కింటిలో శ్రౌతసూత్ర భాగాలులేవు. ఒకవేళ తొలుత ఉన్నప్పటికీ, తరవాతి కాలంలో అవి అంత రించిపోయి ఉంటాయి. మనకు లభించిన కల్పసూత్రాలలో- కాత్యాయన- బోధాయన కల్పసూత్రాలు రెండింటిలో తప్ప తక్కిన వాటిల్లో శుల్బసూ త్రాలు లేనే లేవు (యజ్ఞాదులకు సంబంధించిన వేదికాదులనిర్మాణం, వాటికొలతలు, యజ్ఞపరికరాలు మున్నగు వాటినిగూర్చి శుల్బసూత్రాలు ప్రధానంగా వివరిస్తాయి). ఇంక మనకు లభించిన కల్పసూత్రాలలో, అయిదు తప్ప, తక్కినవన్నీ గృహ్యసూత్రాలను విపులంగా వివరించినవి.

యజ్ఞం లేదా యాగం చేయటం అంటే తనకున్న సర్వస్వాన్ని దైవానికి (ంకితం చేయటం అనే క్రొత్త అర్థం ప్రచారంలోకి వచ్చింది (దేవతానాం ఉద్దిశ్య ద్రవ్యత్యాగః యాగః = దైవమును ఉద్దేశించి ద్రవ్యాన్ని త్యాగం చేయటం యజ్ఞం). పూర్వకాలంలో ఆగ్రయనం, అశ్వమేధం, వాజపేయం, సోమంవంటి గొప్ప యజ్ఞాలు చేసే సమయంలో ద్విజుడైన గృహస్థుడు పంచమహాయజ్ఞాలు నిర్వహించాలని గృహ్యసూత్రాలు నిర్దేశిస్తున్నవి. ఇందుకు ఆధారం తైత్తిరీయ-ఆరణ్యకం (2వ ప్రపాఠకం-10వ అనువాకం):

"పంచవా ఏతే మహాయజ్ఞాః సతతి ప్రతాయంతే సతతి సంతిష్ఠంతే- దేవయజ్ఞః, పిత్రుయజ్ఞో, భూతయజ్ఞో, మనుష్యయజ్ఞో, బ్రహ్మయజ్ఞ ఇతి."

-(1) బ్రహ్మయజ్ఞం, (2) దేవయజ్ఞం, (3) పిత్రుయజ్ఞం, (4) మనుష్యయజ్ఞం, (5) భూతయజ్ఞం - ఈ అయిదు పంచమహాయజ్ఞాలు. ఇవి ఎల్లప్పూడూ ఉంటాయి. విస్తరిస్తూ ఉంటాయి.

అయితే, నిజానికి, ఈ పంచయజ్ఞాలు, వేదవిహితములైన యజ్ఞముల వంటివికావు.'తనకున్నది దానంచేయటం' అనే ముఖ్యభావనకు సంబంధించి, దినచర్యలో భాగంగా రూపొందిన ఈ ప్రక్రియలు, చివరకు, నిత్యకర్మకాండగా

స్థిరపడినవి.

1. దేవయజ్ఞం: అగ్నిహోత్రునకు ఆహుతులను అర్పించటం దేవయజ్ఞం అవుతుంది. పూర్వం, యజ్ఞాలలో అనేకవస్తువులు, తినుబండారాలు (= పురోడాశం మొ.) వేదమంత్రసహితంగా అగ్నిలో హోమం చేయబడేవి. కాని, అగ్నిహోత్రునకు ఒక్క సమిధను అర్పించినా అది దేవయజ్ఞం అవుతుంది. ఇంక ఏ విధమైన కర్మకాండ దీనికి లేదు (యద్ అగ్నౌ జుహోత్యపి సమిధం తద్ దేవయజ్ఞః సంతిష్ఠతే).

2. పితృయజ్ఞం: 'స్వధా' కారంతో పితరులకు జలాన్ని అర్పించటమే పితృయజ్ఞం (యత్ పితృభ్యః స్వధా కరోత్యపస్ తత్).

3. భూతయజ్ఞం: 'వైశ్వదేవబలి' పూర్తి అయిన తరువాత మధ్యాహ్నం తాను భుజించటానికి ముందు, గృహస్థుడు కాకి వంటి పక్షులకు ఆహారం సమర్పించటం భూతయజ్ఞం (యత్ భూతేభ్యో బలిం హరతి తత్).

4. మనుష్యయజ్ఞం: పండితులు, అతిథులు, అభ్యాగతులు, పేదలు-ఇటువంటివారితో కలిసి భుజించటం మనుష్యయజ్ఞం (యద్ బ్రాహ్మణా దిభ్యో అన్నం దదాతి తత్).

5. బ్రహ్మయజ్ఞం: స్వశాఖకు సంబంధించిన వేదభాగాన్ని అధ్యయనం చేయటం (= స్వాధ్యాయం) లేదా పఠించటం బ్రహ్మయజ్ఞం (యత్ స్వాధ్యాయం అధియీతైకం అపి ఋచం యజుస్ సామవా తత్). తనకు సంబంధించిన వేదశాఖనంతటినీ శ్రద్ధతో పరిశీలనగా చదవటం 'స్వాధ్యాయం' అవుతుంది. అయితే ఈ యజ్ఞానికి సంబంధించినంత వరకు ఒక్క వేద మంత్రాన్ని అధ్యయనం చేసినా, పఠించినా చాలును.

గృహస్థుడు నెరవేర్చవలసిన ఈ పంచమహాయజ్ఞాలు క్రతుకలాపదృష్టితో కంటె సమాజదృష్టితో నిర్దేశింపబడినవని చెప్పవచ్చు. శ్రౌతభాగంనుంచి, గృహ్యభాగంమీదకు మొగ్గుప్రబలటం- క్రతుకలాపం తెరమఱుగు అవుతున్నదనీ, ప్రతిమారాధనం ప్రచారం అవుతున్నదనీ- సూచిస్తున్నది.

వేదవిహితములైన యజ్ఞాలు రెండువిధాలు- శ్రౌత (= సోమ-హవిర్) యజ్ఞాలు, గృహ్య (= పాక) యజ్ఞాలు. గృహస్థులు రెండవ విధానాన్నే (అంటే పాకయజ్ఞాలనే) నెరవేర్చాలి. 'ఆహితాగ్నులు' అయితే నిత్యం అగ్నిహోత్రకార్యాన్ని నిర్వహించాలి. ఉదయం సూర్యునకు 'క్షీరనివేదన',

సాయంకాలం అగ్నికి 'హవిర్నివేదన' చేయటం ద్వారా ఈ ఆరాధన సాగు తుంది. సూర్య ప్రతిరూపమే అగ్ని. గార్హపత్యాగ్ని నుంచి ఆహవనీయ, దక్షిణప్రభృతి అగ్నులు వెలిగింపబడిన పిమ్మట వాటి ఆరాధన జరుగు తుంది. గార్హపత్యాగ్ని ధ్రువబింబసమానమయితే, తక్కిన అగ్నులు స్వభావతః విధానతః కౌతుకబేరతుల్యాలు.

ఇంతటితో ప్రతిమారాధన గృహపరిమితులను దాటి, అందరికీ అందు బాటులో ఉండే ప్రదేశాలకు తరలింది. కాగా, కల్పసూత్రాలకు వారసులని చెప్పదగిన భగవచ్ఛాస్త్ర గ్రంథాలలో ప్రతిమారాధనకు సంబంధించిన వివ రాలు-సమగ్రమైన విధివిధానంతో, సమంత్రకంగా ప్రాధాన్యం వహించాయి.

గృహంలో విష్ణువును ఆరాధించాలని నిర్దేశించిన వైఖానసగృహ్యసూత్రం ఆరాధనావిధానాన్ని కూడా సంక్షిప్తంగా వివరించింది.

"షడంగులాదహీనం తద్రూపం కల్పయిత్వా....పూర్వపక్షే పుణ్యేన క్షత్రే ప్రతిష్ఠాం కుర్యాత్".

-పై వివరణలోని మొదటిభాగంలో ప్రతిమయొక్క ఎత్తు ఆరుఅంగు ళాలకు తగ్గరాదనీ, రూపసామ్యంరావాలనీ, తరువాతిభాగంలో శుక్లపక్షంలో శుభనక్షత్రమందు ప్రతిమాప్రతిష్ఠచేయాలనీ- సంక్షిప్తంగా అయినాచెప్పబడినవి.

విష్ణువుయొక్క చతుర్వింశతి మూర్తులలో లేదా దశావతారములలో ఏదో ఒక రూపాన్ని, లేదా విష్ణువుయొక్క ఏ అంశమును అయినా ప్రతిబింబించే ఏదో ఒక రూపాన్ని గ్రహించి, దానిని ప్రతిష్ఠించాలి అని వ్యాఖ్యాత వివరించినాడు. దైవత్వం ఉట్టిపడుతూ, శుభకరమైన దివ్యమంగళ విగ్రహాన్ని శిల్పశాస్త్రానుసారంగా, శిల్పిచేత, చేయించుకోవాలి (దివ్యమంగళవిగ్రహం, శాస్త్రానురోధేన శిల్పశాస్త్రోక్త విధినా కారయిత్వా). కాగా, ప్రతిమారాధనకు ముఖ్యమైనరెండు నిబంధనలున్నవి-1. ఆ ప్రతిమ వైఖానసకల్పసూత్రం నిర్దేశించిన విధంగా ఉండాలి; 2. అటువంటి ప్రతిమ శిల్పశాస్త్రానుసారంగా సిద్ధంకావాలి. ఆగమం ఈ రెండు నిబంధనలను ఏకత్ర సమకూర్చింది. మొదటిది ప్రతిమా రూపకల్పనకు సంబంధించినది. ఇంక రెండవది ప్రతి మారాధనా విధానమునకు సంబంధించినది. ఆగమం ఈ రెండింటిని కలిపి చెప్పటానికి కారణం-ప్రతిమారాధన ఎట్లా చేయాలి? అట్లా చేయటంలోని విశిష్టత ఏమిటి? అనే అంశాలను నిర్దేశించవలసిరావటమే.

గృహ్యసూత్రం క్రిందివిధంగా కూడా నిర్దేశిస్తున్నది:

"నిష్కలం దేవం హృదయాత్ తదాధారే రుక్మాభం రుక్మనేత్రాస్య పాణిపాదం శ్రీవత్సాంకం చతుర్భుజం పీతాంబరధరం శంఖచక్రధరం సౌమ్యం సకలం ధ్యాత్వా ప్రణమేత్"

-(వైఖానసగృహ్యాసూత్రం-4, 10, 2).

-నిష్కలుడు (= తేజోమయుడు, అచింత్యుడు, సచ్చిదానందరూపుడు అని వ్యాఖ్యాత) అయిన దేవుని హృయపద్మమందు ధ్యానించి, తదాధార భూమియందు రుక్మ (= స్వర్ణ) వర్ణుడు, సువర్ణ అస్య-నేత్ర-పాణి-పాదుడు, శ్రీవత్సాంకుడు, చతుర్భుజుడు, శంఖచక్రధరుడు, పీతాంబరుడు, సౌమ్యుడు అయిన సకలుడుగా ధ్యానించి ప్రణమిల్లాలి.

అయితే, దేవుని అర్కమండలవాసిగా, లేదా జలకుంభస్థుడుగా లేదా అర్చామూర్తిగా మాత్రమే అర్చించవచ్చు. దేవుని ప్రతిమారూపంలో అర్చించినప్పుడు, ఆప్రతిమకు మానవాకృతినే- విశిష్టములైన అవయవాలతో-క ల్పించాలి (కలాభిః కరచరణాద్యైః సహవర్తమానం-అని వ్యాఖ్యాత). ధ్యానించి, ప్రణమిల్లాలి అన్నప్పుడు విష్ణువు-పీతాంబరుడు,. చతుర్భుజుడు, సౌమ్యుడుగా ఉండాలి (సౌమ్యుడు అన్నప్పుడు సోమవత్ ప్రియదర్శనః = చల్లని చంద్రుని వలె దర్శనీయుడు అని వ్యాఖ్యాత).

దేవుని ప్రతిమారూపమునేకాక, ధ్యానించే, భావించే, అర్చించే విధానాలను కూడా ఆ గ్రంథం నిర్దేశించింది. తరువాతికాలంలో వెలసిన సూత్రం విష్ణువు యొక్క నాలుగు అంశాలను-ఇదివరకే పేర్కొన్న పురుష-సత్య-అచ్యుత-అనిరుద్ధ రూపాలను-వివరించింది. ఇట్లా గృహ్యాసూత్రగ్రంథం ఆగమగ్రంథానికి మార్గదర్శకమైనది. గృహ్యాసూత్రం నిర్దేశించిన అగ్న్యాధానం, ఆగమం (= వైఖానసభగవచ్ఛాస్త్రం) నిర్దేశించిన దేవాలయంలో ప్రతిమారాధన-వీటిమధ్య భాగవత సంప్రదాయమైన 'క్రియాయోగం' యొక్క తత్త్వం గోచరిస్తున్నది.

'క్రియాయోగం' యొక్క ప్రస్తావన భాగవతంలో ఉన్నది (11 వ స్కంధం-27వ అధ్యా.). 'క్రియాయోగము' ను విశదీకరించవలసినదిగా ఉద్ధవుడు కృష్ణుని ప్రార్థించాడు; దైవార్చనకు పర్యాయపదం క్రియాయోగం.

"క్రియాయోగం సమాచక్ష్వ భవదారాధనం ప్రభో ।
యస్మాత్ త్వాం యథార్చంతి సాత్వతాః సాత్వతర్షభ ॥"

-ఓ సాత్త్వతర్షభ (= ఓ కృష్ణా!) సాత్త్వతులు నిన్ను అర్చించే భగవదారాధన పరమైన క్రియాయోగమును వివరించుము.

ఇంక తక్కిన అధ్యాయమంతా ప్రతిమారాధనకు సంబంధించిన-వేదవిహితవిధుల, తాంత్రికవిధుల, ఈ రెండుమిళితములైన విధుల వివరణముతో కూడి ఉంది. అసలు, ఆవివరణ ప్రారంభంలోనే ఇట్లా ఉంది:

"వైదికస్తాంత్రికో మిశ్ర ఇతి మే త్రివిధో మఖః ।
త్రయాణా మీప్సితేనైవ విధినా మాం సమర్చయేత్ ॥"

-అర్చన మూడువిధాలు-వైదికం, తాంత్రికం, ఈ రెండింటి మిశ్రమం. భక్తుడు, ఈమూడింటినుంచి, తనకు హితమైన విధానమును స్వీకరించి, నన్ను అర్చించవలెను.

విష్ణుపారమ్యాన్ని నిరూపించే 'భాగవతం' ఒకపురాణం; ఆపేరే విష్ణుభక్తునకు కూడా అన్వయమై, అతడు 'భాగవతుడు' అయినాడు. పాంచరాత్రికులవలె వైఖానసులు కూడా ప్రధానంగా భాగవతులు (క్రియాధికారం 30, 136-150 తో సరిచూడవచ్చు). పై గ్రంథంలో చెప్పబడిన వేదవిహిత విధానం వైఖానససంప్రదాయంకాగా, తాంత్రికవిధానం పాంచరాత్రసంప్రదాయాన్ని సూచిస్తున్నది. మరీచిమహర్షి ప్రకారం విష్ణుభక్తులు రెండువిధాలు-వేదసంప్రదాయానుయాయులైన వైఖానసులు, వేదసంప్రదాయానుయాయులు కాని పాంచరాత్రికులు (వైష్ణవం ద్వివిధం-వైఖానసం, పాంచరాత్రం ఇతి; వైఖానసం వైదికం— పాంచరాత్రం తు అవైదికం).

ప్రాచీనకాలంనుంచీ 'భాగవతులు లేదా ఏకాంతినులు' లో వైఖానసులు, పాంచరాత్రికులు అనే విభజన ఉంది. మహాభారతంలో కూడా ఇది నిర్దిష్టమైంది. దైవత్వం పొందటానికి భగవంతుని పట్ల భక్తి లేదా ప్రపత్తి ప్రధానమార్గమని బాగవతులందరూ విశ్వసించినప్పటికీ, ఆ మార్గాన్వేషణలో వైఖానసులకు, పాంచరాత్రికులకు భేదమున్నది. తాత్పర్యచింతామణి (దశవిధహేతునిరూపణ) లో శ్రీనివాసమఖి ఇట్లా పేర్కొన్నాడు: వైఖానసుని దృష్టిలో 'ప్రపత్తి' అనగా, 'ఓమ్' కారసహితంగా పురుషుని తదితర విష్ణురూపాలను నిరంతరం అవాహన చేసి, అర్చించటం- 'ఓమ్' లోని మూడు అక్షరాలు అంటే 'అ'కారం విష్ణువును, 'ఉ' కారం లక్ష్మిని, 'మ' కారం భక్తుని ఏకత్ర సూచిస్తున్నవి. ఇంక పాంచరాత్రికుని దృష్టిలో 'ప్రపత్తి' అనగా భగవంతుని వేదమంత్రరహితంగా, నైమిత్తికంగా అవాహన చేయుటం.

కాగా వైఖానసపద్ధతి వైదికం; పాంచరాత్రపద్ధతి అవైదికం (వేదమంత్రాలు లేని కారణంచేత).

"వైదిక తాంత్రిక భేదేన ప్రపత్తిః ద్వివిధా. ప్రణవపూర్వ కత్వేన పురుషాద్యావాహనాదికం వైదికం. శ్రుత్యంతరే - అకారేణోచ్యతే విష్ణుః సర్వలోకేశ్వరో హరిః. ఉద్ధృతా విష్ణునా లక్ష్మీరుకారేణ తథోచ్యతే. మకారస్తు తయోః దాస ఇతి ప్రణవలక్షణం , ఇతి. సర్వకారణ భూతాయ సర్వరక్షకాయ సర్వశేషిణే శ్రియః పతయే ఏవ

స్వాభావిక శేషభూత ఇతి సర్వదా నుసంధాన మేవ వైదికీ ప్రపత్తిః. పాంచరాత్రే తు త్యక్త్వా త్రయీ తంత్ర మేవ ప్రపద్య శరణం స్థితాః ఇతి ఉపదిశ్యతే. తస్యాః ప్రపత్తేః సకృత్ కరణాత్ సమంత్రకత్వాభావాత్ తచ్ఛేష భూత గత్యనుసరణాభావచ్చ తాం తాంత్రిక ప్రపత్తిం విహాయ...వైదికం ప్రపత్తి మేవోక్తవాన్ సూత్రకారః.

-(టి.టి.డి. ప్రచురణ - పుటలు-104-105)

- వైదిక, తాంత్రిక భేదాలచేత 'ప్రపత్తి' రెండువిధాలు. ప్రణవ (= ఓమ్‌కార) పూర్వకంగా పురుషాదులను ఆవాహన చేయటం మున్నగునవి వైదికం - ప్రణవంలోని 'అ' కారం సర్వలోకేశ్వరుడైన విష్ణువునకు, 'ఉ' కారం లక్ష్మికి, 'మ' కారం ఆ యిరువురి దాసుడైన భక్తునకు సంకేతాలు - ఇది ప్రణవలక్షణమని శ్రుతి వివరించినది. సర్వకారణ భూతుడు, సర్వ రక్షకుడు, సర్వశేషి అయిన శ్రియఃపతియే స్వాభావిక శేషభూతుడు (= విశ్వతత్త్వమయుడు). అని సర్వదా అనుసంధానం చేసుకోవటమే వైదికప్రపత్తి. ఇంక పాంచరాత్రమందు అన్నచో, వేదపద్ధతిని విడిచి కేవలం తంత్రమార్గ ముననే శరణువేడుతాను అని ఉపదేశింపబడుతున్నది. ఆ ప్రపత్తి ఒక్కసారి చేయబడేది కావటంచేత, వేదమంత్రసహితం కాకపోవటంచేత, భగవంతుని శేషభూతమైన స్థితి యొక్క స్మరణ లేక పోవటంచేత దానిని విడిచిపెట్టి వైదిక ప్రపత్తిని మాత్రమే సూత్రకారుడు ఉపదేశించినాడు. (భగవంతుడైన విష్ణువు 'శేషి', తక్కిన చరాచర జగత్తు అంతా 'శేషము', విష్ణువు చరాచరజగత్తునకు అతీతుడు మాత్రమేకాక 'విశ్వతత్త్వమయుడు కూడా).

'క్రియాయోగం' అనగా విష్ణుపూజకు సంబంధించిన క్రియాకలాపం

అని అర్థం. భృగుమహర్షి విరచితమైన ఒక వైఖానసగ్రంథం యొక్క శీర్షిక 'క్రియాధికారం'. ఇందులోని 'క్రియ' అనే పదానికి కూడా అర్థం ఇదే. 'క్రియాయోగం' అనే పదం అగ్నిపురాణంలో కూడా ఉంది. నారద - బ్రహ్మల సంవాదంలో-

"జ్ఞానయోగస్తు యోగస్య యస్తు సాధనమాత్మనా ।
యస్తు బాహ్యార్థస్తద్యోగః క్రియాయోగః స ఉచ్యతే"

- జ్ఞాన యోగం అనేది 'యోగం' యొక్క అంతరంగ సాధన; ఇంక క్రియాయోగం అనేది బాహ్యార్థసాధన.

అగ్నిపురాణం ఇంకా ఇట్లా వివరిస్తున్నది: విష్ణువునకు మందిర నిర్మాణం, లక్షణాన్వితంగా ప్రతిమను తయారుచేయించుకోవటం, ప్రత్యహం విష్ణుపూజ చేయటం మున్నగునవి క్రియాయోగంలోని విభాగాలు. ప్రతిమారాధనలోని విలువలకు తగినట్లు జీవనవిధానమును మలచుకొనటాన్ని క్రియాయోగం ప్రధానంగా నిర్దేశిస్తున్నది. ఇది వ్యక్తియొక్క బాధ్యత, విద్యుక్తధర్మంగా శ్రద్ధతో దీనిని సాధించుకోవాలి (బాహ్యార్థ సాధనలోని ప్రధానాంశమిది). ఆలయ వ్యవస్థనుకాని, గృహంలో ప్రతిమారాధననుకాని అగ్నిపురాణం వివరించలేదు. అంతేకాదు, అది కల్పసూత్రానికి వివరణ కూడాకాదు. కాని, గృహ్యసూత్ర పరిధి నుంచి ప్రతిమారాధనను వెలికి తెచ్చి, ఆగమ (= వైఖానసులకు తెలిసిన 'భగవచ్ఛాస్త్ర') రచనకు దారి మాత్రం చూపించినది.

భృగుమహర్షి రచించిన ప్రకీర్ణాధికారం (35, 1-13) క్రియాయోగ ఫలమును ఇట్లా వర్ణించింది:

"అహన్యహని యజ్ఞేన యజతో యన్మహాఫలమ్ ।
ప్రాప్నోతి తత్ఫలమ్ విష్ణోః యః కారయతి మందిరమ్ ॥
కారయేత్ భగవద్గేహ మితి బుద్ధిం కరోతి యః ।
సప్తజన్మకృతం పాప మల్పం వా యదివా బహు ॥
విష్ణోరాలయవిన్యాస ప్రారంభాదేవ నశ్యతి ॥
ప్రతిమాం లక్షణవతీం యం కారయతి మానవః ।
కేశవస్య స తల్లోకమక్షయం ప్రతిపద్యతే ॥
బేరపూజార్థ్యయం ప్రోక్తా పూజానాముత్తమోత్తమా ।
అతీతే యుగమానే౽పి చిరమప్యా అవస్థితేః ॥

-(ఖిలాధికారం 1,30-31తో పోల్చి చూడవలె.)

సంగతిర్దేవపూజా చ దానం యజ్ఞ ఇతి స్మృతిః ।
యజ్ఞేష్వేతేషు విధివద్ బేరపూజా విశిష్యతే ॥
యజమానే మృతే౽ప్యేషా శాశ్వతం భువి తిష్ఠతి ।
- (ఖిలాధికారం)

- ప్రతిరోజు యజ్ఞం చేయటంవల్ల ఏ మహాఫలం లభిస్తుందో, అది విష్ణువుయొక్క మందిరనిర్మాణం వల్ల లభిస్తుంది. విష్ణువునకు ఆలయం నిర్మించాలని సంకల్పించి ఆలయనిర్మాణం ప్రారంభించినంతనే ఏడు జన్మల పాపాలు అవి చిన్నవి కానీ పెద్దవికానీ తప్పక నశిస్తాయి. సలక్షణవతిగా కేశవుని ప్రతిమచేయించిన మానవుడు, అక్షయలోకాలను పొందుతాడు. బేర పూజ, పూజలన్నింటిలోనూ ఉత్తమోత్తమని చెప్పబడినది. యజమానుడు గతించినప్పటికీ, ఈ బేరపూజ చిరకాలం కొనసాగుతుంది (ఖిలాధికారం 1,30-31తో సరిచూడవచ్చు).

- దేవపూజ, దానం, యజ్ఞం - ఇవి సమానములని స్మృతి. ఈ యజ్ఞములన్నింట, విధిపూర్వకమైన బేరపూజ విశిష్టమైనది. యజమానుడు మృతి చెందినప్పటికీ, ఆ బేరపూజ భువిలో శాశ్వతంగా ఉంటుంది.

ఆగమ ఆవిర్భావమునకు దారి సుగమంచేసిన ఇంకోదృష్టి కల్పసూత్రంలో ఉంది. ఇది సిద్ధ పురుషుల, భక్తుల తరతమభేదాలకు సంబంధించినది. బ్రాహ్మణ పితరులకు జన్మించిన వ్యక్తి పుట్టుకచేత మాత్రమే బ్రాహ్మణుడు కాని, ఆధ్యాత్మికంగా కాడు. అతడు ఉపనయన సంస్కారం పొందినప్పుడే నిజంగా బ్రాహ్మణుడవుతాడు. కాని, అతడు నిత్యం సంధ్యావందనాదికాలు చేయటంవల్లనే సమాజంలో బ్రాహ్మణుడుగా అతని స్థాయి గుర్తింపబడు తుంది. ఇట్టివాడు పుట్టుకచేత బ్రాహ్మణుడైనవానికంటె అధికుడు. కాని, శ్రోత్రియుడుకంటె ఇతడు తక్కువవాడే (వేదాధ్యయనం చేస్తూ, గృహస్థుడై, పాకయజ్ఞాలను నిర్వహించే వ్యక్తి శ్రోత్రియుడు).

అయితే ఈ శ్రోత్రియుడు కూడా, తనకు చెందిన వేదశాఖను అధ్య యనం చేస్తూ, గార్హపత్యాగ్నిని ఆధానంచేసే 'ఆహితాగ్ని' కంటె తక్కువ స్థాయివాడే. మరి ఈ ఆహితాగ్ని, హవిర్యజ్ఞాలు తప్పక నిర్వహించే 'అనూ చానుడు' కంటె తక్కువస్థాయివాడు. కాని, విస్తృతమైన సామయజ్ఞంచేసే 'భ్రూణుడు' ఈ అనూచానుడుకంటె స్థాయిలో అధికుడు.

యాజ్ఞికులలో ఉత్తముడైన ఈ భ్రూణుడు కూడా యమనియమాది సంస్కారోపేతుడైన 'ఋషి కల్పుడు' కంటె తక్కువస్థాయివాడు. ఇంక సాంగోపాంగంగా నాలుగువేదాలు అధ్యయనం చేసిన, తపోయోగంలో ఉన్న 'ఋషి', ఈ ఋషికల్పుడుకంటె అధికుడు. ఈ ఋషి కంటె కూడా అధికుడు నారయణపరాయణుడు, ద్వంద్వరహితుడు అయిన 'ముని'.

ఇట్లా, కల్పసూత్రం (వైఖానస గృహ్యసూత్రం 1, 1, 9-16 తో పోల్చి చూడదగును) భక్తులలో తరతమాది స్థాయి భేదాలను నిర్ణయించటమేకాక, గృహంలో ఆధ్యాత్మిక విధులను పాటించే యమనియమాదులకు భిన్నంగా 'భక్తి' యొక్క విలువను ఉద్ఘాటించింది. 'ముని' యొక్క పరమావధి 'భాగవతజీవనం'. ముని లేదా భాగవతుడు తనముక్తి కొరకు మాత్రమేకాక ఇతరుల క్షేమానికి కూడా పాటుపడతాడు (భాగవత సంప్రదాయానికి ఆధారగ్రంథమైన భగవద్గీత దీనిని 'లోకసంగ్రహం' అని పేర్కొన్నది). శ్రీనివాసమఖి 'దశవిధహేతు నిరూపణం' (వైఖానస గృహ్యసూత్రాలకు వ్యాఖ్య అయిన తాత్పర్యచింతామణికి వ్రాసిన ఉపోద్ఘాతం - టి.టి.డి. ప్రచురణ -1వసం. పుటలు 36-37) లో 'పురాతంత్రం' (47అధ్యా.) నుంచి క్రింది భాగం ఉద్ధరించినాడు:

"ఆలయార్చా గృహార్చేతి చోభయం శ్రుతిచోదితమ్ ।
ఆలయే పంచమూర్తీనాం అర్చనం త్వధికం భవేత్ ॥
ఆలయార్చావిధిః సో ఽయం వైదికః సర్వసిద్ధిదః ।
సర్వలోకహితార్థాయ ప్రోక్తో ఽస్మాభిః విశేషతః ॥
ఆలయార్చనకర్మేదం వైదికం భగవత్ప్రియమ్ ।
అనుష్ఠేయం ద్విజశ్రేష్ఠైః తద్వైఖానససూత్రిభిః ॥
యే వైఖానససూత్రేణ సంస్కృతాస్తు స్యాద్విశేషతః ।
పూజా వైఖానసైర్విప్రైరాలయే స్యాద్విశేషతః ॥
సర్వసంపత్కరం చైవ సర్వాశుభవినాశనమ్ ।
తద్ గ్రామవాసినాం తద్వదైహికాముష్మిక ప్రదమ్ ।
వర్షదం పుష్టిదం శ్రేష్ఠం రాజ రాష్ట్ర వివర్ధనమ్ ॥

-(పురాతంత్రం)

- ఆలయార్చన, గృహార్చన- ఈ రెండూ శ్రుతి విహితములైనవే. ఆలయంలో మాత్రం 'పంచమూర్తులు' అర్చన అధికంగా ఉంటుంది. ఆల

యార్చావిధి వైదికం, సర్వసిద్ధికరం. అంతేకాదు, సర్వలోక హితం కోసం ఇది ఉద్దిష్టమైనదని విశేషంగా చెప్పబడింది. ఆలయార్చన అనే 'కర్మ' వైదికమైనది; భగవంతునకు ప్రీతిపాత్రమైనది. వైఖానససూత్రానుయాయు లైన ద్విజశ్రేష్ఠులు దీనిని అనుష్ఠించాలి. వైఖానస సూత్రం ప్రకారం విశిష్టసంస్కారాలు పొందిన వైఖానస విప్రులు ఆలయంలో విశేషపూజ చేయాలి. ఇట్టి పూజ సర్వసంపదలను ఇస్తుంది, అన్ని అశుభాలను నాశనం చేస్తుంది. ఆ గ్రామవాసులకు ఐహికాముష్మిక ఫలములను ప్రసాదిస్తుంది. సకాలంలో వర్షాలను కురిపిస్తుంది. పుష్కలంగా పంటలను పండిస్తుంది. సర్వశుభాలను కలిగిస్తుంది. రాజును రాష్ట్ర ప్రజలను వృద్ధి పొందిస్తుంది.

'పౌష్కర సంహిత' ఇట్లా వివరిస్తున్నది (దశవిధహేతు నిరూపణ ఉద్ధృతం - పుట 42):

"విప్రా వైఖానసాఖ్యా యేతే భక్తా ప్రత్యముచ్యతే ।
ఏకాంతినః సుసత్వస్థా దేహాంతం నాన్యయాజినః ॥
కర్తవ్యమితి దేవేశం సంయజంతే ఫలంవినా ।
ప్రాప్నువంతి చ దేహాంతే వాసుదేవత్వ మబ్జజ ॥"

- భక్తులైన వైఖానస విప్రులు నిజంగా ఏకాంతినులు (= ఏకాంత సేవకులు), సుసత్వస్థులు (=నిరంతరం సత్త్వగుణయుక్తులు), ప్రాణమున్నంత వరకు ఇంకొకరిని పూజించని వారు కావాలి. ఫలాపేక్షారహితంగా దేవేశుని పూజించాలి. అట్టివారు దేహాంతమందు వాసుదేవత్వాన్ని పొందుతారు.

ఈ సందర్భములో 'ప్రకీర్ణాధికారం' (30, 117-118) ఇట్లా వివరిస్తున్నది:

"ఫలాభిసంధిరహితం సర్వం కర్మాఖిలం కృతమ్ ।
బ్రహ్మార్పణధియా కుర్యాత్ స భవేత్ వైష్ణవోత్తమః ॥

- సర్వకర్మలను ఫలాపేక్షారహితంగా, బ్రహ్మార్పణబుద్ధితో చేసినవాడు వైష్ణవోత్తముడు అవుతాడు.

ప్రతిమార్చనలో ఫలాపేక్షారహితమైన భక్తి ప్రధానంకావటం చేతనే ప్రతి మార్చన ఉత్తమోత్తమమైన మతవిధిగా చెప్పబడింది. అంతిమ మోక్షానికి ఇదే రాచబాట:

"బేరపూజా త్రియం ప్రోక్తా పూజానాముత్తమోత్తమా ।"
-(ప్రకీర్ణాధికారం -35,13)

"తస్మాత్ సర్వప్రయత్నేన భక్త్యా పరమయా యుతః ।
సమూర్తారాధనం కుర్యాన్నాన్యథా ముక్తి మాప్నుయాత్ ॥"

-( ప్రకీర్ణాధికారం 37, 208)

-పూజలన్నింటిలో బేరపూజ ఉత్తమోత్తమం అనిచెప్పబడింది. కావున పరమ భక్తితో సర్వప్రయత్నంతో సమూర్తారాధన చేయాలి. ఇంకో విధంగా ముక్తి లభించదు.

"అర్చాత్మన్యేవ సర్వేషామధికారో నిరంకుశః ।
విశేష భక్తిహేతుత్వాత్ ప్రతిమారాధనం పరమ్ ॥"

-(ప్రకీర్ణాధికారం -33,33)

-అర్చామూర్తియందు అందరికీ అధికారం ఉంది. విశేషమైన భక్తికి కారణం కావటంవల్ల ప్రతిమారాధన శ్రేష్ఠమైనది.

సర్వసామాన్యంగా ప్రతిమారాధనకు ఆలయమే ఉచితమైనస్థానం. అయితే, ఆ ఆలయం శాస్త్రసమ్మతంగా నిర్మింపబడాలి. అందలి ప్రతిమ విధివిహితంగా ప్రతిష్ఠింపబడాలి. విధివిహితములైన అర్చనా విధులు అందరికీ తెలియవు కాబట్టి, వాటి నిర్వహణకు సమర్థుడైన అర్చకుడు కావాలి. ఇటువంటి అర్చకులకు, పూజావిధులలో మార్గదర్శకమైన ఆగమశాస్త్రం బాగాతెలియాలి.

"శ్రుతిస్మృతి విధానేన పూజా కార్యా యుగత్రయే ।
ఆగమోక్తవిధానేన కలౌ దేవాన్ యజేత్ సుధీః" ॥

-శ్రుతి-స్మృతి విహితములైన పూజావిధులు కృత-త్రేత-ద్వాపర యుగాలకు పరిమితములైనవి. ఇంక కలియుగంలో ఆగమోక్తమైన పూజా విధితోనే బుద్ధిమంతులు దేవుని అర్చించాలి.

"యజ్ఞా నరాణాం పాపౌఘక్షాలనాః సర్వకామదాః ।
యత్తైవేజ్యా జగద్ధాతుః సర్వయజ్ఞమయో హరిః "॥

-(ప్రకీర్ణాధికారం-35,25).

-వేదవిహితములైన యజ్ఞములు పాపసమూహాలను క్షాళనంచేసి, కోరికలనన్నింటిని తీర్చేవి. అయితే విష్ణుపూజకూడా అటువంటి ఫలములనే ఇస్తుంది-కారణం హరి సర్వయజ్ఞస్వరూపుడు కావటమే.

"దీపం ప్రయచ్ఛతి నరో విష్ణోరాయతనే హి యః ।
స దక్షిణస్య యజ్ఞస్య ఫలం ప్రాప్నోత్యసంశయః "॥
-(ప్రకీర్ణాధికారం-35,83)

-విష్ణ్వాలయంలో దీపదానంచేసిన మానవుడు, దక్షిణ ఇచ్చి చేయించు కొన్న యజ్ఞం ఇచ్చేఫలాన్ని నిస్సంశయంగా పొందుతాడు.

"భక్త్యా ప్రదక్షిణం కుర్యాన్నిత్యం విష్ణ్వాలయే నరః ।
సాయం ప్రాతశ్చ దేవేశం నమస్యన్నథ చింతయన్ ।
యః ప్రణామం ముహుః కుర్యా త్సతు యజ్ఞఫలం లభేత్" ॥
-(అందే-35, 300-301)

-ఏ నరుడు భక్తితో విష్ణ్వాలయం చుట్టూనిత్యం ప్రదక్షిణం చేస్తాడో లేదా సాయంకాలం ప్రాతఃకాలం దేవేశుని ధ్యానిస్తూ ప్రణమిల్లుతాడో, అతడు యజ్ఞఫలమును తప్పకపొందుతాడు.

-'ఉత్సవం' (= ఉత్-సవం = ఊరేగింపుతో కూడిన నైమిత్తిక ప్రక్రియ) అనేది తరువాతి కాలంలో యజ్ఞానికి పర్యాయపదమైనది. (ఉత్ = ఉత్తమం, సవం = యజ్ఞం).

ఉదిత్యుత్కృష్ట శబ్దోయం సవో యజ్ఞ ఉదాహృతః ।
తస్మాదుత్తమ యజ్ఞత్వా దుత్సవః పరిభాష్యతే ।
వాజిమేధాంతయాగానాం తస్మాద్దేవోత్సవో వరః ॥
వాజిమేధసహస్రేణ యజతో యత్ ఫలం భవేత్ ।
యశ్చోత్సవేన యజతే తయోస్తుల్యం ఫలం స్మృతం ॥
-(383-384)

-ఉత్ అనగా ఉత్కృష్టం, సవం అనగా యజ్ఞం, కాగా దేవోత్సవమనేది ఉత్తమయజ్ఞమని భావం. కావున అశ్వమేధం చివరగా గల గొప్పయాగాలకంటె దైవోత్సవనిర్వహణమనే యజ్ఞం శ్రేష్ఠమైనది. వేయి అశ్వమేధయాగాలు చేసినందువల్ల ఏ ఫలం లభిస్తుందో, దానితో తుల్యమైనఫలం ఉత్సవపూర్వకంగా అర్చించటంవల్ల లభిస్తుంది.

## వైఖానస సాహిత్యం

సామాన్యంగా అందరూ అంగీకరించిన ప్రకారం-మతవిషయకములైన

భక్తి ప్రవత్తులు, ఆధ్యాత్మికములైన ఆచారవ్యవహారములు-వీటిని వివరించే గ్రంథసముదాయం 'ఆగమం' గా ప్రసిద్ధం-ఇది లక్ష 'గ్రంథముల' కు తగ్గరాదు; కోటిన్నర 'గ్రంథములు' మించరాదు (పాదానికి ఎనిమిది అక్ష రాలు చొప్పున మొత్తం నాలుగుపాదాలకు 32 అక్షరాలు ఉండే అనుష్టుప్ ఛందస్సులోని ఒక వృత్తాన్ని 'గ్రంథం' అంటారు).

"లక్షాధికైస్తు బహుభిః సహస్రైస్తు శతాన్వితైః ।
సార్ధకోటి త్రయాంతం చ తచ్చ తంత్రాఖ్యమాగమమ్" ॥
-(పౌష్కర సంహిత-39, 11)

-ఈవైఖానస తంత్రము (= శాస్త్రము) అనే ఆగమం మూడున్నర కోట్ల గ్రంథములును, లక్షపైన కొన్నివేలు, వందలు శ్లోకములు కలిగి ఉన్నది (సార్ధకోటిత్రయం = మూడున్నరకోట్లు- విశ్వంలోని పుణ్యతీర్థాల సంఖ్య ఇదే; మానవుని రోమకూపముల సంఖ్య కూడా ఇదే).

మరీచి యొక్క 'విమానార్చనా కల్పం' (101,) ప్రకారం విఖనసముని బోధించిన సూత్రం కోటిన్నర గ్రంథముల ప్రమాణం కలది (సార్ధ కోటి ప్రమాణం గ్రంథం దత్తవాన్). అయినప్పటికీ, ఆయన శిష్యులు-భృగువు ప్రభృతులు నలుగురు కూర్చిన 'వైఖానసశాస్త్రం' లో నాలుగు లక్షల గ్రంథములు మాత్రమే ఉన్నవి (చాతుర్ లక్షగ్రంథం ప్రాదదుః ఏతద్ వైఖానసంశాస్త్రం). కాగా, మరీచి పేర్కొన్న మొత్తంమాత్రం మనకు లభించక పోయినా, నలుగురు శిష్యులు కూర్చిన సంపుటి 'ఆగమం' అనే పదానికి అర్థమవుతున్నది.

రఘునాథచక్రవర్తిభట్టాచార్య, సేతుమాధవాచార్య- ఈఇరువురు సంపాద కత్వం వహించిన 'విమానార్చనాకల్పం' లో 101 పటలములు ఉన్నవి (దీనిని తిరుమలతిరుపతి దేవస్థానం యొక్క మహంత్ ప్రయాగదాస్‌జీ 1926లో మద్రాసులో ప్రచురించినారు). ఇందులోని చివరిపటలం, కల్ప సూత్రం తరువాతి కాలంలో వెలసిన వైఖానససాహిత్యం యొక్క వివరాలు పేర్కొన్నది. దీనిని రచించిన మరీచి, వైఖానసకల్ప సూత్ర సంకలన కర్తగా ప్రసిద్ధి పొందిన విఖనసముని యొక్క నలుగురు శిష్యులలో ఒకడు. విమానార్చనా కల్పం ఇట్లా పేర్కొన్నది:

"వైఖానసమహాశాస్త్రం సర్వవేదేషూద్ధృతం సర్వవేదార్థసారభూతం అప్ర తర్క్య మనిందితం వైదికైరుపసేవితం విష్ణోరారాధనం సర్వభూతహితార్థాయ

శాబ్దం ప్రమాణమవలంబ్య విష్ణునా విఖనస ఉక్తమ్" (పుట. 521).

-వైఖానస మహాశాస్త్రం సర్వవేదములనుంచి ఉద్ధృతమైనది. అది సర్వవేదార్థసార భూతము. అప్రతర్క్యం (= ఊహింపరానిది), నిర్దుష్టమైనది. వైదికులచేత సేవింపబడేది. విష్ణువు యొక్క ఆరాధనకు సంబంధించినది. సర్వభూతహితంకోసం శాబ్దిక (= వేద) ప్రమాణమును అవలంబించి విష్ణువుచేత విఖనసునకు చెప్పబడింది.

విమానార్చనాకల్పం ఇంకా ఇట్లా వివరించింది: విఖనసముని, వైఖానస సిద్ధాంతాన్ని, భృగువు, కాశ్యపుడు, అత్రి, మరీచి (విమానార్చనా కల్పకర్త)- ఈ నలుగురు శిష్యులకు బోధించినాడు. అంతట ఈనలుగురు, వరుసగా అధికారములు, కాండములు, తంత్రములు, సంహితలు అనే వైఖానసగ్రంథాలను రచించినారు; నాలుగింటను మొత్తం నాలుగు లక్షల గ్రంథములు ఉన్నవి. ఈ నలుగురు రచించిన గ్రంథాల వివరములు ఇట్లా ఉన్నవి:

1. పూర్వతంత్రం, ఆత్రేయతంత్రం, విష్ణుతంత్రం, ఉత్తరతంత్రం అనే నాలుగు తంత్రాలను అత్రి రచించినాడు. ఈనాలుగింటిలో 88వేల గ్రంథములున్నవి.

2. ఖిలతంత్రం, పురాతంత్రం, వాసాధికారం, చిత్రాధికారం, మానాధికారం, క్రియాధికారం, అర్చాధికారం, యజ్ఞాధికారం, వర్ణాధికారం, ప్రకీర్ణాధికారం, ప్రతిగృహ్యాధికారం, నిరుక్తాధికారం, ఖిలాధికారం-ఈపదమూడు అధికారములును భృగువు రచనలు (మొదటి రెండు 'తంత్రము' అనే పేరుతో ఉన్నవి). ఈపదమూడింటి పరిమాణం, అత్రి రచనలవలెనే 88వేల గ్రంథములు. కాని, కొందరు వీటి పరిమాణం 64వేల గ్రంథములే అని పేర్కొన్నారు (నిజానికి, ఈ సంఖ్య మాత్రము మొత్తంనాలుగులక్షలు అనేసంఖ్యకు సరిపోతున్నది).

3. జయసంహిత, ఆనందసంహిత, సంజ్ఞానసంహిత, వీరసంహిత, విజయసంహిత, విజితసంహిత, విమలసంహిత, జ్ఞానసంహిత-ఈపేర్లతో మరీచి ఎనిమిది 'సంహితలు' రచించినాడు; ఈ ఎనిమిదింటి పరిమాణం లక్షా ఎనభైనాలుగువేల గ్రంథములు.

4. సత్యకాండ, తర్కకాండ, జ్ఞానకాండ-ఈపేర్లతో కాశ్యపుడు మూడు 'కాండలు' రచించినాడు- వీనిమొత్తం పరిమాణం 64వేల గ్రంథాలు.

పైనాలుగు వర్గాల రచనలకు మూలం వైఖానససూత్రం అని పై

వివరణయొక్క అంతమందున్నది. (ఏతేషాం చతుర్విధానాం మూలం తద్వైఖానససూత్రమ్). వీటిని క్రింది పట్టిక రూపంలో చూడవచ్చు:

| కర్తలు | రచనలు | గ్రంథములు |
|---|---|---|
| 1. అత్రి | 4 తంత్రములు | 88,000 |
| 2. భృగువు | 13 అధికారములు | 64,000 |
| 3. మరీచి | 8 సంహితలు | 1,84,000 |
| 4. కాశ్యపుడు | 3 కాండలు | 64,000 |
| మొత్తం | గ్రంథములు. | 4,00,000 |

పైమొత్తం సంఖ్య కల్పన కాదని ముద్రిత గ్రంథాలు, వ్రాతప్రతులు, పెక్కు పరస్పరోదాహరణలు, వ్యాఖ్యానాలు, పై తంత్రాదులనుంచి లభించిన భాగాలు నిర్దేశిస్తున్నవి. కాని, అర్వాచీనులు నలుగురి రచనల మొత్తాలను వేర్వేరుగా పేర్కొనటంచేత, వాటిని గూర్చి నిర్ధారణగా చెప్పజాలము. ఉదా: భృగువుయొక్క రచనలు 13అని మరీచిచెప్పగా, భృగువు రచించిన యజ్ఞాధి కారం పదకొండు అని పేర్కొన్నది (భార్గవం యన్మయాకృతం తదేకాదశధా మతమ్ - 51, 13).

భృగువే రచించిన 'వాసాధికారం'లో భృగువు ఎనిమిది అధికారాలే రచించినట్లున్నది. ఆనందసంహిత (17, 45), వా సాధికారం(1), సమూర్తార్చనాధికారం ప్రకారం భృగువు రచనలు మొత్తం 64వేల గ్రంథ ములు. కాని, విమానార్చనాకల్పం 88వేలు అనీ, యజ్ఞాధికారం 50వేలు అనీ పేర్కొన్నవి. ముద్రింపబడిన వైఖానసగ్రంథాలు చాలా తక్కువకావటంచేత, చాలా వ్రాతప్రతులు అసమగ్రములు, ఖండఖండములు కావటంచేత ఈ సంఖ్యాసమస్య మరింత జటిలం అవుతున్నది.

అయితే, వైఖానసాగమ నిర్మాతలు నలుగురనీ, వారు తమతమ రచలకు తమగురువైన విఖనసముని బోధనలను ఆధారంగా చేసుకొన్నారనీ అందరూ అంగీకరిస్తున్నారు.

గారుడపురాణం (ప్రకీర్ణాధికారంలో ఉద్ధరింపబడింది - 34, 9-10) ఇట్లా పేర్కొన్నది:

"పురా చతుర్ముఖాదేశాచ్చత్వారో మునయో ఒమలాః ।
ప్రణీయ వైష్ణవం శాస్త్రం భూమావభ్యర్చయ న్నృప ॥
మరీచిర్నందిరే విష్ణుమర్చయామాస కేశవమ్ ।

సర్వదేవోత్తమం దేవం (ఆదేశాద్ బ్రహ్మణో విష్ణుం)
శ్రీనివాసే ఽత్రిరర్చయత్ ।
కాశ్యపో విష్ణ్వధిష్ఠానే శుభక్షేత్రే భృగుర్మునిః (శుభక్షేత్రే హ్యహం
భృగుః) ॥"

-పూర్వం చతుర్ముఖుని ఆదేశానుసారం, నిర్మలులైన నలుగురు మునులు వైష్ణవ శాస్త్రాన్ని రచించి, భువిలో విష్ణువును అర్చించినారు. ఆ నలుగురిలో మరీచి 'మందర' క్షేత్రంలో కేశవుడైన విష్ణువును అర్చించినాడు; సర్వదేవోత్తముడైన విష్ణువును శ్రీనివాసక్షేత్రమందు అత్రి అర్చించినాడు; కాశ్యపుడు విష్ణువును, విష్ణ్వధిష్ఠాన క్షేత్రమందు అర్చించినాడు; ఇంక భృగువు శుభక్షేత్రమందు విష్ణువును అర్చించినాడు.

ఈక్షేత్రాలను గుర్తించటం ఇప్పుడు సాధ్యంకాదు ; కాని శ్రీనివాస క్షేత్రం నేటి తిరుమలకావచ్చు.

ప్రకీర్ణాధికారం (34, 9-10)లో క్రిందిశ్లోకం,
భృగువుపేరుతో పై రెండవ శ్లోకానికి ముందున్నది.

"యత్ర వైఖానసం శాస్త్రమాశ్రిత్య పరమం శుభమ్ ।
అర్చయామో జగద్యోనిం అహ మన్యే తే త్రయః" ॥

-పరమశుభకరమైన వైఖానసశాస్త్రాన్ని ఆశ్రయించి, జగద్యోని అయిన విష్ణువును తక్కిన ముగ్గురు, నేను (= భృగువు) అర్చించినాము.

విఖనసముని, ఆయన శిష్యులు నలుగురు (వీరుకూడా మునులే) చారిత్రక పురుషులనటంలో ఎటువంటి విప్రతిపత్తి ఉండరాదు. కాని, ఈ నలుగురుమునులు స్వీయ తాత్త్వికచింతనలను స్వయంగా ప్రారంభించినారో, లేదా వారి శిష్యులు వైఖానసాగమమునకు తమతమ తాత్త్విక చింతనలను చేర్చినారో కచ్చితంగా చెప్పజాలము. హారీతుడు అనేవ్యక్తి యొక్క అభిప్రాయాలను వ్యాఖ్యాతలు తరచుగా పేర్కొంటూ వచ్చారు. తాను భృగువుయొక్క శిష్యుడనని ఈయన చెప్పకొన్నాడు. ఒక సంహితకర్త అయిన 'శౌనకుడు' అనేవ్యక్తి యొక్క అభిప్రాయాలను (కుంభప్రోక్షణముమున్నగు అంశాలకు సంబంధించినవాటిని) కూడా వ్యాఖ్యాతలు పేర్కొన్నారు. కొన్ని రచనలు 'ఇతివైఖానసే శౌనక సంహితాయామ్' (= వైఖానస శాస్త్రమైన శౌనకుని సంహితయందు) అని పేర్కొన్నవి; కాని, ఈ సంహిత

లభ్యంకాలేదు. పై నలుగురు మునుల రచనలలో కొన్ని 'ఉత్తరతంత్రములు' అని పేర్కొనబడినవి. అంటే అవి 'తరువాతి రచనలు' అని అర్థం. ఉదాహరణకు-భృగువుయొక్క 'యజ్ఞాధికారం' భృగువు రచనలు పదకొండు అని చెప్పినప్పటికీ, ఆపదకొండింటిలోనూ చేరని ఒక ఉత్తరతంత్రమును భృగువుయొక్క రచనగా పేర్కొన్నది. బహుశః భృగువుయొక్క శిష్యుడొకడు దీనిని రచించి ఉండవచ్చు. మరీచి యొక్క విమానార్చనాకల్పమును, ఉత్తరతంత్రంగా పేర్కొన్నది యజ్ఞాధికారం (51, 24) (ఆనంద సంహితకు ఇది ఉత్తరతంత్రం కావచ్చు) (యత్ విమానార్చానాకల్పం తంత్రం ఉత్తరసంజ్ఞకం). ఇది, భృగువు స్వయంగా లేదా ఆయన శిష్యుడొకడు రచించిన అనుషంగిక రచనకావచ్చు- మరీచి రచనలుగా చెప్పబడిన ఎనిమిది సంహితలలో ఇది లేదు. అట్లాగే, భగవదర్చనాకల్పం లేదా విష్ణుయాగవిధి అనే ఉత్తరతంత్రం కాశ్యపుని రచనగా గోచరిస్తున్నది.

"శేషం భగవదర్చాయాః కల్పముత్తరసంజ్ఞకమ్ ।
విష్ణుయాగవిధిశ్చేతి తదేవ పరికీర్తితమ్" ॥
- (ప్రకీర్ణాధికారం-51, 29)

-భగవదర్చనకు సంబంధించిన తక్కిన విషయాలకు ఉత్తరకల్పమని పేరు; దీనినే విష్ణుయాగవిధి అంటారు.

అయితే కాశ్యపుని రచనలుగా చెప్పబడిన మూడు లేదా అయిదు కాండలలో ఈ రచన లేదు. శేషించినవి ( = మిగిలినవి లేదా తక్కినవి) చెప్పిన కల్పం కావటం చేత, ఉత్తర సంజ్ఞకం (= తరువాతి రచన) అని చెప్పబడటం చేత దీనిని కాశ్యపుని శిష్యుడొకడు రచించి, కాశ్యపునిపేర వెలయించెనని ఊహించవచ్చు.

విమానార్చనాకల్పం ప్రకారం, వైఖానసాగమంలోని అధికభాగం - అంటే లక్షా ఎనభైవేల గ్రంథములను మరీచి రచించినాడు. కాని, కాశ్యపుని రచనలైన ఎనిమిది సంహితలు (= సంహితాష్టకం) లక్షగ్రంథముల పరిమాణం కలవని కొందరు పేర్కొన్నారు (లక్షగ్రంథేన మరీచిః). బహుశః మరీచి, మరికొన్ని 'అధికారములు' నిర్దిష్ట విషయాలపై రచించి ఉండవచ్చు.

మరీచియొక్క సంహితలు ఎనిమిది :

1. జయ సంహిత

2. ఆనందసంహిత (దీనిని, 'అనంతాఖ్యం' అని సమూర్తార్చనాధికారం పేర్కొన్నది- 27, 28).

3. సంజ్ఞానసంహిత.

4. వీరసంహిత (ఇదియజ్ఞాధికారం పేర్కొన్న వరసంహిత కావచ్చు).

5. విజయ సంహిత.

6. విజిత సంహిత.

7. విమల సంహిత.

8. జ్ఞాన సంహిత (ఇది, ఆనందసంహిత పేర్కొన్న 'కల్పసంహిత' కావచ్చు-17, 40-42).

పై ఎనిమిది సంహితలలో ఒకటి రెండు సంహితలు మాత్రమే మనకు లభించినవి. 101 అధ్యాయాలతో ఆనంద సంహిత ముద్రింపబడి లభిస్తున్నది (భట్టర్ పార్థసారథి ఆచార్య సంస్కృతవ్యాఖ్యతో, తెలుగులిపిలో, ఈగావారి పాలెంలో 1924లో ముద్రింపబడింది). జయసంహితకూడా లభ్యమవుతున్న దట. కాని మరీచి రచనలలో సుప్రసిద్ధమైనది విమానార్చనాకల్పం. ఇది నూరు అధ్యాయాల గద్య రచన ( పద్య రచన అయిన ఆనందసంహిత గద్య రచన అయిన విమానార్చనాకల్పం ఒక్కటే అని తరచు పొరపాటుపడటం జరుగుతున్నది). విష్ణువును ప్రతిమారూపంలో అర్చించే విధానమంతటినీ (= క్రియాయోగం) ఈ రచన వివరించినది; ఇది దేవనాగరలిపిలో, తెలుగులిపిలో చాలాసార్లు ముద్రింపబడినది. ఈగ్రంథాన్నే వైఖానస అర్చకులు విరివిగా ఉపయోగిస్తున్నారు.

యజ్ఞాధికారం (51, 13) ప్రకారం మరీచి రచనలు పదకొండు; మరితక్కిన మూడు రచనలు ఏమిటో, ఏమైనవో తెలియదు.

భృగువురచనలు పదకొండుఅనీ, పదమూడుఅనీ, 14 అనీ ఆయా గ్రంథాలు పేర్కొన్నవి. ఇందులో రెండు తప్ప తక్కినవన్నీ 'అధికారములు' లేదా 'అధికరణములు' గా ప్రసిద్ధములు. భృగువుమాత్రం తనరచనలు పదకొండు అని తన 'యజ్ఞాధికారం' లో పేర్కొన్నాడు (భార్గవం యత్ మయాకృతమ్ తత్ ఏకాదశధా మతమ్-51, 13); వీటి మొత్తం పరిమాణం 50వేల గ్రంథములు.

1. ఖిలం (= ఖిలతంత్రం).

2. పురాధికారం (= పురాతంత్రం)

3. మానాధికారం.
4. అర్చనాధికారం.
5. వర్ణాధికారం.
6. నిరుక్తాధికారం
7. ప్రకీర్ణాధికారం.
8. యజ్ఞాధికారం.
9. వాసాధికారం.
10. క్రియాధికారం.
11. ఉత్తరతంత్రం.
విమానార్చనాకల్పంలో ఇంకో రెండు అధికంగా చెప్పబడినవి.
12. చిత్రాధికారం.
13. ప్రతిగృహ్యాధికారం.
వాసాధికారంలో ఇంకొకటి అధికంగా చెప్పబడింది.
14. ఖిలాధికారం.

భృగువుయొక్క రచనల మొత్తం పరిమాణం 64 వేల గ్రంథములు (భృగుణా చతుష్షష్టి సాహస్రమ్ సముదాహృతమ్).

మరీచి రచనల మొత్తం (లక్ష గ్రంథముల)లో భృగువురచనల మొత్తం సగం అని ఆనందసంహిత పేర్కొన్నది (అంటే భృగువురచనల మొత్తం 50 వేల గ్రంథములు) (లక్షగ్రంథేన మారీచం తదర్ధం భృగుణోదితమ్).

ఆనందసంహిత చెప్పిన సంఖ్య, యజ్ఞాధికారంచెప్పిన సంఖ్య (50 వేల) తో సరిపోతున్నది. బహుశః భృగువు పదకొండు రచనలే చేసి ఉండ వచ్చు; ఈ పదకొండింటిలో చివరిది, అంటే 'ఉత్తరతంత్రం' తరువాత చేర్చబడిఉంటుంది ('ఉత్తర' అనే పదానికి 'తరువాతది' అని అర్థం).

భృగువుయొక్క రచనలు పదకొండింటిలో నాలుగు సమగ్రంగా లభించినవి- 1. క్రియాధికారం (39 అధ్యాయాలు), 2. ప్రకీర్ణాధికారం (37 అధ్యాయాలు), 3. యజ్ఞాధికారం (51 అధ్యాయాలు), 4. ఖిలాధికారం (43 అధ్యాయాలు).

శ్రీనివాసమఖి తన వ్యాఖ్యానంలో పురాతంత్రం (= పురాధికారం) నుంచి విరివిగా ఉద్ధరించినాడు. తిరుమలతిరుపతి లోని వైఖానసకుటుంబాలలో - 1. వాసాధికారం (51 అధ్యాయాలు), 2. అర్చాధికారం

(38 అధ్యాయాలు), 3. నిరుక్తాధికారం (36 అధ్యాయాలు) - ఈమూ డింటి వ్రాతప్రతులు ఉన్నవని తెలుస్తున్నది. మానాధికారం, చిత్రాధికారం, వాసాధికారం- ఈ మూడింటిలోని కొన్నిభాగాలు-'ప్రతిష్ఠానుక్రమణిక' (వైఖానసభగవచ్ఛాస్త్రమాలా ప్రచురణ- నల్లూరు, 1979) వంటి సంకలన గ్రంథాలలో ఉద్ధరింపబడినవి.

'యజ్ఞాధికారంలో ఇట్లా ఉన్నది:

"మంత్రాశ్చోపచారాంశ్చ ఉత్తరోక్తవదాచరేత్ ।
నామవర్ణాక్షరాదీని వర్ణాధికరణోక్తవత్ ॥
ఋషిచ్ఛందో ధిదేవాంశ్చ క్రియాధికరణోక్తవత్ ।
నిత్యార్చనం నిరుక్తోక్తం యజ్ఞే చోత్సవ ఈరితః ॥
అగ్నికార్యవిశేషం చ పురాతంత్రోక్తవచ్చరేత్ ।
యద్యచ్ఛాస్త్రేష్వనుక్తం తత్ ఖిలాధికరణోక్తవత్ ॥
మానోన్మానప్రమాణాని మానాధికరణోక్తవత్ ।
అర్చాపరిచ్ఛేదం చైవాభ్యంజనవిధిం తథా ।
కర్మశేషంచ సర్వత్ర ప్రకీర్ణకవిధానతః ॥
అర్చనస్యాధికారోక్తవిధిః సార్వత్రికో భవేత్ ।
తంత్రోత్తరేషు విధయః సర్వే సార్వత్రికా మతాః" ॥
-(యజ్ఞాధికారం, 51, 43-48)

-మంత్రాలు-ఉపచారాలు-ఉత్తరాధికారంలో; నామములు, వర్ణములు, అక్షరములు- వర్ణాధికరణంలో; ఆవరణలు, ప్రతిమలు-వాసాధికారంలో; ఋషులు, ఛందస్సు, అధిదేవతలు- క్రియాధికారంలో; నిత్యార్చనావిధి-నిరుక్తాధికారంలో; ఉత్సవములు-యజ్ఞాధికారంలో; అగ్నికార్యవిశేషాలు-పురా తంత్రంలో; వైశాస్త్రాలలో చెప్పబడనివాటిని-ఖిలాధికారంలో; ప్రతిమాదుల ప్రమాణములు-మానాధికరణంలో; అర్చనావిధులు, అభ్యంజనవిధి, శేషించిన కలాపమంతా-ప్రకీర్ణాధికరణంలో-చెప్పబడినవిధంగా ఆచరించాలి.

- అర్చనాధికారంలో చెప్పబడిన విధి సార్వత్రికమైనది. ఇంక ఉత్తర తంత్రంలో చెప్పబడిన విధులు అన్నీ సార్వత్రికములు.

'తంత్రములు' అనే పేరుతో ఉన్న నాలుగు, అత్రియొక్క రచనలుగా పేర్కొనబడినవి:

1. పూర్వతంత్రం (ఇది సమూర్తార్చనాధికారంలో చెప్పబడిన 'పాద్మ సంహిత' కావచ్చు).

2. ఆత్రేయతంత్రం (దీనిని ఆనందసంహిత 'మహాతంత్రం' అన్నది).

3. విష్ణుతంత్రం.

4. ఉత్తరతంత్రం.

అత్రి యొక్క రచనల పరిమాణం 88 వేల గ్రంథములని ఆనంద సంహిత పేర్కొనగా (అష్టోత్తరాశీతి సాహస్రగ్రంథసంఖ్యాత్రినోచ్యతే), 28 వేల గ్రంథములని సమూర్తార్చనాధికారం పేర్కొన్నది ( అష్టావింశతి సహస్రాణి గ్రంథసంఖ్యా మయా శ్రుతా). మనకులభించిన అత్రియొక్క రచన సమూర్తార్చనాధికారం (40 అధ్యా.) మాత్రమే; దీనిని కొందరు 'ఉత్తర తంత్రం' గా పేర్కొన్నారు. అయితే, ఇందులో వివరింపబడిన-ప్రతిమార్చనకు సంబంధించిన విషయాలను పట్టి, దీనికి 'తంత్రం' అనే పేరుకంటె, అధికారం అనే పేరే సమంజసంకాగలదు. ఇది చాలా పెద్దరచన; రెండువేల గ్రంథములకంటె అధికపరిమాణంకలది.

విమానార్చనాకాండ ప్రకారం కాశ్యపుని రచనలు మూడు (త్రికాండేష్వపి):

1. సత్యకాండ.

2. తర్కకాండ.

3. జ్ఞానకాండ.

ఆనందసంహిత చెప్పిన ఇంకోరచన (17, 42-48)-

4. కర్మకాండ (ఇది తర్కకాండకు ఇంకోపేరట).

కాశ్యపుని రచనలు అయిదు అని వాసాధికారం (పంచకాండ మితి స్మృతం), యజ్ఞాధికారం (51, 17-పంచధా కాశ్యపీయం స్యాత్ అధికార ప్రభేదతః) పేర్కొన్న ప్రకారం మరోరెండురచనలు-

5. సంతానకాండ.

6. కాశ్యపకాండ.

కాశ్యపుని రచనలు మూడుఅనీ, వాటిపరిమాణం 28 వేల గ్రంథములు

అని ఆనందసంహిత (17, 48- అష్టావింశతిసాహస్రం కాశ్యపేనాధికం కృతమ్) (కర్మకాండ, తర్కకాండ ఒకేరచనకు రెండుపేర్లు అని భావించినప్పుడు కాశ్యపునిరచనలు మూడు; లేదా కర్మకాండ ప్రత్యేకరచన అని భావించినప్పుడు కాశ్యపునిరచనలు నాలుగు). కాశ్యపునిరచనలు అయిదు అని చెప్పిన వాసాధికారం ప్రకారం వాటి పరిమాణం 64 వేల గ్రంథములు (చతుష్షోడశసంఖ్యాతు కాశ్యపే). ఈసంఖ్య, కాశ్యపుని మూడు రచనల పరిమాణం 64 వేల గ్రంథములని విమానార్చనాకల్పం చెప్పినసంఖ్యతో సరిపోతున్నది. కాశ్యపుని రచనలలో జ్ఞానకాండ (108 అధ్యా.) మాత్రమే మనకులభించింది. ఇది గద్యరచన; 3, 800 గ్రంథముల పరిమాణంకలది.

వైఖానసాగమం, వైఖానససూత్రానికి అనుషంగిక రచన అని చెప్పాలి. పూర్వతంత్రంనుంచి, శ్రీనివాసమఖి పేర్కొన్న దానినిబట్టి సూత్రంలో దేవాలయంలోని అర్చనను గూర్చిన వివరాలేమీ లేవనీ, గృహంలోచేసే అర్చనను గూర్చి మాత్రం సంక్షిప్తంగా చెప్పబడినదనీ తెలుస్తున్నది. ఇంక కాశ్యపాది నలుగురుమునులు దేవాలయార్చన ప్రాముఖ్యాన్ని గుర్తించి, గృహంలో అర్చనకు సూత్రంఇచ్చిన సూచనలను పరిగ్రహించి, ఆగమరచన చేశారు- మానవకల్యాణం దృష్టిలో పెట్టుకొని.

వైష్ణవం సూత్రమేతత్తు సర్వసిద్ధికరం పరం ।
అద్యత్వాత్సర్వసూత్రాణాం వైష్ణవత్వాచ్చ తత్తు వై ॥
మయానువర్తితం తద్వత్ కాశ్యపాత్రిమరీచిభిః ।
గృహే పురుషపూజాయా విధానం ఋషిసత్తమాః ॥
ఉక్తం సంక్షేపతః సూత్రే నోక్తమాలయపూజనమ్ ।
ప్రోక్తం విఖనసాసూత్రే ఋషీణాం బ్రహ్మవాదినామ్ ॥
ఆలయార్చా గృహార్చేతి చోభయం శ్రుతిచోదితమ్ ॥
ఆలయార్చావిధిః సోఽయం వైదికః సర్వసిద్ధిదః ।
సర్వలోకహితార్థాయ ప్రోక్తం అస్మాభిర్విశేషతః ॥

- ఈవైష్ణవసూత్రం ఉత్తమం, సర్వసిద్ధికరం; ఇది వైష్ణవంకాటంచేత సర్వసూత్రములకు ఆద్యం. ఈ కారణంచేత నేను, కాశ్యప-అత్రి-మరీచులు దీనిని అనువర్తించినాము. సూత్రమందు-గృహంలో 'పురుష' పూజా విధానం సంక్షేపంగా చెప్పబడింది; ఇంక ఆలయపూజావిధానం అసలు చెప్పబడవేలేదు.

- ఆలయార్చ, గృహార్చ-ఈ రెండూ శ్రుతిచేత చెప్పబడినవే అని సూత్ర

మందు విఖనసముని బ్రహ్మవాదులైన ఋషులకు చెప్పినాడు. ఇందులో ఆలయార్చావిధి వైదికమైనది. సర్వసిద్ధిప్రదమైనది. లోక హితార్థమై మాచేత ఇది విశేషంగా చెప్పబడినది.

అయితే సూత్రం, ఆలయార్చనకూడా సంక్షిప్తంగా చెప్పినదని ఖిలాధికారం (2, 3-4) పేర్కొన్నది:

"వైఖానసేన విపులం నోక్తమాలయపూజనమ్ ।
ఆలయార్చా గృహార్చా చేత్యుభయం శ్రుతిచోదితమ్ ॥
తేనాత్ర సకలం ప్రోక్తం గ్రంథవిస్తరభీరుణా ।
ఉక్తశేషమనుక్తంచ సర్వమత్ర వదామి వః ॥
శృణ్వంతు మునయః సర్వే విష్ణోరర్చా జగత్పతేః ।
ఆలయార్చావిధానాని శాంతికాదీని వై క్రమాత్"॥

-విఖనసునిచేత ఆలయ పూజా విధానం విపులంగా చెప్పబడలేదు. ఆలయార్చ, గృహార్చ-ఈరెండూ శ్రుతిసమ్మతములైనవే. అందుచేత గ్రంథవిస్తరభీతి ఉన్నప్పటికీ, సకలం వివరిస్తాను. చెప్పబడిన వాటిలో మిగిలినవిషయాలు, అసలు చెప్పబడని విషయాలు సర్వం మీకు నేను చెబుతున్నాను. కావున ఓ మునులారా! జగత్పతి అయిన విష్ణువుయొక్క ఆలయార్చనా విధిని, శాంతికాదులను క్రమంగా వివరిస్తాను; వినండి.

'ప్రతిష్ఠావిధిదర్పణం' యొక్క ప్రథమాధ్యాయంలో నృసింహవాజపేయయాజి, అయామునులరచనలను, వాటిపరిమాణములను సంక్షిప్తంగా తెలిపినాడు; ఈ సంక్షిప్తవివరణను మనం ప్రమాణంగా గ్రహించవచ్చు (ఈగ్రంథాన్ని ఆర్. పార్థసారథి భట్టాచార్య తెలుగులిపిలో మద్రాసులో, 1948 లో పరిష్కరించి, ముద్రించినారు ).

'వైఖానసాగమం' అని చెప్పబడే రచనలలో క్రింది విషయాలు విపులంగా చర్చింపబడినవి: ఆలయనిర్మాణం, ఆలయభేదాలు, ఆలయసంప్రోక్షణ (శుద్ధిక్రమం), ప్రతిమాప్రతిష్ఠ, నిత్యార్చనావిధి, అందుకు కావలసిన సామగ్రి, ఆయావిధులకు సంబంధించిన మంత్రములు, నైమిత్తికవిధులు, అసాధారణ పరిస్థితులలో నిర్వహింపవలసిన విధులు, ఆయాలోపాలకు ప్రాయశ్చిత్తాలు.

వైఖానసులు ఒక్క విష్ణువును మాత్రమే భగవంతునిగా గుర్తించినప్పటికీ, ఇతరదేవతలను కూడా- విష్ణువుయొక్క పరివారంగామాత్రమే-అర్చించటానికి ఆగమం అవకాశం కల్పించింది.

"అంగభావేన దేవానామర్చనం న నిషిధ్యతే ।
స్వతంత్ర్యబుద్ధ్యా కుర్వన్ హి బ్రాహ్మణో నకరం వ్రజేత్ ॥

-ఆయాదేవతలను అంగభావంతో (= విష్ణువుయొక్క పరివారంఅనే భావంతో) అర్చించటం నిషిద్ధంకాదు. కాని, వారిని స్వతంత్రదైవములుగా భావించి, అర్చించే బ్రాహ్మణుడు నరకానికి పోతాడు.

నృసింహవాజపేయయాజి యొక్క 'భగవదర్చాప్రకరణం' వంటిరచనలు కేవలం నిత్యార్చనకు సంబంధించిన విషయాలనే వివరించాయి. 'బ్రహ్మోత్సవానుక్రమణిక' వంటి రచనలు కొన్ని మహోత్సవాలను గూర్చి వివరించినవి. కొన్ని చిన్నరచనలు ఆయాసమయాలలో చేసే ఆలయసంప్రోక్షణ, నిత్యనైమిత్తిక అర్చనలలో సంభవించే లోపాలకు ప్రాయశ్చిత్తాలు, ప్రతిష్ఠలు మున్నగువిషయాలను వివరించినవి.

దేవాలయవాస్తు, విష్ణువుయొక్క తదితర అంగదేవతలయొక్క ప్రతిమల నిర్మాణం, ఆప్రతిమల ప్రతిష్ఠ మున్నగువాటిని గూర్చి అమూల్యములగు సమాచారాన్ని అందిస్తున్నవి ఆగమగ్రంథాలు. వైఖానసాగమం, నిర్ద్వంద్వంగా వేదసంప్రదాయానుయాయి కాబట్టి దీనిలో, వేదవిహితములైన, ఆసక్తికరములైన చిన్న-పెద్దక్రియావిశేషాలు-ప్రతిమార్చనకు సంబంధించినవి-వివరింపబడినవి.

వైఖానసాగమం యొక్క స్థాయిని విశదీకరించే అర్వాచీన రచనలలో ముఖ్యమైనవి వ్యాఖ్యానములు:

1. నృసింహవాజపేయయాజి రచనలు-వైఖానసకల్పసూత్రంలోని స్మార్త విభాగానికి వ్యాఖ్య, సకలాగమసారసంగ్రహమునకు ప్రతిష్ఠావిధిదర్పణ వ్యాఖ్య (ఈ రెండురచనలు లభ్యములు- మద్రాసు-1948).

2. శ్రీనివాసమఖి (తరచుగా శ్రీనివాసదీక్షితులు అనికూడా) రచనలు: బాదరాయణుని శారీరకసూత్రాలుమీది 'లక్ష్మీవిశిష్టాద్వైత భాష్యం,' ఉత్తమబ్రహ్మవిద్య (ముక్తికి రాజమార్గం ప్రతిమారాధన అని సమర్థించే రచన), వైఖానసమహిమామంజరి (వైఖానసకల్పసూత్రవిశిష్టతను వివరించే రచన). శ్రీనివాసమఖి తిరుమలలోని వేంకటేశ్వరాలయంలో అర్చకుడు; ఈయనరచనలు శ్రీవైఖానసగ్రంథమాలవారి చేత, మద్రాసులో, హిందూరత్నాకరముద్రణాలయంలో, తెలుగు లిపిలో 1931 పూర్వమే ముద్రింపబడినవి). వైఖానసగృహ్యసూత్రములకు శ్రీనివాసమఖి రచించిన తాత్పర్యచింతామణి అనే వ్యాఖ్యను, తిరుమలతిరుపతి దేవస్థానంవారు, ఆర్. పార్థసారధిభట్టాచార్య

సంపాదకత్వంలో 1967 లో రెండు సంపుటాలుగా ప్రచురించారు.

3. వైఖానసకల్పసూత్రమునకు-సుందరరాజు (ప్రయోగవృత్తి), సంజీవ యాజి, వరదరాజసూరి, భాస్కరభట్టు, కోదండరామ పాకయాజి మున్నగువారు వ్యాఖ్యలు రచించారు.

భృగువు, అత్రి, మరీచి, కాశ్యపుడు- ఈ నలుగురుమునులు వైఖానస శాస్త్రస్వభావాలనునిర్ధారిస్తూ రచనలు చేసిన తరువాత ప్రత్యేక విషయాలపై మరికొన్ని రచనలు వెలసినవి; కాని, వాటి రచనాకాలాలు సరిగా తెలియవు.

కేశవాచార్య అనే ప్రాచీనరచయిత బాదరాయణుని వేదాంత సూత్రాలకు "లక్ష్మీవిశిష్టాద్వైత" దృక్పథంతో 'వృత్తి' రచించాడు; ఈయన ప్రతిమార్చనకు సంబంధించిన 'అర్చనానవనీతం' అనే స్వతంత్రరచనకూడా చేసినాడు. మాధవాచార్యకుమారుడు, వరదాచార్యశిష్యుడు అయిన నృసింహవాజ పేయయాజి ఇంకొక ఉత్తమరచయిత; ఈయన ప్రస్తావన ఇంతకుముందే వచ్చింది కదా. ఈయన శిష్యుడైన భాస్కరభట్టాచార్యుడు దైవిక-మాను షిక సూత్రాలకు, ఋగ్వేదమందలి ఖిలసూత్రాలకు వ్యాఖ్యలు రచించినాడు. వైఖానససూత్రాలకు 'ప్రయోగవృత్తి' రచించాడు సుందరరాజు.

ఇంకబహుళగ్రంథ రచయిత శ్రీనివాసమఖి (ఈయనకు శ్రీనివాసాధ్వరి, శ్రీనివాసదీక్షితుడు అనికూడా పేర్లు). శ్రీనివాసమఖి- 'సర్వతంత్ర స్వతంత్రుడు' గా, 'కవికులతిలకుడు' గా కీర్తింపబడినాడు; అంతేకాదు, వైఖానసులకు 'వేదాంతదేశికుడు' గా వందనీయుడైనాడు. శ్రీనివాసమఖి రచనలు ఇంతకుముందే పేర్కొనబడినవి. తరువాత, అనంతనారాయణ 'వార్తికగ్రాహిణి' పేర వేదాంతసూత్రాలకు 'వృత్తి' రచించినాడు. శ్రీనివాసమ ఖికి ప్రశిష్యుడైన ఇంకో శ్రీనివాసమఖి 'ఉత్తమ బ్రహ్మవిద్య' ను రచించినట్లు చెబుతారు. అయితే ఈ ఇరువురు శ్రీనివాసమఖులు విషయంలో, వారి రచనలవిషయంలో కొంత అస్పష్టతలేకపోలేదు. అయితే శ్రీనివాసమఖి ఒక్కడే (ఇరవురుకాదు) అనీ, ఆపేర ఉన్నరచనలన్నీ ఆ ఒక్కనివే అనీ, అతడు తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయంలో అర్చకుడనీ కొందరి తలంపు.

ఆగమంయొక్క ప్రధానాశయాన్ని గూర్చి ప్రకీర్ణాధికారం ఇట్లా వివరి స్తున్నది (30, 101-102):

"షట్కాలం వా త్రికాలం వా ద్వికాలం కాలమేవ వా ।

అలయే భగవత్పూజా సౌమ్యేన విధినా కృతా ।
సర్వసంపత్కరీ సా స్యాజ్జగతామితి శాసనమ్ ॥"

-దినంలో ఆరు లేదా మూడు లేదా రెండు సార్లు అయినా, లేదా ఒక్క సారిఅయినా ఆలయంలో సౌమ్యవిధితో భగవత్పూజచేస్తే అది జీవులందరకు సర్వసంపత్కరి కావటం నిశ్చయం.

ప్రతిమారాధన యొక్క విశిష్టతను, విలువను సోపపత్తికంగా సమర్థిం చింది వైఖానసాగమం. కాశ్యపుని జ్ఞానకాండ (38వ అధ్యా.) పూజార్థం ప్రతిమలను ప్రతిష్ఠించటాన్ని గూర్చి ఇట్లా వివరిస్తున్నది:

"అథ విష్ణోర్దేవేశస్య ప్రతిష్ఠావిధిం వ్యాఖ్యాస్యామః । సోఽవ్యయః సర్వవ్యాప్యాకాశోపమః నిష్కలః పరమాత్మా జ్ఞానేన భక్త్యాచ యుక్త స్యాంతః సన్నిహితోభవతి । 'ఆత్మాగుహాయాం' నిహితోఽస్య జంతోరితి శ్రుతిః । తస్మాత్ భక్తిమతా తేన సకలం సంకలయ్య భక్త్యా మంత్రైశ్చ ప్రతిష్ఠాపితే బింబే భక్తానుకంపయా సకలః తద్బింబే సమావిష్టః దేవః ప్రతిష్ఠితో భవేత్ । అవ్యక్తం శాశ్వతం అనాదిమధ్యాంత మతీంద్రియం దేవైరప్యనభిలక్ష్యం యద్వైష్ణవం పదం తత్ప్రాప్తిఫలం తదర్చనం, తస్య మూలం ప్రతిష్ఠా ।"

-ఇంక దేవేశుడైన విష్ణువుయొక్క ప్రతిష్ఠావిధిని వ్యాఖ్యానిస్తాము. ఆయన అవ్యయుడు, ఆకాశంవలె సర్వవ్యాపి, నిష్కలుడు, పరమాత్మ. కాని, జ్ఞాని లేదా భక్తుని అంతఃకరణలో ఆయన సన్నిహితుడుగా ఉంటాడు. ఆయన జంతువుల (= జీవుల) యొక్క ఆత్మగుహాలయందు సన్నిహితుడుగా ఉంటాడని శ్రుతిచెబుతున్నది. అందుచేత భక్తుడు, భగవంతుని సకలుడుగా భావించి, భక్తితో మంత్రపురస్సరంగా, 'బింబము' ను ప్రతిష్ఠించితే, భక్తుని మీది అనుకంపతో, భగవంతుడు, అబింబమునందు సకలుడుగా సమావిష్టుడై ప్రతిష్ఠితుడై ఉంటాడు. అట్టి ప్రతిమను అర్చించిన భక్తుడు-అవ్యక్తం, శాశ్వతం, ఆదిమధ్యాంతరహితం, అతీంద్రియం, దేవతలకు కూడా కనపడనిది అయిన వైష్ణవపదమును పొందుతాడు. అది ఈ అర్చనకు ఫలం. ఇంతటి మహాఫలమునకు మూలం విష్ణుప్రతిమాప్రతిష్ఠ అవుతున్నది.

భృగువుయొక్క ప్రకీర్ణాధికారం (37, 126-144) ప్రతిమార్చన చేయ వలసిన ఆవశ్యకతను గూర్చి విపులంగా వివరించింది:

"విష్ణుధ్యానపరాః సంతో విష్ణ్వర్చనపరాయణాః ।

తే విష్ణుసదృశా జ్ఞేయా నహి తాన్ బాధతే కలిః ॥
యత ఏవమతో లబ్ధ్వా శరీరం కర్మసాధనమ్ ।
శుభం కర్మైవ కర్తవ్యం తత్ప్రసాదాయ మానవైః ॥
ప్రసాదితేఽస్మిన్సర్వేషాం సర్వవర్ణాశ్రమ కర్మభిః ।
సర్వే హస్తగతాః కామా ముక్తిశ్చాఽతేః కరస్థితా ॥
కార్యార్థా మూర్తయస్తస్య లోకకల్యాణకారకాః ।
అతః సాకారమేవేష్ట్వా భక్త్యేమం సిద్ధిమాప్నుయాత్ ॥
ఇదంచ శాస్త్రమవలంబ్య పూజయే ద్విష్ణుమవ్యయమ్ ।
యద్ధ్యానం కేవలం ప్రోక్తం శాస్త్రే క్వచిదనాశ్రయమ్ ॥
న తత్రేంద్రియదౌర్బల్యాత్ కర్మస్థస్యాధికారితా ।
యథాగిరితటాగ్రస్థవనస్పతిఫలేచ్ఛయా ॥
ఉపాయే వర్తతేఽశ్రాంతస్తథాఽసౌ యత్నమాచరేత్ ।
సర్వత్రక్రమవాన్ యత్నః కార్యో నేచ్ఛైవ కేవలా ।
తత్కాయవాఙ్మనో యోగైః క్రమాదిచ్ఛేత్ పరాంగతిమ్ ॥
నిరాకారేతు యా భక్త్యా పూజేష్టా ధ్యానమేవ వా ।
రమణీయమివాభాతి తదనర్థస్యకారణమ్ ॥
స్థూలభావప్రసంగీని జన్మనాఽస్యేంద్రియాణి తు ।
సూక్ష్మాచ్చ న ప్రపద్యంతే చిరాచ్చ కిముతాఽచిరాత్ ॥
న చ రూపం వినా దేవో ధ్యాతుం కేనాపిశక్యతే ।
సర్వరూపనివృత్తా హి బుద్ధిః కుత్రాస్య తిష్ఠతి ॥
నివృత్తా గ్లాయతే బుద్ధిః నిద్రయా హి పరీయతే ।
తస్మాద్విద్వానుపాసీత బుద్ధ్యా సాకారమేవ తమ్ ॥
అస్తి తస్యపరోక్షం తదితి కించిదనుస్మరేత్ ।
సర్వదా కారముద్దిష్టం న పరిత్యజ్య పండితః ॥
పరం దేవముపాసీత ముక్తయే వా ఫలాయ వా ।
పూజాద్యనుగ్రహాయాదావావిర్భూతశ్చతుర్భుజః ।
తస్మాత్తేనైవరూపేణ హ్రియా లక్ష్మ్యా సమాయుతః ॥
ధ్యేయః సేవ్యోఽర్చనీయశ్చ సదా నారాయణో బుధైః ।
సాకారేఽస్మిన్ కృతా పూజా స్తుతిర్వా ధ్యానమేవవా ।
విధినా శాస్త్రదృష్టేన తస్మిన్నేవ కృతా భవేత్ ॥"

- విష్ణుధ్యానపరులు, విష్ణ్వర్చనపరాయణులు అయిన సజ్జనులు విష్ణు సదృశులు అవుతారు. వారిని కలి బాధింపదు. అట్లా కర్మ సాధనపరమైన శరీరం పొంది, భగవత్ప్రసాదం కోసం, మానవులు శుభకర్మలను చేయాలి. సర్వవర్ణాశ్రమ కర్మలతో భగవంతుని ప్రసన్నునిగా చేసుకొంటే అందరకు అన్ని కోరికలు హస్తగతములవుతాయి. అట్లాగే అంతమందు ముక్తి కరస్థిత మవుతుంది. పూజాకార్యార్థములైన మూర్తులు లోకకల్యాణ కారకములు. అందుచేత సాకారమూర్తులే అభీష్టములైనవి. వాటిని భక్తితో పూజిం చితే సిద్ధిని పొందగలరు. అవ్యయుడైన విష్ణువును ఈ శాస్త్రానుసారంగానే పూజించాలి. అనాశ్రయమైన (= ఆలంబన రహితమైన = ప్రతిమాదులు లేని) కేవల ధ్యానమును గూర్చి శాస్త్రములు క్వాచిత్కంగా చెప్పటం కద్దు. కాని మానవ సహజములైన ఇంద్రియ దౌర్బల్యాలవల్ల, ప్రాపంచిక కర్మల ప్రభావాల వల్ల దీనిని సాధించటం కష్టం. గిరితటాగ్రమందున్న వృక్షంమీది ఫలమును పొందవలెనంటే అందుకు తగిన ఉపాయమును అనుసరించాలి. అట్లాగే భగవంతుని పొందటానికి అశ్రాంతంగా యత్నం చేయాలి. ఎల్లప్పుడు క్రమపద్ధతిలో పాటుపడాలి. కేవలం ఇచ్ఛవల్ల ఫలం చేకూరదు. కాయ - వాక్ - మనస్సంయోగంతో పరమగతిని చేరటానికి క్రమప్రయత్నం జరగాలి. దైవమును నిరాకారంగా పూజించటం లేదా ధ్యానించటం తొలుత రమణీయంగానే భాసిస్తుంది. కాని అది అనర్థహేతువు అవుతుంది. జన్మతః మానవుని ఇంద్రియాలు, స్థూల పదార్థాలను మాత్రమే గ్రహించి నిలుపుకోగలవు. కాని సూక్ష్మ విషయాలను కొంచెంసేపు కూడా నిలువు కోలేవు; ఇక చాలాకాలం అనే ప్రసక్తే లేదు. రూపం లేకుండా దేవుని ధ్యానించటం ఎవ్వరికీ శక్యం కాదు. రూపమే లేనప్పుడు మనస్సు దేనిమీద లగ్నమవుతుంది? రూపదర్శనం లేనప్పుడు మనస్సు గ్లాని పొందుతుంది. లేదా నిద్రపోతుంది. కావున, విద్వాంసుడు, బుద్ధిపూర్వకంగా భగవంతుని సాకారంగానే ఉపాసించాలి. అయితే, ఆ సాకారానికి పరోక్షంగా శక్తి ఒకటి ఉన్నదని మరచిపోరాదు. కావున పండితుడు, సర్వధా, ఉద్దిష్టమైన ఆకారమును ఉద్దేశించియే పరదైవమును ముక్తికొరకు లేదా ఐహికఫలం కొరకు ఉపాసించాలి. భక్తులను అనుగ్రహించటం కోసం విష్ణువు తొలుత చతుర్భుజుడుగా ఆవిర్భవించినాడు. ఆ రూపంతోనే హ్రీ - లక్ష్మీయుతుడై ఉన్నాడు. అట్టి నారాయణుని బుధుడు సర్వదా ధ్యానించాలి, సేవించాలి, అర్చించాలి. కావున శాస్త్రానుసారంగా సాకార విష్ణువును పూజించటం, లేదా స్తుతించటం, లేదా ధ్యానించటం చేస్తే, నిరాకారుడైన విష్ణువును తప్పక పొందుతాడు.

ఇతర ఆగమాల వలెనే, వైఖానసాగమం కూడా అర్చకులకోసం నిర్మాణం చేయబడిన గ్రంథాల సంపుటి. ఈ అర్చకులు గృహార్చనలోను, ఆలయార్చనలోనూ నిపుణులు. అయితే, ఈ రెండింటిలోనూ ఆలయార్చన శ్రేష్ఠమని పురాతంత్రం నిర్దేశిస్తున్నది:

"ఆలయే పంచమూర్తీనామర్చనం త్వధికం భవేత్ ।
శతక్రతూనాం యజనే తత్ఫలం పరికీర్తితమ్" ॥

-ఆలయంలో పంచమూర్తుల అర్చన అదనంగా ఉంటుంది. వంద క్రతువులు చేయటంవల్ల లభించే ఫలం, ఆలయార్చనవల్ల లభిస్తుంది.

వైదికమైన ఆలయార్చన విష్ణువునకు చాలా ప్రీతికరమైనదని చెప్పబడినది (ఆలయార్చనా కర్మేదం వైదికం భగవత్ప్రియం). కావున నిత్యార్చనకు, నైమిత్తికార్చనలకు సంబంధించిన సర్వవిషయాలను, అర్చకులను దృష్టిలో పెట్టుకొని వివరించటం ఆగమాల ధ్యేయం. అర్చనలకు సంబంధించిన విధులను అన్నింటిని, సూక్ష్మాతిసూక్ష్మంగా సక్రమంగా వివరించటం వైఖానసాగమ గ్రంథాల ప్రత్యేకత. అజాగ్రత్తవల్ల, లేదా అజ్ఞతవల్ల జరిగే చిన్న పెద్ద లోపాలను కూడా పరిశీలించి, వాటికి ప్రాయశ్చిత్త విధులను ఇవి సూచించినవి. పూజా విధులలో, ఉత్సవ విధులలో అవలంబించవలసిన జాగ్రత్తలను గూర్చి ఈ గ్రంథాలు తరచుగా నిర్దేశిస్తూ ఉంటాయి. ఆలయప్రాంగణం కాని, ప్రతిమలు కాని, అశుచిపాలుకావటం సంభవిస్తూ ఉంటుంది. అందులకు చిన్న పెద్ద సంప్రోక్షణ విధులను కూడా ఆగమాలు నిర్దేశించినవి.

ప్రకీర్ణాధికారం ఇంకా ఇట్లా ప్రతిపాదిస్తున్నది:

"యాదృశీ వర్తతే పూజా యా బింబానాంచ సంస్థితిః ।
న కించిత్తామతిక్రమ్య పూర్వోక్తాం తు సమాచరేత్ ॥"

-(34, 10-11)

తస్మాత్సర్వ ప్రయత్నేన పూర్వైరాచరితం చరేత్ ।
అన్యథా చేత్తు కుర్వాణో దేవాద్యైవాపరాధ్యతి ॥

-(34, 13).

-పూర్వోక్తములైన పూజా విధులను, బింబముల సంస్థితిని ఏ మాత్రం అతిక్రమించకుండా, అర్చన సాగించాలి.

- కావున, పూర్వులు ఆచరించిన దానినే, సర్వప్రయత్నంతో ఆచరించాలి. అట్లాకాక, వేరే విధంగాచేస్తే, దైవంపట్ల అపరాధమొనర్చినట్లే.

ఏ విధమైన లోపాలు, విఘాతాలు లేకుండా పూజలు నిర్వహించవలసిన బాధ్యత అర్చకుల మీద ఉన్నది. సక్రమంగా చేసిన పూజ లోకకల్యాణ కారకమవుతుంది. అట్లాకాకపోతే, అది లోకోపద్రవ కారణం కావచ్చు. కావున అర్చకుడు జ్ఞానవంతుడు, అప్రమత్తుడు కావాలి.

"అర్చకః ప్రణిధిర్యస్మాత్ రాజ్ఞోరాష్ట్రస్య కల్పతే ।
తస్మాత్సమాహితః కుర్యాద్యథా పూజా న లుప్యతే ।
ఆపద్యపి కష్టాయాం పూజా మేతాం న లోపయేత్ ॥
యద్యైవ లుప్యతే పూజా యేన కేనాపి హేతునా ।
అగ్రేఽర్చక మియాద్దోష అర్ద్రిమేష్యోపరాధ్యతి" ॥
- (27, 83-84).

-రాజుయొక్క, రాష్ట్రంయొక్క ప్రతినిధి అయిన (= శుభంకోరే) అర్చకుడు సమాహితమనస్సుతో, లోపంరాకుండా పూజనిర్వహించాలి. తాను ఆపదలో ఉన్నా, తనకు కష్టం సంభవించినా, పూజలో లోపంమాత్రం రానీయరాదు. ఏకారణం చేతనైనా పూజలో లోపం సంభవిస్తే అతడు సరిక్రొత్త అపరాధం చేసినట్లు అవుతుంది. లేదా విఘాతం కలిగితే, ఆదోషం మొదట అర్చకునికే చెందుతుంది.

అయితే అర్చకుడు గౌరవంగా, దైన్యంలేని జీవనంచేయటానికి తగిన వసతులు కల్పించటం రాజుయొక్క, ప్రజలయొక్క బాధ్యత అనికూడా ఆశాస్త్రాలు నిర్దేశించినవి. కారణం-అర్చకుడు గృహస్థుడు, ఆయనకుకూడా బాధ్యతలు ఉన్నవి. అతడు వంశపారంపర్యంగా అర్చకత్వం స్వీకరిస్తాడు. జీవికకు ఇంకేవిధమైన లౌకిక కార్యక్రమాలు చేపట్టరాదు. పుట్టుకతోనే తాను అర్చకుడనని వైఖానసుడు విశ్వసిస్తాడు.

భాష్కర సంహిత ఇట్లా వివరిస్తున్నది:

"విప్రా వైఖానసాఖ్యా యే తు భక్తాస్తత్త్వముచ్యతే ।
ఏకాంతినః సుసత్వస్థా దేహాంతం నాన్యయాజినః ॥
కర్తవ్యమితి దేవేశం సంయజంతే ఫలంవినా ।
ప్రాప్నువంతి చ దేహాంతే వాసుదేవత్వ మబ్జజ ॥

- భక్తులైన వైఖానసవిప్రులు నిజంగా ఏకాంతినులు, సుసత్త్వస్థులు, ప్రాణమున్నంతవరకు ఇంకొక దేవుని పూజింపని వారుకావాలి. ఫలాపేక్షారహితంగా దేవేశుని పూజించాలి. అట్టివారు దేహాంతమందు వాసుదేవత్వాన్ని పొందుతారు.

ధనార్జనదృష్టితో అర్చకత్వం స్వీకరించినవాడు అపవిత్రుడు అవుతాడు; తక్కువస్థాయిగల 'దేవలకుడు' అవుతాడు. అటువంటివాడు ప్రాయశ్చిత్తం చేసుకొని, పవిత్రుడైతేతప్ప గర్భగుడిలో ప్రవేశించరాదు; ప్రతిమనుతాకరాదు (చూ. అనుబంధం-దేవాలయార్చకులకు సంబంధించినది). కావున ఆలయ నిర్మాణమునకు, ప్రతిమా ప్రతిష్ఠకు పూర్వమే అర్చకుని వసతులకు నిత్యపూజకు ఏర్పాట్లు తప్పక జరగాలి.

ప్రకీర్ణాధికారం ఇంకా ఇట్లా నిర్దేశిస్తున్నది:

యస్తు దద్యాదర్చకాయ భృత్యర్థం కేవలం ధనమ్ ।
అన్యద్వాప్యస్థిరం వస్తు న హరిస్తేన తుష్యతి ॥
లోభాన్మోహాదథాఽజ్ఞానాద్య ఆదత్తేఽర్చకోధనమ్ ।
వేతనార్థం తథా దద్యాద్యజమానో విమూఢధీః ।
ఉభౌ తౌ నరకం యాతో యావచ్చంద్రదివాకరమ్ ॥
విత్తార్థం పూజయేద్యస్తు నియమ్యాఽప్యవధిం హరిమ్ ।
స వై దేవలకోనామ సర్వకర్మబహిష్కృతః ॥

అదత్వా వసుధామగ్రే పూజనార్థమథార్చకే ।
నిర్మాతి బ్రాహ్మణం భూమో యజమానస్తు దేవలమ్ ॥
-(35, 477-481)

-కేవలం జీవనభృతిగా అర్చకునకు ధనమివ్వటం లేదా అస్థిరవస్తువులను సమకూర్చటం వల్ల హరి సంతోషింపడు. లోభంచేత, లేదా మోహంచేత లేదా అజ్ఞానంవల్ల అర్చకునకు వేతనంగా ధనమిచ్చే మూర్ఖపు యజమానుడు, అట్లా తీసుకొనే అర్చకుడు కూడా, ఆచంద్రార్కం నరకంపాలు అవుతారు. విత్తార్థం నియమితుడై హరినిపూజించేవ్యక్తి 'దేవలకుడు' అవుతాడు; అతడు సర్వకర్మబహిష్కృతుడు. పూజార్థం అర్చకునకు, ముందుగానే భూమి దానం చేయకుండా కేవలం వేతనమిచ్చే యజమానుడు అబ్రాహ్మణుని దేవలకునిగా మార్చినవాడు అవుతున్నాడు.

"తస్మాద్దాయేన భూమ్యాదిస్థిరదానేన సాదరమ్ ।
రూఢాధికార ఏవాగ్రే ప్రవర్తేతాఽర్చనేఽర్చకః ॥
ప్రతిష్ఠాంతే తు విధివదర్చకే త్వకల్పితే ।
అసురీ సా భవేత్పూజా కర్తా నైవాప్నుయాత్ఫలమ్ ॥
-(27, 86-87).

-అందుచేత (ఆలయనిర్మాణమునకు పూర్వమే) సాదరంగా దాయ భాగంచేతకానీ, భూమ్యాది స్థిరదానం చేతకానీ రూఢాధికారం పొందిన అర్చకుడు అర్చనయందు చక్కగా ప్రవర్తింపవలెను-ప్రతిష్ఠాంతమందు, విధి పూర్వకంగా జీవనభృతికల్పించితే అప్పుడు జరిగేపూజ 'అసురీపూజ' (= రాక్షసపూజ) అవుతుంది; పూజాఫలం యజమానునకు దక్కదు.

# అధ్యాయం-4

## వైఖానస తత్త్వచింతన

వైఖానసం ప్రధానంగా ఒక మతసంప్రదాయం ; స్వతంత్రమైన ఒక తాత్త్విక దృక్పథమును ప్రచారంచేయటానికి అదివూనుకోలేదు. కాని, అది ఒకధర్మ పథమేకాక, ఒక దర్శన విధానమని కూడా మధ్యకాలీన స్మృతి కర్తలు గుర్తించినారు. మనుస్మృతి (6-21) వ్యాఖ్యలో కుల్లూక భట్టు ఇట్లాచెప్పినాడు:

"వైఖానసో వానప్రస్థో తద్ధర్మప్రతిపాదకశాస్త్రదర్శనే స్థితః" ॥

-వైఖానస ధర్మప్రతిపాదకమైన శాస్త్రమందు వైఖానసుడు వానప్రస్థ డుగా పేర్కొనబడినాడు.

వేదాంతప్రస్థానమైన 'శారీరకసూత్రములు' ను వ్యాఖ్యానిస్తూ శ్రీనివాస మఖి (లేదా శ్రీనివాసదీక్షితులు) వేదప్రామాణ్యమునకు, ప్రతిమార్చనకు అనుగుణమైన వైఖానస తాత్త్విక దృక్పథమును పునర్నిర్మించుటకు ప్రయ త్నించినాడు. 'లక్ష్మీవిశిష్టాద్వైతభాష్యం' అనే పేరుతో ప్రసిద్ధమైన ఈ వ్యాఖ్యానం 'విశిష్టాద్వైతం' పట్ల మొగ్గుచూపింది; అయితే రెండింటిమధ్య చాలాభేదాలు లేకపోలేదు. బహుళ గ్రంథకర్తఅయిన ఈశ్రీనివాసమఖి సర్వతంత్ర స్వతంత్రుడుగా, కవికుల తిలకుడుగా ప్రసిద్ధుడు. 'వైఖానసమహి మమంజరి'ని కూడా ఈయన రచించినాడు. 'పారమాత్మికోపనిషత్ భాష్యం' కూడా ఈయన రచనయే అంటారు. తరువాత ఒక వార్తికం కూడా వెలసింది; బహుశః ఇది శారీరకసూత్ర భాష్యంమీది రచనకావచ్చు. పిమ్మట 'ఉత్తమ బ్రహ్మవిద్య' అనేది శ్రీనివాసరచనగా వెలసినది (శ్రీనివాసుడు భాష్యకారుడే అనికొందరి తలంపు).

పైరచనలన్నీ వైఖానస తత్త్వచింతనయొక్క స్వరూపస్వభావాలను విశ దీకరిస్తున్నవి. అయితే, వైఖానసతత్త్వచింతనను ప్రదర్శించటానికి విశిష్టము, సంక్షిప్తము అయిన ప్రయత్నం 'మోక్షోపాయప్రదీపిక' లో జరిగింది. ఈరచన ఎప్పటిదో తెలియదు; రచయితపేరు రఘుపతి భట్టాచార్యుడు (కాని, వాసుదేవుడు అనే పేరే ప్రసిద్ధం-వాసుదేవాపరనామా) అనితప్ప ఇంక ఏవిషయమూ తెలియలేదు. విషయపరిగణనను (అర్థపంచక-తత్త్వత్రయ-సిద్ధ సాధ్యోపాయ మొ.) పట్టి, మూలమంత్రం-ద్వయం-చరమశ్లోకం వంటివాటికి

ఇచ్చిన ప్రాముఖ్యమును పట్టి ఈరచనపై 'విశిష్టాద్వైత ప్రభావం' స్పష్టంగా గోచరింప గలదు. కాని, ఈరచయిత వైఖానసశాస్త్రాలమీదనే పూర్తిగా ఆధారపడి, ఆయావిషయాలను స్వతంత్రదృష్టితోనే వివేచించినాడు.

ఈరచన సంస్కృతంలో గద్యరూపంలో ఉంది. ఇందులో 12భాగాలు ఉన్నవి (కొన్నిచిన్నవి; కొన్నిచాలాపెద్దవి). ఇది, శ్రీనివాసదీక్షితేంద్రుని (= శ్రీనివాసమఖి) రచనలనుంచి గ్రహింపబడిన భాగాలసంకలనం మాత్రమే అనిపేర్కొనబడింది. కాని, ఏరచననుంచి, ఏభాగం గ్రహింప బడిందో చెప్పజాలము. అయితే అధికభాగం 'లక్ష్మీవిశిష్టాద్వైతభాష్యం' నుంచి, 'ఉత్తమ బ్రహ్మ విద్య' నుంచి ఉపనిషత్తులనుంచి ఉదాహర ణలు ఈయబడినవి. అయితే ఇక్కడ కూడా మూలగ్రంథాల ప్రస్తావన లేదు. 'మోక్షోపాయ ప్రదీపిక' 1905లో గ్రంథలిపిలో త్రిచూర్ (త్రిశిరః పురం) లోని లక్ష్మీవిలాస ప్రెస్‌లో ముద్రింపబడింది. దీనిని అనుసరించి, 1948లో దీవి వేంకట నరసింహాచార్య సంపాదకత్వంలో నల్లూరులోని వైఖానస భగవచ్ఛాస్త్ర గ్రంథమాలవారు, తెలుగులిపిలో ప్రచురించారు. ఈ గ్రంథప్రారంభంలో వైఖానసశాస్త్రాల ఆవిర్భావం, భృగువు మున్నగు నలుగురు మునుల నుంచి ఇటీవలివరకు వెలసిన వైఖానస ఆచార్యుల పరంపర వర్ణింపబడినది. విష్ణువు, విఖనసమునికి, వైఖానసశాస్త్రంతోపాటు శ్రీవైష్ణవఅర్చనకు మూలాధారములైన 'మూలమంత్రము'ను 'ద్వయము'ను ప్రసాదించెనని చిత్రంగా ఈరచయిత పేర్కొన్నాడు. పాంచరాత్రగ్రంథమైన 'వృద్ధహారీతసంహిత' మూడువిధాల అర్చనలను పేర్కొన్నది - 1. శ్రౌతం లేదా వేదవిహితం, 2. స్మార్తం, 3.ఆగమం (= మూలమంత్రసహితమైన అర్చన). దీనిని బట్టి వేదవిహితమైన వైఖానసవిధానం,'మూలమంత్రం-ద్వయం' తో కూడిన ఆగమ (= పాంచరాత్ర) విధానంకంటె భిన్నమనే విషయం స్పష్టమవుతున్నది.

శ్రౌతస్మార్తాగమైః విష్ణోస్త్రివిధం పూజనం స్మృతమ్.

(11,26)

మంత్రైరష్టాక్షరాద్యైస్తు తద్దివ్యాగమముచ్యతే.

(11,77)

-విష్ణుపూజ శ్రౌత-స్మార్త-ఆగమవిధానాలచేత మూడువిధాలు - అష్టాక్షరి మున్నగు మంత్రములతో పూజచేయటం అని ఆ దివ్యాగమం పేర్కొనబడినది.

మోక్షోపాయప్రదీపికాకర్త, బహుశః వైఖానస-పాంచరాత్ర సంప్రదాయాల మధ్య సమన్వయానికి ప్రయత్నించిన వారిలో ఒకడు కావచ్చు.

'అర్థపంచకం' అనే ఈగ్రంథంలోని రెండవభాగం అయిదింటి స్వభావాలను గూర్చి పరిశీలన చేసింది:

1. సాధించుకోవలసిన గమ్యం (పావ్యం = పరబ్రహ్మ)
2. సాధించుకొనేవ్యక్తి (ప్రాప్త = జీవుడు)
3. సాధించుకొనేమార్గం (ప్రాప్తి = ఉపాయం)
4. సాధన యొక్క లాభం లేదా కారణం (ఫలం)
5. సాధనలో ఎదురయ్యే అడ్డంకులు (ప్రాప్తివిరోధాలు)

పరమాత్మ నిష్కలుడు, సకలుడు కూడా. సకలరూపంలో లక్ష్మీ (= ప్రకృతి)యుతుడై ఉంటాడు. 'లక్ష్మీ విశిష్టాద్వైతం' అనే పేరు పెట్టటంలోనే, భక్తి విషయంలో, సకలరూపానికి ఉన్న విశిష్టత వ్యక్తమవుతున్నది; ఇది వైఖావస సంప్రదాయానికి చెందిన విశిష్టాద్వైతం. అసలు 'పరబ్రహ్మ' ఏకైకమే; దాని రెండు (= నిష్కల-సకల) అంశములు విడదీయరానివి (= అద్వైతం); అయితే, భక్తికి సంబంధించి, సకలరూపం ఒక ఉపాయం మాత్రమే.

ప్రత్యగాత్మ (= జీవాత్మ) అనేది మూడువర్గాలలో ఒకటి-1. నిత్యం (అనంతుడు, సనకుడు మున్నగువారివలె); 2. ముక్తం, 3. బద్ధం. మొదటి వర్గం ఆత్మలు ఎన్నడూ బంధ ంలో ఉండలేదు; అందుచేతవాటికి బంధాలనుంచి ముక్తిఅనేది లేదు. రెండవవర్గం ఆత్మలు తొలుత బంధంలో చిక్కుకొని, తరువాత భక్తి, ఉపాసనలద్వారా ముక్తి పొందినవి (భగవత్ ఉపాసనయా మోక్ష మాగతః). ఇంక చివరివర్గం ఆత్మలు అనాది అయిన అవిద్యవల్ల, మంచిచెడ్డల ఫలితాలను అనుభవిస్తూ శరీరగతములై ఉంటాయి.

పరిపూర్ణశరణాగతితో భగవదారాధన చేయటమే దైవత్వసిద్ధికి ఏకైక మార్గం (ప్రపత్తి పూర్వక భగవదారాధన).

ఇటువంటి సాధనఫలమే ముక్తి. ఈముక్తి పొందటానికి అడ్డువచ్చేది శ్రుతి-స్మృతి విహితవిధుల ఉల్లంఘనమే.

మోక్షోపాయప్రదీపికలోని రెండవభాగం 'తత్వత్రయము'ను కూడా వివ

రిస్తున్నది. ఇందులో శ్రుతి నుంచి ఒకభాగం పేర్కొనబడింది- "ద్వా ఏతౌ పక్షీ అచరం చరంతౌ" ఇందు చెప్పబడిన రెండుపక్షులలో ఒకటి పరమాత్మ, రెండవది ప్రత్యగాత్మ. 'అచరం' (= కదలనిది) ప్రకృతి; ఇంక 'చరంతౌ' (= కదిలేవి) రెండుపక్షులు. ప్రకృతి అనేది పురుషుడైన విష్ణువు యొక్క 'మాయ' అని మరీచికూడా వివరించినాడు (మాయా ప్రకృతిః, మాయా విష్ణుః, ప్రకృతి- పురుషావేతౌ అనాది).

అయితే ప్రకృతి రెండువిధాలు- 1. ఆధిభౌతికం (ఇది అష్టవిధం- పంచభూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారం), 2. ఆధ్యాత్మికం (= జీవాత్మలు). ఈరెండింటి మధ్యగలభేదం- ఆధిభౌతికం 'అచేతనం'; ఆధ్యాత్మికం 'చేతనం'. ఆధిభౌతికం మరల మూడువిధాలు-1. సత్త్వ-రజస్-తమోగుణాత్మకములైన విషయాలు, 2.కాలం, 3.శుద్ధసత్త్వం లేదా జ్ఞానం. పైమూడు గుణాలు సమపాళ్ళలో ఉన్నపుడు- అది ప్రళయం; అవి సమపాళ్ళలో లేనప్పుడు ప్రపంచసృష్టి-స్థితులు జరుగుతాయి. అస్వతంత్రులైన (అస్వతంత్రౌ) ప్రకృతి-పురుషులకు ఈశ్వరుడు ప్రాపు అని ఈగ్రంథం పేర్కొన్నది. ఈశ్వరుడు 'ఈశుడు'; ఇంక ప్రకృతి-పురుషులు ఈశితవ్యులు. ఈశ్వరుడు పరంబ్రహ్మ, ఆనంద స్వరూపుడు, ఆయన ఆధిభౌతిక ఆధ్యాత్మిక విషయాలన్నింటికి కారకుడు-ఆయననే నారాయణుడు అంటారు.

కాగా మూడు తత్త్వాలు-1. లక్ష్మీసహితుడైన ఈశ్వరుడు(= లక్ష్మీవిశిష్ట-ఈశ్వరతత్త్వం), 2.ప్రకృతి, 3. పురుషుడు. ఇందులో ప్రథమ తత్త్వం విష్ణువు లేదా నారాయణుడు. నారాయణుడు ఒక్కడే స్వతంత్రతత్త్వం అని నమ్మినవారు వైష్ణవులు (నారాయణ పరాయణో నిర్ద్వంద్వో మునిః). దైవత్వాన్ని ఈ రూపంలో ఆరాధించే వైఖానసులు, పుట్టుకకు ముందు జరిగే 'విష్ణుబలి' అనే సంస్కారం ద్వారా పుట్టుకతోనే ప్రపత్తికి అర్హులు. ఈ విషయాన్ని వైఖానసమహిమ మంజరిలో శ్రీనివాసమఖి స్పష్టీకరించినాడు.

'నారాయణపరాయణ' అనటంలో నారాయణుడు స్వయంగా 'సిద్ధోపాయం' అని స్పష్టమవుతున్నది. ఆ ఉపాయం సిద్ధంగానే ఉంది; అయితే మోక్షప్రాప్తికోసం ఆ ఉపాయాన్ని దర్శించాలి. ఉపాయాలు రెండు విధాలు-సిద్ధము, సాధ్యము. నారాయణుడు మొదటి దానికి ఉదాహరణము. ఇంక రెండవదానికి అనేకానేకోపాయములున్నవి-జ్ఞానం, ఉపాసన, ప్రపత్తి, ఆత్మసమర్పణ, కర్మాచరణ మున్నగునవి.

వైఖానస శాస్త్రాలప్రకారం నారాయణ సమారాధన ఒక్కటే ఉత్తమ

ఉపాయం. ఇది నాలుగువిధాలు- 1. (మంత్ర) జపం, 2. (అగ్నిలో) హోమం, 3. (ప్రతిమ) అర్చన, 4. ధ్యానం. హోమం లేదా హుతం అనేది దైవాన్ని అమూర్తరూపంలో అగ్నిద్వారా అర్చించటం (అమూర్తా అగ్న్యాహుతిః ప్రోక్తా). అర్చన అనేది సమూర్తబేరపూజ; అన్నివిధానాలకంటె 'అర్చన' యే అధికఫలప్రదమని చెప్పబడింది. వైఖానస గ్రంథాలు ఇట్లా పేర్కొన్నాయి:

"సగుణే బ్రహ్మణి బుద్ధిం నివేశ్య పశ్చాన్నిర్గుణం బ్రహ్మశ్రిత్య మోక్షే నిత్యం యత్నం కుర్యాత్."

-తొలుత సగుణమైన బ్రహ్మమునందు బుద్ధినిల్పి, పిమ్మట నిర్గుణమైన బ్రహ్మమును ఆశ్రయించి, మోక్షప్రాప్తికి నిత్యం యత్నించాలి.

సామాన్యులకు సహజములైన పరిమితులను దృష్టిలో పెట్టుకొని పై విధంగా చెప్పబడింది.

"సదా ధ్యాతు మశక్యత్వాత్ ప్రతిమాదిష్వావాహ్యార్చయేత్."

-ఎల్లప్పుడు ధ్యానం చేయటం శక్యంకాదు కాబట్టి భగవంతుని, ప్రతిమ మున్నగువాని యందు ఆవాహనంచేసి, అర్చించాలి.

ప్రతిమార్చన, ఈజన్మలోనే ముక్తిని ప్రసాదిస్తుంది. బ్రహ్మము యొక్క సగుణ నిర్గుణ రూపాలు, క్రమంగా సావయవ-నిరవయవ రూపాలు అవుతాయి. 'సగుణం' అనేది ప్రతిమారూపం. సగుణరూపధ్యానం, నిర్గుణ రూపధ్యానం-వీటిమధ్యగల భేదాన్ని 'శాండిల్య ఉపనిషత్తు' వివరించింది. వైఖానసూత్ర వాఖ్యానంలో నృసింహవాజపేయయాజి ఇట్లా పేర్కొన్నాడు:

"ఇదానీం అస్మిన్ జన్మన్యేవ మోక్షోపాయ మాహ. 'సగుణే బ్రహ్మణి బుద్ధిం నివేశ్య' ఇతి. యోగీ సగుణే పూర్వోక్తలక్షణే సాకారే బ్రహ్మణి బుద్ధిం మనః ప్రథమం నివేశ్య, తద్రూపం దృష్ట్వా, తద్గత మానసః సన్, ఏవం విధం పరంబ్రహ్మేతి జ్ఞాత్వా, పశ్చాత్ తదను నిర్గుణం పూర్వోక్త లక్షణాన్వితం నిరాకారం ఓంకారగమ్యం అవ్యక్తం బ్రహ్మశ్రిత్య, మనః సంప్రాపయిత్వా, తద్రూపం ధ్యాత్వా, నిత్యం ఆమోక్షాంతం ఏవం మోక్షే యత్నం ఉద్యోగం కుర్యాత్. తస్య యోగిన ఇహ జన్మన్యేవ మోక్షో భవేత్".

-ఇప్పుడు, ఈజన్మయందే మోక్షం పొందే ఉపాయం చెప్పబడు

తున్నది-'సగుణబ్రహ్మమునందు బుద్ధిని నిల్పి' అని; యోగి, తొలుత, పుర్వోక్త లక్షణాన్వితమైన సాకారబ్రహ్మమునందు బుద్ధిని, మనస్సును నిల్పి, ఆ సాకార రూపమును దర్శించి, తద్గతమానసుడు కావాలి. ఇట్లా పరబ్రహ్మమును తెలిసికొని, పిమ్మట పూర్వోక్త లక్షణాన్వితం, నిర్గుణం, నిరాకారం, ఓంకార గమ్యం, అవ్యక్తం అయిన బ్రహ్మమును ఆశ్రయించి, మనస్సులో నిల్పి, తద్రూపాన్ని నిత్యం ధ్యానిస్తూ, మోక్షం లభించేపర్యంతం, మోక్షమును గూర్చి ప్రయత్నించాలి. అటువంటి యోగికి ఈజన్మలోనే మోక్షం లభిస్తుంది.

'ప్రపదనం' (= శరణాగతి)తో అర్చనచేయటం చాలా లాభకారి; ఇది రెండువిధాలు-1. వైదికం, 2.తాంత్రికం. పుట్టుకకుముందు జరిగే సంస్కారంతో విష్ణువు స్వయంగా ప్రసాదించేది వైదికం; దీనివల్ల పుట్టుకతోనే ఆ వ్యక్తి విష్ణుభక్తుడవుతాడు. ఇంక రెండవది, జన్మించిన తరువాత, మానవాచార్యుని ద్వారా లభించే తాంత్రిక సంస్కారఫలం. మొదటిది పుట్టుకతోనే వచ్చేది; మార్పులేనిది. ఇంక రెండవది కాల్పనికం, మార్పుకు లోనయ్యేది. కాగా, వైఖానసునకు 'ప్రపత్తి' అనే ఉపాయమునకు ఉత్తమమైన , సహజం అయిన అధికారం పుట్టుకతోనే లభిస్తుంది.

ఈ ఉపాయం ద్వారా జీవాత్మ పరమాత్మను దర్శించగలుగుతుంది. దైవత్వం యొక్క మహిమను దైవం యొక్క దయవల్లనే దర్శించ గలుగుతారని శాస్త్రంచెబుతున్నది (ధాతుః ప్రసాదాత్ మహిమానం). భక్తుడు దర్శించే దైవత్వం, దైవం తానుగా ఇచ్చే దర్శనమే. భగవంతుడు చూపించిన దానినే భక్తుడు చూడగలుగుతాడు. భగవంతుడు స్వయంగా ఈ దర్శనం చేయించి, భక్తుని తనలో కలుపుకొంటాడు.

అయితే వైఖానసదృక్పథం కర్మకాండను అసంగతమని, అప్రశస్తమని నిరసించలేదు. 'సంపూర్ణప్రపత్తి' అనేది శ్రుతివిహితమైన నిత్యనైమిత్తిక కర్మకాండను త్రోసిపుచ్చలేదు; అంతేకాదు. దాని విలువను అధికంచేసింది కూడా. ఉదాహరణకు ఏదైనా మతకర్మ నిర్వహింపవలసి వచ్చినప్పుడు శుద్ధికొరకు ముందుగా స్నానంచేయాలి; కాని స్నానం చేయటానికి వీలు కాని రోగంతో ఉన్నప్పుడు 'విష్ణుస్మరణ చింతనములు' స్నానఫలం ఇస్తాయి. అయితే విష్ణుస్మరణచేస్తూ స్నానం చేస్తే ఫలం రెట్టింపు అవుతుంది. అట్లాగే సంపూర్ణ ప్రపత్తితో కర్మకాండ ద్వారా అర్చన చేసిన వ్యక్తి విష్ణుత్వాన్నే పొందుతాడు.

మరి విష్ణుపదం నాలుగు అంచెలుగా ఉన్నది- 1. ఆమోదం,

2.ప్రమోదం, 3. సంమోదం, 4.వైకుంఠలోకం. ఈ అంచెలను చేరుకో వటం అనేది భక్తుల సాధనమీద ఆధారపడి ఉంటుంది. సంపూర్ణ ప్రపత్తితో కర్మకాండపూర్వకమైన ప్రతిమార్చనవల్ల చివరి స్థాయిని చేరుకోవటానికి అర్హత లభిస్తుంది. కావుననే మరీచి ఇట్లా హెచ్చరించినాడు:

"సమూర్తార్చనమేవ కారయే దన్యథా న పరమపదప్రాప్తిః."

-కావున సమూర్తార్చనమే చేయాలి; ఇంకోవిధంగా పరమపదప్రాప్తి లభిం చదు.

సంసార బంధములనుంచి ముక్తిలభించటమే ఈసాధన యొక్క ఫలం. చేపట్టిన ఉపాయమును అనుసరించి, ఫలం నాలుగు విధాలుగా ఉంటుంది- 1. సాలోక్యం, 2. సామీప్యం, 3.సారూప్యం. 4. సాయుజ్యం. ఈనాలుగింటిలో సాయుజ్యమే ఉత్తమమైనదిగా పరిగణింపబడింది.

"లోకేషు విష్ణో ర్నివసంతి కేచిత్
సమీప మిచ్ఛంతి చ కేచిదన్యే ।
అన్యేతు రూపం సదృశం భజంతే
సాయుజ్య మన్యే స తు మోక్ష ఉక్తః" ॥

-విష్ణులోకాలలో నివసిస్తారు కొందరు. మరి కొందరు (విష్ణు) సామీప్యం పొందుతారు. ఇంకా కొందరు (విష్ణు) సదృశ రూపం పొందుతారు. ఇంక తక్కినవారు (విష్ణు) సాయుజ్యమే పొందుతారు; ఇదే మోక్షమనిచెప్పబడింది.

భగవంతుని మాయవల్ల మానవుడు సంసారబంధములందు చిక్కుకొం టాడని చెబుతూ, మరీచి ఇట్లా వివరించినాడు:

"తస్మాద్ భగవన్మాయయా మోహితత్వాద్ భగవంతం సమాశ్రిత్య భక్త్యా నారాయణ ముపాసీత. తదుపాసనాత్సో ఽపి భక్తవత్సలత్వాద్ భక్తానుకంపయా స్వమాయాం విమోచయతి. తత ఆత్మా సమ్యక్ జ్ఞానం ప్రవిశతి. పశ్చాదాశ్రమధర్మసంయుక్తో భగవదారాధనం కరోతి. తదారాధనేన సంసారార్ణవనిమగ్నో జీవాత్మా పరమాత్మానం నారాయణం పశ్యతి. సోఽప్యపునరావృత్తికం దివ్యలోకం ప్రాపయతి. పశ్చాత్ కృత కృత్యో భవతి".

-అట్లా భగవన్మాయచేత మోహితుడుకావున, భగవంతుడైన నారాయ

ణుని ఆశ్రయించి, భక్తితో ఉపాసించాలి. ఆ ఉపాసనవల్ల, భక్తవత్సలుడైన నారాయణుడు, భక్తునిమీది అనుకంపతో స్వీయమాయను తొలగించుతాడు. అప్పుడు ఆత్మ, సమ్యక్ జ్ఞానం పొందుతుంది. తరువాత ఆశ్రమ ధర్మ సంయుక్తుడై భగవదారాధనం చేస్తాడు. ఆ ఆరాధనవల్ల సంసారసముద్ర నిమగ్నమైన జీవాత్మ పరమాత్ముడైన నారాయణుని దర్శించగలుగుతాడు. అప్పుడు భగవంతుడు ఆ వ్యక్తిని, పునరావృత్తి రహితమైన దివ్యలోకాన్ని పొందించుతాడు. ఇట్లా ఆవ్యక్తి కృతకృత్యుడవుతాడు.

ఉత్తమఫలమైన మోక్షం అనేది సాయుజ్యమే. జీవాత్మ, పరమానంద స్వరూపుడైన బ్రహ్మముతో 'అత్యంతావస్థానం' పొందటమే మోక్షం (పరమానందరూపిణీ బ్రహ్మణా సహ అత్యంతావస్థానం ఏవ మోక్షః- నృసింహవాజపేయయాజీ). మోక్షమునకు అర్హుడైన భక్తుడు (భవసంచిత కర్మవిముక్తికి మరల దేహధారణ చేయనక్కరలేని వ్యక్తి) అర్చిరాది మార్గాలలో ప్రయాణించటాన్ని గూర్చి మరీచి ఇట్లా పేర్కొన్నాడు:

"ఏతేషు దేవతా స్థానేషు విశ్రమ్య, దేవయానమార్గేణ భూరాదీన్ ప్రాప్య, బ్రహ్మకటాహం భిత్వా, తతో విరజాం ప్రవిశ్య, కృతసూక్ష్మదేహ పరిత్యాగః, పూర్వోక్తవైష్ణవాండం గచ్ఛతీతి విజ్ఞాయతే."

-ఈ (అర్చిరాది) దేవతాస్థానములందు విశ్రమించి, దేవయానములైన భూరాదులనుచేరి, బ్రహ్మాండమును భేదించి, పిమ్మట విరజను (నదిని) ప్రవేశించి, సూక్ష్మదేహపరిత్యాగంచేసి, పూర్వోక్తమైన వైష్ణవాండమును చేరుతాడు.

మోక్షసాధనలో, ప్రతిమారాధనయొక్క ప్రాముఖ్యం విషయంలో వైఖానస గ్రంథాలలో ఎటువంటి అస్పష్టతలేదు; ఇది మోక్షానికి సాక్షాత్కారణం. శ్రీనివాసమఖి యొక్క శారీరకసూత్ర (3, 3, 24) వ్యాఖ్యానంలోని "అపి సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యాం" అనే వాక్యం, ఇంకోవిధంగా మోక్షం సాధ్యంకాదని స్పష్టంచేస్తున్నది.

"భజనేన వినా కేనాప్యయమాత్మా న లభ్యతే ।
ప్రత్యక్షాది ప్రమాణేన చాయమర్థోఽవగమ్యతే ॥

-భజన (= విష్ణుసేవ) తప్ప ఇంకేవిధంగాను పరమాత్మ లభ్యంకాదు. ప్రత్యక్షం మున్నగు ప్రమాణాలవల్ల ఈవిషయం స్పష్టమవుతున్నది.

నిజానికి, ప్రతిమారాధనమే 'పరవిద్య' గా గుర్తింపబడింది. "విద్యాశబ్దేన భగవదారాధన మేవోచ్యతే" (విద్య అనే శబ్దానికి భగవదారాధనమే అని అర్థం) అని భాష్యం పేర్కొన్నది. "బ్రహ్మవిదులలో క్రియావంతుడు వరిష్ఠుడు" అనే ముండకోపనిషత్తులోని వాక్యం ఆరాధకుని ఘనతను స్పష్టం చేస్తున్నదని వ్యాఖ్యాత తెలిపినాడు. 'ఉత్తమబ్రహ్మవిద్య' ఈ వ్యాఖ్యానమును సమర్థించినది.

వైఖానసుల తత్త్వచింతనకు రూపకల్పనచేసిన శ్రీనివాసమఖి యొక్క 'లక్ష్మీవిశిష్టాద్వైతభాష్యము'ను గూర్చి ఒక్కమాట. రచనయొక్క శీర్షికను పట్టి, విష్ణువు మాత్రమే, అందునా లక్ష్మీసహితుడైన విష్ణువు (= లక్ష్మీవిశిష్ట నారాయణః) ఒక్కడే పరతత్త్వమని స్పష్టమవుతున్నది. 'అద్వైతం' అనే పదం విష్ణువును మాత్రమేకాక, లక్ష్మీయుతుడైన విష్ణువును సూచిస్తుంది. వైఖానససూత్రంలోని "తస్మాత్త్రయా శ్రియాసార్థం పూజయే త్పురుషోత్తమమ్" (= అందుచేత, శ్రీయుతుడైన పురుషోత్తముని పూజించాలి) అనే వాక్యం శ్రీనివాసమఖికి మార్గదర్శకమై ఉంటుంది.

'లక్ష్మి' ఒక ప్రత్యేక తత్త్వం కాదు; ఆమె నారాయణుని నుంచి విడదీయరానిది. వైఖానస శాస్త్రాలలో క్రింది వర్ణన ఉంది:

"శ్రీ శ్రీశయోస్తు సంబంధః చంద్రచంద్రికయో రివ."

-శ్రీ (= లక్ష్మి)కి, శ్రీశు (= విష్ణువు)నకు మధ్యగల సంబంధం చంద్రునకు, చంద్రిక (= వెన్నెల)కు మధ్యగల సంబంధంవంటిది.

'నారాయణ' అనే శబ్దంలో 'నర' అనేది సర్వజీవసమూహాలను, 'అయన' అనేది 'ఆశ్రయము' ( = ప్రాపు)ను సూచిస్తున్నవి (సర్వజీవసమూహాలకు ఆశ్రయస్థానం అని నారాయణ శబ్దం యొక్క అర్థం) (నరశబ్దేన జీవానాం సమూహః ప్రోచ్యతే బుధైః తేషామ్ అయన భూతత్వాత్ నారాయణ ఇహ ఉచ్యతే). జీవులు అనేకం; అవి నశించేవికావు (న రిష్యతి, న నశ్యతి ఇతి నరః). ప్రణవం (= ఓంకారం) బ్రహ్మమును లేదా నారాయణుని నిర్దేశిస్తున్నది; ఇందుకు కారణం తదుచ్చారణ జీవాత్మలను నారాయణుని వైపు ఆకర్షించటమే (నారాయణ ప్రవణత్వాత్-ప్రవణం అనేదే 'ప్రణవం' అయింది - పశ్యక అనేది కశ్యప అయినట్లు). 'ఓమ్' (అ+ఉ+మ) కారంలోని 'అ' విష్ణువుమ (అకారో వై విష్ణుః), 'ఉ' లక్ష్మిని లేదా ప్రకృతిని, 'మ' ఆ యిరువురికి దాసుడైన జీవాత్మను బోధిస్తున్నవి. ('మన'

అవబోధనే= తెలిసికొనటం-జీవునకు 'తెలివి' అనేది ఉన్నది). "శ్రీమన్నారాయణ మర్చయేత్" (శ్రీమన్నారాయణుని అర్చించాలి) అని భృగువుయొక్క వాసాధికారం నిర్దేశించింది.

'నారాయణార్చన' అంటే శ్రీ లేదా లక్ష్మీయుతుడు అయిన నారాయణుని అర్చించటమేకాని నారాయణుని లేదా లక్ష్మిని వేర్వేరుగా అర్చించటంకాదు. నారాయణునకు (ప్రణవంలోని 'అ'), భక్తునకు (= ప్రణవంలోని 'మ') మధ్య ఉన్నది లక్ష్మి (= ప్రణవంలోని 'ఉ'). ఈ లక్ష్మియే, నారాయణుని చేరుకొనటానికి భక్తునకు తోడుపడుతుంది; నారాయణుని అనుకంపను భక్తునిపై వర్షింపజేస్తుంది.

వైఖానస సంప్రదాయం , అర్చనను మోక్షప్రాప్తికి రాజమార్గంగా నిర్దేశించినప్పటికీ 'సంకల్పము' ను కాని 'ధ్యానము'ను కాని, తక్కువగా భావించలేదు. అర్చన అనేది, మతదృష్టితో, యాంత్రికంగా చేసేది మాత్రం కాదు. ప్రతిమార్చన, మానవుని, వాని మనస్సు యొక్క పరిమితులను దాటించి, దైవదర్శనమునకు తోడుపడుతుంది. సకలరూపంలో విష్ణువు యొక్క అర్చన జరుగుతున్నప్పటికీ, ఆయన నిష్కల భావన అంతర్లీనమై ఉండనే ఉంటుంది. భక్తుడు స్థూలరూపంనుంచి, సూక్ష్మరూపానికి తరలి రావాలి. ఈ విషయంలో కాశ్యపుని జ్ఞానకాండ(55వ అధ్యా.)ఇట్లా పేర్కొన్నది: సాధారణ జీవితాలను గడిపే మనకు ప్రతిమార్చనమే శరణ్యం; ఇంక స్థితప్రజ్ఞులైన వారికి 'ధ్యానం' తగినది. ప్రతిమపై శ్రద్ధవహించటం, దానిని మరల మరల చూస్తూ ఉండటం, దానికి పలువిధాల సేవలు సమర్పించటం-వీటివల్ల భక్తి పెరుగుతుంది. భక్తివినా, ఏసేవచేసినా, అదివ్యర్థమే. భక్తిని జనింపజేయటం కొరకే ప్రతిమార్చన నిర్దిష్టమైంది.

అంతిమ మోక్షాపేక్షతోనేకాక, మనదైనందిన జీవితంలోని కోరికలు తీరటానికి కూడా ప్రతిమార్చన ఆవశ్యకం. విష్ణువు ( = పురుషుడు) ముక్తి విషయంలో సర్వప్రధానుడు అయితే భుక్తి విషయంలో లక్ష్మి అధికారిణి- కావున ఇరువురిని ఏకంగానే పూజించాలి. పూజావిషయంలో మనస్సు లగ్నంకావాలంటే సుందరమైన ప్రతిమను ప్రతిష్ఠించుకోవాలి. ప్రతిమ స్వయం విష్ణువుకాగా, దాని సౌంధర్యమే లక్ష్మి. 'ప్రతిమాసౌందర్యం' అంటే ప్రతిమ సులక్షణంగా, శిల్పశాస్త్ర సమ్మతంగా ఉండటం.

కాశ్యపుని జ్ఞానకాండ (55వ అధ్యా) ఇంకా ఇట్లా వివరించింది:

"నిరాలంబారాధనం సంకల్పధనినాం శ్రేష్ఠాశ్రమిణామ్. సాలంబం సమ్యక్ సంసార నిష్ఠానాం భుక్తిముక్తి ఫలప్రదత్వాత్. అభీక్ష్ణ దర్శనాత్ పరిచర్యయా భక్తిర్భవతి. నృణా మభక్తానాం కృతం సర్వం నిష్ఫలమ్. తస్మాద్ భక్తి హేతుత్వాత్ సలక్షణం పరమపురుషరూపం కృత్వా శ్రియా సహైవ సంస్థాప్య ప్రకృతిపురుషౌ వర్చయేత్. సాలంబారాధనే కౌతుకసంపత్ సర్వేషాం సంపదితి విజ్ఞాయతే"

-నిరాలంబారాధన సంకల్పధనులు, శ్రేష్ఠులు అయిన ఆశ్రమస్థులకే. సాలంబారాధన (= ప్రతిమార్చన) భుక్తి-ముక్తి ఫలప్రదం కావున సంసారులకు శ్రేష్ఠం. అభీక్ష్ణ (= సమ్యక్) దర్శనంవల్ల, పరిచర్యవల్ల భక్తి కుదురుతుంది. భక్తిలేని నరులు చేసే సర్వకర్మలు నిష్ఫలములే. కావున, భక్తికి కారణంకావటంవల్ల పరమపురుషరూపాన్ని సలక్షణంగా నిర్మించి, లక్ష్మితో సహా సంస్థాపించి, ఆ ప్రకృతిపురుషులను అర్చించాలి. సాలంబారాధనలోని కౌతుక సంపద (= ఉత్సాహానందసంపద) అందరకు లభిస్తుంది.

మరీచియొక్క విమానార్చనాకల్పంలో (85 వ పటలం నుంచి) వైఖానసుల తత్త్వచింతనను గూర్చి విపులమైన వివరణ ఉన్నది. మరీచి మాటలలోనే, ఆవిషయం, సంక్షిప్తంగా పేర్కొనబడుతున్నది:

'తత్త్వం' అనేది బ్రహ్మముయొక్క ఉనికిని తెలుపుతుంది. బ్రహ్మము అనగా పరమాత్మ; అతడే నారాయణుడు. ఈ సత్యమును తెలిసికొనటమే 'జ్ఞానం'. ఇట్టి జ్ఞానం కలవారినే 'బ్రహ్మవిదులు' అంటారు. కాగా, పరమాత్మ లేదా బ్రహ్మము 'జ్ఞేయము' (= తెలిసికోవలసినది); జీవాత్మ 'జ్ఞాత' (= తెలిసికొనేవాడు); ఇంక వేదవాఙ్మయమంతా 'జ్ఞానం' (= తెలిసికొన్నది) అవుతుంది.

బ్రహ్మము లేదా నారాయణుడు ద్వైతస్వరూపుడు-నిష్కలుడు, సకలుడు. నిష్కలరూపం- సర్వం తనయందు ఇముడ్చుకొన్నది; దానికి వెలుపల ఇంకేమీ ఉండదు. పాలలో నేయివలె, తిలలలో నూనెవలె, పూవులలో తావివలె, పండులో రుచివలె, కట్టెలో నిప్పువలె-అది లోపల వెలుపల అంతటా వ్యాపించి ఉంటుంది. విష్ణువు అనేపదానికి 'సర్వవ్యాపి' అని అర్థం. ఆయన అవ్యక్తరూపుడేకాక వ్యక్తరూపుడుకూడా. తేజోరాశి, పవిత్రుడు, నిర్వికల్పుడు, అభవుడు, అనంతుడు, మార్పులేనివాడు, అప్రమేయుడు, వివరింపరానివాడు, అగోచరుడు, అత్యంతం 'అణు' రూపుడు కావటంచేత ఆయన ఉనికిని సత్యమో, అసత్యమో చెప్పటానికి సాధ్యంకాదని అంటారు బ్రహ్మవిదులు.

నిష్కలుడుగా ఆయనపరంజ్యోతి, సర్వథా శక్తిమంతుడు. ఆయన సర్వ దేవతా స్వరూపుడు, సర్వమతగమ్యుడు, సర్వస్వమునకు ప్రావు, అనంతుడు, జ్ఞాన-జ్ఞేయ-జ్ఞాతృ స్వరూపుడు. ఆయన సమగ్రచైతన్యమూర్తి. కాని జీవుని వలె మేల్కొనటం, గాఢనిద్రపోవటం, స్థూల- సూక్ష్మవస్తువుల అనుభూతి పొందటం చేస్తూఉంటాడు. సర్వప్రాణులకు ఆయన ఆత్మ; హృదయ కుహరాలలో అంతర్లీనంగా ఉంటాడు. హృత్పద్మంలోని అవకాశంలో ఉండే ప్రాణంయొక్క చివరిభాగంలో ఆయన ఉనికి (పటలం-85).

భక్తులు ధ్యానంతో, భక్తితో తమ హృదయాలను మథించినప్పుడు, ఆయన సకలరూపంలో గోచరిస్తాడు. నిజానికి ఆయన నిష్కలుడు అయిన ప్పటికీ, మథనంవల్ల కట్టెనుంచి నిప్పుపుట్టునట్లే హృదయమథనంవల్ల ఆయన సకలరూపం వహిస్తాడు. మండుతున్ననిప్పునుంచి పెక్కు నిప్పురవ్వలు జనించి వేర్వేరుగా ప్రకాశించునట్లే, ఆయన బ్రహ్మ, శివుడు మున్నగురూపాలతో ప్రకాశిస్తాడు. కులాలుని చక్రం మీదపెట్టిన మన్ను, కోరినవిధంగా కుండ, మూకుడు మున్నగురూపాలను తాల్చునట్లే భక్తులమనస్సులు భావించినవి ధంగా ఆయన వేర్వేరురూపాలు తాలుస్తాడు.

సర్వవస్తువులు, సర్వరూపాలు విష్ణువే. అందరి శరీరాలను ఆవరించి ఉండే ఆత్మ ఆయనయే. ప్రపంచసృష్టి-స్థితి-లయములకు కారకుడు ఆయ నయే. దేవతలందరిలోనూ అగ్ని కనిష్ఠుడనీ, విష్ణువు జ్యేష్ఠుడనీ, ఈ రెండు పరిమితులమధ్య తక్కినదేవతలంతా ఉంటారనీ శ్రుతిచెబుతున్నది. ప్రధానరూపం విష్ణువే; ఆయనే పరమాత్మ, పురుషుడు, సర్వజగత్తునకు సృష్టికర్త, స్థితికారకుడు, లయహేతువు. జీవులు ఆయనకంటె భిన్నులు (పటలం-86).

అయితే విష్ణువు యొక్క శక్తి, ప్రభావంకూడా శ్రీ లేదా లక్ష్మియే. ఆమె అనంతురాలు, ఆద్యంతరహిత. ఆమెరూపం అవ్యక్తం, నిగూఢం. ఆమెదయ అనశ్వరం. ఆమెయే మూలప్రకృతి. ఆమె సర్వశక్తిస్వరూపిణి. ఆమె విష్ణువుయొక్క 'మాయ' యేకాక 'మాయి' కూడా. ఈ ఇరువురు శాశ్వత ప్రకృతి-పురుషులు; వీరినుంచి జగత్తు, సర్వకార్యకలాపాలు ప్రభవిస్తాయి.

ప్రకృతినుంచే అన్నిమార్పులు సంభవిస్తాయి. ప్రకృతియే సర్వకార్య కలాపాలకు హేతువు; అంతేకాదు, ప్రాణుల సర్వకార్యకలాపాలు ఆమెయే. ప్రాణులకష్టసుఖాలకు పురుషుడుకారకుడు. ప్రకృతియుతుడైన పురుషుడు

ప్రకృతిగతములైన గుణాలు కలిగి ఉంటాడు (పటలం-86).

ప్రకృతి రెండువిధాలు-1. సజీవం, 2. అజీవం. ఇందులో అజీవం మరల ఎనిమిది విధాలు-మనస్సు, బుద్ధి, అహంకారం, పంచభూతములు. ఇంక సజీవం జీవులు. పురుషులు ఎల్లప్పుడు ప్రకృతితో కలిసేఉంటారు. ప్రకృతిబద్ధులైన జీవులను 'క్షేత్రజ్ఞులు' అంటారు; వీరు లెక్కలేనంతమంది; వీరు కూడా శాశ్వతులే. కాని, అనాది అయిన అజ్ఞానం వల్ల పూర్వ జన్మలలోచేసిన పుణ్య-పాపకార్యాలను అనుసరించి, వాటిఫలానుభూతి ఈ జన్మలో పొందటంకోసం వారు వేర్వేరు శరీరాలను ధరిస్తూఉంటారు.

జీవాత్మ కాటుక రంగుతో, పవిత్రంగా, జ్ఞానవంతుడుగా ఉంటాడు. అతడు శాశ్వతుడు; కాని అణురూపి. అతడు సర్వవ్యాపి; కానిమానవశరీరంలో ప్రవేశించి పుణ్య-పాపకార్యాలు చేస్తూఉంటాడు. అతని కార్యకలాపాలు రెండువిధాలు: 1. ఐహికం, 2. ఆముష్మికం. తినటం, త్రాగటం, పోవటం, రావటం, పండుకొనటం, వస్త్రాలు ధరించటం మున్నగు సాధారణక్రియలు మొదటివిధానం.ఇంక అహింస, త్యాగం, ధర్మప్రవర్తన, మానవసేవ, భగవదారాధన-ఇవి ఆముష్మికమునకు సంబంధించిన కార్యాలు. ఈ కార్యాలవల్ల, వాటిని అనుసరించి, మరణసమయంలో జీవాత్మ మరోలోకాలలోకి వెళ్ళి, తనకార్యాల ఫలాన్ని అనుభవిస్తూ, ఆకాశంలోకి ప్రవేశిస్తాడు.

శరీరాన్ని విడనాడి, ఆకాశంలోకి ప్రవేశించిన జీవాత్మ గాలిగామారి, అగ్నిలోచేరుతాడు, పొగగామారి జలంలో చేరుతాడు, జలంగామారటంవల్ల మేఘంలోచేరుతాడు, మేఘంవర్షించినప్పుడు ఆ జీవాత్మ చెట్లు-చేమలలో ప్రవేశిస్తాడు. తరువాత అన్నంలో ప్రవేశించి, దానినుంచి శుక్ల-శోణితములుగా, రక్తంగా మారుతాడు. అప్పుడు జీవాత్మ తనకు తగినశరీరంలో ప్రవేశించి, మాతృ గర్భంలోపెరిగి, మరల జన్మిస్తాడు. ఇట్లా క్షేత్ర-క్షేత్రజ్ఞుల పరస్పర సంబంధం స్థిరపడుతుంది. ఈ విధంగా జీవాత్మ అంతం లేని పరకాయప్రవేశాలుచేస్తూ, లెక్కలేనంతమంది జీవాత్మలలో తాను ఒకడవుతాడు.

ఆత్మ, శరీరం ఏకమైనప్పుడు ఎదుటివ్యక్తితో (పురుషునకు స్త్రీమీద, స్త్రీకి పురుషుని మీద) ప్రేమపూర్వకమైన బంధం ఏర్పడుతుంది. ఇక దైవ మాయలోపడి, కోరికలకు, ద్వేషానికి, లోభానికి, మోహానికి, అహంకారానికి, అసూయకు, హింసకు పాలుపడతాడు. ఇందువల్ల జన్మపరంపరలను, కష్టాలను అనుభవిస్తాడు. ఈ బంధం దైవమాయవల్ల ఏర్పడింది కావున, భగవంతుని శరణుపొంది, భక్తితో ఆయనను అర్చించటం ద్వారా ఈ మాయనుంచి

తప్పించుకోవాలి. భక్తులపట్ల భగవంతుడు దయామయుడు కాబట్టి, భక్తితో ఆయనను అర్చించితే, దానిని మెచ్చి, భక్తుని తన మాయాజాలంనుంచి తప్పించుతాడు. అప్పుడు వాని ఆత్మ సమ్యక్జ్ఞానం పొందుతుంది. తన సాంసారిక బాధ్యతలను నెరవేరుస్తూనే భక్తితో భగవంతుని అర్చించుతాడు. ఈ అర్చనఫలంగా, సంసారమగ్నుడైన జీవాత్మకు భగవంతుడైన నారాయణుని దర్శనభాగ్యం లభిస్తుంది. అప్పుడు భగవంతుడు జీవాత్మకు దివ్యలోకాల నివాసం ప్రసాదిస్తాడు. ఇట్లా జీవాత్మ కృతకృత్యుడవుతాడు (పటలం-94).

దైవత్వం నుంచి హిరణ్మయగోళం వెలువడింది; దీనిలోనే ఇతరగోళాలు ఇమిడి ఉంటాయి. ఈ గోళాలు అన్నింటిపైన వైష్ణవాండం ఉంటుంది. పవిత్రులు, జ్ఞానులు, ముక్తులు అయినవారే దీని అనుభూతి పొందగలరు. మరి ఇతరులకు ఇది అచింత్యం; దేవతలకు కూడా అగోచరం. ఇచ్చట నాలుగు విష్ణులోకాలు ఉన్నవి- 1. ఆమోదం, 2. ప్రమోదం, 3. సమ్మోదం, 4. వైకుంఠం-ఇవి ఉత్తరోత్తర ఉన్నతములు. దైవత్వం-ఆమోదలోకంలో విష్ణువుగా, ప్రమోదలోకంలో మహావిష్ణువుగా, సమ్మోదలోకంలో సదావిష్ణువుగా, వైకుంఠంలో సర్వవ్యాపినారాయణుడుగా ఉంటుంది. (పటలం-81).

సర్వసంసారబంధాలనుంచి విముక్తి పొందటమే మోక్షం. అర్చనఫలంగా లభించే నాలుగు దశలలో ఏదో ఒకదశ దీనికి సంబంధించి ఉంటుంది- సాలోక్యం, సామీప్యం, సారూప్యం, సాయుజ్యం. ఈ నాలుగు దశలు విష్ణులోకాలు నాలుగింటిని వరుసగా పొందటంతో సంబంధించి ఉంటాయి - ఆమోదంలో సాలోక్యం, ప్రమోదంలో సామీప్యం, సమ్మోదంలో సారూప్యం, వైకుంఠంలో సాయుజ్యం. ఇందులో చివరిదశ శాశ్వతానందప్రదం. సంపూర్ణ సిద్ధిప్రదం. దైవత్వంతో అవినాభావసంబంధప్రదం, పరంజ్యోతి ప్రవేశప్రదం.

పరిపూర్ణశరణాగతి, ఇంతకుముందు చెప్పబడిన నాలుగు విధానాలలో ఏదో ఒకదానివల్ల సంభావ్యమవుతుంది-జపం, హోమం, అర్చన, ధ్యానం.

జపం-ఋగ్వేదంలోని విష్ణుసూక్తాలను లేదా అష్టాక్షరీ మంత్రాన్ని మరల మరలపఠించటం-దీనివల్ల మనస్సు దైవత్వంమీద లగ్నమవుతుంది.

హోమం-సంప్రదాయానుగుణంగా హోమకుండంలో అగ్నికి నిర్దిష్టములైన ఆహుతులను అర్పించటం.

అర్చన-గృహంలో కానీ, ఆలయంలో కానీ వైదికవిధానంతో ప్రతిమను పూజించటం.

ధ్యానం-దైవత్వం యొక్క సకల-నిష్కల రూపభేదాలను గుర్తించి జీవాత్మ, అష్టాంగయోగమార్గానుసారంగా, పరమాత్మబుద్ధితో దైవత్వం మీద మనస్సు లగ్నంచేయటం.

పైనాలుగు విధానాలలో ప్రతిమార్చన శ్రేష్ఠమైనది. ఇది సర్వఫలప్రదం. ఇందులో దైవం స్వయంగా అయిదేసి మూర్తులను స్వీకరిస్తాడు. పంచ భూతాలు (పృథివి-జలం-అగ్ని-వాయువు- ఆకాశం), పంచాగ్నులు (సభ్య-ఆహవనీయ-అన్వాహార్య-గార్హపత్య-అవసథ్యములు), పంచప్రాణములు (ప్రాణ - అపాన - వ్యాన - ఉదాన - సమానములు)-ఇవి అన్నీ దైవత్వం యొక్క ఐదేసి రూపాలు. ఇంక విష్ణువు, పురుషుడు, సత్యకుడు, అచ్యుతుడు, అనిరుద్ధుడు-ఈ అయిదుగురు దైవత్వంయొక్క అయిదు మూర్తులు. అయిదింటిలో విష్ణువు 'ఆదిమూర్తి'; తక్కిననాలుగు ఆయన రూపాంతరాలు.

బ్రహ్మమును 'చతుష్పాదము' ( = నాలుగుపాదాలుకలది) అని వేదాలు పేర్కొన్నవి; ధర్మము, జ్ఞానము, ఐశ్వర్యము, వైరాగ్యము-ఇవే ఆనాలుగు పాదాలు. విష్ణువు ఆదిమూర్తికాగా, తక్కిన నలుగురు ఆనాలుగు పాదాలు అవుతారు. అంటే, పురుషుడు ధర్మమునకు, సత్యకుడు జ్ఞానమునకు, అచ్యుతుడు ఐశ్వర్యమునకు, అనిరుద్ధుడు వైరాగ్యమునకు ప్రతీకలు. ఈనాలుగు మూర్తులు వరుసగా నాలుగు రూపాలకు సమానములు-విష్ణువు, మహావిష్ణువు, సదావిష్ణువు, వ్యాపినారాయణుడు. ఇందులో విష్ణువుయొక్క అంశము పురుషుడు, మహావిష్ణువు యొక్క అంశము సత్యకుడు, సదావిష్ణువు యొక్క అంశము అచ్యుతుడు, వ్యాపినారాయణుని అంశము అనిరుద్ధుడు.

ఈ అయిదు మూర్తులను ( = రూపాలను) ఆచార్యునిబోధన ద్వారా చక్కగా తెలిసికొని, అష్టాంగయోగానుసారంగా ధ్యానించి, ఆవాహనం చేసి, అర్చించాలి (పటలం-95).

మానవశరీరం 96 అంగుళాల పొడవుకలది (ఆయావ్యక్తుల యొక్క వ్రేలికొలతలతో). సహజంగా ప్రాణం ఇంకో 12 అంగుళాలవరకు వ్యాపించి ఉంటుంది; కాని, 'ప్రాణాయామ' సాధనవల్ల అది కూడా శరీరంకొలతకు పరిమితమై ఉంటుంది. 'గుదము' నకు రెండు అంగుళాలపైన ఉన్న భాగం దేహమధ్య భాగం. అచ్చట స్వర్ణాభమైన త్రికోణం ఉంటుంది; అది 'అగ్ని' స్థానం. దానిమధ్యలో యజ్ఞమూర్తి ఉంటాడు (శిల్పశాస్త్రానుసారంగా అగ్ని-కపిలవర్ణుడు, ద్విముఖుడు, చతుశ్శృంగుడు, షట్‌నేత్రుడు, సప్తభుజుడు, త్రిపాదుడు, పీతాంబరుడు).

త్రికోణంపైన, తొమ్మిది అంగుళాల పొడవుకలది 'కందస్థానం'; దీనిమ ధ్యలో ద్వాదశారచక్రం ఉంటుంది. అచ్చట 'ప్రాణము' ను అధిష్ఠించి, తానుచేసిన పాప-పుణ్యములఫలంగా, జీవాత్మ తిరుగుతూ ఉంటుంది-సాలెగూటిలో సాలీడు వలె.

నాభికి పైన, కందస్థానంప్రక్కన, 'కుండలినీ శక్తి' ఉంటుంది. ఇది ప్రక్కలకు వ్యాపిస్తుంది; ఇంతకుముందు పేర్కొన్నట్లుగా, ఇది అష్టాదశాత్మకంగా ఉంటుంది. ఇది సర్పంవలె చుట్టలు చుట్టుకొని ఉంటుంది; బ్రహ్మ-రుద్రాత్మకములైన తన పడగలతో సుషుమ్నానాడిని అడ్డగిస్తూ ఉంటుంది.

నాభికిపైన, ఒక వితస్తి ( = 12 అంగుళాల) దూరంలో హృదయం ఉంటుంది. ఇది అన్నిటికీ మూలం. హృదయంలో సూర్యమండలం ఉంటుంది; సహస్రజిహ్వలతో అచ్చట అగ్నివెలుగుతూ ఉంటుంది. దానిమధ్యలో- శిల్ప శాస్త్రవిహితమైన లక్షణాలతో విష్ణువుయొక్క మూర్తి ఉంటుంది. ఆయన ఉదయసూర్యకాంతియుతుడు, రుక్మాభుడు, శ్రీవత్సాంకుడు, చతుర్భుజుడు, (పై రెండుహస్తాలలో శంఖచక్రాలు, క్రింది కుడిచేతితో అభయముద్ర, క్రింది ఎడంచేయి కట్యవలంబితం), ప్రసన్నముఖుడు, శుభాభరణ భూషితుడు, శ్రీ-భూయుతుడు.

హృదయం పైన నాసికాగ్రమందు, అమృతస్యంది అయిన చంద్రమం డలం ఉంటుంది-స్వచ్ఛమైన స్ఫటికప్రకాశంతో, తెల్లని కిరణాలతో దీనిమధ్యలో నారాయణుడు ఉంటాడు. ఈయన స్వచ్ఛమైన స్ఫటికరూపుడు. చతుర్భుజుడు, శ్రీవత్సాంకుడు, పీతాంబరుడు. ప్రసన్నదృష్టితో, దేవేరులతో, పరివారదేవతలతో పరివృతుడై ఉంటాడు.

ఈ స్థానమునకు పైన, శిరస్సుమీద సుషుమ్నానాడి అగ్రమందు, 'ముక్తిద్వారం' ఉంటుంది. అచ్చట షోడశదళశిరఃపద్మం ఉంటుంది. ఈ పద్మంయొక్క దళాలు అధోముఖంగా, కాడ ఊర్ధ్వముఖంగా ఉంటుంది. ఇచ్చట, ఈ స్థానమునకు అధిపతి అయిన వాసుదేవుని ధ్యానించాలి; ఆయన సహస్ర అమృతప్రవాహ పరివేష్టితుడై ఉంటాడు. (పటలం-90).

హృదయకమలం 12 అంగుళాల పరిమాణంకలది; ఇది కందస్థానంలో మొలకెత్తుతుంది. మోక్షజ్ఞానం దాని కాడ, అష్టసిద్ధులు దాని దళములు, ప్రకృతి కర్ణిక, జ్ఞానం కేసరాలు. సాధారణంగా అధోముఖంగా ఉండే ఈ కమలం ప్రాణాయామ సాధనవల్ల వికసించి, ఊర్ధ్వముఖమవుతుంది. హృదయ కమలంలోని కర్ణిక మధ్యలో మహాగ్ని, చుట్టూ రవ్వలు వెదజల్లుతూ,

అన్ని దిశలందు వెలుగు ప్రసరింపజేస్తూ, అపాదమస్తకం శరీరాన్ని వేడిగా ఉంచుతుంది. ఈ అగ్నిమధ్యలో హృదయగతమై, పరమాత్మ అయిన విష్ణువు యొక్క మహిమాన్వితమగు మూర్తి ఉంటుంది. ఆయనకు రెండుప్రక్కల శ్రీ-భూదేవులుంటారు. ఆయన రుక్మాభుడు, పీతాంబరుడు, పద్మదళాయతాక్షుడు, చతుర్భుజుడు, శ్రీవత్సాంకుడు, స్మితపూర్వక ప్రసన్న ముఖరాగయుతుడు.

ధ్యానబలంతో, జ్ఞానచక్షువుతో భక్తుడు పైనివర్ణించిన విష్ణురూపాన్ని దర్శింపగలుగుతాడు. సర్వవ్యాపి అయిన విష్ణువు, ఇప్పుడు, ధ్యానమథనంచేత, సర్వవిభూతితో సాకారుడవుతాడు; ఇది విష్ణువుయొక్క సకలరూపం. భక్తుడు ఆయనను సందర్శించి, ఆవాహనంచేసి, అర్చించాలి. "ప్రవః పాంతం" అనే వేదమంత్రం-మానవుడు విష్ణువును నిత్యం అర్చించాలి అని నిర్దేశిస్తున్నది (పటలం-91) ఇదే వైఖానస తత్త్వచింతన.

"ప్రతి ఆలయానికి సొంత అర్చకులుంటారు. ఆలయ నిర్మాణం ప్రారంభం నుంచి వారి జీవితాలు దానితో ముడిపడి ఉంటాయి. సాధారణంగా ఆలయ నిర్వాహక సంఘం వారిని నియమించదు. ఆలయం దైవప్రతిమ అర్చకుడు -- ఈ మూడు సమిష్టిగానే ఆలయ నిర్వాహక సంఘానికి సంక్రమిస్తాయి."

(చూ.పుట 164)

రూపద్వయం హరేః ప్రోక్తం
బింబ మర్చక ఏవచ
బింబేత్వానాహనాదూర్థ్వం
సదాసన్నిహితోఽర్చకే
అర్చకస్తు హరిః సాక్షాత్
చరరూపీ నసంశయః

(చూ. పుట 167)

# అనుబంధం-1

## వైఖానస ఆగమోత్పత్తి

(భృగుప్రోక్త 'ప్రకీర్ణాధికారం'-30వ అధ్యాయంనుంచి)

శ్రుణ్వంతు మునయః సర్వే శాస్త్రమాహాత్మ్యముత్తమమ్ ।
యావచ్ఛక్తి ప్రవక్ష్యామి జ్ఞాతం గురుకృపాబలాత్ ॥ 1
పురా చతుర్ముఖో బ్రహ్మా సిసృక్షురఖిలం జగత్ ।
సుప్తోత్థితశ్చిరం కాలం ప్రాకామీత్సర్గకర్మణి ॥ 2
విసస్మార యదా ధాతా నిద్రయాక్రాంతమానసః ।
వేదాన్ సంసర్గ ప్రధానాంస్తు సృష్టిర్నైవప్రవర్తతే ॥ 3
చింతాతురస్తదా బ్రహ్మా మూఢః కర్తవ్యకర్మణి ।
బహుధా ధ్యాయమానస్తు లేభే కారణం స్తతః ॥ 4
స్వశక్త్యా యద్విధేయం స్యాత్సర్వం చక్రే విమూఢధీః ।
న హి తత్కారణం లేభే వేదవిస్మరణం తు యత్ ॥ 5
చిరాచ్చింతాం తు తాం త్యక్త్వా స్వస్థచిత్తః ప్రజాపతిః ।
హృత్పద్మమధ్యే పురుషం పరమేణ సమాధినా ॥ 6
చింతయామాస వై విష్ణు మృగ్యజుస్సామరూపిణమ్ ।
తుష్టావ చ తదా బ్రహ్మా హరిప్రవణమానసః ॥ 7
ననామ చ తదా విష్ణుం శంఖచక్రగదాధరమ్ ।
అర్చయామాస దేవేశం పాదాద్యై ర్వ్యగ్రహైః సమైః ॥ 8
ముహుర్ముహుః ప్రాణమ్యాథ మూర్ధ్నా దేవం జగత్పతిమ్ ।
నిర్వ్యాజకరుణాలేశాద్దేవస్య విమలాంతరః ॥ 9

# అనుబంధం-1

## వైఖానస ఆగమోత్పత్తి

### (భృగుప్రోక్త 'ప్రకీర్ణాధికారం'-30వ అధ్యాయంనుంచి)

ఓ మునులారా! ఉత్తమమైన శాస్త్రమాహాత్మ్యమును మీరు అందరూ వినండి, గురుకృపాబలంతో తెలిసినది శక్తి వంచనలేకుండా చెబుతాను. (1)

పూర్వం చతుర్ముఖుడైన బ్రహ్మ సమస్తజగత్తును సృష్టింప కోరిక గలవాడై నిద్రించినాడు. చిరకాలానికి నిద్రలేచి, సృష్టికర్మప్రారంభింపదలచినాడు. కాని, నిద్రాక్రాంతమానసుడైన ధాత వేదాలను మరచినాడు. సృష్టి వేదప్రధానమైనది కాబట్టి, వాటిని మరవటం చేత సృష్టిసాగలేదు (2-3). చింతాతురుడైన బ్రహ్మ, కర్తవ్యకర్మవిమూఢుడై సృష్టికర్మయందు తన అశక్తతకు కారణం తెలుసుకోవాలని బహుధా ఆలోచించినాడు. విమూఢబుద్ధి అయిన బ్రహ్మ స్వశక్తితో చేయవలసినదంతా చేసినాడు. కాని వేదాలను విస్మరించటం అందుకు కారణమని తెలియలేదు (4-5).

ప్రజాపతి, చిట్టచివరకు, చింతనువిడిచి, స్వస్థచిత్తుడై, పరమసమాధిస్థితుడై, హృత్పద్మమందు, పురుషుడును ఋగ్యజుస్సామరూపియును అయిన విష్ణువును ధ్యానింపసాగెను. హరిప్రవణమానసుడైన బ్రహ్మ స్తోత్రం చేసినాడు. శంఖచక్రగదాధరుడైన విష్ణువును ఉద్దేశించి, విగ్రహమును అర్చించినట్లుగా, పాద్యాదులతో దేవేశుని అర్చించెను (6-8). మరలమరల జగత్పతి అయిన ఆదేవునకు ప్రణమిల్లి, దేవుని నిర్వ్యాజకరుణాలేశంచేత విమలాంతరంగుడై, అజుడు, జగదీశ్వరుడు అయిన నారాయణుని ఇట్లా స్తుతించెను:

తుష్టావ జగదీశానం నారాయణమజం విధిః ।
జితం తే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన ॥ 10

[పిమ్మట 21 శ్లోకాలతో బ్రహ్మచేసిన విష్ణుమూర్తి స్తుతి సాగింది. ]

తమసాక్రాంతచిత్తస్య విస్మృతా నిగమా మమ ।
అవేదవిహితః సర్గో మయా కర్తుం న శక్యతే ॥ 1
ప్రసీద పరమేశాన వేదభిక్షాం ప్రయచ్ఛమే ।
ఇతి చింతయస్తస్య బభూవాఽనావిలం మనః ॥ 2
తతస్తు భగవాన్ బ్రహ్మ వేదరాశిమవాప్తవాన్ ।
సస్మార నిఖిలాన్ వేదాన్ సాంగానుపనిషద్గణమ్ ॥ 3
పురాణన్యాయమీమాంసా ధర్మశాస్త్రాణి సర్వశః ।
చతుఃషష్టికలాశ్చైవ విద్యాస్థానాని యాని చ ॥ 4
అంతర్హితానాం ఖననాత్ వేదానాం తు విశేషతః ।
స విధుః ప్రోచ్యతే బ్రహ్మ విఖనా బ్రహ్మవాదిభిః ॥ 5
వైఖానసశ్చ భగవాన్ ప్రోచ్యతే స పితామహః ।
జగత్సర్వమశేషేణ వేదదృష్టేన వర్త్మనా ॥ 6

[ఇట్లా గ్రంథం కొనసాగుతూ బ్రహ్మ-దక్షుడు, మరీచి మున్నగు పదిమంది మునులను సృష్టించి, వారికి వైఖానసశాస్త్రం బోధించెనని వివరించినది.]

తాం తు వైఖానసీం శాఖా మేతానధ్యాపయన్మునిః ।

[తరువాత ఈ గ్రంథం తొమ్మిదిమంది శిష్యులను పేర్కొన్నది. భృగువు, అంగిరసుడు, మరీచి, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు, దక్షుడు- వీరే నవబ్రహ్మలు].

ఓ పుండరీకాక్ష! నీకు జయము. విశ్వమును సంభవింపజేయువాడ! నీకు నమస్కారము! (9, 10).

[పిమ్మట 21 శ్లోకాలలో బ్రహ్మచేసిన విష్ణుస్తుతి సాగినది].

తమసాక్రాంత చిత్తుడనైన నేను వేదములను విస్మరించితిని. వేదాలు లేకుండా సృష్టిచేయుటం నాకు శక్యంకాదు. నాయందు ప్రసన్నుడవై, ఓ పరమేశా! నాకు వేదభిక్షను అనుగ్రహించుము. ఇట్లా చింతిస్తున్న బ్రహ్మ యొక్క మనస్సు అనావిల (= నిర్మల) మైనది. అంతట బ్రహ్మకు వేదరాశి లభించినది. బ్రహ్మకు, సాంగంగా నిఖిలవేదాలు, ఉపనిషద్గణము, పురాణ-న్యాయ-మీమాంసా-ధర్మశాస్త్రములన్నియు, చతుష్షష్టికళలు, విద్యా స్థానములెల్ల స్ఫురించినవి. అంతర్హితములైన వేదాలను విశేషంగా 'ఖననం' (=త్రవ్వి పైకి తీయటం) చేయటం వల్ల, ప్రభువైన ఆబ్రహ్మను 'విఖనుడు'' అని బ్రహ్మవాదులు పేర్కొన్నారు (1-5). పితామహుడైన ఆ బ్రహ్మయే వైఖానసుడనియు పేర్కొనబడినాడు. వేదదృష్టమగు అశేషమార్గంతో సర్వ జగత్తును సృజించినాడు (6).

[ఇట్లా గ్రంథం కొనసాగుతూ, బ్రహ్మ-దక్షుడు, మరీచిమున్నగు పదిమంది మునులను సృష్టించి, వారికి వైఖానసశాస్త్రం బోధించెనని వివరించింది].

"తాంతు వైఖానసీం శాఖా మేతానధ్యాపయన్ మునిః".

- అంతట ఆముని వారికి వైఖానసీశాఖను భోధించెను.

[తరువాత ఈ గ్రంథం తొమ్మది మంది శిష్యులను పేర్కొన్నది-భృగువు, అంగిరసుడు, మరీచి, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు, దక్షుడు-వీరే నవబ్రహ్మలు]

ఏతే విఖనసః శిష్యాః శ్రుతిస్మృతి విధానతః ।
తచ్ఛిష్యాస్తు మహాత్మానో మునయస్తత్త్వదర్శినః ॥ 63
వేదానుగాని శాస్త్రాణి చక్రుర్లోకహితైషిణః ।
కేచిత్ గృహ్యాణి వై చక్రుః గృహ్యశ్రౌతాత్మకాని తు ॥ 64
ధర్మశాస్త్రాణి కేచిత్తు పురాణాని చ కేచన ।
ఇతిహాసాం స్తథా కల్పాన్ ప్రోచురన్యే మహర్షయః ॥ 65
. . . . . . . . . . . . . . . . . . . .
ఆదికాలే తు భగవాన్ బ్రహ్మా తు విఖనాముని ।
యజుః శాఖానుసారేణ చక్రే సూత్రం మహత్తరమ్ ॥ 69
వర్ణాశ్రమాచారయుతం శ్రౌతస్మార్త సమన్వితమ్ ।
యత్సూత్రాద్యంతమధ్యేషు భగవాన్ విష్ణు రవ్యయః ॥ 70
యష్టవ్యో శియతే యస్మాత్ సర్వసూత్రోత్తమం తు తత్ ।
వేదే వైఖానసే సూత్రే యోధర్మః పరికీర్తితః ॥ 71
సర్వైః స ధర్మో ఽనుష్ఠేయో నాఽత్ర కార్యావిచారణా ।
.......................................... ॥ 72
ఏతద్వైఖానసం సూత్ర మన్యసూత్రా ఽనపేక్షితమ్ ।
(ఏతద్వైఖానసం సూత్రం సర్వవేదార్థసంగ్రహః) ॥ 73

వీరే విఖనసముని శిష్యులు; మహాత్ములు, తత్త్వదర్శులు, అయిన ఈ శిష్యులు, శ్రుతి- స్మృతివిధానములను అనుసరించి, వేదానుగాములైన శాస్త్రాలను, లోకహితంకోసం నిర్మించినారు. కొందరు గృహ్య-శ్రౌతాత్మకములైన గృహ్యసూత్రములను రచించినారు. మహర్షులు కొందరు ధర్మశాస్త్రాలు, కొందరు పురాణాలు, కొందరు ఇతిహాసాలూ, కొందరు కల్పములు రచించినారు (63 - 65).

ఆదికాలంలో భగవంతుడైన బ్రహ్మయే 'విఖనముని'; ఆయన యజుశ్శాఖానుసారంగా మహత్తరమైన సూత్రమును రచించినాడు. వర్ణాశ్రమాచారయుతం, శ్రౌత-స్మార్త సమన్వితం అయిన ఆ సూత్రంయొక్క ఆది-మధ్య-అంతములందు అవ్యయుడైన భగవంతుడైన విష్ణువు విలసిల్లుతూ ఉంటాడు. (69-70).

అందుచేత అది సర్వసూత్రములందును ఉత్తమమైనది. వేదములందు, వైఖానససూత్రమందు ఏ ధర్మం చెప్పబడినదో ఆ ధర్మము అందరిచేత అనుష్ఠింపదగినది. ఇచ్చట విచారణ చేయదగినది కాదు.

ఈ వైఖానస సూత్రాన్ని అనుసరిస్తే, ఇంక ఏ సూత్రమును పాటించవలసిన పనిలేదు. (ఈ వైఖానస సూత్రం సర్వ వేదార్థ సంగ్రహరూపమైనది.) (71 - 73).

# అనుబంధం - 2

[క్రింద ఉద్ధరింపబడిన భాగం భృగువు యొక్క యజ్ఞాధికారం - 51వ అధ్యాయంలోనిది. ఆగమం యొక్క స్థాయిని గూర్చి వైఖానసుల దృక్పథం ఏమిటో ఈ భాగం వివరిస్తున్నది. తరువాతి కాలంలో వేదం నాలుగు భాగములైనట్లే, వైఖానసూత్రం కూడా నాలుగు భాగములైనది.]

విష్ణోః తంత్రం ద్విధా ప్రోక్త మర్చనార్థం తు వైదికమ్ ।
ప్రథమం సౌమ్య మన్యత్ తదాగ్నేయం తాంత్రికం భవేత్ ॥
వైఖానసేన సూత్రేణ నిషేకాది క్రియాన్వితైః ।
బ్రాహ్మణైః క్రియమాణం యత్తత్ సౌమ్యం వైదికం మతమ్ ॥
విధిస్తు వేదమూలశ్చ దీక్షాయుక్తశ్చ తాంత్రికః ।
స చోక్తో ద్వివిధోమార్గః శుద్ధమిశ్రవిభేదతః ॥
శుద్ధం భాగవతం ప్రోక్తం పంచరాత్రమథేతరత్ ।
సూతైర్వా సాత్త్వతైర్వాపి కృతం యచ్ఛుద్ధతాంత్రికమ్ ॥
తేషాం శారీర సంస్కారాస్తత్ తంత్రేషు కీర్తితాః ।
న తేషాం వేద మర్యాదా సూతాదీనాం ప్రవర్తతే ॥
త్యక్త్వాఽత్మసూత్రవిధి ర్నానాసూత్రార్థదర్శిభిః ।
దీక్షితైః క్రియమాణం యత్తన్మిశ్రమభిధీయతే ॥
కేవలం భుక్తిదం శుద్ధం మిశ్రం ముక్త్యైకసాధనమ్ ।
భుక్తి ముక్తి ప్రదం సౌమ్యం ఇతి పూర్వ్యజదర్శనమ్ ॥

# అనుబంధం - 2

[క్రింద ఉద్ధరించిన భాగం భృగువు యొక్క యజ్ఞాధికారం - 51వ అధ్యాయంలోనిది. ఆగమం యొక్క స్థాయిని గూర్చి వైఖానసుల దృక్పథం ఏమిటో ఈ భాగం వివరిస్తున్నది. తరువాతి కాలంలో వేదం నాలుగు భాగములైనట్లే, వైఖానసూత్రం కూడా నాలుగు భాగములైనది.]

అర్చన విషయంలో విష్ణుతంత్రం రెండు విధాలు - 1. వైదికం; ఇది సౌమ్య పద్ధతి. 2. తాంత్రికం; ఇది ఆగ్నేయం. వైఖానస సూత్రోక్తనిషేకాది సంస్కారవంతులైన బ్రాహ్మణులచేత చేయబడే అర్చన వైదికం, సౌమ్యం.

దీక్షాయుతుడైన తాంత్రికుని విధులకు కూడా వేదమే మూలం. అతడు అనుసరించే మార్గాలు రెండు విధాలు : 1. శుద్ధం. 2. మిశ్రం. ఇందులో శుద్ధమైనది భాగవత పద్ధతి. ఇంక రెండవది పాంచరాత్ర పద్ధతి. సూతుల చేత కాని, సాత్త్వతులచేత కాని చేయబడేది శుద్ధతాంత్రికం. సూతాదులు ఆయా తంత్రములందు చెప్పబడిన శారీరసంస్కారాలు నిర్వర్తిస్తారు. వారు వేదమర్యాదను పాటించరు.

ఆత్మ (= స్వీయ) సూత్రవిధిని విడిచి, నానా సూత్రార్థాలను దర్శిస్తూ దీక్షితులై కార్యకలాపాలను నిర్వర్తించటం మిశ్రతాంత్రికం అవుతుంది.

శుద్ధతాంత్రికం కేవలం భుక్తిదం. మిశ్రతాంత్రికం కేవలం ముక్తి సాధనం. ఇంక సౌమ్యం భుక్తిముక్తి ప్రదమైనది. ప్రాచీనులచేత ఉపదేశింపబడినది.

సౌమ్యం నారయణః ప్రాహ వేదేభ్యః సారముద్ధితమ్ ।
తస్మాద్ బ్రహ్మ విరాట్ తస్మాత్స ఏవ విఖనాముని ॥
తతో உస్మదాద్యా మునయ శ్చత్వారో లేభిరే విధిమ్ ।
తేభ్యః ప్రాదురభూచ్ఛాస్త్రం ఉత్తమం చతురాత్మకమ్ ॥
వేదానాం వ్యసనాదర్వాక్ ప్రాగ్రూపం మిలితం తు యత్ ।
తాంతు వైఖానసీం శాఖా మితి ప్రోక్తం విఖనసా తథా ॥
తత్సమష్ట్యాత్మకం సూత్రం ప్రోక్తం విఖనసా తథా ।
ఋగాది భేదసంభిన్నా వ్యష్టి రూపేణ సా పునః ।
ఋగ్యజుః సామాథర్వేతిచతుర్ధా సా యథా உభవత్ ॥
చతుర్ధా వ్యష్టిరూపేణ తత్సూత్రం చాభవ త్పునః ।
ఆత్రేయం భార్గవం చైవ మారీచం కాశ్యపం త్వితి ॥

[తరువాత, అత్రి-భృగువు-మరీచి-కాశ్యపుడు-ఈ నలుగురి రచనలు విశదీకరింపబడినవి. భృగువుయొక్క రచనల విషయవివరణ కూడా ఉన్నది.]

సౌమ్యపద్ధతిని వేదసారంగా నారాయణుడు చెప్పినాడు. ఆ నారాయణుడు విరాట్ బ్రహ్మ. ఆయన నుండి .విఖనముని, ఆయననుండి మేము నలుగురం ఈ సౌమ్యవిధానమును పొందగలిగినాము; మా నలుగురు నుండియే ఉత్తమమైన వైఖానసశాస్త్రం చతురాత్మకంగా వెలసినది. వేదాలు విభజింపబడక పూర్వం ఏ రూపం ఉండెనో దానికి 'వైఖానసీశాఖ' అని పేరు. అది విఖనముని చేత ఉపదేశింపబడినది.

పూర్వం, విఖనుడు సమష్ట్యాత్మకంగా వైఖానస సూత్రమును నిర్మించినాడు. సమష్టిరూపంగా ఉన్న వేదం ఋగ్-యజుస్-సామ-అథర్వణ భేదములచేత నాలుగు విధములైనట్లే, సమష్టిరూపంగా ఉన్న వైఖానస సూత్రం వ్యష్టిరూపంగా నాలుగు విధాలైనది-- 1. ఆత్రేయం. 2. భార్గవం. 3. మారీచం. 4. కాశ్యపం.

[తరువాత పై నలుగురు మునుల రచనలు విశదీకరింపబడినవి. పిమ్మట, భృగువు యొక్క రచనల విషయవివరణ కూడా ఉన్నది.]

# అనుబంధం - 3

[భృగువు యొక్క యజ్ఞాధికారం (27,12-34) నుంచి, శ్రీనివాస మఖి తన వైఖానస గృహ్యసూత్ర తాత్పర్య చింతామణి (11వ ఖండం 1వ సూత్రం)లో ఉద్ధరించిన క్రిందిభాగం 'ధ్యానం' చేయవలసిన విధానమును వివరిస్తున్నది.]

అత్రగృహ్యాః:

ఆసనం స్వస్తికం కుర్యాత్ దక్షిణం పాదమూర్ధ్వతః ।
వామపాదమథశ్చాథ తథా జాన్వంతరే బుధః ॥ 1
అంగుష్ఠౌ ద్వౌ నిగృహ్యైవ శిశ్నం చ వృషణావపి ।
పీడయన్వై నివాతస్థః ప్రదీప ఇవ నిశ్చలః ॥ 2
అంకే వామం న్యసేత్పాణి మన్యం చోత్తానమూర్ధ్వతః ।
కించిదున్నామితముఖో దంతైః దంతానసంస్పృశన్ ॥ 3
నాసాగ్రస్థేక్షణశ్చైవమాసయేదాసనం బుధః ।
ప్రాణానాయమ్య విధినా రేచపూరకకుంభకైః ॥ 4
బీజం తద్ధృదయే న్యస్య ప్రణవైరపి వేష్టయేత్ ।
వలయంచాదిబీజం స్యాత్ ఉకారం కుటిలం భవేత్ ॥ 5
మకారం చైకనాదాన్మమేవం ప్రణవ ముచ్యతే ।
శుద్ధస్ఫటికసంకాశ మర్ధచంద్రసమాకృతి ॥ 6
తతో వారిణి కుంభస్థే ధ్యాయేద్ధారుణమండలమ్ ।
ఆదిబీజం సుసన్న్యస్య ప్రణవైరపి వేష్టయేత్ ॥ 7

# అనుబంధం - 3

[భృగువు యొక్క యజ్ఞాధికారం (27,12-34) నుంచి, శ్రీనివాసమఖి తన వైఖానస గృహ్యసూత్ర తాత్పర్య చింతామణి (11వ ఖండం 1వ సూత్రం)లో ఉద్ధరించిన క్రిందిభాగం 'ధ్యానం' చేయవలసిన విధానమును వివరిస్తున్నది.]

ఇక్కడ గృహ్యసూత్రం:

జానువుల మధ్య, దక్షిణ పాదం పైకి, ఎడమపాదం క్రిందికి ఉండే విధంగా స్వస్తిక ఆసనం వేసుకొనవలెను. ఎడమ మడమ వృషణములక్రింద, కుడిమడమ శిశ్నముపైన ఉంచి, గాలిలేని ప్రదేశంలో ఉన్న దీపంవలె నిశ్చలుడు కావాలి.

అంకమందు ( = ఒడిలో) వామపాణిని ఉంచి, దానిమీద దక్షిణ పాణిని ఉత్తానంగా, ఊర్ధ్వముఖంగా ఉంచాలి. ముఖం కొంచెం ఉన్నమితం కావాలి. పై దంతాలు క్రింది దంతాలతో కలియరాదు. దృష్టినాసా గ్రస్థం చేయాలి. ఇట్లా ఆసనంలో కూర్చుండాలి. విధిపూర్వకంగా రేచక -పూరక-కుంభకములతో ప్రాణాయామం చేయాలి. (1-4).

బీజాక్షరమును హృదయమందు నిల్పి, ప్రణవంతో దానిని పరివేష్టించాలి. (ఉదా: ఓమ్ శ్రీమ్ ఓమ్). ఆదిబీజం ( = అమ్) వలయం, ఉకారం ( = ఉమ్) కుటిలం, మకారం (మమ్) - ఏకనాదమును (= సంధిలో సంభవించిన వీటి కలయికను) ప్రణవమంటారు. ఇది శుద్ధ స్ఫటిక సమానంగా, అర్ధచంద్రాకారంలో ఉంటుంది. కలశంలో ఉన్న జలంలో వరుణ మండలమును ధ్యానించాలి. ఆదిబీజాన్ని (= అమ్) దానియందు బాగా విన్యాసం చేసి, ప్రణవంతో పరివేష్టించాలి. (5-7).

సూక్తం తతో జప్త్వా పౌరుషం సూక్తమేవ చ ।
నారయుణానువాకం చ శ్రీ భూసూక్తే తథైవచ ॥ 8
హృదయే సూక్తాన్ జప్త్వా ప్రణవస్యశతం పునః ।
సమాహితమనాభూత్వా ధ్యానం సమ్యక్ సమాచరేత్ ॥ 9
విషయేభ్యశ్చ సర్వేభ్యః ప్రత్యాహృత్యేంద్రియాణి చ ।
ఏకాగ్రం చ మనః కృత్వా తతః పశ్యేత్ సమాధినా ॥ 10
పద్మకోశప్రతీకాశే విశ్వస్యాయతనే పృథా ।
హృదయే ఽగ్నిశిఖామధ్యే పరమాత్మా వ్యవస్థితః ॥ 11
అప్రమేయ మజం నిత్యం సర్వాధారం సనాతనమ్ ।
నిర్గుణం నిష్కలం శుద్ధం పరమాత్మాన మవ్యయమ్ ॥ 12
క్షీరే సర్పి స్తిలే తైలం పుష్పే గంధః ఫలే రసః ।
కాష్ఠేఽగ్ని రివ సర్వత్ర వ్యాపినం పురుషోత్తమమ్ ॥ 13
మనసా సకలం ధ్యాత్వా హృదయే పద్మమధ్యమే ।
ధ్యాత్వైవాత్ర తతో మంత్రీ తస్మాత్ కుంభజలే హరిమ్ ॥ 14
సువర్ణ వర్ణం రక్తాస్యనేత్రపాణిపాదం తథా ।
శుకపింఛాంబరధరం విష్ణుం తం ప్రణవాత్మకమ్ ॥ 15
కిరీటహారకేయూర ప్రలంబబ్రహ్మసూత్రిణమ్ ।
శంఖచక్రధరం దేవం శ్రీవత్సాంకం చతుర్భుజమ్ ॥ 16
పరాత్పరతరం దేవం దేవ్యాదిపరిషద్గణైః ।
ధ్యాత్వా స్వమనసః కుంభే సమ్యగావాహయేద్గురుః ॥ 17
సూచ్యగ్రతోదమాత్రంతు నాస్తి తద్రహితం క్వచిత్ ।
కుత ఆవాహ్యతే దేవః కుత ఉద్వాస్యతే పునః ॥ 18

ఆత్మ (= స్వీయ) సూక్తమునుజపించి, పురుష సూక్తమును, నారా యణానువాకమును, శ్రీసూక్త-భూసూక్తములను హృదయమందు జపించి, ప్రణవమును వందసార్లు జపించాలి. అంతట సమాహితమనస్కుడై ధ్యానం చేయాలి. సర్వవిషయములనుంచి ఇంద్రియములను మరలించి, మనస్సును ఏకాగ్రంచేసి, సమాధియందు భగవంతుని దర్శించాలి. (8-10).

పద్మకోశంవలె ప్రకాశించే హృదయమందు ఉండే ఒక చిన్న అగ్నిశిఖ యొక్క మధ్యలో పరమాత్ముడు వ్యవస్థితుడై ఉంటాడు. ఆయన అప్ర మేయుడు, అజుడు, నిత్యుడు, సర్వాధారుడు, సనాతనుడు, నిర్గుణుడు, నిష్కలుడు, శుద్ధుడు, అవ్యయుడు, పరమాత్ముడు, క్షీరమందునేయి వలె, తిలలయందు తైలంవలె, పుష్పమందు గంధంవలె, ఫలమందు రుచివలె, కాష్ఠమందు అగ్నివలె, సర్వత్ర వ్యాపించి యున్న పురుషోత్తముడు. అట్టి విష్ణువు తన హృదయపద్మమందు సకలుడుగా ఉన్నాడని మనస్సులో భావించి, తరువాత కుంభజలమందు హరిని ధ్యానించవలెను. (11-14).

సువర్ణవర్ణుడు, రక్తఆస్యనేత్రపాణిపాదుడు, శుక పింఛాంబర ధరుడు, ప్రణవాత్మకుడు, కిరీట-హార-కేయూర-ప్రలంబ బ్రహ్మసూత్రధరుడు, శంఖ చక్రధరుడు, శ్రీవత్సాంకుడు, చతుర్భుజుడు, అయిన విష్ణువును పరాత్పర తరునిగానూ, లక్ష్మి మొదలగు పరిషద్గణములతో కూడిన వానిగానూ తన మనస్సు నందు ధ్యానించి కుంభజలమునందు ఆచార్యుడు ఆవాహనచేయవలెను.

ఆ విష్ణువు లేని చోటు, ప్రపంచంలో సూదిమొన మోపినంత భాగం కూడా లేదుకదా? ఆయన ఎక్కడి నుండి ఆవాహన చేయబడతాడు? ఎక్కడినుండి ఉద్వాసన చేయబడతాడు? (అనే ప్రశ్నలు ఉదయించవచ్చును).

తస్మా దావాహనం విష్ణోరయుక్త మితి మన్యతే ।
సర్వత్ర వ్యాపినస్తస్య సర్వస్మాత్ పరమాత్మనః ॥ 19
ఏకత్ర స్మరణం యత్తత్ ఆవాహనమితి స్మృతమ్ ।
అరణ్యాం సంస్థితో వహ్నిరేకత్ర జ్వలితో యథా ॥ 20
తథా ధ్యానేన భక్తస్య హృది విష్ణుః ప్రకాశతే ।
మంత్రైరావాహితే బింబే స్థలే కూర్చే జలే తథా ॥ 21
భక్తానుకంపయా స్థిత్వా పూజాం గృహ్ణాతి కేశవః ।
వదంత్యావాహనం కేచిద్ధరేరాదిత్యమండలాత్ ॥ 22
దేవేన సహ తత్కుంభే ధ్యాయేద్దేవ్యౌ యథావిధి ।
అసనాదిభిరభ్యర్చేత్ అర్ఘ్యాంతాచమాంతకైః ॥ ఇతి. 23

అంటే, విష్ణువును ఆవాహనం చేయటం అయుక్తమని భావింపబడుతున్నది. అంతటా వ్యాపించి, అంతటా ఉన్న పరమాత్మకు ఎట్లు ఆవాహనం సంభవిస్తుంది? మరల ఎట్లు ఉద్వాసన చెప్పబడుతుంది? కాగా ఒకచోట ఆయనను స్మరించుటయే ఆవాహనం అని నిర్ణయింపబడినది. (18-20).

అరణియందు అంతటా అగ్నిఉన్నప్పటికీ, మథించిన చోటనే జ్వలించినట్లుగా భక్తుని యొక్క హృదయమందు ధ్యానమథనం చేత విష్ణువు అభివ్యక్తుడవుతాడు. అట్లాగే విగ్రహమందు కాని, స్థండిలమందుకాని, దర్భకూర్చియందుకాని, జలములందు కాని, మంత్రములతో ఆవాహనం చేస్తే విష్ణువు అక్కడ అభివ్యక్తుడవుతాడు. భక్తులమీది కరుణచేత కేశవుడు అచ్చట ఆగి, పూజను గ్రహిస్తాడు. కొందరు మాత్రం విష్ణువును ఆదిత్యమండలం నుంచి ఆవాహనం చేస్తున్నామని చెప్పుచున్నారు. అప్పుడుయథావిధిగ ఆ దేవునితో పాటు ఆ కుంభజలమందు శ్రీభూదేవులను కూడా ధ్యానించాలి. ఆసనం, అర్ఘ్యం, ఆచమనాదులతో అర్చించాలి.(20-23).

# అనుబంధం-4

[భృగువు యొక్క ఖిలాధికారంలోని ప్రథమాధ్యాయం మూడువిధాలైన పూజను (మానసపూజ- హోమపూజ-బేరపూజలను) వివరిస్తూ, బేరపూజ యొక్క విశిష్టతను విశదీకరించినది]

నారాయణస్య భూతానామాత్మనః పరమాత్మనః ।
లీలయా జగదుత్పత్తి స్థితి సంహారకారిణః ॥ 1
దేవదేవేశితుర్విష్ణోః లక్ష్మీశస్య జగత్పతేః ।
ఉపాయస్త్రివిధః ప్రోక్తః పూజాయాః శ్రుణుత ద్విజాః ॥ 2
మానసీ హోమపూజా చ బేరపూజేతి సా త్రిధా ।
హృదయే హృదయేశానం జగదీశం పరాత్పరమ్ ॥ 3
ధ్యాత్వా తు హృదయాంతస్థం హేమవర్ణమజం విభుమ్ ।
కృత్వైకాగ్రం మనస్సమ్యక్ కృతస్నానజపాదికః ॥ 4
రశ్మిమాలాసహస్రాఢ్యం మండలం విపులం రవేః ।
తదంతః శీతలాభిస్తు రశ్మిభిః సోమమండలమ్ ॥ 5
తతః స్ఫులింగకలిలజ్వాలాభి ర్వహ్నిమండలమ్ ।
తస్య మధ్యే సుఖాసీనం తప్తహాటకసన్నిభమ్ ॥ 6
చతురంగులమాత్రాంకం శుకవక్త్రనిభాంబరమ్ ।
హారకేయూరకటకకటిసూత్రోపశోభితమ్ ॥ 7

# అనుబంధం-4

[భృగువుయొక్క ఖిలాధికారంలోని ప్రథమాధ్యాయం మూడు విధాలైన పూజను (మానసపూజ - హోమపూజ-బేరపూజలను) వివరిస్తూ బేరపూజ విశిష్టతను విశదీకరించినది.]

నారాయణుడు, సర్వభూతాత్ముడు, పరమాత్ముడు, లీలగా జగదుత్పత్తి స్థితి-సంహారకారకుడు, దేవదేవేశుడు, లక్ష్మీశుడు, జగత్పతి అయిన విష్ణువు యొక్క పూజకు సంబంధించిన ఉపాయములు మూడు-వీటిని గూర్చి ఓ ద్విజులారా! వినుడు. విష్ణుపూజమూడు విధాలు- మానసపూజ, హోమ పూజ, బేరపూజ. (1-3)

మానసపూజ: స్నానజపాదికములు పూర్తిచేసుకొని జగదీశుడు, పరాత్పరుడు అయిన హృదయేశుని హృదయమందు ధ్యానించి, హృదయాంతస్థుడు, హేమవర్ణుడు, అజుడు అయిన విభుని మీద మనస్సును చక్కగా ఏకాగ్రం చేయాలి. అందు రశ్మిమాలాసహస్రాఢ్యము, విపులము అయిన రవి మండలాన్ని భావించాలి. దానిమధ్యలో శీతల రశ్మియుతమైన సోమమండలాన్ని భావించాలి. తరువాత విస్ఫులింగములు వెదజల్లే వహ్నిమండలం భావించాలి. దానిమధ్యలో సుఖాసీనుడు తప్తహాటక సన్నిభుడు, చతురంగుల మాత్రాంకితుడు, శుకపత్రనిభాంబరుడు, హారకేయూర కటక కటి

కౌస్తుభోద్భాసితోరస్కం శ్రీవత్సాంకిత వక్షసమ్ ।
ఉద్దామకాంచీ విలసన్ముక్తవిరోపశోభితమ్ ॥ 8
రక్తనేత్రధరం రక్తపాణిపాదనఖం శుభమ్ ।
శంఖచక్రధరం దేవం చతుర్బాహుధరం పరమ్ ॥ 9
తద్గతేనైవ మనసా నైరంతర్యే చింతయేత్ ।
ధ్యాత్వైవ మర్చయేద్దేవం సా పూజా మానసీ స్మృతా ॥ 10
అగ్నినాధాయ విధివదధ్వరేషు ద్విజాతిభిః ।
ఇజ్యతే యజ్ఞపురుషః సర్వదేవమయో హరిః ॥ 11
యో యజ్ఞరూపీ తస్యార్చా హోమపూజేతి కథ్యతే ।
కృత్వా యత్ప్రతిమాం విష్ణోః యథాలక్షణమాదరాత్ ॥ 12
సంస్థాప్య తాంతు విధినా దేవాగారే ఽథ వేశ్మని ।
నిత్యమారాధనం భక్త్యా సా పూజా బేరపూజనమ్ ॥ 13
ఆలయే బేరపూజా చ గ్రామమధ్యే ప్రకల్పితా ।
సా తత్ర వాసినాం సర్వమగ్నిహోత్రం ద్విజన్మనామ్ ॥ 14
శుష్కేంధనం యథా ఽనగ్నౌ న ప్రజ్వలతి కర్హిచిత్ ।
తద్వన్మోఘో ద్విజోఽనగ్నిః ఇత్యాహ వేదపారగాః ॥ 15
అగ్నిహోత్ర మనగ్నీనాం ధాతా ప్రాహ ఽలయం హరేః ।
అనగ్నిహోత్రీ లభతే స్వర్గం నేత్యాహ చ శ్రుతిః ॥ 16
సంగతి ర్దేవపూజా చ దానం యజ్ఞ ఇతి స్మృతిః ।
యజ్ఞేష్వేతేషు విధివద్బేరపూజా విశిష్యతే ॥ 17
యజమానే మృతే ఽప్యేషా శాశ్వతం భువి తిష్ఠతి ।
తస్యాగ్నిహోత్రస్యాధానం వక్ష్యామి శ్రుణుత ద్విజాః ॥ 18

సూత్రశోభితుడు, కౌస్తుభశోభితోరస్కుడు, శ్రీవత్సాంకిత వక్షసుడు, ఉద్దామ కాంచీ విలసన్ముక్త వీరోప (= ముత్యాలపతకంతో) శోభితుడు, రక్తనేత్రధరుడు, రక్తపాణిపాదనఖ శోభితుడు, శుభుడు, శంఖచక్రధరుడు, చతుర్భుజుడు, పరమ పురుషుడు అయిన విష్ణువును నిరంతరంగా చింతనచేస్తూ, అర్చించటం మానసపూజ అవుతుంది. (4-10).

హోమపూజ: ద్విజులు అగ్నిని అధానంచేసి, విధివిధానంతో, యజ్ఞయాగా దులద్వారా సర్వదేవమయుడు, యజ్ఞపురుషుడు అయిన హరిని అర్చించుతారు. యజ్ఞరూపి అయిన హరిపూజ హోమపూజ అవుతుంది. (11-12)

బేరపూజ: ఆదరంతో యథాలక్షణంగా, విష్ణువుయొక్క ప్రతిమను సిద్ధంచేసుకొని, దానిని గృహంలోకాని, దేవాలయంలో కాని విధిపూర్వకంగా ప్రతిష్ఠించి, భక్తితో ఆరాధించటం బేరపూజ అవుతుంది. (12-13)

గ్రామమధ్యలోని ఆలయంలో పరికల్పించబడిన బేరపూజ, ఆగ్రామంలో నివసిస్తున్న ద్విజులందరకు, సమగ్రంగా అగ్నిహోత్రం అవుతుంది. ఎండిన వంటచెరకు అగ్నిహోత్రంలేని చోట ప్రజ్వలించనట్లే, ఆహితాగ్ని కాని ద్విజుడు విఫలుడు అవుతాడు అని వేదపారగులు చెబుతున్నారు. (14-15).

అందుచేత, అగ్నిఆధానం చేయని ద్విజులకు విష్ణ్వాలయమే అగ్నిహో త్రమని బ్రహ్మ ఆదేశించినాడు-కారణం అగ్నిహోత్రం లేనివారికి స్వర్గం లేదని వేదం చెబుతున్నది కావున. సజ్జనసాంగత్యం, దేవపూజ, దానం-ఇవి యజ్ఞములని స్మృతి చెబుతున్నది. ఈమూడురకముల యజ్ఞములందు బేరపూజ విశిష్టమైనది-యజమానుడు మరణించినను భూలోకంలో ఈ బేరపూజ శాశ్వతంగా ఉంటుంది కావున బేరపూజ అనే అగ్నిహోత్ర అధాన విధానం చెబుతాను. ద్విజులారా! వినండి. (16-18)

ఋగ్యజుస్సామసు పరాః తత్తత్కార్యానురూపతః ।
సౌమ్యాః ఫలకరా మంత్రాః విష్ణోరారాధనే స్మృతాః ॥ 19
(శాంతికం పౌష్టికంచాపి నిష్కృతిశ్చాభిచారికమ్ ।
ఏవం చతుర్ధా సంప్రోక్తం పురా తు హరిపూజనమ్ ।
పూజనోపాయమంత్రైస్తు మార్గభేదశ్చతుర్విధః ॥ ) 20

ఋగ్యజుస్సామములందు ఆయాయజ్ఞపరములైన మంత్రములు విష్ణ్వా రాధనలో వినియోగింపబడితే ఆ యజ్ఞములు ఫలవంతములు కలవగును.

(హరిపూజనం నాలుగు విధాలు అని పూర్వం చెప్పబడింది. శాంతిక ములు, పౌష్టికములు, నిష్కృతులు, అభిచారికములు- ఈ నాలుగు విధాలైన కర్మలలో మొదట పూజకు ఉపయోగించే మంత్రాలతో విష్ణువుని పూజిం చాలి. మార్గములు మాత్రం నాలుగు విధాలు).

# అనుబంధం-5

## ఆలయనిర్వహణము

'ఆలయసంస్కృతి' అనే దానిని అభివృద్ధిపరచి, దానికి నిర్దిష్టమైన రూపమిచ్చి దోహదం చేసిన వాటిల్లో వైఖానసగ్రంథాలకు స్థానమున్నది. ఈ గ్రంథాలు ఆలయాలకు సంబంధించిన వాస్తు, శిల్పం- వీటిని గూర్చి అమూల్యమైన సమాచారం అందించటమేకాక, ఆలయం చుట్టూ పట్టణాభివృద్ధికి సంబంధించిన ప్రణాళికలను కూడా వివరించినవి. అంతేకాదు. ఆలయంలో తప్పక నెలకొనవలసిన వాతావరణమును గూర్చి కూడా విశదీకరించినవి. ఆలయంలో నెలకొనవలసిన వాతావరణంలో ప్రధానాంశం-ఆలయానికి వచ్చిన భక్తుని నడవడి. భృగువుయొక్క ప్రకీర్ణాధికారం (20, 36 అధ్యాయాలు) నుంచి క్రింద ఉద్ధరించిన భాగం భక్తుడు పాటించవలసిన అనేకములైన విధులను నిషేధములను పేర్కొన్నది; ఇవి పురుషపరంగా ఉన్నప్పటికీ, ఇవి అన్నీ స్త్రీ-పురుషులిరువురకు సమంగా వర్తిస్తాయి.

1. (అపచారాః----)

"యానైర్వో పాదుకైర్వాపి గమనం భగవద్గృహే." (36,1).

- (అపచారాలు----)

భగవద్గృహంలో (= ఆలయంలోపల) యానం మీదకాని, పాదరక్షలతో కాని తిరుగ రాదు.

2. "ప్రదక్షిణం శనైర్గత్వా దేవాలయ ముపావ్రజేత్" (20,113).

-మెల్లగా ప్రదక్షిణంచేసి, పిమ్మట దేవాలయంలో ప్రవేశించాలి.

3. "విమానం విష్ణురూపం స్యాన్నతత్పదాదినాక్రమేత్" (27,280).

-విమానం (= గర్భగుడి గోపురం) విష్ణుస్వరూపం కావున దాని శిఖరాదులను పాదాలతో త్రొక్కరాదు.

4. ధామప్రదక్షిణే పూర్వం కుర్యాత్తత్ర నమస్క్రియాః"(27, 280).

-ఆలయప్రదక్షిణం చేయటానికి ముందే, (దైవాన్ని ఉద్దేశించి) నమస్కారంచేయాలి.

5. "న లంఘయేత్ ధ్వజచ్ఛాయాం ప్రదక్షిణ విధిం వినా ।
గోపురస్య విమానస్య ప్రాకారస్యాలయస్య చ" (27, 281)

-ఒక్క ప్రదక్షిణ సమయంలో తప్ప, ఇంకెప్పుడూ దేవాలయం యొక్క ధ్వజస్తంభచ్ఛాయనుకాని, విమానచ్ఛాయనుకాని, గోపురచ్ఛాయనుకాని, ప్రాకారచ్ఛాయనుకాని దాటరాదు.

6. "యజ్ఞసూత్రమధః కృత్వా కర్ణే కృత్వా విశేషతః ।
అపసవ్యంచ కృత్వైవ కృత్వా చైవ నివీతవత్ ॥
న గచ్ఛేద్దేవతాగారం న వా ముక్తశిఖో నరః ।
అకచ్ఛః పుచ్ఛకచ్ఛశ్చ నగ్నః కౌపీనమాత్రధృక్" ॥
(36,312-313)

-యజ్ఞసూత్రము (= జందెము )ను నడుమునకు చుట్టుకొనికాని, చెవికి తగిలించుకొనికాని, అపసవ్యంగా వేసుకొని లేదా దండవలె ధరించికాని దేవతాగారం ప్రవేశించరాదు. గోవతిని గోచీ లేకుండాకాని, వ్రేలాడే గోచీ కలదానిగా కాని కట్టుకోరాదు. నగ్నంగాకాని, కౌపీనం మాత్రమే ధరించికాని ఆలయంలో ప్రవేశించరాదు.

7. "యదా విశేత్ గృహం విష్ణోః సేవార్థం మధుద్విషః ।
కృత్వోపవీతః సమ్యగుత్తరీయం మనోహరమ్ ॥
సేవేత దేవదేవేశముపవీతః సదా శుచిః ।
కంచుకేనావృతాంగస్తు న గచ్ఛేద్ధరి మందిరమ్ ॥
ఉష్ణీషీ న చ సేవేత నైవ పాణౌ ధృతాయుధః ।
వస్త్రేణాచ్ఛాద్య దేహం తు కంబలేనేతరేణ వా ॥"
(36, 555-558).

-మధురిపుడైన విష్ణువును సేవించటానికి ఆలయంలో ప్రవేశించేముందు ఉపవీతుడై, మనోహరమైన ఉత్తరీయం ధరించినవాడు కావాలి. ఉపవీతుడై సదాశుచియై ఆ దేవదేవేశుని సేవించాలి. కంచుకం (= కుట్టినదుస్తులు-అంటే చొక్కా, కోటు మొ.) ధరించి హరిమందిరం ప్రవేశింపరాదు. ఉష్ణీషం (= తలపాగా, టోపీ మొ.) ధరించికాని, చేతిలో ఆయుధం పట్టుకొని కాని హరినిసేవించరాదు. వస్త్రంతోకాని, కంబలంతోకాని, తదితరములతోకాని శరీరాన్ని కప్పుకోవాలి.

8. "రిక్తహస్తః శూన్యఫాలస్త్యక్తసంవ్యాన ఏవ చ ।
ఖాదన్నపి చ తాంబుల ముపహారాది భక్షయన్ ॥
దేవాలయం విశన్నేవ తస్య పాపం సముద్భవేత్" ॥(36,314).

-రిక్తహస్తుడుగా కాని, తిలకంధరించకుండాకాని, సంవ్యానం(= ఉత్తరీయం) లేకుండాకాని, తాంబూలచర్వణం చేస్తూకాని, ఉపహారాదులను సేవిస్తూకాని దేవాలయం ప్రవేశించిరాదు. అట్లా ప్రవేశిస్తే పాపం చుట్టుకొంటుంది.

9. "యో భుక్త్వా దేవతాగారే నిక్షిప్యోచ్ఛిష్టమత్ర తు ।
గచ్ఛేదన్యత్ర వా ప్రాఽస్యాత్ సోఽపి మూఢో విపద్యతే" ॥
(36,336)

-దేవాలయంలో 'ప్రసాదం' తిని, శేషించిన దానిని అక్కడనే విడిచి పెట్టివెళ్ళిపోయిన, లేదా ప్రసాదం తినకుండా పారవేసిన మూఢుడు విపత్తిపాలవుతాడు.

10. "అర్తో న ప్రవిశేద్ గేహం దేవస్య పరమాత్మనః ।
వాయుభూతే శరీరే ఽస్మిన్ వాయుసంచారకర్మణి ।
మలవాయువిసర్గస్తు దేవగేహే విశేషతః ॥
పాతయేత్పురుషం సత్యమపి వేదాంతపారగమ్ ।
ఇతి దేవగృహం గంతుం వ్యాధితో నైవ చార్హతి" ॥
(36, 548-552).

-పరమాత్ముడైన దేవుని యొక్క ఆలయమునందు అర్తుడు(=రోగి) ప్రవేశించరాదు. వాతరోగమున్న వ్యక్తి ఆలయంలో వాయు సంచారకర్మ సమయంలో మల-వాయువిసర్జన చేయరాదు; అట్లాచేస్తే, ఆ పురుషుడు సత్యమైన వేదాంతపారగుడు అయినప్పటికీ పతనంకావటం తప్పదు. కావున, వ్యాధిగ్రస్తులు దేవాలయంలో ప్రవేశించటానికి అర్హులుకారు.

11. మనో ఽనవస్థితం యస్య న సాఽలం పూజితుం హరిమ్ ।
యస్యైవ నిర్మలం చిత్తం స ఽర్హః సర్వేషు కర్మసు ॥

-అనవస్థిత (= చంచల)మైన మనస్సుకలవాడు హరిని పూజించటానికి శక్తుడుకాడు. కావున నిర్మలమైన చిత్తంకలవాడే సర్వకర్మలకు అర్హుడు.

12. యస్తు దేవగృహద్వారే ప్రసార్య చరణౌ క్వచిత్ ।
శేతే నిద్రాతిసమ్మోహాత్ స యాతి నరకాయుతమ్ ॥
యాతనాశ్చానుభూయైవ దార్భ్రాహ్మణ్యం వ్రజేత్తు సః ।
యస్తు దేవగృహే మూఢః శయీత మదమోహితః ॥
(36, 337 + 340).

-ఎవడు దేవగృహద్వారమందు కాళ్ళుచాపుకొనికూర్చుంటాడో, లేదా నిద్ర ఆపుకోలేక నిద్రపోతాడో అతడు నరకం పాలు అవుతాడు. మదమోహితుడైన మూఢుడు దేవగృహంలో నిద్రిస్తే, నరకంలో అనేక యాతనలను అనుభవించి, దుర్బ్రాహ్మణ జన్మ ఎత్తుతాడు.

13. యస్తు దేవగృహం గత్వా రోదితి ప్రణయాద్యథా ।
దుఃఖితః స్తౌతి వా దేవం తత్స్యాత్ మానసికం మలమ్ ॥
నిర్వాణ పరమం స్థానం మ్లానేన మనసా తు యః ।
సేవతే స న జానాతి తద్విష్ణోః పరమం పదమ్ ॥(36,422-423)

-దేవగృహం ప్రవేశించి భక్తితో రోదించినా, రోదిస్తూ దేవుని స్తుతించినా, అతని మనస్సు మలపూరితమైనదని చెప్పవచ్చు. నిర్వాణ పరమస్థానమైన ఆలయంలో మలినమైన మనస్సుతో దేవుని సేవించే వ్యక్తికి, విష్ణువు యొక్క పరమపదవిశిష్టత తెలియదన్నమాట!

14. రాగాద్యపేతం హృదయం వాగదుష్టాఽనృతాదినా ।
హింసాదిరహితః కాయః కేశవారాధనే త్రయమ్ ॥ (36, 470).

-రాగాదులులేని హృదయం, అనృతాదులు చొరనివాక్కు, హింసాది రహితమైనకాయం-ఈమూడూ కేశవారాధనమందు ప్రధానములు.

15. నైవాత్ర హింసా కుర్వీత ప్రాణినాం దుఃఖదాం క్వచిత్ ।
అహింసా వైదికం కర్మ ధ్యాన మింద్రియనిగ్రహః ।
తపో ఽథ గురుశుశ్రూషా ధర్మద్వారాః షడీరితాః ॥(36,427).

-ఏప్రాణికైనా దుఃఖం కలిగించే ఏహింసానూ ఆలయంలో చేయరాదు. అహింస, వైదికకర్మ, ధ్యానం, ఇంద్రియనిగ్రహం, తపస్సు, గురుశుశ్రూష-ఈ ఆరూ ధర్మద్వారములని చెప్పబడినవి.

16. ముధా సంభాషతే యస్తు ప్రవిశ్య హరిమందిరమ్ ।

స నిధిః పురతః సిద్ధం త్యక్త్వా భిక్షతి కాకిణీమ్ ॥
యస్తు సంభాషతే వ్యర్థం దేవాలయ ముపాశ్రితః ।
సిద్ధమన్నం పరిత్యజ్య భిక్షామటతి దుర్మతిః ॥
యన్ముహూర్తం క్షణం వాపి పరమాత్మా న చింత్యతే ।
సా హానిస్తన్మహచ్ఛిద్రం సా భ్రాంతిః సా తు విక్రియా ॥
సంత్యనేకే ప్రదేశాశ్చ సమయాశ్చ విశేషతః ।
లోకయాత్రనిష్పత్త్యై దేహయాత్రోపయోగినః ।
తస్మాద్దేవగృహం గత్వా నరో నాఽన్యపరో భవేత్ ॥
(36,381-393- 386-387)

-హరిమందిరం ప్రవేశించి వ్యర్థసంభాషణచేసే వ్యక్తి, ఎదుట సిద్ధం గాఉన్న నిధిని విడిచి పెట్టి, గవ్వలకోసం భిక్షమెత్తేవానితో సమానం. దేవాలయం చేరి వ్యర్థప్రసంగాలు చేసేవ్యక్తి సిద్ధాన్నం విడిచిపెట్టి, భిక్షాటనం చేసేవానితో సమానం. ఆలయం ప్రవేశించి ముహూర్తకాలం లేదా కనీసం క్షణకాలమైనా పరమాత్మను గూర్చి చింతించక పోవటం హాని కరం; అదిమహచ్ఛిద్రకరం, భ్రాంతికరం; అదేవికారం. లోకయాత్రనుగూర్చి, దేహయాత్రనుగూర్చి చింతించటానికి అనేకప్రదేశాలు, అనేక సమయాలు విశేషంగా ఉండనే ఉన్నవి. కావున, దేవగృహం చేరిన వ్యక్తి, ఇతర భావనలు చేయరాదు (భగవత్పరాయణుడు మాత్రమే కావాలి).

17. న హి దేవస్య పురతః క్వచిదప్యనృతం వదేత్ ।
సత్యస్వరూపీ భగవాన్ సత్యం తస్మై న గూహయే ॥
(36, 389).

-ఆలయంలో దేవుని ఎదుటనిలిచి, అనృతం పలుకరాదు. భగవంతుడు సత్యస్వరూపుడు; ఆయన ఎదుట సత్యమును దాచరాదు.

18. న హి దేవగృహం గత్వా శాస్త్రార్థైర్నీరసైర్నరః ।
ముహూర్తం క్షపయేత్కాలం తద్దేవస్య విమాననా ॥
పాఠనం లేఖనాద్యంచ నైవ కుర్యాద్ గృహే హరేః ।
స భవేదక్షరద్రోహీ యస్తు కుర్యాద్ వ్యతిక్రమమ్ ॥
(36, 416 + 320).

-దేవగృహంలో నీరసములైన శాస్త్రార్థచర్చలు చేయరాదు. అట్లా ముహూర్తకాలం గడిపినా, అది దేవుని అవమానించినట్లే. పాఠనం, లేఖనాదులు

హరిగృహమందు చేయరాదు. అట్లాచేసేవ్యక్తి అక్షరద్రోహి, దైవవ్యతిక్రమం చేసినవాడు అవుతాడు.

"అని బద్ధప్రలాపాన్ యే కుర్వతే దేవమందిరే ।
తే ఽపి తిత్తిరితాం భూత్వా జాయంతే జన్మపంచకమ్ ॥(36,410).

- దేవమందిరంలో అనిబద్ధప్రలాపాలు సాగించేవ్యక్తి ఐదుజన్మలవరకు తిత్తిరి పక్షిగా జన్మిస్తాడు.

19.న హి దేవగృహం గత్వా వివదేత నరః క్వచిత్ ।
న తత్ స్థానం వివాదస్య తస్మాత్తం దూరతస్త్యజేత్ ॥
(36, 468).

-దేవగృహంలో ఎన్నడూ వివాదములు పెట్టుకోరాదు; వివాదములకు అది స్థానంకాదు. అచ్చట వివాదముల పొంతపోరాదు.

20.ఆత్మానం యో విశేషేణ స్తౌత్యహంకారభావితః ।
అనాహత్య గురూన్ దైవమనిబద్ధం చ సంవదేత్ ।
అవలిప్తో న జానాతి దోషమాత్మని సంగతమ్ ॥ (36, 600-601)

-దేవగృహంలో అహంకారంతో తనను బాగా పొగడుకొనే వ్యక్తి, దైవమును గురుజనులను లెక్కచేయకుండా అనిబద్ధంగా సంవదించే వ్యక్తి, అవలిప్తుడై (= గర్వించినవాడై) తనకు సంక్రమించే దోషాన్ని గుర్తించలేడు.

21.న జాతు త్వమితి బ్రూయాదాపన్నో ఽపి మహత్తరం ।
త్వంకారో వా వధో వేతి విద్వత్సు న విశిష్యతే ॥
తస్మాన్నిందాం పరేషాం తు దేవాగ్రే పరివర్జయేత్ ।
తథా పరస్తుతిం చైవ విధినా సంత్యజేన్నరః ॥
పరః పరాత్మా పురుషః పురాణః ప్రోచ్యతేతు యః ।
తదగ్రే ఽన్యస్య దేవస్య న స్తుతిం స్తావయేన్నరః ॥
తస్మాత్స్వాజాం స్తుతిం చాన్యమితరేషాం అసంశయమ్ ।
త్యజేద్దేవగృహే యస్తు సుఖం మన్యేత జీవితుమ్ ॥
(36, 561, 564-5,569-70).

- తాను ఎంతగా అపన్నుడైనప్పటికీ, దేవగృహంలో తనకంటె పెద్ద వారిని "నీవు" అని ఏకవచనంతో సంబోధించరాదు. విద్వాంసులను 'నీవు' అనటం, వధించటం- ఈరెండింటి మధ్య భేదం లేదంటారు పండితులు (= పెద్దలను 'నీవు' అనటం వధతోసమానం). ఆలయంలో దేవుని ఎదుట పరనిందను, పరస్తుతిని కూడా, ఏకారణంచేతనైనాసరే చేయరాదు. పరమపురుషుడని పురాణములు ఉద్ఘోషిస్తున్న దేవుని ఎదుట ఇతరులను స్తుతించరాదు. కావున, సుఖజీవనం కోరేవ్యక్తి, ఆలయంలో ఇతరులను స్తుతించటం, పూజించటం తప్పక పరిహరించాలి.

22. నైవాన్యం ప్రణమేజ్జాతు ప్రవిశ్య హరిమందిరమ్ ।
స హి సర్వేశ్వరః శేషీ యత్రాస్తే రమాధవః ॥ (36, 595).

-హరిమందిరంలో ఉన్నప్పుడు ఇతరులకు ప్రణామం చేయరాదు. అచ్చట రమాధవుడు మాత్రమే సర్వేశ్వరుడు, శేషి.

23. న హి దేవగృహం గత్వా పృష్ఠీకృత్యాసనం చరేత్ ।
దేవాభిముఖ ఏవ స్యాద్ భక్తః సర్వాత్మనా నరః ॥
న పృష్ఠం దర్శయే జ్జాతు దేవాగ్రే హితచింతకః ।
పార్శ్వతస్తు చరన్నేవ నివర్తేతాలయం ప్రతి ॥ (36, 593-594).

-ఆలయంలో దేవునకు పృష్ఠభాగం చూపిస్తూ కూర్చుండరాదు. భక్తుడు సర్వాత్మనా దేవాభిముఖుడై ఉండాలి. హితచింతకుడైనవ్యక్తి భగవంతునకు తన పృష్ఠ భాగం చూపరాదు; ఒకప్రక్కగా తిరిగి మాత్రమే ఆలయం నుంచి నిష్క్రమించాలి.

24. యస్త్వధికార గర్వేణ దేవాగారముపాశ్రితః ।
అకాలే సేవితుం చేచ్ఛేత్సో ఽపి యాస్యతి దుర్గతిమ్ ॥
ఉక్తేష్వేవ తు కాలేషు సేవేత మతిమాన్నరః ।
అంత్యార్చనావసానే యత్ కవాటో బధ్యతే తతః ।
పునరుద్ఘాటనం యావత్ప్రత్యూషే చ భవిష్యతి ॥
తావన్నైవ హరిం సేవేదకాలః స విశేషతః ।
అథార్చనాకాలే ఽపి భక్తానాం సేవనాయ తు ॥
అకాలా బహవః ప్రోక్తాస్తథా యవనికోదితా ।
తస్మాదకాలసేవాం తు విధినా పరివర్జయేత్ ॥
(36, 627-633).

-అధికార గర్వంతో ఎవరు, అకాలంలో, ఆలయంప్రవేశించి, భగవంతుని సేవించాలని కోరుతాడో అతడు దుర్గతిని పొందుతాడు. చెప్పబడినకాలమందే మతిమంతుడైన వ్యక్తి భగవంతుని సేవించాలి. చివరి అర్చన జరిగిన తరువాత మందిర కవాటం బంధింపబడుతుంది; మరల ప్రత్యూషమందు కవాటం తెరువబడుతుంది-ఈమధ్యకాలంలో (= అకాలంలో) హరిని సేవించరాదు. భక్తుల అర్చనకు చెప్పబడిన కాలములలో కూడా అకాలములు చాలా ఉంటాయి; ఆ అకాలములలో సేవలు తెరవెనుకజరుగుతాయి. కావున భక్తులు అకాలసేవలను పరిహరించాలి.

25. దురాచారో హి పురుషో నేహాయుర్విందతే మహత్ ।
త్రస్యంతి చాస్య భూతాని తథా పరిభవంతి చ ।
తస్మాదాచారవానేవ కుర్యాద్వై వైదికాః క్రియాః ॥(36, 316).

-దురాచారుడైన పురుషుడు దీర్ఘాయువును పొందడు. జనులు వానిని చూసి త్రాసం (= ఆకస్మికభయం) పొందుతారు; అతనిని అవమానిస్తారు కూడా; కావున సదాచారవంతుడైన వ్యక్తి మాత్రమే వైదిక క్రియలు చేయవలెను.

26. విషయాక్రాంతచిత్తానాం విష్ణ్వర్చనమకుర్వతామ్ ।
కర్మభూమౌ నృణాం జన్మ కర్మా ఽపి విఫలం ధ్రువమ్ ॥
యో గురౌ మానుషం భావం శిలాభావం చ దైవతే ।
మంత్రేషు జీవికాభావం హింసాభావం మఖేషు చ ॥
పూజకేషు చ పూజాయాం నీరసం భావమేతి సః ।
సర్వథా నిందితవ్యో హి జీవితం తస్య నిష్ఫలమ్ ॥
(36, 633-636).

-విషయలోలుడై విష్ణ్వర్చనకు పూనుకొననివాని జన్మ, వాని కర్మలు-ఈకర్మభూమిలో-విఫలములు కావటం తప్పదు. గురువునందు మానుషభావం, దైవమునందు శిలాభావం, మంత్రములందు జీవికాభావం, మఖములందు హింసాభావం, అర్చకులపట్ల అర్చనల పట్ల నీరసభావం కలవ్యక్తి సర్వథా నిందాపాత్రుడు; వానిజీవితం నిష్ఫలం.

27. అపచారాస్తథా విష్ణోర్ద్వావింశత్ పరికీర్తితాః ।
యానైర్వా పాదుకైర్వాఽపి గమనం భగవద్గృహే ॥
దేవోత్సవాద్యసేవా చాఽప్రణామం చ తదగ్రతః ।

ఏకహస్తప్రణామం చ తత్పురస్తాత్ ప్రదక్షిణమ్ ॥
ఉచ్ఛిష్టే చైవ చాఽశౌచే భగవద్వందనాదికమ్ ।
పాదప్రసారణం చాఽగ్రే తథా పర్యంక బంధనమ్ ॥
శయనం భోజనం చైవ ముధాభాషణమేవ చ ।
ఉచ్చైర్భాషా వృథాజల్పో రోదనాద్యం చ విగ్రహః ॥
నిగ్రహోఽనుగ్రహశ్చైవ స్త్రీషు సాకృతభాషణమ్ ।
అశ్లీలకథనం చైవాఽప్యధోవాయువిమోక్షణమ్ ॥
కంబలావరణం చైవ పరనిందా పరస్తుతిః ।
శక్త్యా గౌణోపచారశ్చాఽప్యనివేదితభక్షణమ్ ॥
తత్తత్కాలోద్భవానాం చ ఫలాదీనాం నార్పణమ్ ।
వినియుక్తావశిష్టస్య ప్రదానం వ్యంజనాదిషు ॥
పృష్ఠీకృత్యాసనం చైవ పరేషామభివందనమ్ ।
గురౌ మౌనం నిజస్తోత్రం దేవతానిందనం తథా ॥
అపచారాంస్తు వివిధానీదృశాన్ పరివర్జయేత్ ।
అపచారేష్వనంతేషు సత్స్వన్యేషు ప్రమాదతః ।
క్షమస్వేత్యర్థనైవైకా నిష్కృతి ర్నిరుపద్రవా ॥ -(36, 1-9).

-విష్ణువుపట్ల జరిగే అపచారాలు ఇరవై రెండు:

(1) భగవద్గృహ మందు యానంమీదకాని, పాదుకలతోకాని సంచరించటం.

(2) దేవోత్సవాదులందు పాల్గొనకపోవటం; దేవుని ఎదుట ప్రణామంచేయక పోవటం.

(3) ఒకచేతితో ప్రణామంచేయటం; ప్రణామానికిపూర్వమే ప్రదక్షిణం చేయటం.

(4) అశుచిగా, అమేధ్యంగా భగవంతునకు వందనాదికం చేయటం.

(5) దేవునియందు పాదప్రసారణంచేయటం; పర్యంకంమీద కూర్చుండటం.

(6) దేవుని ముందు శయనించటం. (7) దేవునిముందు భుజించటం.

(8) వ్యర్థ సంభాషణచేయటం

(9) బిగ్గరగామాటాడటం, వృథాజల్పంచేయటం, రోదనాదులు చేయటం, తగవులాడటం.

(10) నిగ్రహించటం (=ఇతరులను. శిక్షించటం), అనుగ్రహం చూపటం (=ఇతరులకు బహుమానాలు ఇవ్వటం).

(11) స్త్రీలతో సాభిప్రాయంగా మాటాడటం, అశ్లీలకథనం.

(12) అపానవాయువు విడువటం.

(13) కంబలావరణం. (14) పరనింద, పరస్తుతి.

(15) శక్తి ఉన్నప్పటికీ గౌణ-ఉపచారాలు మాత్రమే చేయటం.

(16) అనివేదిత (=నైవేద్యంపెట్టనిదాని) భక్షణం.

(17) ఆయాకాలములందు లభించేఫలములను భగవంతునకు అర్పించక పోవటం.

(18) నైవేద్యంపెట్టినదానిలో మిగిలినవాటిని వ్యంజనాదులకు ఉపయోగించటం.

(19) భగవంతువంతుని వైపు వీపుపెట్టికూర్చుండటం.

(20) ఆలయంలో ఇతరులకు అభివందనంచేయటం· గురువులను గణింపకపోవటం.

(21) స్వీయస్తోత్రం. (22) దేవతానింద.

వివిధములైన ఇటువంటి అపచారాలను ఆలయంలో భక్తుడు పరిత్య జించాలి; ఒకవేళపొరపాటుగా అపచారాలు జరిగినప్పుడు 'క్షమించుము' అని భగవంతుని ప్రార్థించాలి; అట్లాచేస్తే నిష్కృతి జరిగి ఉపద్రవం తప్పుతుంది.

# అనుబంధం-6

## ఆలయాలకు, అర్చకులకు సంబంధించిన విషయాలు

### వైఖానసులకుప్రత్యేకించి

ప్రాచీనకాలంనుంచీ భారతీయసంస్కృతిలో ఆలయం ప్రధానపాత్ర

వహిస్తున్నది. అయితే, ఎప్పుడు, ఏవిధంగా ఆలయ నిర్మాణంప్రారంభమై నదో కచ్చితంగా చెప్పటం కష్టం. భారతీయ సంస్కృతియొక్క ప్రాచీనతకు, అందరూ అంగీకరించిన రెండు హద్దులు ఉన్నవి-(1) వేదవాఙ్మయంలో మిగిలిన సాహిత్యసంపద; (2) సింధునాగరకత అనబడే పురాతత్త్వశాఖవారి త్రవ్వకాలఫలం. ఇవి కూడా భారతీయ నాగరకత యొక్క ప్రారంభదశను సూచించేవి కావు; బాగా అభివృద్ధిచెందిన సాంస్కృతికపరిస్థితిని, సాంఘిక వ్యవస్థను ఇవి సూచిస్తున్నవి. ఆలయాలకు సంబంధించిన కచ్చితమైన ఆధారాలు తొలివేదమంత్రములలో లేకపోయినాయజుర్వేదంలోని "విష్ణోః స్తూపోసి" వంటి వాక్యాలు దైవానికి అంకితములైన నిర్మాణాలు కలవని సూచిస్తున్నవి. "ప్రవః పాంతం" అని ప్రారంభమయ్యే మంత్రంలోని "విష్ణవేచార్చత" అనేవాక్యం (ఐతరేయశాఖకు చెందిన ఋగ్వేదంలో-2వ అష్టకం, 21వ అనువాకం, 16వ సూక్తం) అర్చనను గూర్చి నిర్దేశిస్తున్నదని అసందిగ్ధంగా చెప్పవచ్చు. దేవాయతనములలో దేవతలు అర్చింపబడుతున్నారని తైత్తిరీయ సంహిత (2, 2, 6, 1) విశదీకరించినది (దేవానాం ఏవాయతనే యజతే). మొహెంజోదారో హరప్పాలలోని అవశేషాలలో దొరకిన పెక్కు ప్రతిమలు అర్చనకు ఉద్దిష్టములైన వనటంలో విప్రతిపత్తిఉండరాదు. సింధులోయత్రవ్వకాలలో దేవాలయాలు బయల్పడలేదుకాని, గృహార్చన వాడుకలో ఉన్నదనటానికి అనేకాధారములున్నవి.

అయితే క్రీస్తుపూర్వం 6వ లేదా 7వ శతాబ్దమునాటికే ప్రతిమార్చన, దేవాలయాలు వ్యవస్థీకృతములై బహుళ ప్రచారంలో ఉన్నవని చెప్పక తప్పదు. ప్రతిమలు అమ్మకమునకుకాక, జీవనాధారంగా ఉన్నవని పాణిని పేర్కొనటంవల్ల (అష్టాధ్యాయి-5, 3, 99- జీవికార్థే చాపణ్యే), హిరణ్యార్థులైన మౌర్యులు (మౌర్యవంశపురాజులు కారు) ప్రతిమలను చేసి, వాటిని అర్చనాభిలాషులైనవారికి అమ్మేవారని మహాభాష్యంలో పతంజలి వ్యాఖ్యానించటంవల్ల, నాటికి వృత్తిపరమైన అర్చకవర్గం ఏర్పడిందని స్పష్టమవుతున్నది (మౌర్యైః హిరణ్యార్థిభిః అర్చాః ప్రకల్పితాః యాస్త్వేతాః సంప్రతి పూజార్థాః తాసు భవిష్యంతి)

ప్రముఖప్రాచీన గ్రంథాలైన బృహత్ సంహిత, అర్థశాస్త్రం క్రీస్తుశకానికి ముందరి శతాబ్దములలోనే ప్రజాజీవితంలో ఆలయాలు ప్రముఖపాత్ర వహించినవని స్పష్టంచేస్తున్నవి. క్రీ. పూ. 2వ శతాబ్దమునాటికే

దేవాలయనిర్మాణం భక్తిపరమైన కార్యంగా పాలకులు పరిగణించినట్లు శాసనాధారములున్నవి. ఆలయనిర్మాతలు తమను 'భాగవతులు' గా శాసనాలలో పేర్కొన్నారు. 'భాగవత ' అనే పదం వ్యస్తంగా, సమస్తంగా జీవిత పర్యంతం తాను నమ్మినదేవునకు అంకితంకావటం అనే సంప్రదాయానికి పేరు. భాగవతులు విష్ణుభక్తులు కావచ్చు లేదా శివభక్తులు కావచ్చు. అంతకుకొన్ని శతాబ్దములకు ముందున్న పతంజలి 'శివభాగవతులు' ను గుర్తించినాడు. అయితే చాలాకాలంతరువాత 'భాగవతులు' అనేది విష్ణు భక్తులకు మాత్రమే పరిమితమైనది. కొందరు, అయావ్యక్తులు సొంతంగా నిర్మించుకొన్న ఆలయాలలో, లేదా అందరికీ చెందిన ఆలయాలలో అర్చకులుగా చేరినారు; జీవనార్థం వారు ఇంక ఏపనీ చేసేవారుకారు. గృహాలలో సాధారణమతవిషయకకార్యకలాపాలలో సహాయపడే పురోహితులకంటె ఈ అర్చకులు భిన్నులు.

దేవాలయవాస్తు వ్యవస్థీకరణ, అందులో పూజావిధానంయొక్క స్థిరీకరణ, విగ్రహశిల్పంయొక్క ప్రమాణీకరణ, అర్చనాసంబంధి ఆచార కర్మలనిర్ణయం మున్నగు వాటిని ఆగమశాస్త్రాలు సాధించి, విశదీకరించినవి. ఈ శాస్త్రాలు భాగవతుల (=శైవ-వైష్ణవుల) మేధాసంపత్తి ఫలములు. ఈ భాగవతులు ఆలయ నిర్వహణాధికారులు. ఆలయ నిర్మాణమునకు ప్రణాళికలువేసి, నిర్మింపజేయుటం, విగ్రహములు తయారు చేయించటం, వాటిని ప్రతిష్ఠింపజేయుటం, నిత్యనైమిత్తక క్రియాకలాపములు జరిపించటం, మరమ్మతులు చేయించటం, ప్రాయశ్చిత్తములు చేయించటం మున్నగు పనులన్నీ ఈ భాగవతులే నిర్వహించేవారు. ఆయామతాలలో శాఖలు, వర్గాలు ఏర్పడటం వల్ల ప్రధాన-పరివారదేవతలకు సంబంధించిన విషయాలలో విభిన్నములైన అభిప్రాయాలు చోటుచేసుకొన్నవి; కాని ప్రధానదృక్పథం ఆగమాలన్నింటికీ సమానమే. ఏవర్గానికి చెందిన ఆగమంలో అయినా ప్రధానవిషయం భగవంతునిమీది అచంచలభక్తి. ఇంక ఆగమశాఖలన్నింటి ప్రకారం భగవంతునకు, సామాన్యభక్తునకుమధ్య అనుసంధానం దీక్షపొందిన అర్చకుడు.

అసలు, ఆగమం అనేది అర్చకుని, అర్చకుని విధులను నిర్దేశించే శాస్త్రం. ఆలయం యొక్క మహిమకు హేతువులు ఇట్లా చెప్పబడినవి:

"అర్చకస్య తపోయోగాత్ అర్చనస్యాతిశాయనాత్ ।

. అభిరూప్యాచ్చ మూర్తీనాం దేవః సాన్నిధ్యమృచ్ఛతి॥"

-అర్చకుని యొక్క తపోయోగంవల్ల, అర్చనలోని విశిష్టతవల్ల, ప్రతిమ యొక్క అభిరూప్యంవల్ల - ఆలయంలో దేవుడు సన్నిహితుడవుతాడు.

అర్చకుడు తన శీలంవల్ల, నడవడివల్ల, అర్చనవిధులను నిర్వహించటంలో చూపే అభినివేశంవల్ల ప్రతిమలో దైవత్వాన్ని సాధిస్తాడు. ఒక శిలాప్రతిమను దేవుడుగా రూపొందించటం అర్చకునకే సాధ్యమవుతుంది.

"అర్చకస్య ప్రభావేన శిలా భవతి శంకరః".

-అర్చకుని ప్రభావంవల్లనే శిల, శంకరుడవుతుంది. అందుచేత, అర్చకుడు తన వృత్తిలో ఉపదేశం, దీక్షపొంది ఉండాలనీ, తనశాఖకు చెందిన శాస్త్రవిషయాలలో సరిఅయిన అవగాహన కలిగి ఉండాలనీ ఆగమాలు నిర్దేశించటంలో ఆశ్చర్యమేమీలేదు. అతడు దైవత్వంతో తాదాత్మ్యం చెందకపోతే, సామాన్య భక్తునకు, దైవత్వానికి మధ్య అతని అనుసంధానం ఫలవంతంకాజాలదు. పూజా సమయంలో దైవత్వంతో తాదాత్మ్యం చెందటానికి ఉపదేశం, దీక్షఅనేవి అర్చకునకు అర్హతకలిగిస్తాయి. ఉపదేశం, దీక్షతరువాత ప్రధానమైనది శాస్త్రజ్ఞానం. అర్చకుడు విద్వాంసుడు లేదా ఉపాధ్యాయుడు కానక్కరలేదు. ఉపదేశ-దీక్షాసమయాలలోనే అతని శాస్త్రశిక్షణ కూడా పూర్తి అవుతుంది. ఇందుకోసం పాఠశాలకు లేదా కళాశాలకు వెళ్ళి వేరే చదువుకోనక్కరలేదు. విద్వత్తు కలిగిఉండటం కంటె, దైవం మీది అచంచలభక్తివల్ల, తాను చేపట్టిన వృత్తిమీది అభినివేశంవల్ల అర్చకుడు విశిష్టుడవుతాడు.

అర్చకునకు, దేవలకునకు మధ్యగల భేదాన్ని వివరించటం ఆగమ గ్రంథాలలో సర్వసామాన్యం. చక్కగా ఉపదేశం-దీక్షపొంది అభినివేశంతో అర్చనకార్యక్రమం నిర్వహించే వైఖానస అర్చకుని గూర్చి భాష్కర సంహిత ఇట్లా వర్ణించినది:

"విప్రా వైఖానసాఖ్యా యే తే భక్తా సత్త్వముచ్యతే ।
ఏకాంతినః సుసత్త్వస్థా దేహాంతం నాన్యయాజినః ।
కర్తవ్యమితి దేవేశం సంయజంతే ఫలం వినా॥"

-భక్తులైన వైఖానసవిప్రుల యొక్క తత్త్వం చెప్పబడుతున్నది. వారు-ఏకాంతులు, సుసత్త్వస్థులు, దేహాంతంవరకు ఇంకొకరిని యజించనివారు.

ఫలాపేక్ష లేకుండా, అర్చన తమకర్తవ్యంగా భావించి, దేవేశుని పూజిస్తారు.

ఇంకదేవలకుడు జీతం కోసంవచ్చినవ్యక్తి. అర్చనచేయుటంలో వాని ప్రధాన దృష్టి, అందుకు ప్రతిఫలంగా తనకు లభించే వేతనం మీదనే ఉంటుంది.

యో దేవం పూజయే ద్విప్రో విత్తార్థీ వత్సరత్రయమ్।
స వై దేవలకోనామ హవ్యకవ్య బహిష్కృతః ॥

-విత్తార్థియై (=వేతనంమీదిదృష్టితో) దేవుని మూడుసంవత్సరాలు పూజించినవిప్రుడు 'దేవలకుడు' అవుతాడు; అతడు హవ్య (=యజ్ఞ)-కవ్య (=శ్రాద్ధ) బహిష్కృతుడు అవుతాడు (=బ్రాహ్మణ్యం కోల్పోతాడు).

తన శాఖకు చెందిన పూజావిధానాలు తెలిసికొన్నప్పటికీ, నాలుగు వేదాలను చదివిన అర్హత ఉన్నప్పటికీ, విధివిధానంగా ఉపదేశంపొందకపోతే, అతడు మూడువిధాల దేవలకులలో రెండవవాడు అవుతాడు; అంటే 'కల్పదేవలకుడు' అవుతాడు.

"పాంచరాత్ర విధానజ్ఞో దీక్షావిరహితో ఽర్చకః ।
చతుర్వేదాధికారోఽపి కల్పదేవలకః స్మృతః ॥"

-అర్చకుడు-పాచరాత్రవిధానజ్ఞుడైనప్పటికీ, చతుర్వేదాధికారి అయినప్పటికీ, దీక్షావిరహితుడైతే, అతడు 'కల్పదేవలకుడు' అవుతాడు.

శివశేఖరతంత్రం, సంకర్షణసంహిత-వీటిప్రకారం దేవలకులు మూడు వర్గాలు: (1) కర్మదేవలకులు (దీక్షావిరహితులై పూజావిధాన-అనభిజ్ఞులైకూడా ఒకసంవత్సరంపాటు ఆలయంలో అర్చనచేసినవారు); (2) కల్పదేవలకులు (దీక్షావిరహితులైనప్పటికీ, పూజావిధానం తెలిసికొని, మూడు సంవత్సరాలు ఆలయంలో అర్చనచేసినవారు); (3) శుద్ధదేవలకులు (గురువు వద్ద ఆగమం చదువు కోకుండా, ఇతరవిధాల ఆగమజ్ఞానం సంపాదించినవారు; తాము అర్చించవలసిన దేవునినే కాక ఇతరదేవతలను కూడా అర్చించే వారు).

పూజావిధులలో కొన్నింటిని, సామాన్యభక్తుల తృప్తికోసం, అందరికీకనిపించేటట్లుగా, అర్చకుడు నిర్వహింపవచ్చు. అయితే ఇందుకు నిషేధం కూడా ఉన్నది:

"దేవార్చన పరో యోऽపి పరార్థం విత్తకాంక్షయా ।
చతుర్వేదధరో విప్రః స చండాలసమో భవేత్ ॥"

-పరులకోసం, లేదా విత్తకాంక్షతో దేవార్చనచేసే విప్రుడు, అతడు చతుర్వేదపారంగతుడైనప్పటికీ, చండాలునితో సమానం.

అత్రియొక్క 'స్మృత్యర్థసారం', దీక్షితుడైన అర్చకునకు, దేవలకునకు మధ్యగల భేదాన్ని ఇట్లా వివరించినది:

"వైదికేన విధినా దంభలోభవివర్జితః ।
పూజయేద్ భక్తితో విష్ణుం స హి దేవలకో న వై" ॥

-అర్చకుడు, దంభం (=పరప్రదర్శనార్థం), లోభం లేనివాడై, వైదిక మైన విధితో, భక్తితో విష్ణువును పూజించాలి; అప్పుడు అతడు దేవలకుడు కాడు.

ఇటువంటివాడు ఇతరులకోసం అర్చనచేసి, అందుకు ప్రతిఫలంగా విత్తం పొందినప్పటికీ అతడు దేవలకుడు కాడు.

భృగువుయొక్క ప్రకీర్ణాధికారం(30 వ అధ్యాయం-136-150) విశ్వా సంతో, భక్తితో, ఐహికఫలాపేక్ష లేకుండా, అర్చనచేసే వ్యక్తి 'భాగవతుడు' అని వర్ణించింది. దుఃఖమయమైన ఈ ప్రపంచంలో భగవద్భక్తి ఒక్కటే శర ణ్యమని నమ్మినవాడు భాగవతుడు. అట్టివ్యక్తి దేవతలందరూ, ప్రపంచమంతా విష్ణుస్వరూపమే అనీ, అయన అంతరంగమందే ఉంటాడనీ విశ్వసించి, సర్వభూతదయాపరుడై, ఫలాపేక్షలేకుండా భగవంతుని అర్చిస్తాడు.

దేవాలయం ప్రజలందరకుచెందిన సంస్థ. కావున దైవసంబంధి అంశాలు, లౌకికములైన అంశాలు అవ్యవస్థలో ఉండటం సహజం. ఆలయ నిర్మా ణమును సంరక్షించటం, అవసరమైనప్పుడు మరమ్మత్తులు చేయించటం, ఆలయం ఆస్తులను కాపాడటం, ఆదాయవ్యయాలను సక్రమంగా నిర్వహిం చటం, ఆలయంసిబ్బంది నిర్వాహకం, నైమిత్తిక ఉత్సవాలను నిర్వహించటం, సమాజంతో సత్సంబంధాలను సాధించటం-ఇవి లౌకికములైన అంశాలు. వీటిని, ఆసమాజంలోని పెద్దలతో కూడిన చిన్నచిన్న కార్యనిర్వాహక సంఘాలు, ప్రాచీనకాలంనుంచీ నిర్వహిస్తున్నవి (ఈ సంఘాలకు దక్షిణ దేశంలో 'సభైయార్', 'స్థానత్తార్' అనిపేర్లు).

ఆలయంలో నిత్యార్చన ఒక పవిత్రకార్యం; దానికి లౌకికములైన పరిమితులు లేవు; దానిని నిర్వహించేవ్యక్తి అర్చకుడు. అతడు దేశపాలకునిద్వారా లేదా కార్యనిర్వాహక సంఘంద్వారా వేతనం మీద నియమింపబడిన వ్యక్తికాదు. అతడు అర్చకవంశంనుంచి వచ్చినవాడు. అతడు పుట్టుకకు ముందే తండ్రి ద్వారా లేదా ఆకుటుంబంలోని పెద్దలద్వారా సంస్కారం పొందినవాడు ; పూజా విధానాలలో బాగా పరిచయం ఉన్నవాడు.

ప్రకీర్ణాధికారం(11, 2-8) ఇంకా ఇట్లా వివరించింది:

"వైఖానససూత్రేణ నిషేకాది క్రియాన్వితాన్ విప్రాన్ ।
వేదవిదః శ్రేష్ఠాన్ ధార్మికాన్ జ్ఞానతత్పరాన్ ॥
సౌమ్యాన్ జితేంద్రియాన్ శుద్ధాన్ విష్ణోరారాధనే పరాన్ ।
ఊహాపోహవిధానేన ధ్వస్తసంశయమానసాన్॥"

-వైఖానససూత్రం ప్రకారం నిషేకాదిసంస్కారాలు పొందిన వారు, విప్రులు, వేదవిదులు, శ్రేష్ఠులు, ధార్మికులు, జ్ఞాన తత్పరులు, సౌమ్యులు, జితేంద్రియులు, శుద్ధులు, విష్ణ్వారాధనతత్పరులు, ఊహాపోహ విధానంతో సంశయరహితమానసులు (-ఇట్టివారు ఉత్తమ అర్చకులు).

ప్రతిఆగమం, అర్చకులగుణాలను ఇట్లాగే పేర్కొన్నది. అయితే, ఈ గుణాలన్నీ ప్రతిఅర్చకునిలోను ఉండటం దుర్లభమైనప్పుడు ఏంచేయాలో ప్రకీర్ణాధికారం (17, 7-8) ఇట్లా నిర్దేశించింది:

"తదభావే తు తత్పుత్రం పౌత్రం నప్తారమేవ వా ।
తస్యైవ భ్రాతరం శిష్యం ప్రశిష్యం గురుమేవ వా ।
సబ్రహ్మచారిణం వాపి పూర్వాభావే తథోత్తరమ్ ॥
తదనుజ్ఞాత మితరం ఆచార్యత్వే నియోజయేత్ ।
అన్యథా చేన్మహాదోషో రాజా రాష్ట్రం చ నశ్యతి॥"

-ఉత్తమఅర్చకుడు లభించనప్పుడు, అంతకు ముందున్న అర్చకుని పుత్రుని లేదా పౌత్రుని లేదా మునిమనుమని ఎన్నుకోవాలి. అటువంటి వ్యక్తి కూడా లభించనప్పుడు అతని సోదరుని లేదా శిష్యుని లేదా ప్రశిష్యుని లేదా గురువును లేదా సబ్రహ్మచారి (=సహపాఠి)ని ఎన్నుకోవాలి. ఇందులో తొలుతపేర్కొన

బడినవ్యక్తి లభించనప్పుడే తరువాత పేర్కొనబడిన వ్యక్తిని ఎన్నుకోవాలి. ఇట్లా కూడా తగిన వ్యక్తి లభించక పోతే, పూర్వఅర్చకుని అనుమతితో తగినవ్యక్తిని ఇంకెవరినైనా ఆచార్యత్వమందు నియోగించవచ్చు. పైనివివ రించిన ప్రకారం చేయకపోవటం మహాదోషం అవుతుంది; రాష్ట్రం, రాజు కూడా నశించటం తథ్యం.

కాగా, అర్చకుని ఎన్నికలో, వంశానికి ప్రాధాన్యంఉన్నది. ఉత్తమ అర్చకుని కుమారునకు, తనవంతు వచ్చినప్పుడు, ఉత్తమ అర్చకుడు కావ టానికి అర్హత, మంచి అవకాశం ఉన్నవి- కారణం పుట్టుకకు ముందు విష్ణుబలి ద్వారా, తరువాత ఉపదేశం దీక్ష పొందటం ద్వారా అతడు అర్చకత్వానికి అర్హత పొంది ఉండటమే. అర్చకుని కుమారుడు యుక్తవయ స్కుడు అయినప్పుడు పాంచరాత్ర-శైవాగమాలు దీక్షావిధిని నిర్దేశిస్తూఉండగా, వైఖానసాగమం అదీక్షను శిశువు మాతృగర్భంలో ఉన్నప్పుడే విధిస్తున్నది; దీనినే 'విష్ణుబలి' అంటారు. గర్భధారణతరువాత, పుంసవన-సీమంతోన్నయ నములు జరిగిన తరువాత ఎనిమిదవనెలలో ఈ సంస్కారంజరుగుతుంది (ఇంకా ఎక్కువ వివరణములకు భృగువు యొక్క క్రియాధికారం-36, 42 చూడవలెను). ఈ సంస్కారాన్ని 'గర్భవైష్ణవేష్టి' అనికూడా అంటారు. దీనివల్ల గర్భస్థశిశువునకు వైష్ణవత్వంలభిస్తుంది; పుట్టుకతోనే అతడు వైష్ణవు డవుతాడు. అందుచేతనే వైఖానసులు మేము 'గర్భవైష్ణవులము' అని చెప్పుకొంటారు. ఈ సంస్కారసమయంలో విష్ణువేస్వయంగా గర్భస్థశి శువునకు ఉపదేశంచేసి, వైష్ణవత్వం, అర్చకత్వం ప్రసాదిస్తాడని వారి విశ్వాసం. అందుచేత వానికి ఇంకేవిధమైన సంస్కారం అక్కరలేదు. అయితే, ఇష్టంతోకాని, బలవంతంగా కాని జీవితంలో ఇంకేవిధమునైన ఉపదేశాదులను పొందితే, తిరిగి వైఖానసార్చకుడు కావటానికి అతడు ప్రాయశ్చిత్తం చేసుకోవలసి ఉంటుంది (వైఖానససూత్రానుక్రమణిక-2వ భాగం). కాగా అర్చక-అర్హత వైఖానసునకు పుట్టుకతోనే లభ్యమవుతున్నది.

"మద్భక్తియుక్తస్య మదాారసస్య నిషేకాది కర్మ విరాజితస్య న తప్తముద్రా న మంత్రదీక్షా న గురుర్మయా వినా." -(క్రియాధికారం).

-మద్భక్తియుక్తునకు, నాఆారసునకు, నిషేకకర్మాది విరాజితునకు తప్త ముద్ర మంత్రదీక్ష అక్కరలేదు; వానికి నాకంటె వేరే గురువు లేదు.

"త్వత్సుతో భాగ్యవాన్ ధన్యో గర్భవైష్ణవసంజ్ఞితః ।
అప్రాకృతో మహాత్మాసౌ గర్భచక్రేణలాంఛితః ॥"

-నీపుత్రుడు భాగ్యవంతుడు, ధన్యుడు, గర్భవైష్ణవసంజ్ఞితుడు, అప్రాకృతుడు, మహాత్ముడు, గర్భచక్రలాంఛితుడు (వైఖానససూత్రానుక్రమణికలో; ఆనందసంహితలో-10వ అధ్యాయం).

గర్భవైష్ణవజన్మనాం వైఖానసానాం సర్వేషాం
విష్ణ్వర్చనహేతుజన్మనాం
విష్ణువాక్యబలేనైవ తే చక్రాంకితా మతాః ।
నారాయణః స్వయం గర్భే ముద్రాం ధారయతే నిజాం ।
తత్కరస్థేన చక్రేణ శంఖేన ప్రథితౌజసా ॥
కరోతి చక్రశంఖాంకం శిశోర్వై బాహుమూలయోః ।
వైఖానసేన సూత్రేణ స్యాదయం గర్భవైష్ణవః ॥
వైష్ణవం సూత్రమేతద్ధి సర్వసిద్ధికరం పరమ్ ।

-గర్భవైష్ణవజన్ములు, విష్ణ్వర్చనాహేతుజన్ములు అయిన వైఖానసులందరూ విష్ణువాక్యబలంచేతనే 'చక్రాంకితులు' అవుతారు. నారాయణుడు స్వయంగా గర్భస్థశిశువుచేత తనముద్రలనుధరింపజేస్తాడు. తనచేతులలోని తేజోవంతములైన శంఖ-చక్రములను ప్రసాదిస్తాడు; వైఖానససూత్రం ప్రకారం అప్పుడతడు 'గర్భవైష్ణవుడు' అవుతాడు. ఈ వైష్ణవసూత్రం శ్రేష్ఠమైనది. సర్వసిద్ధి కరమైనది (ప్రకీర్ణాధికారంలో-36, 43-45).

"వైఖానసాశ్చ మత్పుత్రా దత్తపుత్రాశ్చ దీక్షితాః ॥
మమ వైఖానసస్యాపి న పశ్యంతరం బుధాః ।
న ముద్రధారణం తేషాం గర్భవైష్ణవజన్మనాం ॥
శ్రౌతస్మార్త క్రియార్హాణాం మత్ప్రసాదైకజీవినామ్ ।
మమవాక్యబలేనైవ తే వై చక్రాంకితా మతాః॥"

-(ప్రకీర్ణాధికారం-36, 43, 41)

-వైఖానసులు నాపుత్రులు, నాచేత శిక్షితులు, నాదత్తపుత్రులు. నాకు, వైఖానసునకు మధ్య బుధులు అంతరం (=భేదభావం) చూపరు. గర్భవైష్ణవజన్ములకు వేరే ముద్రధారణ అవశ్యకంకాదు. మత్ప్రసాదైక

జీవనులైన వైఖానసులు శ్రౌతస్మార్త క్రియార్హులు; నావాక్యబలంచేతనే వారు చక్రాంకితులు.

పై వివరణలనుపట్టి, వైఖానససమాజంలోని వారందరూ దేవాల యార్చకులే; వారు ఇంకేవిధమైన వృత్తిని చేపట్టరాదు. అర్చన రెండువిధాలు: (1) గృహార్చన, (2) ఆలయార్చన. ఇందులో రెండవది ఎల్లప్పుడు బేరపూజ లేదా సమూర్తార్చన అవుతుంది. దైవత్వం పర-వ్యూహ-విభవ -హార్దలేదా అంతర్యామి-అర్చారూపాలలో ఉంటుందనే భాగవతసంప్రదాయానికి చెందినదే ఈ బేరపూజ లేదా సమూర్తార్చన. గృహార్చన ఎవరైనాచేసుకోవచ్చు. కాని, ఆలయార్చనమాత్రం, చక్కగా అర్హతసంపాదించుకొన్నఅర్చకుడే నిర్వహించాలి. అట్లాకాక పోతే, రాజునకు, రాష్ట్రానికి కీడు కలుగుతుంది. కొరతవస్తుంది. కుండుకుపోవు తప్పదు.

దేవాలయం ప్రజలందరకుచెందిన సంస్థకదా. మరి అందులో నిత్యం అర్చనజరిగేటట్లు చూడటం అందరి బాధ్యత అవుతుంది (అందువల్ల రాజునకు, రాష్ట్రానికి మేలుజరుగుతుంది). కాగా, ఈ బాధ్యత ప్రధానంగా పరిపాలకులది, ప్రజాప్రతినిధులది. ప్రతిఆలయానికి సొంతఅర్చకులు ఉంటారు; ఆలయనిర్మాణం ప్రారంభంనుంచీ వారిజీవితాలు దానితో ముడిపడి ఉంటాయి. అర్చకత్వం అనేది వంశపారంపర్యంగా వస్తుంది. సాధారణంగా ఆలయనిర్వాహకసంఘం వారిని నియమించదు. ఆలయం, దైవప్రతిమ, అర్చకుడు-ఈమూడూ సమష్టిగానే ఆలయనిర్వాహకసంఘానికి సంక్రమిస్తాయి.

ఆలయార్చనావిధానం, ముఖ్యంగా వైఖానసపద్ధతిలో, చాలా విస్తృతమైనది. కావున ఆయా అర్చనావిధుల నిర్వహణలో అర్చకునకు సహాయకులు ఆవశ్యకం అవుతారు; ఇందుకోసం అతడు, పూజా విధానాలు తెలిసిన కొందరు పరిచారకులను నియమించుకొంటాడు-తన ఆ ఆగమసంప్రదాయనికి చెందినవారినే సాధారణంగా అర్చకుడు ఎన్నుకొంటాడు. వైఖానసాలయంలో, గర్భగుడిలో పూజలు నిర్వహించే అర్చకుడు, పరిచారకులు విధిగా వైఖానసులే అవుతారు. గర్భగుడి వెలుపల సాగే విధులకు నియుక్తులైన పరిచారకులలో కొందరు అర్చకునిచేత నియమింపబడినవారు; ఇంకతక్కిన వారు ఆలయ నిర్వాహక సంఘంచేత నియమింపబడినవారు.

భృగువుయొక్క ప్రకీర్ణాధికారం ఇట్లా వివరిస్తున్నది (18, 15-17):

ఆచార్యః స్యాదుపద్రష్టా దేవసాన్నిధ్యకారకః ।
అర్చనాద్యఖిలం కార్యం తన్నియోగేన కారయేత్ ॥
స హి కార్యస్య నిర్ణేతా గోప్తా ధర్మస్య దేశికః ।
అర్చకో దేవదేవస్య కుర్యాన్మంత్రాసనాదిషు ॥
ఉపచారానంతాశ్చ విధినా శాస్త్రచోదితాన్ ।
అర్చకస్య సహాయస్తు కింకరః పరిచారకః॥

- ఆచార్యుడు ఉపద్రష్ట (=సర్వవిధులు సక్రమంగా జరుగుతున్నవో లేదో పరిశీలనగా చూచేవాడు), దేవసాన్నిధ్యకారకుడు. అర్చనాది సర్వ కార్యములు అతని నియోగం ప్రకారమే జరగాలి. అతడే కార్యనిర్ణాయకుడు, ధర్మరక్షకుడు, దేశికుడు. దేవదేవుని మంత్ర ఆసనాదులు అర్చకుడే నిర్వహించాలి. శాస్త్రచోదితములైన ఉపచారవిధులు అనంతములు; వీటిని అర్చకసహాయులు - కింకరులు (=ఏపనిచేయాలని అడిగేవారు), పరిచారకులు నిర్వహిస్తారు.

గర్భగుడిలోని పరిచారకులు అర్చకునకు బాధ్యులు. అర్చకుడు వారికి ఉపదేశికుడు, మార్గదర్శి, నాయకుడు కూడా. పూజావిధులలో వారికి స్వతంత్రప్రతిపత్తికాని, బాధ్యతకాని ఉండదు; ప్రతిదశలోను వారికి అర్చకుడే మార్గదర్శి; వారిమీద ఆలయనిర్వాహక సంఘమునకు అధికారంలేదు-వారిన నడవడి ఆలయధర్మానికి భంజకం కానంతవరకు. గర్భగుడిలో నిత్యపూజలు, విశేషపూజలు, కామ్య (=భక్తులు కోరే) పూజలు-వీటి నిర్వహణబాధ్యత పూర్తిగా అర్చకునిదే. ఈవిషయాలలో మాత్రమే పరిచారకులు అర్చకునకు తోడ్పడతారు.

వేర్వేరుగా అర్చించవలసిన దేవతామూర్తులతో ఆలయం చాలా పెద్దది అయినప్పుడు లేదా జనంరద్దీ ఎక్కువ అయినప్పుడు అర్చకుల, వారి సహాయకుల సంఖ్య తప్పక పెరుగుతుంది. భృగువు యొక్క ప్రకీర్ణాధికారం (18, 9-14) తొమ్మిది విధాల దేవాలయాలను, వాటిల్లో ఉండవలసిన అర్చకుల, సహాయకుల సంఖ్యలను ఇట్లా వివరించింది:

| ఆలయం | అర్చకులు | సహాయకులు |
|---|---|---|
| 1. ఉత్తమోత్తమం | 20 | 70 |
| 2. ఉత్తమ-మధ్యమం | 16 | 64 |
| 3. ఉత్తమ-అధమం | 12 | 50 |

| | | | |
|---|---|---|---|
| 4. | మధ్యమ-ఉత్తమం | 8 | 40 |
| 5. | మధ్యమ-మధ్యమం | 6 | 25 |
| 6. | మధ్యమ-అధమం | 4 | 16 |
| 7. | అధమ-ఉత్తమం | 3 | 9 |
| 8. | అధమ-మధ్యమం | 2 | 4 |
| 9. | అధమ-అధమం | 1 | 2 |

గర్భగుడిలో చేయవలసిన వివిధ-ఉపచారాలను కూడా ప్రకీర్ణాధికారం వివరించింది-దీపాలను తుడిచి వెలిగించటం, పాత్రలను తోమి శుద్ధిచేయుటం, అర్చనకు నీళ్ళు పువ్వులు తీసుకొనిరావటం, ధూపదీపాలను సిద్ధంచేయుటం, చందనం అరగదీయుటం, విగ్రహామును వస్త్రములతో భూషణములతో అలంకరించటం మున్నగునవి. ఈ పరిచారకులలో నైవేద్యంతయారుచేసే వంటలవారుకూడా ఉంటారు. ఈ పరిచారకులందరూ వైఖానసులే కావాలి. వారు వైఖానసులుకాకపోతే గర్భగుడిలో ప్రవేశింపలేరు; విగ్రహాలను తాకలేరు.

"పరిచారాంస్తు వృణుయాదలాభే త్వన్యసూత్రిణః ।
దీక్షితానేవ సద్వృత్తానాగమోక్త విధానతః ॥"

-(ప్రకీర్ణాధికారం-25)

-వైఖానసులు లభించనప్పుడు, ఇతరసూత్ర విప్రులను అర్చకుడు పరిచారకాదులుగా నియోగించుకోవచ్చు; అయితే వారు, ఆ ఆగమంప్రకారం పూజావిధులలో దీక్షితులుకావాలి; మంచినడవడికలవారు కావాలి. అయితే వారు పరిచారకులలే అవుతారు కాని, అర్చకులుగా వ్యవహరించటానికి అర్హులు కారు.

ఆలయంలో వైఖానసులకు మాత్రమే పరిమితంకాని సేవలు కొన్ని ఉంటాయి; ఆ సేవలు చేసేవారు- దైవజ్ఞుడు, వాస్తువిద్యావిశారదుడు, ఉద్యానరక్షకుడు, పుష్పావచయకరులు, మాల్యోపజీవులు, ద్రవ్యసంభారకులు, దౌవారికులు మున్నగువారు (యజ్ఞాధికారం-50, 28-34 తో పోల్చిచూడదగును).

వైఖానసఅర్చకులు జీవనాధారంకోసం ఆలయంలో పనిచేయరు; అర్చనకోసమే తమ ఉనికి అనీ, అది తమవిధ్యుక్త ధర్మమనీ వారి విశ్వాసం.

"శాస్త్రమేతచ్చ సూత్రంచ సర్వేషామపి జీవనమ్ ।

యే వైఖానససూత్రేణ సంస్కృతాస్తు ద్విజాతయః॥"
-(యజ్ఞాధికారం, 30, 17)

-వైఖానససూత్రం ప్రకారం సంస్కారంపొందిన ద్విజులందరకు వైఖానససూత్రం, వైఖానసశాస్త్రం- ఇవే జీవనాధారములు.

పరిచారకులు, తాముచేసిన సేవలకు ప్రతిఫలం, అర్చకునినుంచి ధనరూపంలో కాని ద్రవ్యరూపంలో కాని పొందుతారు; వారివసతికి, భుక్తికి కూడా అర్చకుడే ఏర్పాట్లు చేస్తాడు.

అయితే రాష్ట్రంయొక్క, రాజు యొక్క క్షేమంకోసం స్వచ్ఛందంగా ఆలయార్చనచేపట్టిన అర్చకులకు ఐహిక వసతులను చేకూర్చ వలసిన అవశ్యకతను ఆగమాలు విస్మరించ లేదు. నిత్యార్చన నిర్విఘ్నంగా జరిగే బాధ్యతను అర్చకుడు స్వీకరించినట్లే, అర్చకులకు వసతులు చేకూర్చి, వారు సంతోషంగా జీవించేటట్లు చూడవలసిన బాధ్యత పాలకులు స్వీకరించాలి.

"రూపద్వయం హరేః ప్రోక్తం బింబ మర్చక ఏవ చ ।
బింబేత్వావాహనా దూర్ధ్వం సదా సన్నిహితో ఽర్చకే ।
అర్చకస్తు హరిః సాక్షాచ్చరరూపీ న సంశయః॥"
-(క్రియాధికారం, 36, '59-60)

-హరికి రూపద్వయం చెప్పబడింది–1. బింబం. 2. అర్చకుడు. బింబానికి దైవత్వం ఆవాహనతరువాతనే సంక్రమిస్తుంది. కాని అర్చకునిలో దైవత్వం సదాసన్నితంగానే ఉంటుంది. అర్చకుడు సాక్షాత్తు చరరూపిఅయిన హరియే; సంశయం లేదు.

"అధ్యాత్మ గుణసంయుక్తో యోగజ్ఞో భక్తిమాంచ్ఛుచిః ।
అర్చకః సుప్రసన్నాత్మా హరిరేవ న సంశయః॥"
-(బ్రహ్మోత్సవానుక్రమణికలో- ఉద్వాసనప్రబంధంలో)

అధ్యాత్మ (= ఆత్మ) గుణ సంయుక్తుడు (=దయాది గుణములు కలవాడు), యోగజ్ఞుడు, భక్తిమంతుడు, శుచి అయిన అర్చకుడు సుప్రసన్నాత్మ అయిన హరియే. సంశయం లేదు.

ఆలయంలో నిత్యం (రోజులో ఆరులేదా మూడు లేదా రెండుసార్లు)

జరిగే అర్చనలవల్ల రాష్ట్రం యొక్క భద్రత, సంపద, క్షేమం ఆధారపడి ఉంటాయి కాబట్టి అర్చకుని పేదరికం వల్ల ఆలయార్చనకు విఘాతం కలుగకుండా చూడవలసిన బాధ్యత పాలకులది. కావున, అర్చకుడు సుఖంగా జీవించటం కోసం, వానికి, పన్నులు విధింపని భూమిని, ఈనాముగా ఇవ్వాలని శాస్త్రాలు నిర్దేశిస్తున్నవి.

అవిచ్ఛిన్నా యథా పూజా విధినా సంప్రవర్తతే, ।
తథా ప్రకల్పయేద్విద్వాన్ భూమిభోగేన వై స్థితిమ్ ॥
అర్చకస్యార్చనార్థం చ కుటుంబార్థం చ యత్నతః ।
అత్యంత పుష్కలాం భూమిం బహుసస్యోచితాం తథా ।
కరగ్రాహాదిరహితా మర్చకాయ సమర్పయేత్ ॥

-( ప్రకీర్ణాధికారం, 12, 111-113)

-విధి పూర్వకంగా, అవిచ్ఛిన్నంగా ఆలయంలో పూజలు జరగటంకోసం భూమిని భోగ్యంగా ఇవ్వటం ద్వారా ఏర్పాటు చేయాలి. అర్చనార్థం, అర్చకుని కుటుంబపోషణ నిమిత్తం అత్యంతం పుష్కలం, బహుసస్యోచితం అయిన భూమిని కరగ్రాహాది రహితంగా (= పన్నులు మున్నగునవి లేనివిగా) అర్చకునకు సమర్పించాలి.

ఆలయం యొక్క ఆధ్యాత్మిక శక్తి, ప్రతిమలోని దైవత్వం - ఇవి పూర్తిగా అర్చకుని మీద, అతడు పూజ చేయటంలోని అభినివేశం మీద ఆధారపడి ఉంటాయి. అందుచేత అర్చకుని క్షేమం కూడా చాలా ముఖ్యం. అర్చకుడు తృప్తి పడితే, భగవంతుని తృప్తి పరచటం అనే మొదటిమెట్టు దాటినట్లే. అర్చకుడు కష్టదశలో ఉంటే అర్చన యథావిధిగా జరుగదు. అప్పుడు ప్రతిమలో దైవత్వానికి కూడా విఘాతం కలుగుతుంది. కావున పాలకులుకాని, ఆలయకార్యనిర్వాహకులు కాని అర్చకునకు ఆలయానికి దగ్గరలోనే వసతికల్పించి, అతడు కుటుంబంతో కలిసి నిశ్చింతగా, సుఖంగా జీవించే ఏర్పాటుచేయాలి.

భృగువు యొక్క యజ్ఞాధికారం (50, 28-37) అర్చకునకు, పరిచారకులకు వసతులు ఎట్లాకల్పించాలో విశదీకరించినది ( డి. రాఘవాచార్య సంపాదకత్వంతో, తెలుగు లిపిలో, 1931 లో మద్రాసులో ప్రచురింపబడింది).

"తథార్చకస్యావాస మాలయస్యసమీపతః ।
శిలాభిః సుదృఢం కృత్వా వాసాయాస్య ప్రశస్యతే ॥
అక్లేశేన యథా జీవేదర్చకః సుసమాహితః ।
యావచ్చంద్ర దివానాథం తథా కుర్యాత్ప్రియత్నతః ॥
అర్చకే క్లేశయుక్తే తు క్లిశ్యతే భగవాన్ హరిః ।
అర్చకే తు సుసంతుష్టే తదా తుష్టో జనార్దనః ॥"

-(ప్రకీర్ణాధికారం, 12, 117-119)

-అర్చకుని ఆవాసం ఆలయసమీపంలో ఉండాలి. దానిని శిలలతో సుదృఢంగా నిర్మించి, నివసించటానికి ఆయనకు ఇవ్వాలి. అర్చకుడు సుస మాహితుడై, క్లేశరహితంగా జీవించటానికి ఆచంద్రార్కంగా ఉండే ఏర్పాటు చేయాలి. అర్చకుడు క్లేశయుక్తుడైతే భగవంతుడైన హరికూడా క్లేశం పొందు తాడు. అర్చకుడు సంతుష్టుడైతే జనార్దనుడు కూడా సంతుష్టుడవుతాడు.

"అగ్రం వృక్షస్య రాజానో మూలం వృక్షస్య పూజకాః ।
తస్మాన్మూలం న హింసీయాన్మూలాదగ్రం ప్రరోహతి ॥
ఫలం వృక్షస్య రాజానో పుష్పం వృక్షస్య పూజకాః ।
తస్మాత్పుష్పం న హింసీయా త్పుష్పాత్పంజాయతే ఫలమ్ ॥"

-(ప్రకీర్ణాధికారం, 12, 104-105)

-సమాజంలో ఆలయం అనే వృక్షం పెరగటానికి మూలం అర్చ కులు, అగ్రం పాలకులు లేదా కార్యనిర్వాహకులు. అగ్రం పెరగటానికి మూలం ఆధారం కావున మూలాన్ని హింసించరాదు. భంగ్యంతరంగా చెప్పాలంటే అర్చకుడు పుష్పం; పాలకులు • లేదా కార్యనిర్వాహకులు ఫలం. ఫలం పుష్పంనుంచి పుడుతుంది. కావున, ఆ పుష్పాన్ని హింసించరాదు.

ఒక ఆలయం ప్రసిద్ధికి వచ్చిందంటే అందుకు దాని వాస్తు నిర్దోషత కాని, ప్రదేశం కాని, శిల్పవైచిత్రి కాని కారణం కాదు. అందుకు ఒకే ఒక కారణం, అర్చామూర్తిలో దైవత్వం నెలకొనటం. అట్లా దైవత్వం మూర్తీభవించటానికి ప్రధానకారణం - సుశిక్షితులు సద్వర్త నులు అయిన అర్చకులు క్రమపద్ధతిలో నిరంతరాయంగా, లోపరహితంగా శతాబ్దాలపాటు అర్చనలు చేయటమే అని ఆగమాలు పేర్కొంటున్నాయి.

విగ్రహంలో దైవత్వం మూర్తీభవించటానికి గల మూడు ప్రధానాంశాలలో రెండింటికి అలయార్చకుడు హేతువు - వాని జీవనవిధానంలోని పవిత్రత, ఆతడు పాటించే యమ నియమాదులు (మూడవది అర్చామూర్తి విశిష్టత). కావున భారతదేశంలోని ఆలయ సంస్కృతిలో అర్చకుని పాత్ర విస్మరించరానిది; తక్కువగా అంచనా వేయరానిది.

వైఖానసార్చకులు వేదసంప్రదాయానికి, అందునా ఆచారకాండను ప్రతిపాదించే యజుర్వేద తైత్తిరీయశాఖకు సర్వాత్మనా కట్టుబడినవారు. లభ్యమైన ఈ గ్రంథభాగాల ప్రకారం ఆలయార్చకులైన భాగవతులను రెండు ప్రధాన వర్గాలుగా విభజించవచ్చు 1. వైఖానసులు. 2. పాంచరాత్రికులు. ఈ విషయంలో క్రియాధికారం ఇట్లా వివరిస్తున్నది:

"ఆలయార్చన విధిః సో ఽపి ద్విధా విష్ణోః ప్రకీర్తితః ।
వైఖానసః పాంచరాత్రో వైదికస్తాంత్రికః క్రమాత్ ॥
విధిస్తు వేదమూలశ్చ దీక్షాయుక్తస్తు తాంత్రికః ।
ఐహికాముష్మికఫలో మోక్షమాత్రఫలప్రదః ॥
కారయేద్వైదికేనైవ గ్రామాదిషు చ వాస్తుషు ।
నదీతీరే ఽద్రిశృంగే వా వాన్యత్ర నిర్జనే ।
పూజయే త్తాంత్రికేణైవ గ్రామాదౌ న కదాచన ॥

-(క్రియాధికారం, 1, 17-21)

-విష్ణువు యొక్క ఆలయార్చన విధికూడా రెండు విధాలు-

వైఖానసం, పాంచరాత్రం. వైఖానసం వైదికం, పాంచరాత్రం తాంత్రికం. వేదమూలం వైఖానసం. దీక్షాయుక్తం తాంత్రికం. వైఖానసం ఐహికాముష్మిక ఫలప్రదం. తాంత్రికం మోక్షమాత్రఫలప్రదం. వైదికవిధి గ్రామాదులందు వాస్తు శాస్త్రం ప్రకారం జరగాలి. ఇంక తాంత్రిక పూజ - నదీ తీరములందు, లేదా అద్రి శృంగములందు, లేదా నిర్జన ప్రదేశములందు జరగాలి. గ్రామాదులలో ఎన్నడూ జరుగరాదు.

" శ్రుత్యనుకూలమార్గేణ చతుర్వేదోద్భవై స్తథా ।
మంత్రైః సమస్తలోకేశమర్చయేద్ధరిమవ్యయమ్ ॥
తం విష్ణుం పూజ యేన్నిత్యం సర్వసాధనసాధనమ్ ।
సర్వముక్తిప్రదం నిత్యం సర్వకామఫలప్రదమ్ ॥
గ్రామాగ్రహారయోః సమ్యగర్చనం తన్నివాసినామ్ ।

**సర్వసిద్ధిప్రదం నిత్యం పుత్రపౌత్ర వివర్ధనమ్ ॥**

-(యజ్ఞాధికారం - 1, 5, 8)

-శ్రుత్యనుకూలమార్గంలో, చతుర్వేదసముద్భవములైన మంత్రములతో సమస్తలోకేశుడు, అవ్యయుడు అయిన హరిని అర్చించవలెను. సర్వసాధక సాధనము, సర్వముక్తిదము, నిత్యం సర్వకామఫలప్రదము అయిన విష్ణ్వర్చన నిత్యం జరగాలి. గ్రామములందు, అగ్రహారములందు నిత్యం చక్కగా విష్ణ్వర్చన జరిగితే అది, ఆ గ్రామాగ్రహారవాసులకు సర్వసిద్ధిప్రదం, పుత్రపౌత్ర వివర్ధనం అవుతుంది.

రెండు విధాల అర్చనల మధ్య తేడా పేర్కొనబడినప్పటికీ, నాటి పాంచరాత్ర విధానమెట్టిదో మనకు తెలియదు. కాని, ఒక ప్రక్క పాంచ రాత్రవిధానం గ్రామాలలో పట్టణాలలో ప్రసిద్ధంకాగా, ఉన్నతపర్వతాగ్రమందు దట్టమైన అరణ్యాల మధ్య ఉన్న తిరుమల దేవాలయంలో ప్రాచీనకాలంనుంచి వైఖానస సంప్రదాయం నెలకొన్నది.

సారాంశమేమంటే, పాంచరాత్రవిధానం వేదవిహితం కాని దీక్షాదులమీద ఆధారపడగా, వైఖానసం వేదవిహితమైన సంప్రదాయం మీద ఆధార పడి ఉన్నది. వైఖానస అర్చకుని జీవన విధానం ప్రామాణికములైన వైఖానస గృహ్యసూత్ర ధర్మసూత్రములను అనుసరించిఉంటుంది. వేదవిహితములైన సంస్కారములనే అతడు పొందుతాడు. అతడు గృహంలో ఔపాసనాగ్నిని ఆధానంచేసికోవచ్చు. సంధ్యను-ఇష్టిని-చరుహోమమును జీవితాంతం చేసుకో వచ్చు (వైఖానస గృహ్యసూత్రం - 3.14 మీద శ్రీనివాసమఖి రచించిన శ్రీసూత్రతాత్పర్యచింతామణిలో పులస్త్యుడు చెప్పినట్లుగా ఉద్ధరింపబడినది).

అసలు, వైఖానసులు అర్చించే పరమదైవం విష్ణువు, వేదప్రోక్తమైన దైవంగానే కాక యజ్ఞపురుషుడుగా కూడా కీర్తింపబడినాడు. వృద్ధమనువు ఇట్లా చెప్పినాడని వైఖానసులు విశ్వసిస్తారు:

**వేదాంతవేదిభిః విప్రైః తద్వైఖానససూత్రిభిః ।**
**యాజయేద్ యజ్ఞపురుషం విష్ణుం.... ॥**
**సర్వే ఽపి వైదికాచారాః సర్వే యజ్ఞతపాంసి చ ।**
**విష్ణుపూజావిధేర్భేదాస్తత్కర్మఫలదో హరిః ॥**

-వేదాంతవేత్తలు, వైఖానస సూత్రావలంబకులు అయిన విప్రులు యజ్ఞపురుషుడైన విష్ణువును యజించాలి.......... వైదికాచారములన్నీ, యజ్ఞములు తపములు అన్నీ విష్ణు పూజా విధి భేదాలే. ఆ కర్మలన్నింటికి విష్ణువే ఫలదాత.

దైవత్వం రెండు రూపాలుగా ఉంటుంది - నిరాకారం, సాకారం. యజ్ఞాదులు, వాటికి సంబంధించిన ఆచారకర్మకాండలు నిరాకార భేదానికి సంబంధించినవి. ఇంక గృహంలో లేదా ఆలయంలో జరిగే ప్రతిమారాధన సాకారభేదానికి చెందినది. సామాన్య ప్రజల అవసరాలు, వారి సమర్థత దృష్టిలో పెట్టుకొన్నప్పుడు ప్రతిమారాధానమే ఉత్తమమైనది. భగవంతుని మానసికంగా పూజింపవచ్చు. లేదా హోమం ద్వారా పూజింపవచ్చు. లేదా ప్రతిమారాధన (= బేరపూజ) ద్వారా పూజింపవచ్చు. ఏ విధానం అవలంబించాలి అనేది భక్తుని శక్తిమీద, ఇష్టంమీద ఆధారపడి ఉంటుంది. ఈ యుగంలో సామాన్య ప్రజలకు ప్రతిమారాధన ఉత్తమోత్తమమని వైఖానసశాస్త్రాలు నిర్దేశిస్తున్నవి.

చక్షుషః ప్రీతికరణాన్మనసో హృదయస్య చ ।
ప్రీత్యా సంజాయతే భక్తిర్భక్తస్య సులభో హరిః ॥

-(క్రియాధికారం, 1, 13 - 14)

తస్మాత్ త్రయాణా మే తేషాం బేరపూజా విశిష్యతే ।

-చక్కని ప్రతిమ కనులకు, మనస్సునకు, హృదయమునకు ప్రీతి జనకమవుతుంది. ఈ ప్రీతివల్ల భక్తి కుదురుతుంది. ఇంక భక్తునకు హరి సులభుడు. కావున పై మూడు విధానాలలో బేరపూజ విశిష్టమైనది.

ఇంక, ఆలయంలో జరిగే అర్చన సర్వజన క్షేమంకరమైనది.

వైదికేన విధానేన భక్త్యా చావాహనే కృతే ।
భక్తానుకంపయా దేవో బింబే వ్యాప్యైవ తిష్ఠతి ॥

-(ఉద్వాసనాప్రబంధం)

-వైదికమైన విధానంతో, భక్తితో ఆవాహనం చేస్తే దేవుడు, భక్తుని మీది అనుకంపతో, బింబమందు వ్యాపించి ఉంటాడు.

కావుననే, వైఖానససంప్రదాయమునకుచెందిన పూజ సౌమ్యము, శ్రీకరము అని వర్ణింపబడినది. ఈ పూజ దేశమునకు, ప్రజలకు క్షేమకరం, అధ్యాత్మిక చింతనకు దోహదకారి కావున గ్రామాలలోని, పట్టణాలలోని ఆలయాలలో వైఖానస పద్ధతి ప్రకారం పూజలు జరగాలి. ఈ పూజలను నిర్వహించే అర్చకుడు ప్రజాక్షేమాన్ని సాధించే ఉపాయంగా విశ్వసింపబడాలి.

మధ్యయుగాలలో, అర్చకుల పరిచారకుల జీవనాధారంగా దాతలు భూదానాలు చేసిన విషయం ఆసక్తికరంగా తెలియవస్తున్నది. తెలంగాణాలోని శిర్‌పూర్ శాసనంలో, ఇంకో శాసనంలో ఇట్లా ఉన్నది (హిస్టారికల్ స్కెచెస్ ఆఫ్ ఏన్షెంట్ డెక్కన్ అనే గ్రంథంలో కె.వి. సుబ్రహ్మణ్య అయ్యర్ ఈ విషయాన్ని విశదీకరించారు. ఈ గ్రంథం మద్రాసులో 1917లో ముద్రింపబడినది ; పుటలు 334-335).

"శిర్‌పూర్ శాసనం-- ధర్మసత్రాలకు, దేవాలయం మరమ్మతులకు, గుడిలోని పరిచారకులకు, వేదత్రయివేత్తలైన విప్రులకు గ్రామాలు దానం చేయబడిన సత్యాన్ని వివరిస్తున్నది. దానం పొందిన బ్రాహ్మణుల తరువాత, ఆ స్థానం పొందేవారి పుత్రులు, పౌత్రులు హోమాదులు నిర్వహింపగలవారు, ఆరు వేదాంగాలు తెలిసినవారు, జూదము మున్నగు వ్యసనములు లేనివారు, ఎవరికిని సేవకులు కానివారు కావాలి. పై గుణములు కలవారు లేకపోతే, లేదా దానగ్రహీతలు నిస్సంతులుగా చనిపోతే, ఆదానం వారినుంచి తప్పించి, పై గుణాలుకల ఇతర బ్రాహ్మణులకు సంక్రమింపజేయాలి. ఇట్లా నియమింపబడిన బ్రాహ్మణులు - అర్హతలు లేని వారికి బంధువులు, వయస్సు మీరిన వారు, విద్వాంసులు కావాలి. వీరిని, వారి అనుమతితోనే నియమించాలి కాని అధికార పూర్వకంగా నియమించరాదు".

ఇంకొక శాసనంలో ఇట్లా ఉంది--దానం గ్రహించిన వ్యక్తి (= వాటాలు కల వ్యక్తి) చనిపోయినా, లేదా వేరే ప్రదేశానికి తరలి వెళ్ళినా, వాని సన్నిహిత బంధువులకు ఆదానం సంక్రమింపజేసి, వారు అర్చనాదులు నిర్వహించే ఏర్పాటు చేయాలి. ఒకవేళ సన్నిహిత బంధువులు ఎవ్వరూ అటువంటి వారు లభించకపోతే, అర్హులైన ఇతరులను ఎన్నుకొని, వారు ఆలయంలో సేవలుచేస్తూ, అందుకు నిర్దిష్టమైన ప్రతిఫలం గ్రహించునట్లు చేయాలి.

# అనుబంధం-7

## ప్రతిమార్చన

అచలం చలమితి ద్వివిధం భగవతో రూపమ్. తత్ర సర్వగం వ్యోమాభం అపోహలక్షణం బ్రహ్మాద్యైరనభిలక్ష్యం నిష్కల మచలం, తదారాధనం నిరాలంబం, తత్స్థానీయం ధ్రువరూపమ్.

తస్మాదచలాత్మనో యద్ భిన్నం సర్వదేవాత్మకం మత్స్యాద్యంశ జనకం సకలం తచ్చలమ్. తదారాధనం సాలంబం తత్స్థానీయం కౌతుకమ్.

తస్మాత్ మహాబేరే దోషేఽపి కౌతుకసంపదా నశ్యతి. ధ్రువబేరం పరంజ్యోతిరూపం తదలక్షణమపి న దోషాయ భవతి, అరూపత్వాత్తస్య.

యదా నిష్కలం సూక్ష్మం పరంజ్యోతిర్నారాయణ ఇతి కీర్త్యతే యదా స్థూలః సకలస్తదా విష్ణురితి. విష్ణుః సువర్ణ వర్ణో రక్తాస్య పాణిపాదాక్షః శుకపింఛాంబరధరః కిరీట కేయూరహార ప్రలంబ కటి సూత్రోజ్జ్వలః శంఖచక్రధరః రక్తత్రయసమన్వితః సువర్ణ రజత తామ్ర దారూణామన్య తమేన సలక్షణ మేవం వా కౌతుకం కారయేత్. అల క్షణే తు తత్సర్వం భస్మసాద్ భవతి సకలత్వాత్తస్య.

నిరాలంబారాధనం సంకల్పధనినాం శ్రేష్ఠాశ్రమిణామ్. సాలంబం సమ్యక్ సంసారనిష్ఠానాం భుక్తిముక్తిఫల ప్రదత్వాత్.

# అనుబంధం-7

## ప్రతిమార్చన విషయం

అచలం, చలం అని భగవంతుని రూపం రెండు విధాలు. ఇందులో సర్వగం, వ్యోమాభం, అపోహ ( =ఊహకు అందని) లక్షణం, బ్రహ్మాదులచేత అనభిలక్ష్యం, నిష్కలం అయినది అచలరూపం ; దాని ఆరాధన నిరాలంబం; ఇంకదాని స్థానీయమైనది ధ్రువరూపం లేదా ధ్రువబేరం.

అచలరూపంకంటె భిన్నమైనది, సర్వదేవాత్మకమైనది, మత్స్యావతారాది అంశావతారాలకు జనకమైనది, సకలమైనది చలరూపం ; దాని ఆరాధాన సాలంబం, దాని స్థానీయమైనది కౌతుకం (= కౌతుకబేరం). మహాబేరంలో దోషం ఉన్నప్పటికీ కౌతుక సంపదచేత అదోషం నశిస్తుంది. ధ్రువబేరం జ్యోతీరూపం; అది సలక్షణం కాకపోయినా దోషంలేదు ; అది రూపరహితం కావున.

నిష్కలము, సూక్ష్మము, పరంజ్యోతీరూపము అయినట్టిది నారాయణ తత్త్వమని కీర్తింపబడుతున్నది. స్థూలము, సకలముగా ఉన్నప్పుడు విష్ణువు అని పేర్కొనబడుతున్నది. విష్ణువు-సువర్ణవర్ణుడు, ఎల్లని అస్య-పాణి-పాద-అక్షులు కలవాడు, శుకపింఛాంబరధరుడు, కిరీట-కేయూర-ప్రలంబహార-కటిసూత్ర-ఉజ్వలుడు,శంఖచక్రధరుడు, రక్తత్రయ (=అస్య-పాణిపాద-అక్షి) సమన్వితుడు, అగునట్లుగా సువర్ణంతో లేదా వెండితో లేదా రాగితో లేదా దారువుతో లేదా ఇంకేవిధంగా అయినా సలక్షణంగా కౌతుకమును తయారు చేయించాలి. అది సలక్షణంగా లేకపోతే సర్వం భస్మసమానమే అవుతుంది - కారణం అది సకలరూపం కావున.

సంకల్పధనులకు, వానప్రస్థాది శ్రేష్ఠాశ్రమవంతులకు నిరాలంబారాధన శ్రేష్ఠము.సాలంబారాధన సంసారనిష్ఠులకు సమంజసం - అది భుక్తి ముక్తి ఫలప్రదం కావున.

అభీక్ష్ణదర్శనాత్ పరిచర్యయా భక్తిర్భవతి. నృణామభక్తానాం కృతం సర్వం నిష్ఫలం. తస్మాత్ భక్తిహేతుత్వాత్ సలక్షణం పరమపురుషరూపం కృత్వా శ్రియా సహైవ సంస్థాప్య ప్రకృతి పురుషావర్చయేత్.

సాలంబారాధనే కౌతుకసంపత్ సర్వేషాం సంపదితి విజ్ఞాయతే (కాశ్యపీయే జ్ఞానకాండే-55).

అథాతో భగవతో నారాయణస్యాకృతి లక్షణం వ్యాఖ్యాస్యామః. యస్యాస్యమగ్నిః ద్యౌ మూర్ధా ఖం నాభిః భూఃపాదే చక్షుషీ అర్కనిశాకరే దిశః శ్రోత్రే జ్యోతిష్యాభరణాని ఉదధయోఽంబరం భూతానీంద్రియాణి. అస్యాకృతేః ప్రమాణం కల్పితం భృగ్వాదిభిః. తద్ధేతుభిర్నావమంతవ్యం అమీమాంస్యం. ఆజ్ఞాసిద్ధమితి జ్ఞాత్వా తదుక్తవిధినా కారయేత్. విధినా కారితం బేరం సర్వపాపహరం పుణ్యం భుక్తిముక్తిఫలప్రదమ్. స్వబుద్ధి క్లప్తం అశుభం పుణ్యకీర్తి వినాశమ్. తస్మాచ్ఛాస్త్రం సమాలంబ్య బుద్ధ్యా యుక్త్యా ప్రమాణయుతమేవ మనోహరం కారయేత్ (తత్రైవ 50).

తస్య విశ్వాత్మనో విష్ణోరర్చనం త్రివిధం యథా ।
మానసం వాచికం వాథ కాయికం వాపి తత్త్రయమ్ ।

కాయికం ద్వివిధం ప్రోక్తం అమూర్తం చ సమూర్తకమ్ ॥ (34-35)

అర్చనేషు చతుష్వేషు తావన్మానస ముచ్యతే ।
వివిక్తే విశదే దేశే ఉపవిష్టః సుఖాసనే ॥ (36)

స్వస్తి కాసన ఆసీనో నిస్సంగః సంయతేంద్రియః ।
యమాదిభిరుపేతః సన్నాసాగ్రే న్యస్తలోచనః ॥ (37)

అభీక్ష్ణ (= మిక్కిలిగా లేదా మరలమరల) దర్శనం వల్ల, పరిచర్యవల్ల భక్తి పెరుగుతుంది. భక్తిపరులుకాని నరులుచేసే సర్వము నిష్ఫలమే. కావున భక్తికి కారణమైన, సలక్షణమైన పరమపురుషరూపమును (= ప్రతిమను) శ్రీదేవితో కూడా స్థాపించి, ఆ ప్రకృతి పురుషులను అర్చించవలెను.

సాలంబారాధనలోని కౌతుకసంపద అందరకు లభ్యమవుతుందని తెలియ వలెను. (కాశ్యపజ్ఞానకాండ-55).

ఇంక భగవంతుడైన నారాయణునియొక్క ఆకృతిలక్షణం వ్యాఖ్యా నిస్తాము. ఆయన ఆస్యం అగ్ని, మూర్ధము లేదా శిరస్సు ద్యులోకం, నాభి ఆకాశం, పాదములు భూమి, కనులు సూర్యచంద్రులు, చెవులు దిశలు, ఆభరణములు జ్యోతులు, వస్త్రములు సముద్రములు, ఇంద్రియములు పంచభూతములు. భృగువుమున్నగువారు ఆయన ఆకృతికి ప్రమాణములు కల్పించినారు; కావున దీనిని అవమానించరాదు, విచికిత్స చేయరాదు. వారి నిర్దేశములు ఆజ్ఞగా పాలించి, వారు చెప్పిన విధంగా ప్రతిమను తయారుచేయించాలి. విధిపూర్వకంగా తయారైన బేరం సర్వ పాపహరం, పుణ్యప్రదం, భుక్తి ముక్తి ఫలప్రదం అవుతుంది. అట్లాకాక ఇష్టం వచ్చినట్లు చేస్తే, ఆ బేరం అశుభకరం, పుణ్యకీర్తి వినాశనం అవుతుంది. కావున శాస్త్రమును ఆధారంగా చేసుకొని బుద్ధితో, యుక్తితో, ప్రమాణయుతంగా, మనోహరంగా బేరమును తయారుచేయించాలి (కాశ్యపజ్ఞానకాండ-50).

విశ్వాత్ముడైన విష్ణువుయొక్క అర్చన మూడు విధాలు: మానసం, వాచికం, కాయికం. ఇందులో కాయికం రెండు విధాలు-అమూర్తం, సమూర్తం. ఇట్లా నాలుగు విధాలయిన అర్చనలలో మానసం గూర్చి వివరింపబడుతున్నది (34-36).

విజనము, విశదము అయిన ప్రదేశమందు సుఖాసనమందు ఉపవిష్టుడై స్వస్తి కాసనం వేసుకొని నిస్సంగుడు, సంయతేంద్రియుడు, యమాదులతో కూడిన

తద్గతేనైవ మనసా ధ్యానకర్మణి నిశ్చలః ।
ధ్యాయేద్ హృత్పుండరీకస్థం విమలం రవిమండలమ్ ॥ (38)
తన్మధ్యే మండలం సౌమ్యం తదంతస్థం తదుజ్జ్వలమ్ ।
దివ్యాసనసమాసీనం లక్ష్మీభూమిధరం పరమ్ ॥ (39)
స్వర్ణ వర్ణం మహాబాహుం శుకపింఛనిభాంబరమ్ ।
హేమవర్ణవిచిత్రైస్తు కిరీటమకుటాదిభిః ॥ 40
సర్వైరాభరణైర్దివ్యైః శ్రీవత్సేన తు భాసితమ్ ।
కౌస్తుభోద్భాసితోరస్కం ప్రసన్నవదనాంబుజమ్ ॥ 41
అబ్జనేత్రాస్యపాణ్యంఘ్రిం చతుర్బాహుం సుఖోద్వహమ్ ॥
అవ్యక్తం నిష్కలం నిత్యం నిర్గుణం చ పరాత్పరమ్ ॥ 42
శంఖచక్రధరం సౌమ్యం వరదాభయపాణినమ్ ।
చింతయేత్ సకలం విష్ణుమర్చార్థం సర్వకారణామ్ ॥ 43
ధ్యాత్వైవం విగ్రహైస్సర్వైర్మనసైవ తు కల్పితైః ।
క్రియతే ఽభ్యర్చనం విష్ణోర్యత్తత్ మానస మీరితమ్ ॥ 44
ఋగ్యజుస్సామభిర్మంత్రైర్ధ్యాత్వైవం యద్ ద్విజాతయః ।
స్తువంతి పరమాత్మానం తద్వాచిక ముదీరితమ్ ॥ 45
అగ్నిహోత్రేషు సాంగేషు ధ్యాత్వైవం యద్ ద్విజాతయః ।
యద్ధవిష్యం చాగ్నిహుతం తదమూర్తం తు కాయికమ్ ॥ 46
ప్రతిమాయాం కృతాపూజా ద్రవ్యైః పాద్యాసనాదిభిః ।
సమూర్తమితి తత్ప్రోక్తం అర్చనం మునిపుంగవైః ॥ 47
కృతే తు మానసం శ్రేష్ఠం త్రేతాయాం యజనం పరమ్ ।
ద్వాపరే ప్రతిమార్చా చ కలౌ చింతన ముత్తమమ్ ॥ 48

వాడు నాసికాగ్రదృష్టియుతుడు అయి, ధ్యానకర్మలో నిశ్చలుడై భగవంతుని మీదనే లగ్నమైన మనస్సు కలవాడుకావాలి.

హృత్పుండరీకమందు విమలమైన రవిమండలం; ఆమండలం మధ్య చంద్ర మండలం, దానిలోపల ఉజ్జ్వలమైన దివ్యాసనమందు శ్రీభూయుతుడై పరమాత్మ ఉంటాడు. (37-39)

ఆయన- స్వర్ణ వర్ణుడు, మహాబాహువు, శుకపింఛ నిభాంబరుడు. హేమవర్ణములైన విచిత్రములైన కిరీటమకుటాది సర్వదివ్యాభరణములతో శ్రీవత్సంతో భాసించువాడు. కౌస్తుభోద్భాసిత ఉరస్కుడు, ప్రసన్నవదనాంబుజుడు, అబ్జసమములైన నేత్రములు ఆస్యము పాణులు అంఘ్రులు కలవాడు, చతుర్బాహువు, సుఖోపేతుడు, అవ్యక్తుడు, నిష్కలుడు, నిత్యుడు, నిర్గుణుడు, పరాత్పరుడు, శంఖచక్రధరుడు, వరదాభయహస్తుడు, సర్వకారణ కారణుడు, సకలుడు, అర్చార్హుడు అయిన ఆ విష్ణువును గూర్చి చింతించాలి. ఇట్లా మనస్సులో విగ్రహంతో సమానంగా కల్పితమైన రూపమును ధ్యానించి, విష్ణువును అర్చించటం మానసపూజ అవుతుంది. (40-44).

ద్విజులు, ఋగ్యజుస్సామమంత్రములతో ధ్యానించి, పరమాత్మను స్తుతించటం వాచికపూజ అవుతుంది(45).

ద్విజులు సాంగంగా అగ్నిహోత్రములందు, ధ్యానించి, అగ్నిలో హవిస్సును హుతంచేయటం అమూర్తకాయిక పూజ అవుతుంది (46).

ద్రవ్యములతో, పాద్యఆసనాదులతో ప్రతిమకు పూజచేయటం సమూర్తకాయిక అర్చనమని మునిపుంగవులు చెప్పినారు (47).

కృతయుగమందు మానసపూజ శ్రేష్ఠమైనది. త్రేతాయుగమందు యజ్ఞం విశిష్టమైనది. ద్వాపరమందు సమూర్తకాయికపూజ, కలియుగమందు చింతనం ఉత్తమములు (48).

చతుష్వపి యుగేష్వేవం విశేషస్తు యుగేయుగే ।
మంత్రోచ్చార క్రియాద్రవ్య ధ్యాన భావాంగ పంచకమ్ ॥ 49
-(మరీచిప్రోక్తానంద సంహితాయాం-1)
అథాతో దేవదేవస్య పరస్య పరమాత్మనః ।
స్వరూపం పంచధా వక్ష్యే శ్రణుధ్వం మునిసత్తమాః ॥ 5
పరోవ్యూహశ్చ విభవశ్చాంతర్యామీ తథైవచ ।
అర్చాచేతి హరే రూపం పంచధా ఉవిష్కృతం ప్రభోః ॥ 6
పరఃస్యాదఖిలాండానాం సృష్టిమాత్రప్రయోజకః ।
వ్యూహాస్తు దేహచలన హేతూనాం మునిపుంగవాః ॥ 7
చతుర్ణాం మానసాదీనాం అధిదైవతమేవ హి ।
విభవా మత్స్యకూర్మాద్యా రక్షసాం నిధనాయ చ ॥ 8
ంతర్యామీతి జగతామాధారార్థం స్థితో హరిః ।
పురాణపురుషశ్చైవ జగదానందకారకః ॥ 9
తథైవ సర్వజీవానాం దుఃఖనాశన హేతవే ।
సులభాన్మోక్ష సిద్ధ్యై చ భవత్యర్చాస్వరూపధృక్ ॥ 10
పరవ్యూహాదయశ్చైమే క్లేశాదేవ హి మోక్షదాః ।
అష్టాంగ యోగైర్ధ్యానాద్యైస్తపోభి ర్దుఃఖ సాధనైః ।
చిరాద్దదతి జీవానాం మోక్ష మన్యే ష్వదుర్లభమ్ ॥ 11
అర్చారూపస్తు సులభా ద్దదాతి పరమంపదమ్ ।
శీఘ్రమేవ నమస్కార పూజామంత్రేణ చాదరాత్ ।
అర్చారూపస్య సౌలభ్యం వక్తుం మమ న శక్యతే ॥ 12
నిత్యానుక్తోప భోగ్యత్వా త్పరవ్యూహాత్మనో హరేః ।
తత్కాల సంనికృష్టై కలక్ష్యత్వా ద్విభవాత్మనః ॥ 13
విశుద్ధైర్యోగసంసిద్ధై శ్చింత్యత్వాదంతరాత్మనః ।
అర్చాత్మన్యేవ సర్వేషా మధికారో నిరంకుశః ॥ 14
(తతె ౧ప-14).

ఇట్లా ప్రతి యుగమునందు పూజా విధానంలో ఈ భేదాలు ఉన్నప్పటికీ, నాలుగు యుగాలలో సమానంగా మంత్రోచ్చారణ - క్రియ - ద్రవ్యం - ధ్యానం - భావం అనే అంగపంచకం సమానంగా ఉంటుంది (49).

(మరీచిప్రోక్తమైన ఆనందసంహితలో-1)

ఇంక దేవదేవుడు, పరుడు అయిన పరమాత్మ యొక్క పంచవిధ స్వరూపాలను వివరిస్తాము; ఓ మునిశ్రేష్ఠులారా! వినుడు. పరము, వ్యూహము, విభవము, అంతర్యామి, అర్చామూర్తి-ఇట్లా ప్రభువైన హరియొక్క రూపం ఐదు విధాలుగా ఆవిష్కృతమైనది (5-6).

అఖిలాండముల సృష్టిమాత్రప్రయోజనం కలది పరస్వరూపం; దేహచలన హేతువైనది వ్యూహస్వరూపం; మానస పూజాదులు నాలుగింటిలో ఇది అధిదైవతంగా ఉంటుంది. రాక్షసనిధనం కోసం మత్స్యకూర్మాదిరూప ధారణ విభవ స్వరూపం. జగత్తునకు ఆధారంగా నిలిచిన హరి అంతర్యామి స్వరూపం. పురాణపురుషుడు, జగదానంద కారకుడు, సర్వజీవుల దుఃఖనాశన హేతువు అయిన దేవుడు మోక్ష సిద్ధి సులభంచేయుటం కోసం అర్చామూర్తి స్వరూపం ధరించినాడు(7-10).

పర - వ్యూహాదులు క్లేశపడితేనే మోక్షప్రదములు; అష్టాంగ యోగములు, ధ్యానాదులు, తపస్సుమున్నగు దుఃఖసాధనములు జీవులకు చిరకాలమునకు కాని మోక్ష ప్రదములు కావు; ఇంక సామాన్యులకు ఇది సుదుర్లభం (11).

ఇంక అర్చాస్వరూపం నమస్కారం, పూజ, మంత్రములతో ఆదరంతో పరమపద (=మోక్ష) ముసు సులభంగా శీఘ్రంగా ఇస్తుంది. అర్చారూపం యొక్క సౌలభ్యం వర్ణించటానికి నాకు శక్తిచాలదు. (12)

హరియొక్క పరాత్మ నిత్యము, అవాఙ్మానసగోచరము కావటంచేతను, వ్యూహాత్మ ఉపభోగయోగ్యము కాకపోవుటచేతను, విభవాత్మ ఆ కాలములో సన్నిహితులైన వారికి మాత్రమే కనపడునది అవటంచేతను, అంతర్యామి ఆత్మ విశుద్ధులు యోగసిద్ధులు అయిన వారికి మాత్రమే చింతింపవీలగునది కావటంచేతను, అందరికీ అర్చాత్మయందు మాత్రమే నిరంకుశమైన అధికారం ఉంటుంది (13-14).

# అనుబంధం-8

శ్రీనివాసమఖివిరచితే వైఖానసగృహ్యసూత్రే
తాత్పర్య చింతామణౌ దశవిధ హేతునిరూపణమ్.

## పరిచయం-గ్రంథప్రయోజనం

అథ సత్యత్వాది సమస్త కల్యాణగుణవిశిష్టాత్ పరబ్రహ్మణః శ్రీమన్నారాయణాదుత్పన్నేన విఖనశ్శబ్ద వాచ్యేన చతుర్ముఖబ్రహ్మణా ప్రణీతస్య వైఖానససూత్రస్య సర్వసూత్రోత్తమత్వే తత్సూత్రోక్త ధర్మానుష్ఠాతౄణాం సర్వోత్కృష్టతమత్వే చ దశవిధహేతవో నిరూప్యంతే.

యథా:

1. అఖిలజగత్కారణ భూతేన విఖనసా ప్రణీతత్వాత్.
2. సర్వసూత్రాణా మాదిత్వాత్.
3. సర్వకర్మసు శ్రుతిమార్గానుసారిత్వాత్.
4. సమంత్రక సర్వక్రియా ప్రతిపాదకత్వాత్.
5. నిషేకసంస్కారవత్వాత్.
6. అష్టాదశ శారీరసంస్కార ప్రతిపాదకత్వాత్.

# అనుబంధం-8

వైఖానసగృహ్యసూత్రంపై శ్రీనివాసమఖి రచించిన తాత్పర్యచింతామణి యందలి దశవిధహేతునిరూపణము.

## పరిచయం-గ్రంథప్రయోజనం

సత్యత్వం మున్నగు సమస్తకల్యాణగుణవిశిష్టుడు, పరబ్రహ్మ అయిన శ్రీమన్నారాయణుని వలన పుట్టిన, విఖనసశ్శబ్దవాచ్యుడైన చతుర్ముఖబ్రహ్మ చేత ప్రణీతమైన వైఖానససూత్రం సర్వసూత్రములందు ఉత్తమంకావటానికి, ఆ సూత్రమందు చెప్పబడిన ధర్మాన్ని అనుష్ఠించేవారి సర్వోత్కృష్టత్వానికి దశవిధహేతువులు నిరూపింపబడుతున్నవి: అవి

1. అఖిల జగత్కారణభూతుడైన విఖనసునిచేత ప్రణీతమైనది కావటం.
2. సర్వసూత్రములకు ఆదిమసూత్రంకావటం.
3. సర్వకర్మలందును శ్రుతిమార్గానుసారి కావటం.
4. సర్వకర్మలు సమంత్రకంగా ప్రతిపాదింపబడటం.
5. నిషేకసంస్కారయుతం కావటం.
6. అష్టాదశ శారీరసంస్కార ప్రతిపాదకం కావటం.

7. సాంగక్రియాకలాపవత్త్వాత్.

8. మన్వాద్యైప్స్వీకృతత్వాత్.

9. అఖిలజగదేక కారణభూత శ్రీమన్నారాయణైకపరత్వాత్.

10. ఏతత్సూత్రోక్త ధర్మానుష్ఠానవతామేవ భగవత్ప్రియతమత్వోప పత్తేశ్చ. ఇతి.

**ఏభిర్హేతుభిః అస్యసూత్రస్య సర్వసూత్రోత్తమత్వం ఏతత్సూత్రోత్తమత్వం ఏతత్సూత్రోక్త ధర్మానుష్ఠానాదేవ వైఖనసానాం సర్వేభ్యః శ్రేష్ఠతమత్వం చ శ్రుతిస్మృతి పురాణాది ముఖేన ప్రతిపాద్యతే.**

తత్రాదౌ అఖిలజగత్కారణభూతేన విఖనసా ప్రణీతత్వాదితి హేతుః నిరూప్యతే.

విఖనసుడు ఎవరు?

విఖనానామ కశ్చిదృషిః ఉత నారాయణః? నారాయణ ఏవ. కేవలం మునిమాత్రస్య వైఖానసశబ్దవాచ్యత్వేన ప్రతిపాదనాభావాత్. పరమాత్మనోనారాయణస్య విఖనో వైఖానసాదిశబ్ద వాచ్యత్వం శ్రుతిస్మృతి పురాణాదిష్వవగమ్యతే.

యథా:

ఖిలశ్రుతౌ:

ధేనుర్వహానామదితిస్సురాణాం బ్రహ్మ ఋభూణాం విఖనా మునీనాం ఇతి శ్రూయతే. అయమర్థః: వహానాం అనడుదాదీనాం ధేనుః ఉత్పత్తికార ణమ్. సురాణాం ఇంద్రాదీనామ్ అదితిః. ఋభూణాం సాధ్యా విశ్వే చ వసవో మరుతో ఋభవ స్తథా ।

**తథైవాంగిరసో రుద్రో ఆదిత్యాశ్చ తథైవ చ ।**
**ఏతే దేవ గణాశ్చాష్టౌ మన్వంతరగణేశ్వరాః ॥**

7. క్రియాకలాపం సాంగంకావటం.

8. మనువు మున్నగువారు దీనిని అంగీకరించటం.

9. అఖిల జగదేకకారణభూతుడైన శ్రీమన్నారాయణుని యందే పరాయణం కావటం.

10. ఈ సూత్రోక్తధర్మమును అనుష్ఠించేవారు భగవంతునకు ప్రియతములుకావటం.

పై దశవిధ హేతువులనుపట్టి ఈ సూత్రంయొక్క సర్వసూత్రోత్తమత్వం, ఈ సూత్రంయొక్క ఉత్తమత్వం, ఈ సూత్రోక్తధర్మమును అనుష్ఠించే సర్వవైఖానసుల శ్రేష్ఠతమత్వం - శ్రుతిస్మృతిపురాణాదులు ప్రతిపాదించినవి. తొలుత, ఈ సూత్రమును అఖిలజగత్కారణభూతుడైన విఖనసముని ప్రణీతమనే హేతువు నిరూపింపబడుతున్నది.

'విఖనసుడు' ఎవరు?

విఖనసుడు అనే వ్యక్తి ఒకానొక ఋషికదా. ఆయన నారాయణుడా? ఆయన నారాయణుడే. వైఖానస శబ్దమునకు అర్థం మునిమాత్రమే అని ఎవ్వరూ చెప్పలేదు. విఖన-వైఖానస మున్నగు శబ్దములకు అర్థం పరమాత్ముడైన నారాయణుడే అని శ్రుతి-స్మృతి-పురాణములనుపట్టి తెలుస్తున్నది.

ఖిలశ్రుతియందు-

'ధేనుః వహానాం, అదితిః సురాణాం, బ్రహ్మ ఋభూణాం, విఖనా మునీనాం' అని వేదం చెబుతున్నది. దీని అర్థం ఇది-

'వహానాం' అంటే మోయునవి, అనగా ఎద్దులు మున్నగు వానికి ఉత్పత్తి కారణమైనది ధేనువు. 'సురాణాం' అనగా ఇంద్రాదులకు అదితి. 'ఋభూణాం' అనగా భృగూక్తములైన సాధ్యాదిగణములకు బ్రహ్మ. సాధ్యులు, విశ్వేదేవతలు, వసువులు, మరుత్తులు, ఋభువులు, అంగీరసులు, రుద్రులు, అదిత్యులు - వీరు మన్వంతర గణేశ్వరులైన అష్టదేవగణములవారు- వీరికి బ్రహ్మ జనకుడు. ఇరక 'మునీనాం' అనగా మునిశబ్ద వాచ్యులందరకు విఖనసుడు జనకుడు.

ఇతి భృగూక్తానాం సాధ్యాదీనాం బ్రహ్మ. మునీనాం మునిశబ్దవాచ్యానాం విఖనాః.

అనయా ఖిలశ్రుత్యా భగవతో విఖనశ్శబ్దవాచ్యత్వం కథమవగమ్యత ఇతి చేత్ ఉచ్యతే.

'దుర్బోధా వైదికాశ్శబ్దా ప్రకీర్ణత్వాచ్చ యే ఖిలాః ।
తజ్జై స్తత ఏవ స్పష్టార్థాః స్మృతితంత్రే ప్రతిష్ఠితాః' ॥ ఇతి.
'యది విద్యాచ్చతుర్వేదాన్ సాంగోపనిషదాన్ ద్విజః ।
న చేత్పురాణసద్విద్యా న వేదార్థవిచక్షణః' ॥
'ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ ।
బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరిష్యతి' ॥

ఇతి చ స్మరణాత్ ఇతిహాసపురాణాభ్యామేవార్థనిర్ణయః కర్తవ్యః. భారతే మోక్షధర్మే నారదస్తుతౌ - 'నమస్తే దేవదేవేశ' ఇత్యారభ్య స్తోత్రమధ్యే 'ఫేనపాచార్యవాలఖిల్యవిఖనో విఖనస వైఖానసాచార్య అభగ్నయోగ అభగ్న పరిసంఖ్యాన' ఇతి.

తత్రైవ--

యత్తస్మిన్నుపలభ్యం తే తత్తేజస్తత్రియామయమ్ ।
తద్వైఖానః పరం బ్రహ్మ ఇతి వేదవిదో విదుః ॥

ఇతి చోక్తం. తథా నామసహస్రాధ్యాయే-
'వైఖానస్సామగాయనః'
ఇతిస్మర్యతే. పాంచరాత్రే అత్మసంహితాయామ్-

'మహాభూతేన భూతేన వ్యాప్తం విఖనసా జగత్ ।
తమేవ శరణం గచ్ఛ జగత్కారణమచ్యుతమ్ ॥
ఇతి శాండిల్యేన శతానందమభిలక్ష్యోక్తమ్.

అయితే ఈ ఖిల శ్రుతిప్రకారం విఖనసశబ్దమునకు భగవంతుడు అని ఎట్లా అర్థంచెప్పాలి? అనే శంకకు సమాధానంచెప్పబడుతున్నది.

వైదికశబ్దములు దుర్బోధములు, ఖిలశ్రుతులు ప్రకీర్ణములుకావటంచేత తద్‌జ్ఞులకు మాత్రమే అర్థం స్పష్టమౌతుంది అని శ్రుతియందునిర్ణయం చేయబడింది. నాలుగువేదాలు, సాంగములైన ఉపనిషత్తులు తెలిసినప్పటికీ పురాణసద్విద్య తెలియని ద్విజుడు వేదార్థ విచక్షణుడు కాజాలడు. ఎందుచేతనంటే ఇతిహాసపురాణములతో వేదమును పోషింపవలసియున్నది కావున. తక్కువ చదువుకొన్నవాడు తనను మోసగిస్తాడనీ, అట్టివానికి వేదం భయపడుతుందనీ స్మృతిలో ప్రతిపాదింపబడినది. అందుచేత వేదార్థనిర్ణయం ఇతిహాస పురాణాల సహాయంతోనే చేయాలి.

మహాభారతంలో, మోక్షధర్మప్రకరణంలో నారదుడు 'నమస్తే దేవ దేవేశ' (=దేవదేవేశ! నీకు నమస్కారము) అని ప్రారంభించి, స్తోత్రం మధ్యలో ఫేనపాచార్య, వాలఖిల్య, విఖన, విఖనస, వైఖనాసాచార్య, అభగ్న యోగ, అభగ్నపరిసంఖ్యాన' అని భగవంతుని సంబోధించినాడు.

అందే-

"ఆ పరతత్త్వమందు, త్రయీమయంగా ఉపలభ్యమానమయ్యే తేజస్సును, వైఖానసుడుగా, పరంబ్రహ్మగా వేదవిదులు తెలుసుకొనుచున్నారు" అని కూడా చెప్పబడినది. అట్లాగే నామసహస్రాధ్యాయంలో భగవంతుడు వైఖానసుడుగా, సామగాయనుడుగా ప్రతిపాదింపబడినాడు. పాంచరాత్రంలో ఆత్మసంహితయందు "మహాభూతము, భూతస్వరూపుడు అయిన విఖనునిచేత లోకమంతయు వ్యాపింపబడినది. అందుచేత జగత్కారణుడు, అచ్యుతుడు అయిన ఆయననే శరణుపొందుము" అని శాండిల్యునిచేత శతానందునకు చెప్పబడినది.

వైఖానసే ఆనందసంహితాయామ్:

'వేదాంతతత్త్వమీమాంసాఖననం కృతవాన్ హరిః ।
నామ్నావిఖనసం ప్రాహుర్యంచ వైఖానసం తథా ॥'

ఇతి ప్రోక్తం. అత్ర ఖననశబ్దేన సంకల్ప ఉచ్యతే. 'సోఽకామయత. బహూస్యాం ప్రజాయేయేతి స తపో ఽతప్యత' ఇత్యాది శ్రుతిభ్యః. అవాప్తసమస్త కామస్యాపి భగవతః సృష్టికార్యే ప్రవృత్తి ర్భవతి. జగత్సృష్ట్యాదిలీలానుభవార్థం భగవతా సమష్టిసృష్టేరనంతరం వ్యష్టిసృష్టౌ దేవమనుష్యాది వివిధవిశేష సృష్ట్యర్థం చతుర్ముఖసృష్టింప్రతి ధ్యానం కృతమ్. ఏషా చిదచిదాత్మిక సృష్టిః భగవతా క్రియతే. వ్యష్టిసృష్టిస్తు బ్రహ్మణా.

సమష్టి సృష్టిర్నామ-
'భూతైస్తు పంచభిః ప్రాణైః స్వాంతైర్దశభిరింద్రియైః ।
చతుర్వింశతి తత్వాని సాంఖ్యశాస్త్ర విదోవిదుః ॥
మహాన్ కాలః ప్రధానంచ మాయాఽవిద్యా చ పూరుషః ।
ఇతి పౌరాణికాః ప్రాహుః త్రింశత్తత్వాని తైస్సహ' ॥

ఇతి వచనాత్ తత్వసృష్టి రిత్యవగమ్యతే. 'స్వాంతైః' ఇత్యనేన 'మనో బుద్ధిరహంకారశ్చిత్తంచ కరణాన్యమీ' ఇత్యంతః కరణచతుష్టయ ముచ్యతే.

వ్యష్టిసృష్టిర్నామ-అండాంతర్వర్తి భూతజాతసృష్టిః. 'అజామేకాం లోహిత శుక్లకృష్ణామ్', 'నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్' ఇత్యాది శ్రుతిభిః నిత్యత్వేన శ్రుతానాం ప్రకృతి పురుషాణాం సృష్టిర్నామ. 'ప్రలయదశాయాం

వైఖానసంలో ఆనందసంహితయందు-

"హరి, వేదాంత తత్వ మీమాంసాఖననం చేసినాడు కావున ఆయనకు విఖనసుడు అని పేరువచ్చినది. అయననే వైఖానసుడు అని కూడా చెప్పచున్నారు" అని చెప్పబడినది. ఇచ్చట ఖనన శబ్దమునకు 'సంకల్పము' అని అర్థం.

ఆ పరమాత్మ "నేను పలువురుగా జన్మింతును అని సంకల్పించుకొనెను. అయన అప్పడు తపస్సుచేసెను" ఇత్యాది వేదవాక్యములవలన అన్ని కామములు తీరినవాడైననూ, భగవంతునకు సృష్టికార్యమందు ప్రవృత్తికలదని తెలియుచున్నది. జగత్సృష్ట్యాది లీలానుభవంకొరకు భగవంతుడు సమష్టిసృష్టి చేసిన తర్వాత, వ్యష్టి సృష్టిచేయదలచినప్పడు- అంటే దేవ మనుష్యాది వివిధ విశేష సృష్టుల కొరకు, చతుర్ముఖుని గూర్చి ధ్యానించెను. ఈ చిదచిదాత్మకమగు సమష్టిసృష్టి భగవంతునిచేతనే చేయబడినది. ఇంక బ్రహ్మ వ్యష్టిసృష్టి చేసినాడు.

సమష్టి సృష్టి అనగా: పంచభూతములు, పంచప్రాణములు, అంతఃకరణములతో సహా దశఇంద్రియములు అని 24 తత్త్వములను సాంఖ్యశాస్త్రవేత్తలు ప్రతిపాదించినారు. మహత్తత్వము, కాలము, ప్రధానము, మాయ, అవిద్య, పురుషుడు- వీటితో కలిసి తత్వములు ముప్పదిమూడు అని పౌరాణికులు చెబుతున్నారు. ఈ వాక్యాలవల్ల సమష్టి సృష్టి అనగా తత్వసృష్టి అని అవగతమవుతున్నది. 'స్వాంతైః' అనటం వల్ల మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారం అనే అంతఃకరణ చతుష్టయం విదితమవుతున్నది.

వ్యష్టిసృష్టి అనగా : ఈ బ్రహ్మాండంలోపల ఉన్న భూతజాలసృష్టి. "అజ-ఏక-లోహిత-శుక్ల-కృష్ణ- నిత్యములలో నిత్యము, చేతనములలో చేతనము" ఇత్యాది వేదవాక్యముల వల్ల నిత్యములుగా నిర్ణయింపబడిన ప్రకృతి-పురుషులసృష్టి.

సూక్ష్మరూపేణ అవిభక్తనామరూపేణ చ పరమాత్మన్యేకీకృతానాం సృష్టికాలే పరమాత్మనోఽనుప్రవేశానంతరం స్థూలరూపవత్వం విభక్తనామరూపభాక్త్వం చ. తత్సృష్ట్వా 'తదేవానుప్రావిశత్ తదనుప్రవిశ్య. సచ్చ త్యచ్చాభవత్' ఇత్యాది శ్రుతేః.

అతస్సమస్త జగజ్జన్మ స్థితి ధ్వంసమహానంద్రైకహేతోః భగవతః పరబ్రహ్మణో నారాయణస్య వైఖానసాది శబ్దవాచ్యత్వ సంభవాత్ తన్నాభినలినసం జాతస్య బ్రహ్మణోఽపి 'అంగాదంగాదితి' మంత్రోక్తప్రకారేణ భారతాది ప్రతిపాదితరీత్యా చ వైఖానసాది శబ్దవాచ్యత్వముపపద్యతే.

శాంతి పర్వణి-

'విశేషేణాఖనత్ యస్మాత్ భావనాముని సృష్టయే ।
తస్మాద్విఖనసో నామ స ఆసీదండజః ప్రియః ॥'

ఇతి. తత్రైవ-

'స్రష్టుం స తు సముద్యుక్తో బ్రహ్మయోనిమయః ప్రభుః ।
ఖనిత్వా చాత్మనాఽఽత్మానం ధర్మాదిగుణసంయుతమ్ ॥
ధ్యానమావిశ్య యోగేన హ్యాసీద్విఖనసో మునిః' ॥ ఇతి.

శ్రీభాగవతే-

'న ఖలు గోపికానందనో భవాన్
అఖిలదేహినామంతరాత్మదృక్ ।
విఖనసార్థితో విశ్వగుప్తయే
సఖ ఉదేయివాన్ సాత్వతాం కులే ॥' ఇతి.

వారు, ప్రళయదశలో సూక్ష్మరూపంలో అవిభక్తంగా, అ రూపంగా పరమాత్మయందు ఏకీభూతులవుతారు. సృష్టికాలంలో పరమాత్మ ప్రవేశించిన తరువాత, స్థూలరూపం కలిగిఉండటం, నామరూపవిభాగం కలిగిఉండటం సంభవిస్తుంది. 'దానిని సృజించి, దానియందే అనుప్రవేశం చేసెను'. 'దానియందు అనుప్రవేశంచేసి, సత్తుగాను, త్యక్తుగాను అయెను'-ఇత్యాది వేదవాక్యములు ప్రమాణములు. అందువల్ల సమస్తజగత్తునకు జన్మ-స్థితి-ధ్వంసము-మహానందము-వీటికి ఏకైకకారణమైన భగవంతుడు, పరబ్రహ్మ అయిన నారాయణుడే వైఖానసాది శబ్దములతో చెప్పబడుతున్నాడనటం సమంజసం. ఆయన నాభికమలమునుండి జన్మించిన బ్రహ్మకూడా 'అంగాంగములనుండి పుట్టినావు' అనే వేదమంత్రోక్తి ప్రకారం, భారతాదులలో ప్రతిపాదింపబడిన ప్రకారం వైఖానసశబ్ద వాచ్యుడు కావటం ఉపపన్నమవుతున్నది.

శాంతిపర్వంలో-

'భావనాముని సృష్టికొరకు విశేషంగా త్రవ్వెను కావున విఖనసుడు అనుపేరిట అండజుడు (= చతుర్ముఖ బ్రహ్మ) ప్రీతి పాత్రుడాయెను' అనియు, అచ్చటనే బ్రహ్మయోనిమయుడైన ఆ ప్రభువు సృష్టికి పూనుకొన్నవాడై, ధర్మాదిగుణసంయుతమైన ఆత్మను, ఆత్మచేతనే త్రవ్వి, యోగంతో ధ్యాననిష్ఠుడై విఖనసుడు అనే ముని అయినాడు, అని ఉన్నది.

భాగవతంలో కూడా-

'దేవ! అఖిలప్రాణులకు అంతరాత్మను చూడగలిగే నీవు గోపికా నందనుడవుకావు. ప్రపంచరక్షకై విఖనసుడు కోరగా, ఓ మిత్రుడా! నీవు సాత్త్వతులకులంలో ఉదయించినావు' అని చెప్పబడినది.

గారుడే-శ్రీరంగమాహాత్మ్యే-

'బ్రహ్మా౨పి దివ్యహంసేన సితమేఘోపమేన చ।
పృష్టతో ౨౨మయయా విష్ణుం వస్త్రేణాచ్ఛాద్య చాననమ్
తత్రార్చకో మహాభాగో భగవాన్ విఖనా స్తదా ।
దదౌ ప్రసాదం దేవానాం రంగనాథాభ్యనుజ్ఞయా ॥' ఇతి.

వైఖానసే-ఆనందసంహితాయామ్-

'అంతర్హితానాం ఖననా ద్వేదానాం తు విశేషతః ।
స విధుః ప్రోచ్యతే సర్వైః విఖనా బ్రహ్మవాదిభిః ।
వైఖానసశ్చ భగవాన్ ప్రోచ్యతే స పితామహః' ॥ ఇతి.

వ్యాసనిఘంటౌ-

'విఖనసం చ విధాతారం విరించం తం చతుర్ముఖమ్' ।
నాభిజన్మాండజః పూర్వో విఖనాః కమలాసనః ॥
శతానంద శ్శతధృతి స్స్వత్యకో హంసవాహనః ।
పద్మాసనో విఖనస శ్చతుర్ముఖ ఇతీరితః ॥
ఇతి చ ప్రతిపాదితమ్.

ఏవం కార్యకారణ యోరభేదావగమాత్
ప్రమాణబాహుల్యాచ్చ భగవతి
నారాయణే చతుర్ముఖే చ వైఖానసశబ్ద
ప్రయోగప్రకారః ప్రతిపాదితః ॥

గరుడపురాణంలో, శ్రీరంగమాహాత్మ్యంలో-

'తెల్లని మేఘంవంటి హంసవాహనంమీద బ్రహ్మ, తనముఖమును వస్త్రంతో కప్పుకొని విష్ణువువెంట నడచినాడు. అక్కడ భగవంతుడు మహాభాగుడు అయిన విఖనసుడు అర్చకుడు; అయన రంగనాథుని అనుజ్ఞతో, దేవతలందరకు ప్రసాదము పంచెను' అనిఉన్నది.

శ్రీవైఖానస ఆనందసంహితలో-

'అంతర్హితములైన వేదములను విశేషంగా త్రవ్వటం చేత బ్రహ్మవాదులందరూ ఆ భగవంతుని 'విఖనసుడు' అనిపేర్కొన్నారు.

వ్యాస నిఘంటువులో-

విధాత అయిన విఖనసుడు, చతుర్ముఖుడైన విరించి-వీరు, నాభిజన్ముడు, పూర్వుడు, విఖనుడు, కమలాసనుడు, శతానందుడు, శతధృతి, సత్యకుడు, హంసవాహనుడు, పద్మాసనుడు, విఖనసుడు, చతుర్ముఖుడు అని పేర్కొనబడినారు.

ఇట్లా కార్యకారణములకు అభేదం ఒప్పుకొనటంచేత, బహుళ ప్రమాణములు ఉండటంచేత భగవంతుడైన నారాయణునియందు, చతుర్ముఖునియందు వైఖానసశబ్దం సమానంగా ప్రయోగింపబడినదని ప్రతిపాదింపబడినది.

# వైఖానసుల ఉత్పత్తి

వైఖానసానా ముత్పత్తిః విశేషేణ శ్రూయతే. యజుషి అరుణకేతుకే ఇష్టకోపధానకథనానువాకే సృష్టిప్రకరణే-'ఆపో వా ఇదమాసన్ సలిలమేవ. స ప్రజాపతి రేకః పుష్కర పర్ణే సమభవత్. తస్యాంతర్మనసి కామస్సమభవత్. ఇదం సృజేయమితి'. ఇత్యారభ్య సతపస్తప్త్వా. శరీర మధూనత. తస్య యన్మాంసమాసీత్. తతో౽రుణాః కేతవో వాతరశనా ఋషయ ఉదతిష్ఠన్. యే౽నఖాః తే వైఖానసాః. ఏవాలాః తేవాలఖిల్యాః ఇతి. అస్యార్థః. సమష్టి సృష్టేరనంతరం వ్యష్టిసృష్టౌ చతుర్ముఖః దేవమ నుష్యాదివివిధవిశేషసృష్ట్యర్థం మత్స్యాది రూపేణావతరిష్యమాణస్య భగవతో నారాయణస్య పరమవైదిక త్వేన సంప్రతిపన్న శ్రీవైఖానసభగవచ్ఛాస్త్రమార్గేణ సమారాధనార్థం చ స్వాత్మతుల్యాః ప్రజాస్సంభవేయు రితి స్వాంతర్యామిణం పరమాత్మానం ధ్యానేనానుకృతవాన్.

తపశ్చరణకాలే సాక్షాత్కృత భగవత్స్వరూపవైభవానుభవాతిశయాత్ భగవద్దత్త సృష్టిశక్తి లాభాత్ తదుపజనిత విశేషవేగాచ్చ పులకితసర్వాంగః శరీరమధూనత-కంపమకరోత్. 'తస్య యన్మాంసమాసీత్' మాంసం మానస మితి యావత్.

'అర్థాత్ ప్రకరణాల్లింగాదౌచిత్యాదర్థనిర్ణయః'
ఇత్యర్థాదిభిః సమీచీనార్థనిర్ణయవిధానాత్
'అక్షరసామ్యాన్నిర్బ్రూయాత్' ఇతి నిరుక్తవిధానాచ్చ.
తథా చ తస్య మనః పరమాత్మని సంసక్త మాసీదితి యత్.

# వైఖానసుల ఉత్పత్తి:

యజుర్వేదంలోని అరుణకేతుకమందలి ఇష్టకోపధానకథనానువాకంలో సృష్టిప్రకరణమందు-

'అంతటా సలిలమే. పుష్కరపర్ణమందు ఒక్క ప్రజాపతిమాత్రమే ఉన్నాడు. 'సృష్టిచేయవలెను' అని ఆయన మనస్సునందు కోరిక కలిగినది. ఇట్లా సంకల్పించి, తపస్సుచేసి, తనశరీరమును ఒక్కసారి విదలించినాడు. అప్పుడు ఆయనశరీరంలోని మాంసమునుండి అరుణులు, కేతువులు, వాతరశనులు, ఋషులు ఉద్భవించినారు. వారిలో అనఖులైన వారు వైఖానసులు, వాలములు కలవారు వాలఖిల్యులు అయినారు. దీని అర్థమిది - చతుర్ముఖుడు సమష్టి సృష్టిచేసిన తరువాత వ్యష్టిసృష్టి తలపెట్టినాడు. దేవమనుష్యాది వివిధ విశేష సృష్టులు చేయటం కోసం మత్స్యాది రూపాలతో అవతరించబోయే భగవంతుడైన నారాయణుని, పరమవైదికమైనదిగా ప్రతిపాదింపబడిన శ్రీవైఖానస భగవచ్ఛాస్త్రమార్గంద్వారా ఆరాధించటం కోసం తనతో సమానులైన సంతానము కలుగవలెనని స్వాంతర్యామియగు పరమాత్మను ధ్యానించెను'.

తపశ్చరణకాలంలో భగవత్స్వరూపవైభవం సాక్షాత్కృతం కావటంచేత కలిగిన అనుభూతి అతిశయంవల్ల, భగవంతునిచేత ప్రసాదింపబడిన సృష్టిశక్తి లభించటం వల్ల, ఆశక్తి యొక్క విశేషవేగం వల్ల, పులకితసర్వాంగుడై తన శరీరమును విదలించెను. ఆయన యొక్క 'మాంసము నుండి' అంటే 'మానసమునుండి' అని భావం. అర్థనిర్ణయం-అర్థంచేత, ప్రకరణం చేత, లింగంచేత, ఔచిత్యంచేత- జరుగవలెను. కావున సమీచీనార్థ నిర్ణయం ఇదే. అక్షరసామ్యంచేత నిర్వచనం చెప్పవలెనని నిరుక్తశాస్త్రంలోకూడా నిర్ణయింపబడినది. అప్పుడు ఆ బ్రహ్మయొక్క మనస్సు పరమాత్మయందు సంసక్తమైనదని చెప్పటంచేత, ఆయనకు పరమాత్మానుగ్రహం కలిగినదని భావం.

తేన హేతునా తదనుగ్రహస్సమజని. తేనానుగృహీతాత్ బ్రహ్మణః అరుణాః కేతవో వాతరశనాః ఋషయః ఉదతిష్ఠన్. అరుణాః పరమాత్మని వసంతః తదితరవిరక్తాః. కేతవః ఉచ్ఛ్రిత స్వభావాః. పరమాత్మప్రవణానా మగ్రేసరాః వాతరశానాః దిగ్వాససః. ఋషయః సర్వార్థ దర్శినః సనకాదయః ఉదతిష్ఠన్ ఉత్క్రృష్య సమభవన్ ఇతి.

స ప్రజాపతిః ఏవం విధాన్ స్వకార్యసాధకాన్ తాన్ దృష్ట్వా కించి ద్విషాద మాపన్నః. పునరపి స్వకారణం భగవంతం ధ్యానపర్యాయేణ ఖననే నాతోషయత్-యేనఖ ఇత్యాది. భగవదనుగ్రహ వికసితే ప్రజాపతే ర్మనసి వైఖానసానామ ఋషయ స్సంభూతాః. అత్ర యేనఖా ఇత్యత్ర ఆద్యంతవర్ణ విపర్యయో భవతి, కశ్యపః పశ్యకో భవతీతి వత్. ఖనా ఇత్యేతత్ నఖా ఇతి విపర్యస్త మితి యావత్.

సుప్తిఙు పగ్రహలింగనరాణాంకాలహలచ్స్వరకర్తృయఙాంచ ।
'వ్యత్యయమిచ్ఛతి శాస్త్రకృదేషాం సోఽపిచ సిద్ధ్యతి బాహులకేన'॥

ఇతి. 'బహులం ఛందసి' తి చాత్ర ప్రమాణమ్.
అత్ర 'అనఖా' ఇతి ఛిత్వా కేచిదేవమూచుః.
అనఖా ఇత్యనేన సౌమ్యేంద్రియవత్వ ముక్త మితి.

ఏవం చ సతి 'సౌమ్యం జితేంద్రియం' 'సుప్రసన్నేంద్రియం' ఇత్యాదినా భగవచ్ఛాస్త్రే ష్వాచార్యలక్షణస్య ప్రతిపాదితత్వాత్ 'వైఖానస విఖనసాచార్య' ఇతి విష్ణోః ఆచార్యత్వేన శాంతిపర్వణ్యభిహితత్వాత్,

'విఖనా ఇతి వై విష్ణు స్తజ్జా వైఖానసాః స్మృతాః ।
విష్ణోరేవ సముత్పన్నా భృగ్వాద్యా మునయ స్తథా'॥

ఇట్లా అనుగ్రహీతుడైన బ్రహ్మనుండి అరుణులు, కేతువులు, వాతరశనులు, ఋషులు ఉద్భవించినారు.

అరుణులు పరమాత్మయందే వసించేవారై, అన్యవిషయములందు విరక్తులు అయినారు. కేతువులు ఉచ్ఛ్రిత (= అనియత) స్వభావులు. వాతరశనులు పరమాత్మ ప్రవణులలో అగ్రేసరులు, దిగంబరులు. ఋషులు సర్వార్థదర్శులైన సనకాదులు. 'ఉదతిష్ఠన్' అనగా ఉత్కృష్టంగా జన్మించినారని భావం. ఆ ప్రజాపతి, ఈవిధంగా, స్వకార్యసాధకులైన వారిని చూచి, కొంచెం విషాదంచెంది, మరల ధ్యానమునకు పర్యాయమైన ఖననంతో, స్వకారణమైన భగవంతుని సంతోషపెట్టెను. 'యేనఖ' అనగా భగవదనుగ్రహంచేత వికసించిన ప్రజాపతి మనస్సులో వైఖానసులు అనే ఋషులు జన్మించిరని భావం. 'యేనఖ' అన్నచోట ఆద్యంతవర్ణముల విపర్యయం జరుగుతుంది. 'పశ్యకుడు, కశ్యపుడవుతాడు' అనేన్యాయం ప్రకారం 'నఖ' అనేది 'ఖన' గా వ్యత్యస్తమైనదని భావం.

'సుప్తిఙు' ఇత్యాదులకు శాస్త్రకర్త వ్యత్యస్తమును కోరుతున్నాడు; అది కూడా బహులం. దీనికి 'బహులంఛందసి' అనే సూత్రం ప్రమాణం. ఇక్కడ కొందరు 'అనఖ' అని పరిచ్ఛేదంచేసి, సౌమ్యములైన ఇంద్రియములు కలవారని అర్థం చెబుతున్నారు. అట్లా అయినప్పటికీ, సౌమ్యుడు, జితేంద్రియుడు, ప్రసన్నేంద్రియుడు ఇత్యాదిగా భగవచ్ఛాస్త్రములందు ఆచార్య లక్షణము చెప్పబడుతున్నది. విష్ణువుకూడా ఆచార్యుడు. కావున, విఖనసుడు అనగా వైఖానసాచార్యుడని భావం.

శాంతిపర్వంలో విఖనుడనగా విష్ణువే; తజ్జాతులు వైఖానసులు. భృగ్వాది మునులు విష్ణువు నుండియే ఉద్భవించినారని చెప్పబడినది.

ఇతి వచనాత్, 'గురోస్సానవృత్తిర్వైఖానస' ఇతి బోధాయన సూత్రే ఉక్తత్వాచ్చ భాగవతాదిషు ప్రతిపాదితమాచార్యపుంస్త్వమేతేషాం వైఖానసానా మేవేత్యవగమ్యతే. శ్రీవైఖానసే ఆనందసంహితాయాం విఖనసోత్పత్త్యాదికం ప్రతిపాదితమ్.

'అథ సస్మార భగవాన్ విశ్వసృష్ట్యర్థ మచ్యుతః ।
ధాతారం విశ్వనిర్మాణ చతురం చతురాననమ్ ॥
స్మరణానంతరాదేవ ప్రాదురాసీత్ పురః ప్రభోః ।
ధాతా సమస్త జగతాముత్పత్తికరణ క్షమః ॥
తం ప్రాహ భగవాన్ విష్ణుః ప్రణతం పురతః స్థితమ్' ।
శ్రీభగవానువాచ-

'బ్రహ్మన్ త్వయా జగత్సర్వం కర్తవ్యం సచరాచరమ్ ॥
లోకే విహర్తు మిచ్ఛామి యదహం పద్మసంభవ ।
తతస్త్వత్సృష్టజగతామవిచ్ఛిన్న ప్రవృత్తయే ॥
ధర్మసంరక్షణార్థాయ వేదశాస్త్రార్థసిద్ధయే ।
అలసా అల్ప సత్త్వాశ్చ మనుష్యా స్స్వల్ప బుద్ధయః ॥
తే పరవ్యూహ విభవానాత్మానం చ న మేనిరే ।
సౌలభ్యాయ తు భక్తానాం సర్వలోకానుకంపయా ॥
అర్చావతారరూపేణ లోకేఽస్మింశ్చతురానన ।
అవతారం కరిష్యామి మహ్యా లక్ష్మ్యాసమన్వితః ॥
మదర్చాయై సృజ బ్రహ్మన్ సృష్ట్యాదౌ మునిసత్తమమ్ ।'

గురువుకంటె భిన్నమైన వృత్తి లేనివాడు వైఖానసుడని బోధాయన సూత్రమందువదేశింపబడినది. భాగవతాదులందు వివరింపబడిన ఆచార్య పురుషత్వం ఈ వైఖానసులను గురించియే అని అవగతమవుతున్నది. ఆనందసంహితలో విఖనసోత్పత్త్యాదులు వివరింపబడినవి.

విశ్వసృష్టికొరకు భగవంతుడైన అచ్యుతుడు విశ్వనిర్మాణ చతురుడు, చతుర్ముఖుడు అయిన ధాతనుస్మరించెను. అట్లా స్మరించినంతనే సమస్త జగదుత్పత్తి కరణక్షముడైనధాత ప్రభువుముందు ప్రాదుర్భవించెను. తన ముందు మోకరిల్లిఉన్న ధాతతో భగవంతుడైన విష్ణువు ఇట్లా చెప్పెను:

"ఓ బ్రహ్మ! నాకు లోకాలలో విహరింపకోరిక కలుగుచున్నది. కావున సచరాచరమైన సమస్త జగములను నిర్మించుము. నీవు నిర్మించిన జగత్తులు అవిచ్ఛిన్నంగా కొనసాగుటకు, వేదశాస్త్రార్థసిద్ధికొరకు, ధర్మసంరక్షణ కొరకు నేను ఏర్పాటుచేయుదును. మనుష్యులు- స్వల్పబుద్ధులు, అల్పమన శ్శక్తియుతులు, సోమరులు, పరవ్యూహావిభవములను ఆత్మను కాంచలేని వారు. భక్తుల సౌలభ్యం కొరకు, సర్వలోకములమీద దయతో నేనీలోకంలో, అర్చావతార రూపంలో, భూ-లక్ష్మీదేవులతో కూడి అవతారమెత్తుదును. నాఅర్చనకొరకై, సృష్ట్యాదిలోనే ఉత్తమమునిని సృష్టింపుము"

ఇత్యు క్తస్తదా బ్రహ్మా ముహూర్తం తత్పృక్షయా ॥
చింతయామాస తత్కార్యం క్షణమేకం మహామునిః ।
నాచే వ శక్నుయామేవం ప్రష్టుమిచ్ఛన్ తథావిధమ్ ॥
తస్య తద్వచనం శ్రుత్వా దేవదేవో హరిస్స్వయమ్ ।
చింతయామాస దేవేశః స్వనిర్మలాంతరాత్మని ॥
వేదాంతతత్త్వ మీమాంసాఖననం కృతవాన్ హరిః ।
నామ్నా విఖనసం చక్రే తత్పదాన్వర్థయోగతః ॥
తథా చింతయతస్తస్య మనసో ద్వౌ బభూవతుః ।
సంకల్పధర్మౌ, సన్నమ్య ప్రాంజలిం పురతః స్థితమ్ ॥
బ్రహ్మాణమబ్రవీద్విష్ణు ర్జ్ఞాతసృష్ట్యంతహేతవే(కారకం) ।
సంకల్పధర్మౌ భవతస్తవ సృష్ట్యంతహేతవే ॥
శుద్ధసత్త్వ సముత్పన్నో నిర్మితోఽయం తవాగ్రతః ।
మునిశ్రేష్ఠో మహాతేజా మత్కార్యకరణక్షమః ॥
మత్కార్యసాధకానేవ త్వాం వై స్రష్టుమథార్హసి ।
హృషీకేశస్య తద్వాక్యమభ్యాధాయ కృతాంజలిః ॥
చతుర్ముఖశ్చాపి తథా సనకాదిమునీశ్వరాన్ ।
ధ్యాయన్ముఖైశ్చతుర్భిస్తు క్రమాదసృజదబ్జభూః ॥
సనత్కుమారంచ తథా సనకంచ సనాతనమ్ ।
సనందనమితి ఖ్యాతాన్ బ్రహ్మవిద్యావిశారదాన్ ॥
తతస్తే చ మునిశ్రేష్ఠా జ్ఞానాతిశయవైభవాత్ ।
విరక్తచిత్తా స్సంజగ్ముః కైవల్యం పదముత్తమమ్ ॥

అప్పుడు, బ్రహ్మ, ఆభగవానుని ఆజ్ఞప్రకారం ఆ మునిని సృష్టింప గోరి,ఒక క్షణకాలం, ఆపనిని గూర్చియే ధ్యానమగ్నుడాయెను. [illegible] 'నీవుచెప్పినట్టి వానిని సృజించుటకు, నేను కోరినను, నాకుశక్తి లేద. [illegible] దేవదేవునితో చెప్పెను. అప్పుడు హరి, తన నిర్మలతరాత్మయందు [illegible] వేదాంతతత్త్వమీమాంసాఖననం చేసెను; ఆపదం యొక్క [illegible] (ఆమునికి) విఖనసుడు అని నామకరణం చేసెను. అట్లా [illegible] ఆయన మనస్సునుండి సంకల్పుడు, ధర్ముడు అనే ఇరువురు సంభవించిరి ఎదుట దోసిలిఒగ్గి నిలుచున్న బ్రహ్మతో విష్ణువు ఇట్లు చెప్పినాడు: 'నీసృష్టి అంతమువరకు నిల్చుటకై ఈ సంకల్ప-ధర్ములు ఇరువురు నీ అధీనంలో ఉంటారు. నీ ఎదుట శుద్ధ సత్త్వసముత్పన్నుడు, మత్కా[illegible] మహాతేజుడు అయిన మునిశ్రేష్ఠుడు నిర్మింపబడి ఉన్నాడు. నా కార్యమును సాధించే వారినే నీవు సృజింపుము'.

హృషీకేశుని యొక్క ఆ వాక్యములను, చతుర్ముఖుడు కృతాంజలియై స్వీకరించి. ధ్యానించి, నాలుగుముఖములతో సనకాది మునీశ్వరులను సృజించెను; [illegible]-సనత్కుమారుడు, సనకుడు, సనాతనుడు, సనందనుడు- వారు బ్రహ్మవిద్యా విశారదులుగా ఖ్యాతిచెందిరి. ఆ మునిశ్రేష్ఠులు వారి జ్ఞానాతిశయవైభవం వల్ల విరక్త చిత్తులై, ఉత్తమమైన కైవల్యపదమునందిరి.

స్వకార్యసాధకాన్ బ్రహ్మ సృష్టవాన్ పునరేవ హి ।
ప్రాణాచ్చ చక్షుషస్త్వద్వదభిమానాచ్చ కర్మణః ॥
హృదయాచ్ఛిరసః శ్రోత్రాదుదానాద్వ్యానతస్తతః ।
సమానాచ్చ తథాఽపానాదృషిశ్రేష్ఠానిమాన్ దశ ॥
దక్షం మరీచినం నీలలోహితం భృగుమేవ చ ।
తథాఽంగిరస మత్రిం చ పులస్త్యం పులహం తథా ॥
వసిష్ఠం చ క్రతుం చైవ క్రమాదసృజదబ్జభూః ।
నవబ్రహ్మణ ఏవైతే వినా స్యుర్నీలలోహితమ్ ॥
ధర్మ సంకల్పసహితా స్సనకాద్యా మునీశ్వరాః ।
భృగ్వాది మునయశ్చైవ శ్రుతిస్మృత్యాదివేదనాత్ ॥
శిష్యా విఖనసః ప్రోక్తా స్సర్వశాస్త్రార్థపారగః ।
వైఖానసానాం భృగ్వాద్యా వంశకర్తార ఈరితాః ॥
సర్వేషామగ్రజం శ్రేష్ఠమాత్మపుత్రం మునిం తథా ।
తం హరేః పురతః కృత్వా ప్రోక్తవాన్ కమలాసనః ॥
బ్రహ్మోవాచ-

దేవదేవ జగన్నాథ సృష్టిస్థిత్యంతకారణ ।
భగవంస్త్వత్ప్రభావేన సృష్టోఽయం మునిసత్తమః ॥
జాతాశ్చింతయతో మత్తస్త్వత్ప్రసృష్టా మునయస్త్విమే ।
ఏతైరపి కృతం సర్వం జగదేతచ్చరాచరమ్ ॥
మత్పుత్రాణాం చ సర్వేషామగ్రజః పురుషోత్తమః ।
వైష్ణవే ష్వగ్రజః శ్రేష్ఠో మునీనాం ప్రథమో మునిః ॥

అప్పుడు బ్రహ్మ స్వకార్యసాధకులను మరల సృజించెను. ప్రాణముళు, నేత్రములు, అభిమాన కర్మ, హృదయము, శిరస్సు, శ్రోత్రములు, ఉదానం, వ్యానం, సమానం, అపానం అనే అవయవములనుండి పదిమంది ఋషి శ్రేష్ఠులను సృజించెను. వారే క్రమంగా-దక్షుడు, మరీచి, నీలలోహితుడు, భృగువు, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, వసిష్ఠుడు, క్రతువు అనే పేర్లతో సుప్రసిద్ధులైనారు. వీరిలో నీలలోహితునివిడిచి, తక్కినవారు నవ బ్రహ్మలయినారు. సనకాది మునీశ్వరులు, భృగ్వాదిమునులు, శ్రుతిస్మృత్యాది పరిజ్ఞానం కలిగినవారై, ధర్మసంకల్పులతో కూడా విఖనసుని శిష్యులైనారు; వీరు సర్వశాస్త్రార్థపారంగతులు. వైఖానసులలో భృగ్వాదులు వంశకర్తలుగా పేర్కొనబడినారు. అందరిలో అగ్రజుడు, శ్రేష్ఠుడు, ఆత్మపుత్రుడు అయిన మునిని, హరిముందు నిల్పి, కమలాసనుడిట్లు విన్నవించినాడు:

'దేవదేవ! జగన్నాథ! సృష్టి స్థిత్యంతకారణ! భగవంతుడ! నీ ప్రభావం చేతనే ఈ మునిసత్తముడు సృష్టింపబడినాడు. నీ సృష్టిలో, చింతనచేయు నానుండి ఈ మునులు పుట్టినారు. వీరు ఈ చరాచరజగత్తునంతా సృష్టించినారు. నా పుత్రులందరిలో పురుషోత్తముడు అగ్రజుడు; వైష్ణవులలో అగ్రజుడు; మునులలో శ్రేష్ఠుడైన ప్రథమముని.

విశేషఖననాజ్జాతో విష్ణో ర్వైఖానస స్తథా ।
భృగ్వాదీమునీయాథ సావిత్రి ముపదేక్ష్యతి ॥
పరబ్రహ్మోపదేష్టా సావయమేవ గురుస్స్మృతః ।
ఏతదుక్తప్రకారేణ సర్వే వై మమసూనవః ॥
చరిష్యంతి యథాన్యాయం లౌకికాధ్యాత్మవైదికాన్ ।
విధిః ప్రవర్తితా సృష్టి రవిచ్ఛిన్నా ప్రవర్తతే ॥
భవానవతరత్యత్ర మమస్పష్టా జనార్దన ।
శుద్ధ సత్త్వసముత్పన్నో నిర్మితో ఽయం త్వయా విభో ॥
ఋషి శ్రేష్ఠో మహాతేజాః త్వత్కార్య కరణ క్షమః ।
తథా ఽసౌ ఖననాద్విష్ణోః ధ్యానాదంతశ్చ గర్భతః ॥
యస్మాత్తవ సముత్పన్నో జ్ఞేయో ఽసౌ గర్భవైష్ణవః ।
ఇత్యుక్తో భగవాన్ ప్రాహ మునిశ్రేష్ఠం తపోనిధిమ్ ॥

శ్రీ భగవానువాచ-

దేవ బ్రహ్మ ఋషీణాం తు మదీయారాధనం ప్రతి ।
మయా సంచోదితో యస్మాత్త్వమేవ మునిసత్తమ ॥
తపోధనో భవానేవ ధన్యోఽసి భువనత్రయే ।
ఆత్మార్థం వా పరార్థం వా నిత్యనైమిత్తికాది యత్ ॥
తత్సర్వం మత్ప్రసాదేన మదీయారాధనం కురు ।
అథాహ స ఋషిస్తస్మై ప్రణమ్య జగదాత్మనే ॥

శ్రీ విఖనా ఉవాచ-

భవతాఽనుగ్రహీతోఽహం ధన్యోఽస్మి పురుషోత్తమ ।

విష్ణువు విశేషంగా ఖననమనే చింతన చేయటం నుంచి వైఖానసుడు జన్మించినాడు. ఆయన భృగ్వాదులకు ఉపనయనం చేసి, సావిత్రిని ఉప దేశింపగలడు. ఆయనయే పరబ్రహ్మోపదేశికుడైన గురువు. ఆయన చెప్పిన ప్రకారమే నా పుత్రులందరు లౌకికములు, ఆధ్యాత్మికములు, వైదికములు అయిన కర్మలను యథాశాస్త్రంగా ఆచరింపగలరు. వీరు ప్రవర్తింపజేసిన సృష్టి అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంది. ఓ జనార్దన! ఈ నాసృష్టిలో నీవు అవతరించుము. ఈ ఋషి శ్రేష్ఠుడు, నీచేత శుద్ధ సత్వసముత్పన్నుడుగా నిర్మితుడైనాడు. ఈయన మహాతేజుడు. త్వత్కర్మకరణక్షముడు అయిన ఋషిశ్రేష్ఠుడు. విష్ణువుయొక్క ఖనన ధ్యానమునుంచి నీ గర్భాంతర్భాగము నుంచి ఉత్పన్నుడైనాడు: కావున ఈయనకు 'గర్భవైష్ణవుడు' అనే ప్రసిద్ధి కలుగుతుంది.

అప్పుడు ఆ భగవంతుడు తపోనిధి అయిన మునిశ్రేష్ఠునితో ఇట్లు పలికెను.

శ్రీభగవంతుడు చెప్పినాడు--

దేవతలు, బ్రహ్మ, ఋషులు - వీరిలో నా ఆరాధన విషయంలో నాచే నీవు సంబోధితుడవగుచున్నావు. కావున, ఓ ముని సత్తమ! నీవే తపోధనుడవు. మూడులోకాలలో ధన్యుడవు. ఆత్మార్థంకాని, పరార్థంకాని నిత్యనైమిత్తికాది కర్మలన్నీ, నా అనుగ్రహంతో, నా ఆరాధనగా చేయుము.

అప్పుడు ఋషి జగదాత్మకు ప్రణమిల్లి, ఇట్లు చెప్పసాగెను:

ఓ పురుషోత్తమ! నీ అనుగ్రహం చేత నేను ధన్యుడనైతిని.

నాతఃపరతరం కార్యం కిమస్యన్యద్దివౌకసామ్ ॥
తథాపి దేవదేవేశ స్వకర్మ మునిభిస్తదా ।
ఉదయాద్యస్తపర్యంతం క్రియతే నియతాత్మభిః ॥
సర్వేషాంచ ద్విజాతీనాం శ్రుతిస్మృతి సమీరితమ్ ।
కర్తవ్యం సతతం దేవ స్వస్వకర్మ ప్రయత్నతః ॥
భవదారాధనం విష్ణో కథంకారం కరోమ్యహమ్ ।
త్వత్కర్మ క్రియతే చేత్తు కర్మలోపో భవేన్మమ ॥
ఇత్యుక్తో భగవానాహ మునినా తత్వవేదినా ।

శ్రీభగవానువాచ-

విఖనస్త్వం మునిశ్రేష్ఠ మదారాధనకర్మణి ॥
స్వకర్మలోపసంత్రాస వ్యాకులీకృతచేతసః ।
తవ కర్మాణ్యనూనాని సంతు నిత్యం మదాజ్ఞయా ॥
త్వద్వంశజానాం సర్వేషాం కాలే వై కృతకర్మణామ్ ।
నిషేకాదిశ్మశానాంతాః కార్యాః మంత్రసమన్వితాః ॥
అష్టాదశ చ కర్మాణి శారీరాణి ప్రచక్షతే ।
యజ్ఞాశ్చ వింశతి ద్వే చ ధర్మం వైష్ణవముత్తమమ్ ॥
వేదే వైఖానసే సూత్రే యో ధర్మః పరికీర్తితః ।
సర్వేస్స ధర్మోఽనుష్ఠేయో నాత్ర కార్యావిచారణా ॥
త్వదాజ్ఞయైవ భృగ్వాద్యా నారాయణపరాయణాః ।
వదంతి పరమం ధర్మం వైష్ణవం శ్రుతి సమ్మతమ్ ॥
తద్ధర్మనిరతా యే తు తే వై భాగవతాః స్మృతాః ।

దేవతలకు మునులకు ఇంతకంటె వేరే స్వకర్మ ఏదిలేదు. ఉదయాద్యస్తపర్యంతం సకల ద్విజులు నియతాత్ములై, శ్రుతిస్మృతి ప్రతిపాదితములైన తమతమ కర్మలను ప్రయత్నపూర్వకంగా చేసుకోవాలి. మరి, నీ ఆరాధన చేస్తూ ఉంటే నాకు నిత్యనైమిత్తిక కర్మలోపం జరుగుతుంది.

అప్పుడు శ్రీభగవంతుడు ఇట్లు చెప్పినాడు:

ఓ మునిశ్రేష్ఠ! నీవు విఖనసుడవు. నా ఆరాధన చేస్తూ ఉంటే స్వకర్మలోపం జరుగుతుందని భయపడుతున్నావు. నా ఆజ్ఞాశక్తిచేత అవి లోపములు లేనివే అగునుగాక! నీవంశజులందరకు సకాలంలో నిషేకాది శ్మశానాంతకర్మలన్నీ వేదోక్తంగా జరిపింపుము. శరీరమునకు సంబంధించినవి అష్టాదశకర్మలు, యజ్ఞములు ఇరవై రెండు. ఇదియే ఉత్తమవైష్ణవ ధర్మం. వేదంలో, వైఖానససూత్రంలో ఉపదేశింపబడిన ధర్మమునే అందరూ అనుష్ఠించాలి. దీనికి విచారింప పనిలేదు. నీ ఆజ్ఞచేతనే భృగ్వాదులు నారాయణపరాయణులై, వేదసమ్మతమైన, పరమమైన వైష్ణవధర్మమును బోధింతురు. ఆ ధర్మం ప్రకారం నడచుకొనేవారికి 'భాగవతులు' అనిపేరు.

మత్కార్మకారిణాం తేషాం కర్మలోపో న విద్యతే ॥
తిస్రః కోట్యో మునీనాం తు కర్మ కుర్వంతి మే సదా ।
జ్ఞాత్వా యజూంషి సాంగాని మన్మతాస్సర్వం ఏవ తే ॥
మన్మంత్రకల్పజాతాని మత్పురాణాన్యనుక్రమాత్ ।
అధీత్య సర్వకర్మాణి కుర్వతే తే మదర్చనమ్ ॥
కృతాధికారిణస్తే తు కృతసంబంధినో మమ ।
మత్ప్రసాదభుజస్సర్వ్యా అతిప్రియతమా మమ ॥
షట్కార్మనిరతాస్తే వై సాత్త్వికాహారతత్పరాః ।
వైఖానసేన సూత్రేణ నిషేకాదిక్రియాన్వితాః ॥
భవంతి భావితాత్మానో మత్కార్మకరణక్షమాః ।
తస్మాద్భాగవతశ్రేష్ఠా భవంత్యప్రాకృతా భువి ॥
సర్వథా 'యేనఖాస్తే వైఖానసా' ఇతి వేదతః ।
తస్మాద్వైఖానసశ్శుద్ధా స్సర్వకర్మసు పూజితాః ॥
తతః ప్రాహ మునిశ్రేష్ఠస్తమేవం వాదినం హరిమ్ ।

శ్రీ విఖనా ఉవాచ--

భగవంస్త్వత్ప్రసాదేన కర్మ సాంగం యథోదితమ్ ॥
సర్వేషాం మత్కులీనానాం భవత్యేవ న సంశయః ॥
ఇతి. అతోఽత్ర శ్రుత్యుక్త మార్గేణ వైఖానసానాం
స్పష్ట్యాదికం అద్వారకభగవద్యజనేనైతేషాం
నిత్యకర్మానుష్ఠాన పూర్ణత్వం చ ప్రతిపాదితమ్.

నా సేవ చేసేవారికి కర్మలోపదోషం అంటదు. మూడుకోట్ల ఋషులు, యజుర్వేదమును సాంగంగా ఎరిగి, చేసేకర్మలన్నీ నా సేవయే. నా మంత్ర కల్ప సముదాయములు, క్రమంగా నా పురాణములు అధ్యయనం చేసి, అన్ని కర్మలు చేసేవారు నా అర్చనచేసిన వారే. వారు అధికారం కలవారు అవు తారు. వారు నా సంబంధులు, నా ప్రసాద భాక్కులు, సౌమ్యులు. నాకు అతిప్రియులు. వారు షట్కర్మనిరతులై, సాత్వికాహార తత్పరులై, వైఖానస సూత్రంప్రకారం నిషేకాదిసంస్కారవంతులై, భావితాత్ములై, మత్కర్మకరణ దక్షులవుతారు. వారు శ్రేష్ఠులైన భాగవతులు, అప్రాకృతులు. అన్నివిధాలుగా 'యేనఖాస్తే వైఖానసాః' అనివేదంలో చెప్పబడినట్లుగా వైఖానసులందరూ శుద్ధులు. సర్వకర్మలందును పూజింపదగినవారు.

ఇట్లు విష్ణువు చెప్పగా, విఖనసుడు విష్ణువుతో ఇట్లు చెప్పెను.

శ్రీ విఖనసుడు చెప్పెను-

ఓ భగవంతుడ! నీ అనుగ్రహంతో, నీవు చెప్పిన ప్రకారం సాంగమైన కర్మ నా వంశజులందరకు ఉంటుంది. ఇందులో సంశయంలేదు.

ఇట్లా, వేదోక్తప్రకారం వైఖానసుల సృష్ట్యాదికం ప్రతిపాదింపబడింది. అద్వారకభగవద్యజనముచేత వీరికి నిత్యకర్మానుష్ఠానం పూర్ణమగుటయు ప్రతిపాదింపబడినది.

# ప్రథమ హేతువు

అథ వైఖానస సూత్రశాస్త్రయోః అఖిల జగత్కారణ భూతేన విఖనసా ప్రణీతత్వ ముపపాద్యతే.

(విఖనో వైఖానసాదిశబ్దానాం–

(1) నారాయణే,
(2) తన్నాభినలిన సంభూతే చతురాననే,
(3) మహర్షి ప్రవరే,
(4) తన్నామను మంత్రద్రష్టను,
(5) భృగ్వాదిషు వైఖానస వంశకర్తృషు భగవన్మానస పుత్త్రేషు,
(6) వైఖానససూత్రేణ అష్టాదశ సంస్కారవత్సు భగవత్ప్రియతమే ష్వర్చకేషు,
(7) తత్సూత్రోక్త ధర్మానుష్ఠాతృషు కల్పసూత్రాంతర సంస్కృతేషు హారీతాదిషు,
(8) తత్సూత్రోక్త విధినా తృతీయాశ్రమధర్మానుష్ఠాతృషు సౌభర్యాదిషు,
(9) విఖనసా సృష్టే సమస్తే జగతి, చ యథాయథం ముఖ్యయా వృత్త్యా ఉపచారేణ వా ప్రవృత్తి ర్భవతీతి ఇయతా గ్రంథేన ప్రతిపాదితం గవతి.)

హారీతస్మృతౌ–

పూర్వం విఖనసే విష్ణుః ప్రోక్తవాన్ స్వయమచ్యుతః ।
భృగోః ప్రోక్తం విఖనసా భృగుణా చ సమేరితమ్ ॥

ఇతి.

# ప్రథమ హేతువు

వైఖానస సూత్రశాస్త్రములను అఖిల జగత్కారణ భూతుడైన విఖనసునిచేత ప్రణీతమన్న సత్యము ప్రతిపాదితమవుతున్నది.

(విఖన-వైఖానస మున్నగు శబ్దములకు అర్థములు–

1. నారాయణుడు,
2. నారాయణనాభి సంభూతుడైన చతురాననుడు,
3. మహర్షి ప్రవరుడు,
4. ఆ పేరుతోడి మంత్రద్రష్టలు,
5. వైఖానస వంశకర్తలు, భగవంతుని మానసపుత్రులు అయిన భృగువు మున్నగువారు,
6. వైఖానస సూత్రం ప్రకారం అష్టాదశ సంస్కారాలు పొంది, భగవంతునకు ప్రియతములైన అర్చకులు,
7. వైఖానస సూత్రోక్త ధర్మానుష్ఠానపరులై, ఇతర కల్పసూత్రాల ప్రకారం సంస్కృతులైన హారీతాదులు,
8. వైఖానస సూత్రోక్తవిధిగా తృతీయ (= వానప్రస్థ) ఆశ్రమ ధర్మ పరాయణులైన సాభర్యాదులు,
9. విఖనసుని చేత సృష్టింపబడిన సమస్త లోకములయందు కూడా యథాప్రకారం ముఖ్యమైన వృత్తి చేతకాని, ఔపచారికమైన వృత్తి చేతకాని, ఈ ప్రవృత్తి కలుగునని ఇంతగ్రంథముచేత ప్రతిపాదితమైనది).

హారీత స్మృతియందు–

పూర్వం అచ్యుతుడైన విష్ణువు స్వయంగా విఖనసునకు చెప్పినాడు. దానిని ఆయన భృగువునకు చెప్పినాడు. ఆ భృగువు నాకు చెప్పినాడు.

గారుడే-

పురా చతుర్ముఖాదేశా చ్చత్వారోమునయోఽమలాః ।
ప్రణీయ వైష్ణవం శాస్త్రం భూమావభ్యర్చయన్నృప ॥
మరీచి ర్మందరే విష్ణు మర్చయమాస కేశవమ్ ।
ఆదేశాద్బ్రహ్మణో విష్ణుం శ్రీనివాసే ఽత్రి రర్చయేత్ ॥
కశ్యపో విష్ణ్వధిష్ఠానే శుభక్షేత్రే భృగుర్మునిః ।
గంగాయా దక్షిణే తీరే సీమ్ని తస్యాంతికే ఽపి చ ॥
తత్పంధౌ శుచిషణ్ణామా భృగుణా స్థాపితో హరిః ॥
ఇతి చోక్తమ్.

పాంచరాత్రే-

ఆద్యే కలియుగే ప్రాప్తే సోమకేన హృతా త్రయీ ।
అవైదికేషు లోకేషు దేవతేషు మునిష్వపి ॥
భగవంతం సమాసాద్య నారాయణ మనామయమ్ ।
అనంతో గరుడశ్చైవ విష్వక్సేనః పితామహః ॥
శంకరశ్చైవ పంచేతే సప్రచ్ఛుః శరణం గతాః ।
క్షణమప్యచ్యుతస్యార్చాం త్యక్తుమేవ న శక్నుమః ॥
అవైదికేషు లోకేషు కిం కుర్మశ్చలమానసాః ।
తస్మాదుపాయం లక్ష్మీశ వదాస్మాకం చిరంతన ॥
ఇత్యుక్తస్సహరిస్తేభ్యః పంచరాత్రవిధిం క్రమాత్ ।
ఏకైకరాత్రమేకస్మై తంత్రం సముపదిష్టవాన్ ॥
పంచలక్ష ప్రమాణేన ప్రపంచితమ్ ॥

గారుడమందు-

పూర్వం, చతుర్ముఖుని ఆదేశానుసారం శ్రేష్ఠులైన నలుగురు మునులు వైష్ణవ శాస్త్రమును రచించినారు. విష్ణువును-మరీచి మందరంలో, అత్రి శ్రీనివాస క్షేత్రంలో, కశ్యపుడు విష్ణ్వధిష్ఠానమైన శుభక్షేత్రమందు అర్చించినారు. ఇంక భృగువు గంగయొక్క దక్షిణతీరమందును, దానికి సమీప ప్రదేశములందును, దానియొక్క సంగమములందును, 'శుచిషత్' (= శుచిత్వాన్ని పొందేవాడు) అనే పేరుగల విష్ణువును ప్రతిష్ఠించి, అర్చించినాడు- అని చెప్పబడినది.

పాంచరాత్రమందు-

మొదటి కలియుగం ప్రారంభమైనప్పుడు సోమకుడు మూడువేదాలను అపహరించినాడు. లోకములు, దేవతలు, మునులు వేదశూన్యముగా ఉండెను. కాగా, అనంతుడు, గరుడుడు, విష్వక్సేనుడు, పితామహుడు, శంకరుడు-అనే ఈ అయిదుగురు-అనామయుడు, భగవంతుడు అయిన నారాయణుని శరణుజొచ్చి, ఇట్లా ప్రశ్నించినారు: "ఒక్కక్షణం కూడా అచ్యుతార్చన వదలి మేము ఉండజాలము. లోకములు వేదవిహీనములు కాగా మా మనస్సులు చలించినవి. చిరంతనుడవైన ఓ లక్ష్మీశ! మాకేదో ఒక ఉపాయమును చెప్పుము." అప్పుడు హరి, ఒక్కొక్కరికి ఒక్కొక్కరాత్రి చొప్పున పాంచరాత్ర విధి తంత్రమును ఉపదేశించినాడు. అది అయిదు లక్షల గ్రంథములుగా విస్తరిల్లినది.

ఇత్యుపక్రమస్య.

'ప్రథమం బ్రహ్మరాత్రం తు ద్వితీయం రుద్రరాత్రకమ్ ।
తృతీయ మింద్రరాత్రం యచ్చతుర్థం గ్రహరాత్రకమ్ ॥
పంచమం మునిరాత్రం తు పంచరాత్రం విధీయతే ।
రాత్రిభిః పంచభిః ప్రోక్తం శ్రుతం శిష్యైశ్చ పంచభిః ॥
తస్మాత్తత్పంచరాత్రాఖ్యాం లబ్ధ్వా తిష్ఠతి భూతలే' ॥

ఇత్యంతేన పాంచరాత్రస్యోత్పత్త్యాదికం నిరూప్య పరమవైదికస్య శ్రీవైఖానసస్యోత్పత్త్యాదికం ప్రతిపాద్యతే.

అథ మత్స్యాకృతిః శ్రీశః ప్రవిశ్యాంబుధిమధ్యమమ్ ।
నిర్మథ్య సోమకం వేదానదాత్పంకజయోనయే ॥
తాదృశం పుండరీకాక్షం స్తోత్రైస్సంతోష్య పద్మభూః ।
ఉవాచ వచనం ప్రేమ్ణా దండవత్ప్రణిపత్య చ ॥
తాంత్రికేణ త్వయా ప్రోక్తం మార్గేణ భవదర్చనమ్ ।
న ప్రసీదతి తేనాస్మన్మనః కమలలోచన ॥
వైదికేన త్వదర్చాం మే యథాపూర్వం వదాచ్యుత ॥
ఇత్యుక్తో భగవాన్ దేవః శాస్త్రం శ్రుతిపథా ఽగతమ్ ॥
సహస్రకోటిభిః శ్లోకైస్సంఖ్యాతం బహు విస్తరమ్ ।
సూత్రమూలమనాద్యంతం కల్పే కల్పే సమాశ్రితమ్ ॥
ఉవాచ జగతాం ప్రీత్యై యజ్ఞానాం పూరణాయచ ।
మూలం సర్వాగమానాంచ పురాణానాం తథైవ చ ॥
స్మృతీనాం సర్వసూత్రాణాం ప్రత్యంగోపాంగశోభితమ్ ।

అని ఉపక్రమించి-

ప్రథమం బ్రహ్మరాత్రం, ద్వితీయం రుద్రరాత్రం, తృతీయం ఇంద్ర రాత్రం, చతుర్థం గ్రహరాత్రం, పంచమం మునిరాత్రం-ఇట్లా పంచరాత్రం అయిదు రాత్రులలో బోధింపబడగా అయిదుగురు శిష్యులు విన్నారు. అప్పటి నుంచి భూతలమున ఈ తంత్రమునకు 'పంచరాత్రం' అనే పేరు వచ్చినది.

ఈవిధంగా పాంచరాత్రం యొక్క ఉత్పత్త్యాదికం నిరూపింపబడిన తరువాత పరమవైదికుడైన శ్రీ వైఖానసుని ఉత్పత్త్యాదికం ప్రతిపాదింప బడుతున్నది.

తరువాత, శ్రీశుడు మత్స్యాకృతితో, సముద్రమధ్యమును ప్రవేశించి, సోమకుని చంపి, పంకజయోనికి వేదముల నొసంగెను. అప్పుడు బ్రహ్మ పుండరీకాక్షునకు స్తోత్రములతో సంతోషం కలిగించి, ప్రేమతో సాష్టాంగ నమస్కారం చేసి, ఇట్లు చెప్పినాడు.

"నీవు నీ అర్చనమును ఇంతకుముందు తాంత్రికమార్గములో చెప్పినావు. దానివలన నా మనస్సు ప్రసన్నముగా లేదు. మరల పూర్వంప్రకారం వైదికమార్గమునే ఉపదేశింపుము" అని అడుగగా భగవంతుడైన దేవుడు వేదమార్గమును అనుసరించిన వేయికోట్ల సంఖ్య కలిగిన, బహువిస్తృతమైన, అద్యంతములు లేనట్టి, ప్రతికల్పమున లభించునట్టి సూత్రమూలమును ప్రవచించెను. దానివలన జగత్తునకు ప్రీతి కలుగుతున్నది. యజ్ఞములకు పూర్ణత్వం సిద్ధిస్తున్నది. అది సర్వాగమములకు, పురాణములకు, స్మృతులకు, సర్వసూత్రములకు మూలము. ఉపాంగప్రత్యంగ శోభితము.

వేదాశ్చ విఖనశ్శాస్త్రం ప్రమాణమితి చేరయన్ ॥
యథా 'వైఖానసం పూర్వేఽహన్ సామభవతీ' తి చ ।
'యేఽనఖా' భువి సంజాతాస్తే వై వైఖానసా ఇతి ॥
శ్రుత్యుక్తం తదిదం శాస్త్రం వైఖానసమహార్ణవమ్ ।
ఇత్యుక్త్వా భగవానాద్యస్తత్రైవాంతరధీయత ॥
తతః పరం చతుర్వక్త్రో జటాకాషాయదండభృత్ ।
నైమిశారణ్యమాసాద్య ద్విజసంఘ నిషేవితమ్ ॥
తపస్తప్త్వా చిరంకాలం ధ్యాయంస్తేజస్తు వైష్ణవమ్ ।
పశ్చాదపశ్యద్విష్ణూక్తమాగమం విస్తరాత్తదా ॥
సశ్రౌతంచ సగృహ్యంచ వేదమంత్రైరభిష్టుతమ్ ।
సంక్షిప్య సారమాదాయ శాణోల్లిఖితరత్నవత్ ॥
ధాతా విఖనసోనామ మరీచ్యాది సుతాన్మునీన్ ।
అబోధయదిదం శాస్త్రం సార్ధకోటిప్రమాణతః ॥
కల్పే కల్పే పురా విష్ణురుద్భూతః పూర్వవత్తదా ।
తస్మాద్వైదికమాచారం యః కర్తుం భువి వాంఛతి ॥
తస్యేదం శాస్త్రమిత్యుక్తం నేతరేషామితీరితమ్ ॥ ఇతి.

విఖనసశాస్త్రము ప్రమాణమని వేదములుకూడా ఘోషించినవి; ఎట్లనగా 'వైఖానసంపూర్వేఽహన్ సామభవతి', 'యేఽనఖాః' అని చెప్పబడినది. అందుచేత మహాసముద్రమువంటి ఈవైఖానసశాస్త్రం వేదోక్తమే! అనిచెప్పి, ఆద్యుడైన భగవంతుడు అక్కడనే అంతర్ధానమందెను.

తరువాత, చతుర్ముఖుడు జటలు, కాషాయవస్త్రం, దండం ధరించి, ద్విజసంఘ నిషేవితమైన నైమిశారణ్యమును ప్రవేశించి, వైష్ణవతేజస్సును ధ్యానించుచు చిరకాలము తపస్సుచేసెను. అప్పుడు, ఆయనకు విష్ణువుచెప్పిన ఆగమము విస్తృతముగా సాక్షాత్కారమైనది. అందులో శ్రౌత సూత్రములు, గృహ్యసూత్రములు- అన్నీ ఉన్నవి. సానబట్టిన వజ్రమునువలె దానిని సంక్షేపించి, దాని సారమును విఖనసుడనే పేరుగల ధాత తనపుత్రులైన మరీచ్యాది మునులకు బోధించెను. అప్పుడు దాని ప్రమాణం ఒకటిన్నరకోటి. ప్రతికల్పమునందును విష్ణువు ఉద్భవించి పూర్వప్రకారం చెప్పుచుండును. అందువల్ల భూలోకంలో వైదికాచారం వాంఛించేవారలకే ఈశాస్త్రము; ఇతరులకుకాదు.

## ఆలయంలో అర్చన:

గృహార్చనా వ్యతిరేకేణాలయార్చనా భారతాదిషు ప్రతిపాదితా దృశ్యతే. యథా-

మహాభారతే అశ్వమేధికే కథం త్వామర్చనీయోఽసీ త్యాది.

విష్ణుధర్మోత్తరే షష్ఠేఽధ్యాయే-

యస్తు దేవగృహస్యార్థం ప్రాకారం పరికల్పయేత్ ।
స తు స్వర్గం సమాసాద్య విమానాధిపతిర్భవేత్ ॥
యస్తు దేవాలయస్యాగ్రే శిలాదారుభిరేవ వా ।
కరోతి తోరణం రమ్యం స తు స్వర్గాధిపో భవేత్ ॥
యస్తు దేవాలయం విష్ణోర్దారుశైలమృదా తథా ।
ఇష్టకాకల్పితం వాపి కుర్యాత్తస్య ఫలం బహు ॥
అహన్యహన్యశ్వమేధసహస్రాణి కరోతి యః ।
ప్రాప్నోతి మండపం విష్ణోః యః కారయతి మానవః ॥
కేశవస్య స తల్లోకమక్షయ్యం ప్రతిపద్యతే ।
ప్రతిమార్థం మహావిష్ణోస్సాధయేదుత్తమాం శిలామ్ ॥
షష్టివర్షసహస్రాణి స్వర్గలోకే మహీయతే ॥ ఇతి.
ఏతేషాం చ ప్రాకారతోరణమండప విగ్రహశిలాదీనాం ।
గృహదేవతాస్వసంభవః శ్రీవైఖానససంహితాసు ప్రతిపాదితః ॥

# ఆలయంలో అర్చన:

గృహార్చనకు భిన్నంగా ఆలయార్చన భారతాదులందు ప్రతిపాదింపబడినది.

మహాభారతంలో, అశ్వమేధ పర్వంలో "నీవు ఎట్లు అర్చింపదగినవాడవు?" ఇత్యాదిగా;

విష్ణుధర్మోత్తర పురాణంలో, ఆరవఅధ్యాయంలో-

ఎవడు దేవాలయానికి ప్రాకారం కట్టిస్తాడో అతడు స్వర్గంపొంది, అక్కడ విమానాధిపతి అవుతాడు. దేవాలయాగ్రమందు శిలలతోకాని, దారువులతో కాని రమ్యతోరణం నిర్మించినవాడు స్వర్గాధిపుడవుతాడు. దారువులతో లేదా శిలలతో లేదా మృత్తికతో లేదా ఇటుకలతో విష్ణువునకు ఆలయం కల్పించిన వానికి బహుఫలములు లభిస్తాయి. విష్ణువునకు మండపం నిర్మించిన మానవుడు ప్రతిరోజు అశ్వమేధసహస్రములు చేసిన వానితో సమానుడై అక్షయ్యమైన కేశవలోకమును పొందగలడు. మహావిష్ణు ప్రతిమకొరకు ఉత్తమశిలను ప్రసాదించినవాడు అరవై వేల సంవత్సరాలు స్వర్గలోకంలో నివసింపగలడు - అని ఉన్నది.

ఈ ప్రాకార-తోరణ-మండప-విగ్రహాదులు గృహదేవతలకు పొసగవు అని వైఖానస సంహితలందు ప్రతిపాదింపబడినది.

కించ యథా వైఖానసానాముత్పత్త్యాదికం శ్రుతిస్మృతి పురాణాదిషు విశేషేణ ప్రతిపాదితం తథా ఇతరేషాం విశేషేణ తదా వైఖానస సామ్య మితరేషాం స్యాత్. తథా న దృశ్యతే హి.

## దేవలకులు ఎవరు?

అథ వస్తుతో దేవలకా నిరూప్యంతే.

వైఖానసే-

అవైఖానసవిప్రో యః పూజయే దాలయే హరిమ్ ।
స వై దేవలకోనామ హవ్యకవ్యబహిష్కృతః ॥
వైఖానసకులే జాతః పాంచరాత్రేణ దీక్షితః ।
స దీక్షితో న సంజాతో(?) లోభాన్మోహాన్మదర్చనమ్ ॥
కుర్యాచ్చేత్తు విశేషేణ భవేద్దేవలకస్తు సః ॥

పాంచరాత్రే సంకర్షణ సంహితాయామ్-

కర్మదేవలకాః కేచిత్ కల్పదేవలకాః పరే ।
శుద్ధదేవలకాశ్చాన్యే త్రిధా దేవలకాః స్మృతాః ॥
అర్థార్థీ కాలనిర్దేశీ యో దేవం పూజయేత్స హి ।
కర్మదేవలకోనామ సర్వకర్మబహిష్కృతః ॥
పాంచరాత్రవిధానజ్ఞో దీక్షావిరహితోఽర్చకః ।
చతుర్వేదాధికారోఽపి కల్పదేవలకః స్మృతః ॥
ఆగమోక్తవిధానజ్ఞో భద్రకాల్యుపజీవకః ।
శుద్ధదేవలకః ప్రోక్తః సర్వకర్మ బహిష్కృతః ॥
అర్థోక్తేన విధానేన దేవలత్వం న విద్యతే ।
తస్మాత్ సర్వప్రయత్నేన వైదికేనైవ పూజయేత్ ॥ ఇతి.

వైఖానసుల ఉత్పత్త్యాదికం శ్రుతిస్మృతి పురాణాదులందు విశేషంగా ప్రతిపాదింపబడిన విధంగా ఇతరుల విషయంలోకూడా అట్లా విశేష ప్రతిపాదనలు ఉంటే, అట్టివారికి వైఖానసులతో సమానత్వం లభ్యిఉండేది; కాని అట్లా కనబడటంలేదు.

ఇంక దేవలక స్వరూపం నిరూపింపబడుతున్నది.

వైఖానసమందు-

అవైఖానస విప్రుడు ఆలయంలో హరిని పూజించితే, అతడు 'దేవలకుడు' అనేపేరు కలవాడై, హవ్యకవ్య బహిష్కృతుడు అవుతాడు. వైఖానసకులంలో పుట్టినప్పటికీ పాంచరాత్రం ప్రకారంగా దీక్షితుడై లేదా సంజాతుడు కాక, లోభం వల్ల లేదా మోహంవల్ల అర్చనచేస్తే అతడుకూడా దేవలకుడే అవుతాడు.

పాంచరాత్రంలో సంకర్షణసంహితయందు-

కొందరు కర్మదేవలకులు, మరికొందరు కల్పదేవలకులు, ఇంకా కొందరు శుద్ధదేవలకులు-ఇట్లా దేవలకులు మూడువిధాలు. ధనంకోరి, కాలవశుడై దేవుని పూజించేవాడు కర్మదేవలకుడు; ఇతడు సర్వకర్మ బహిష్కృతుడు. చతుర్వేదాధికారి అయినా, పాంచరాత్రవిధానజ్ఞుడై దీక్షా విరహితుడైన అర్చకుడు కల్పదేవలకుడు. ఆగమో విధానజ్ఞుడై భద్రకాళిని ఆశ్రయించి జీవించెవాడు శుద్ధదేవలకుడు; ఇతడుకూడా సర్వకర్మ బహిష్కృతుడు.

ఆర్షోక్తమైన విధానంలో దేవలకత్వంరాదు. అందుచేత సర్వప్రయత్నములతో వైదికమార్గముననే పూజించవలెను-అని.

శివశేఖరతంత్రే రుద్రః-
అథ దేవలకాన్ వక్ష్యే శృణు దేవి సమాహితా ।
కర్మదేవలకాః కేచిత్ కల్పదేవలకాః పరే ॥
శుద్ధదేవలకా స్త్వన్యే త్రిధా దేవలకాః స్మృతాః ।
అన్యమాత్రోక్తమార్గేణ యస్సంవత్సరపూజకః ॥
అదీక్షితః స్వయం తంత్రే కర్మదేవలకస్తు సః ।
అనేనైవప్రకారేణ వత్సరత్రయపూజకః ।
కల్పదేవలకః ప్రోక్తః స వై శైలమతే ధ్రువమ్ ॥
అనమజ్ఞాత మాచార్యాత్ ఆగమం శుశ్రువే చ యః ।
శీలతః తస్య శిష్యశ్చ శుద్ధదేవలకావుభౌ ॥
త్రిధాదేవలకత్వం తు న విష్ణువిషయే క్వచిత్ ।
రుద్రకాల్యాది విషయు మే తదాగమ సంమతమ్ ॥ ఇతి.

స్మృత్యంతరే-
శర్వం సూర్యం తథా చంద్రం దుర్గాది రుద్రదేవతాః ।
యోఽర్చయేత్ పణపూర్వం సః సద్యః పతతి మానవః ॥
దుర్గా చ భద్రకాలీ చ బుద్ధశ్చ క్షేత్రపాలకః ।
పంచపూజా చ ఇత్యేతే పంచదేవలకాః స్మృతాః ॥
ఆదిత్యమంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరమ్ ।
గృహే పూజా చ ఇత్యేతే పంచదేవలకాః స్మృతాః ॥ ఇతి.

శ్రీ భాగవతంలో-

'నేను, భవుడు, దక్షుడు, భృగుప్రముఖులు, ప్రజేశుడు (= బ్రహ్మ), భూతేశుడు, సురేశ ప్రముఖులు ఎవరి నియమమునకు కట్టుబడి, శిరస్సు నందుంచబడిన లోక భారమును మోయుచున్నామో' అని. కావున భవాదులకు కూడా నారాయణాంగత్వము వలననే పూజార్హత అవగత మవుతున్నది.

'అంగభావంతో ఇతర దేవతార్చన నిషేధింపబడటం లేదు. స్వతంత్ర బుద్ధితో బ్రహ్మను ఇంద్రుని అగ్నిని విష్ణువు యొక్క అవరణ లేకుండా అర్చించిన బ్రాహ్మణుడు నరకమును పొందును. అతడు పాషండుడగును' ఇత్యాదిగా అంగభావంతో ఇతర దేవతలకు అర్చన దోషకారకంకాదని స్మృతు లయందు ఉండటంవల్ల వైఖానసూత్రమున పై విధంగా చెప్పబడినది.

అట్లే-

"ఇతర దేవతలయందు నిన్ను ఆరోపణచేసి ఉపాసన చేసినచో, అట్టి ఉపాసనకు 'ప్రచ్యుత' అనిపేరు. నీ తత్త్వం అట్లే ఉండును. నీయందు అన్నింటిని ఆరోపించి ఉపాసన చేస్తే, దానికి 'సకల' అనిపేరు. అప్పుడు నీ తత్త్వము నీదే" అని జ్ఞానకాండమున కశ్యపుడు ఉపాసనా స్వరూపభేదమును ప్రదర్శించటంచేత 'సర్వ దేవతల అర్చన జరుగును' అనే సూత్రం ద్వారా నారాయణ ముఖ్యత్వం ప్రతిపాదింపబడినది. 'ప్రచ్యుతి' ఫలమును కూడా వారు ఇవ్వలేరు కావున వారిని అంగభావంతోనే పూజించటం యుక్తం. ఆపస్తంబాది సూత్రములందు సర్వసంస్కారములు సద్వారకంగా ప్రతిపాదింప బడటం వల్ల నారాయణైకపరములని ఒక్కచోట కూడా స్మరణలేకపోవటం వల్ల, అవి నారాయణైకపరములు కావు.

నను- కి మర్థం నారాయణైకపరత్వేన సూత్రం ప్రణీతమితి చేత్ - ఉచ్యతే.

నారాయణస్య అఖిలజగదేకకారణత్వాత్ పరంబ్రహ్మ పరమాత్మాది శబ్దవాచ్యత్వాత్ అపవర్గాది ఫలప్రదత్వాత్ సమాధ్యధిక రహితత్వాచ్చ నారాయణైక పరత్వేన ప్రణీతమ్.

అత్ర--

'నారాయణాద్ రుద్రో జాయతే నారాయణాదింద్రో జాయతే నారాయణా ద్ద్వాదశాదిత్యాః రుద్రావసవ స్సర్వాణి చ భూతాని నారాయణా దేవ సముత్పద్యంతే. నారాయణా త్ప్రలీయంతే' ఇత్యాద్యాః 'నారాయణ పరం బ్రహ్మే'త్యారభ్య 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' ఇత్యాద్యాః, 'తమేవం విద్వానమృత ఇహ భవతి. నాన్యః పంథా అయనాయ విద్యతే', 'న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే', 'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికే జ్ఞాన బల క్రియా చ' ఇత్యాద్యాః, 'ఏష సర్వభూతాంతరాత్మా దివ్యో దేవ ఏకో నారాయణః' ఇత్యాద్యాః, 'ఏకో హ వై నారాయణ ఆసీత్' ఇత్యాద్యాః, 'యతో వా ఇమాని భూతాని జాయంతే. యేన జాతాని జీవంతి. యత్ప్రయంత్యభిసంవిశంతి. తద్విజిజ్ఞాసస్వ. తద్ బ్రహ్మేతి' 'పతిం విశ్వస్యాత్మేశ్వర' మిత్యాద్యాశ్చ శ్రుతయః ప్రమాణమ్.

సాంబపురాణే-

'శ్రుతిభ్రష్టః స్మృతిప్రోక్తప్రాయశ్చిత్తే భయం గతః ।
క్రమేణ శ్రుతిసిద్ధ్యర్థం మనుష్యస్తంత్రమాశ్రయేత్ ॥
ధర్మశాస్త్రే పురాణం చ ప్రోక్తం హి మరణాంతికమ్ ।
ప్రాయశ్చిత్తం మనుష్యాణాం పాపిష్ఠానాం సుదారుణమ్ ॥

ఓయి! ఎందుచేత సూత్రము నారాయణైక పరముగా నిర్మింపబడిన దంటే చెబుతాను విను--

నారాయణుడు అఖిల జగదేకకారణం కావటంవల్ల, పరబ్రహ్మ పరమాత్మ ఇత్యాదిశబ్దములకు వాచ్యుడు కావటంవల్ల, అపవర్గాది ఫలమునొసంగేవాడు కావటంవల్ల, సమాధ్యధికరహితుడు కావటంవల్ల నారాయణైకపరముగా ప్రణీతమైనది.

ఇక్కడ--

'నారాయణుని వలన రుద్రుడు ఇంద్రుడు ద్వాదశాదిత్యులు రుద్రులు వసువులు అన్నిప్రాణులు కూడా ఉత్పన్నములవుతున్నవి. విలీనములవుతున్నవి' ఇత్యాదులు,

'నారాయణుడు పరంబ్రహ్మ' అని ప్రారంభించి, 'లోపల బయట అంతటా నారయణుడున్నాడు' ఇత్యాదులు,

'ఇట్లా ఆయనను తెలిసికొన్నవాడు నారాయణుడగును' 'మరొకమార్గం సద్గతులకు లేదు' 'ఈయన శక్తి ఉత్కృష్టము వివిధము, జ్ఞాన బలక్రియ కూడా స్వాభావికం' ఇత్యాదులు,

'ఈయన సర్వభూతాంతరాత్ముడు, దివ్యుడు, దేవుడు ఏకనారాయణుడు' ఇత్యాదులు,

'ప్రాణులు దేనినుండి పుట్టునో, పుట్టినవి బ్రతుకునో, సంలీనమగునో, ఆ తత్వమును తెలిసికొగోరుము. అదియేబ్రహ్మము' అనియు,

'విశ్వమునకు పతి ఆత్మేశ్వరుడు' ఇత్యాది వేదవాక్యములు - ప్రమాణములు.

సాంబపురాణమందు--

వేదభ్రష్టుడై, స్మృతులలో చెప్పబడిన ప్రాయశ్చిత్తములకు భయపడి, ఆ వేదోక్త ధర్మసిద్ధి కొరకు మనుష్యుడు క్రమంగా తంత్రమును ఆశ్రయించవలెను. ధర్మశాస్త్రమందు పూర్వం పాపిష్ఠులైన మనుష్యులకు భయంకరమైన మరణాంతిక ప్రాయశ్చిత్తము చెప్పబడినది.

'భయం దుర్బల చిత్తానాం మరణే జాయతే భృశమ్ ।
తేషామేవాభిరక్షార్థం తదహం తంత్రముక్తవాన్ ॥
పాంచరాత్రం భాగవతం తంత్రం సాత్త్వతనామకమ్ ।
వేదభ్రష్టాన్ సముద్దిశ్య కమలాపతి రబ్రవీత్' ॥ ఇతి.

అతః శ్రీమన్నారాయణైక పరత్వాత్ పరమైకాంతిత్వం శ్రీమద్వైఖానసానామేవేతి ప్రతిజ్ఞాకర్తుముచితా. ఏవం 'అఖిల జగదేకకారణ శ్రీమన్నారాయణైక పరత్వాత్' ఇతి నవమ హేతుః నిరూపితః.

# దశమో హేతుః

అథాస్య శ్రీవైఖానససూత్రస్య శ్రీమన్నారాయణైకపరత్వాద్ తత్సూత్రానుష్ఠానవతామేవ భగవత్ప్రియతమత్వముపపద్యత ఇతి ప్రతిపాదనాయ 'భగవత్ప్రియతమత్వోపపత్తే' రితి దశమహేతు ర్నిరూప్యతే-

ఛందోగబ్రాహ్మణే-

'వైఖానసా వా ఋషయ ఇంద్రస్య ప్రియా ఆసన్' ఇతి. అత్ర ఇంద్రశబ్దః పరమాత్మపరః ఇతి పూర్వమేవోక్తమ్.

వారాహే--

'అశ్వత్థ కపిలాగావః తులసీ విఖనాస్తథా ।
చత్వారో మత్ప్రియా రాజన్ తేషాం వైఖానసో వరః' ॥ ఇతి.

'యత్ర వైఖానసా విప్రా యత్ర సంతి గవాంగణాః ।
యత్ర బిల్వాః పలాశాశ్చ తత్ర సన్నిహితో హరిః' ॥ ఇతి.

దుర్బల చిత్తులకు మరణ విషయమున మిక్కిలి భయంకలుగుతుంది. వీరి రక్షణ కొరకు నేను పాంచరాత్రమనే భాగవతతంత్రమును, సాత్వక నామ తంత్రమును ఉపదేశించితిని అని కమలాపతి వేద భ్రష్టులను ఉద్దేశించి చెప్పెను. అందువల్ల శ్రీమన్నారాయణైకపరం కావటంవల్ల, పరమైకాంతికత్వం శ్రీమద్వైఖానసులకే అని ప్రతిజ్ఞ చేయుటం సముచితం. ఇట్లా, 'అఖిలజగదేక కారణ శ్రీమన్నారాయణైక పరం కావటంవల్ల' అనే నవమ హేతువు నిరూపితమైనది.

# దశమ హేతువు

తరువాత, ఈ వైఖానసూత్రము నారాయణైకపరము కావటంవల్ల ఆ సూత్రమును అనుసరించేవారే భగవంతునకు ప్రియతములుకావటం ఉపపన్నమవుతున్నదని ప్రతిపాదించుటకై, భగవంతునకు ప్రియతములు కావటం ఉపపన్నమవుతున్నది అనే దశమ హేతువు నిరూపింపబడుతున్నది.

ఛాందోగ్యబ్రాహ్మణమునందు--

'వైఖానసులనే ఋషులు ఇంద్రునకు ప్రియులు అయినారు'. ఇచ్చట ఇంద్రశబ్దం పరమాత్మవాచకమని పూర్వమే చెప్పబడినది.

వారాహమునందు--

'అశ్వత్థవృక్షం, కపిలగోవులు, తులసి, విఖనసుడు- ఈ నలుగురు, ఓ రాజా! నాకు ప్రియులు. వీరిలో వైఖానసుడు అధికుడు' అని.

'వైఖానసవిప్రులు, గోగణము, బిల్వవృక్షములు, మోదుగ చెట్లు ఉన్న చోట హరిసన్నిహితుడుగా ఉండును' అని.

యేఽర్చయంతి నరా భక్త్యా నారాయణమనామయమ్ ।
తానర్చయంతి విబుధా బ్రహ్మాద్యా దేవతా గణాః ॥
మయి భక్తిపరో యస్తు మద్యాజీ మత్పరాయణః ।
మద్ధ్యానీ స్వకులం సర్వం నయత్యచ్యుతరూపతామ్ ॥
యేఽర్చయంతి సదా విష్ణుం న తే ప్రాకృతమానుషాః ।
నా విష్ణుర్ధ్యాయతే విష్ణుర్నా విష్ణుర్విష్ణుమర్చయేత్ ।
రూపద్వయం హరేః ప్రోక్తం బింబమర్చక ఏవ చ ॥
బింబేత్వావాహనాదూర్ధ్వం సదా సన్నిహితోఽర్చకే ।
అర్చకస్తు ప్రసన్నాత్మా హరిరేవ న సంశయః ॥
కలిః కృతయుగస్తేషాం క్లేశాశ్చైవ సుఖావహాః ।
యేషాం శరీరమనిశం హరిశుశ్రూషణే రతమ్' ॥ ఇతి.

తత్రైవ-

దేవతార్చనే-

'కష్టం నయతి పాపాని పుణ్యవృద్ధిం కరోతి చ ।
దానైర్ధర్మైః తథా పుణ్యైస్తపోభిశ్చ న తత్ఫలమ్ ।
భగవద్భక్తిపూతానాం యత్ఫలం ప్రాణదానాత్ ॥ ఇతి.

అన్యత్ర-

సత్సంగదేవార్చన సత్కథాసు పరోపదేశే చ రతో మనుష్యః ।
స యాతి విష్ణోఃపరమంపదం యద్దేహావసానేఽచ్యుతతుల్యతేజాః ॥
ఇతి.

అన్యత్ర-

'నారాయణైకనిష్ఠా యే సాత్త్వికాస్తాన్ నిబోధత ।

అనామయుడైన నారాయణుని భక్తితో అర్చించిన నరులను బ్రహ్మాది దేవతా గణములు అర్చింతురు. 'నాయందు భక్తిపరుడై, నన్నుయజించి, మత్పరాయణుడై, నన్ను ధ్యానించే మానవుడు తనకులమును సర్వమును అచ్యుత రూపముగా చేయుచున్నాడు'. విష్ణువును నిత్యం అర్చించే వారు ప్రాకృతమనుష్యులు కారు. విష్ణువుకానివాడు విష్ణువును అర్చింపలేడు. అట్టివాడు మనుష్యరూపంలో ఉన్నవిష్ణువే. విష్ణువునకు రెండు రూపాలు ఉన్నవి- ఒకటి బింబం, రెండవది అర్చకుడు. బింబమునందు ఆవాహనం తరువాతనే విష్ణువు సన్నిహితుడు; కాని అర్చకునియందు ఎల్లవేళల విష్ణువు సన్నిహితుడై ఉంటాడు. ప్రసన్నాత్మకుడైన అర్చకుడు సాక్షాత్తుగా హరియే. సంశయంలేదు. అర్చకుల శరీరం నిరంతరం హరిసేవలో సంలగ్నమై ఉంటుంది. కావున అట్టి వారికి కలియుగం కృతయుగమే. అన్నిక్లేశములు సుఖములే. అని

అక్కడనే-

దేవతార్చనమందు-

పాపములను తగ్గించును, పుణ్యవృద్ధినిచేయును. భగవద్భక్తిచేత పవిత్రులైనవారికి ఏఫలం లభిస్తుందో, ప్రాణదానంవల్ల ఏఫలం లభిస్తుందో అట్టిఫలం దానములవల్ల, ధర్మములవల్ల పుణ్యములవల్ల తపస్సులవల్ల లభించదు.

మరొకచోట-

సత్సంగం, దేవార్చన, సత్కథలు, పరోపదేశం-వీటియందు ఆసక్తుడైన మానవుడు దేహావసానమున అచ్యుతునితో సమానమైన తేజస్సుకలవాడై విష్ణువు యొక్క పరమపదమును పొందును.

ఇంకొకచోట-

నారాయణైకనిష్ఠులు సాత్వికులు.

పురుషా రాజసాశ్చైవ నానాదైవత యాజినః ॥
బ్రహ్మ నిర్దేవతాశ్చైవ తామసాః పరికీర్తితాః ।
రజస్తమో ఽభి భూతానాం న తు మోక్షః కథంచన ॥ ఇతి.

పురాణాంతరే-

'యత్రైవ పూజ్యతే విష్ణు ర్విధినా ప్రయతైర్నరైః ।
న తత్ర హ్యాధి దౌర్గత్యవ్యాధి చౌరాదికం భయమ్' ॥ ఇతి.

కించ-

నిత్యముక్తోపభోగ్యత్వా త్పరవ్యూహాత్మనో హరేః ।
తత్కాల సన్నికృష్టైకలక్ష్యత్వా ద్విభవాత్మనః ॥
విశుద్ధై ర్యోగసంసిద్ధై శ్చింత్యత్వా దంతరాత్మనః ।
అర్చ్యాత్మన్యేవ సర్వేషా మధికారో నిరంకుశః ॥
అర్చ్యావతార విషయే మయాప్యుద్దేశత స్తథా ।
ఉక్తా గుణా న శక్యం తే వక్తుం వర్ష శతైరపి ॥
ఏవం పంచప్రకారోఽహమాత్మనాం పతతామధః ।
పూర్వస్మాదపి పూర్వస్మాత్ జ్యాయాం శ్చైవోత్తరోత్తరః ।
సౌలభ్యతో జగత్స్వామీ సులభో హ్యుత్తరోత్తరః ॥

ఇతి ప్రతిపాదితరీత్యా భగవతః పరత్వాదిషు సౌలభ్యాభావాత్ అఖిలలోక సముజ్జీవనార్థ మర్చ్యావతారః.

తదేక పరత్వా ద్వైఖానసాః తత్ప్రియతమాః. ఏతాదృశనారాయణైక పరత్వాభావాద్ బోధాయనస్య ఆపస్తంబాదీనాంచ న కథంచిదపి పరమైకాంతిత్వం భగవత్ప్రియతమత్వం చ సంభవతి.

ఏవం చ వైఖనసా నా మేవ పరమైకాంతిత్వం భగవత్ప్రియతమత్వం చోపపద్యతే ఇతి సర్వం సమంజస మితి దశమో హేతుర్నిరూపితః.

[మూలగ్రంథం నుంచి, క్రమవివరణార్థం, ఆయాభాగాలను ఉద్ధరించడ మైనది]

నానాదేవతాయాజులగు పురుషులు రాజసులు; ఈస్థితికి వెలుపలివారు, దేవతలు లేనివారు తామసులు. రజోగుణ తమోగుణ యుక్తులకు మోక్షం ఎట్లయినా రాదు.

పురాణాంతరమందు-

శుచులైన నరులు, విధిప్రకారం విష్ణువును అర్చించిన చోట మనోరోగములు, దుర్గతులు, వ్యాధులు, చోరులు మున్నగువారిభయం ఉండవు, అని. మరియును-

పరాత్మ, వ్యూహాత్మ అయిన హరి నిత్యముక్తులకే ఉపభోగ్యుడుకావటం వల్ల, విభవాత్మ తనకాలంలో సమీపంలో ఉన్నవారికి మాత్రమే కనబడేవాడు కావటంవల్ల, అంతరాత్మ విశుద్ధయోగ సిద్ధులకే చింతనసాధ్యుడు కావటంవల్ల, అర్చాత్మయందే అందరికీ నిరంకుశాధికారం ఉంది.

అర్చావతారవిషయంలో, నాఉద్దేశం ప్రకారంకూడా గుణములు వర్ణించుటకు నూర్లకొలది సంవత్సరములైనచాలవు. ఇట్లా క్రింది క్రిందికి దిగజారిపోయే ఆత్మలతో నేను పంచప్రకారుడను; వీనిలో పూర్వపూర్వము కంటె ఉత్తరోత్తరము శ్రేష్ఠం.

ఆ జగత్స్వామి, సౌలభ్యకారణంచేత ఉత్తరోత్తరాత్మ సులభుడు అని ప్రతిపాదించిన రీతిలో భగవంతుని యొక్క పరత్వాది ఆత్మలయందు సౌలభ్యం లేదు కావున అఖిలలోక సముజ్జీవనార్థమైనది అర్చావతారం. దానియందు మాత్రమే పరములు కావటంవల్ల వైఖానసులు ఆయనకు ప్రియతములు.

ఈప్రకారంగా నారాయణైకపరత్వం లేదు కావున బోధాయనునకు ఆపస్తంబాదులకు ఎట్టి పరిస్థితులలోనూ పరమైకాంతికత్వం, భగవత్ప్రియతమత్వం సంభవించదు.

ఇట్లా వైఖానసులకే పరమైకాంతికత్వం, భగవత్ప్రియతమత్వం ఉపపన్నమవుతున్నదనీ, సర్వమూ సమంజసమనీ దశమహేతువు నిరూపితమైనది.

# అనుబంధం-9

వైఖానస తత్త్వచింతనను గూర్చిమరిచి వివరణ:
(విమానార్చనా కల్పం నుంచి కొన్ని భాగాలు - పటలములు: 85-95

తత్త్వోపదేశవిధిం వక్ష్యే-

తస్య భావస్తత్త్వమితి తస్య పరబ్రహ్మణః పరమాత్మనో నారాయణస్య భావః. 'తత్త్వం నారాయణః పర' ఇతి శ్రుతిః. తదవగమనం జ్ఞానం. తద్విదః బ్రహ్మవిదః. తస్మాత్పరమాత్మా జ్ఞేయః, జీవాత్మా జ్ఞాతా, శ్రుతయో జ్ఞానమితి బ్రహ్మవాదినో వదంతి. తద్బ్రహ్మణో నిష్కలః సకలశ్చ స్వభావః.

నిష్కలః-పరమాత్మనోఽన్యత్ న కించిదస్తీతి క్షీరే సర్పిః,
తిలే తైలం, పుష్పే గంధః, ఫలే రసః, కాష్ఠే అగ్నిరివ అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య ఽఽకాశోపమః 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థిత' ఇతి.
'ఆకాశశరీరం బ్రహ్మ' తి. 'అశరీరః శరీరే వ్యాప్య తిష్ఠతి, విశ్వవ్యాపకశీలత్వా ద్విష్ణుః'.

దృశ్యాదృశ్యః అత్యచ్ఛః అమలః నిత్యః అచింత్యోఽ ప్రమేయః
నిర్గుణో నిశ్చలో నిరవయవో నిరాద్యంతో నిర్వికల్పో
నిర్ద్వంద్వోఽనిర్వచనః అతీంద్రియః సుసూక్ష్మత్వాదనిర్దేశ్యః
సదసదితి బ్రహ్మవాదినో వదంతి.

పరంధామ పరంజ్యోతిః సర్వేశః సర్వశక్తిమయః సర్వదేశమయః
సర్వధర్మమయః సర్వాధారః సనాతనః జ్ఞాతృజ్ఞేయజ్ఞాన
హీనః జ్ఞానఘనః జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయస్థానగో
బహిః ప్రజ్ఞః ప్రజ్ఞానఘనః స్థూలసూక్ష్మవిభాగేన వైశ్వానర
తేజః స్వరూపేణ భుంజానః సర్వేషామాత్మా గుహాయాం
నిహితః అణోరణీయాన్మహతో మహీయానాత్మా గుహాయాం
నిహితోఽస్యజంతో రితి శ్రుతిః. తస్మాద్ హృదయ
కమలాంతరాకాశోపలబ్ధం వైశ్వానర శిఖాయాం

# అనుబంధం-9

తత్త్వోపదేశవిధిని గూర్చిచెబుతాను.

దానియొక్క భావం తత్త్వం అని ఆ పరంబ్రహ్మ పరమాత్మ అయిన నారాయణుని భావం. 'తత్వం, పరుడగు నారాయణుడు' అని వేదం; దానిని అవగతం చేసికొనటం జ్ఞానం; తద్విదులే బ్రహ్మవిదులు. అందువలన పరమాత్మజ్ఞేయుడు, జీవాత్మజ్ఞాత, శ్రుతులు జ్ఞానం అని బ్రహ్మవాదులు చెబుతారు. అట్టి బ్రహ్మయొక్క స్వభావం-సకలం, నిష్కలం.

నిష్కలం:

పరమాత్మకంటె ఇతరమేదీలేదు. పాలలో నెయ్యి, తిలలలో తైలం, పుష్పాలలో గంధం, ఫలాలలో రుచి, కాష్ఠంలో అగ్నివలె లోపల బయట అంతటా ఆకాశమువలె వ్యాపించి ఉన్నాడు. 'ఆకాశంవంటి శరీరం కల బ్రహ్మ' అనీ, 'అశరీరుడు శరీరమున వ్యాపించి ఉండును, విశ్వవ్యాపక శీలంచేత విష్ణువు' అనీ, దృశ్యుడు, అదృశ్యుడు, మిక్కిలి స్వచ్ఛమైనవాడు, అమలుడు, నిత్యుడు, అచింత్యుడు, అప్రమేయుడు, నిర్గుణుడు, నిశ్చలుడు, నిరవయవుడు, అద్వంతరహితుడు, నిర్వికల్పుడు, నిర్ద్వంద్వుడు, నిర్వచనుడు, అతీంద్రియుడు, మిక్కిలిసూక్ష్ముడు కావటంచేత అనిర్దేశ్యుడు, సత్తు-అసత్తు అనీ బ్రహ్మవాదులు చెబుతారు.

ఉత్కృష్ట స్థానం కలవాడు, పరంజ్యోతి, అంతటా సర్వశక్తిమయుడు, సర్వదేవమయుడు, సర్వధర్మమయుడు, సర్వాధారుడు, సనాతనుడు, జ్ఞాతృ-జ్ఞేయ-జ్ఞానరహితుడు, జ్ఞానఘనుడు, జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయ స్థానగతుడు, బహిఃప్రజ్ఞుడు, స్థూలసూక్ష్మవిభాగంతో వైశ్వానరతేజ స్వరూపంతో భుజిస్తూ సర్వులకు ఆత్మయై, గుహవంటి స్థానంలో ఉన్నవాడు. 'అణోరణీయాన్ మహతో మహీయాన్ ఆత్మగుహాయాం నిహిత· అస్యజంతో' అని వేదం. అందుచేత హృదయ కమలం యొక్క లోపలి దహరాకాశమందు ఉండువాడు.

త్రిగుణాత్మకో విష్ణుః పరమాత్మా తిష్ఠతి. 'తస్యా శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః. స బ్రహ్మా స శివ' ఇతి శ్రుతిః.

ఏవం నిష్కలమితి విజ్ఞాయతే.

అథ సకలః- కాష్ఠే అగ్నిర్మథనాత్ జ్వలన్నివ నిష్కలాత్మకో విష్ణుః ధ్యానమథనేన భక్త్యా సంకల్పనాత్ సకలో భవతి. తస్మాదగ్నే ర్విస్ఫులింగా ఇవ బ్రహ్మేశానాదిదేవతా రూపైర్భిన్నత్వాత్ కులాలచక్రస్థమృదో ఘటశరావాదిభేద ఇవ యద్రూపం మనసా భావితం తద్రూపో భూత్వా విష్ణుః ప్రకాశతే. 'విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్. సంబాహుభ్యాం ధమతి సంపత్రైర్ద్యావా భూమీ జనయన్ దేవ ఏక' ఇతి శ్రుతిః. తత్ర సర్వవ్యాప్యశరీరః పరమాత్మైవ సర్వభూతానాం ప్రభవరక్షణ సంహృతి నిమిత్తశరీరీ భవతి. 'అగ్నిర్వై దేవానామవమో విష్ణుః పరమస్తదంతరేణ సర్వా అన్యా దేవతా' ఇతి బ్రాహ్మణమ్. తస్మాత్ ప్రధానః పరమోఽవ్యయో స ఏవ పురుషః స ఏవ స్రష్టా, పాతా, హర్తా, అఖిలస్య. తద్భిన్నాః పురుషాః.

తద్విష్ణోర్విభూతిః శ్రీః. సా చ నిత్యా అద్యంతరహితా అవ్యక్తరూపిణీ ప్రమాణాఽప్రమాణసాధారణభూతా విష్ణోః సంకల్పానురూపా నిత్యానందమయీ మూలప్రకృతిరూపా శక్తిః తద్భిన్నా ప్రకృత్యంశ భూతా శేషః తద్భిన్నా స్త్రియః. తదాత్మికా మాయా ప్రకృతిః, మాయీ విష్ణుః. ప్రకృతిపురుషౌ వేతావనాదీ. తాభ్యాం లోకప్రవృత్తిః.
వికారగుణాః సర్వే ప్రకృత్యుత్పన్నాః. కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిః, పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతుః. ప్రకృతిస్థః పురుషః ప్రకృతిజాన్ గుణాన్ భుంక్తే.

సా ప్రకృతి ర్ద్విధా భవతి చేతనా చేతనేతి. అచేతనా పంచభూతైః మనోబుద్ధ్యహంకారరూపై రష్టధా భిన్నా.

వైశ్వానరశిఖయందు త్రిగుణాత్మకుడైన విష్ణువు, పరమాత్మ ఉండును. 'తస్యా శిఖాయామధ్యే----సశివ' అని వేదం. ఇట్టిది నిష్కలము అని తెలియుచున్నది.

ఇంకసకలం:

మథనంవల్ల కాష్ఠమందు అగ్నివెలుగునట్లు నిష్కలాత్మకుడైన విష్ణువు ధ్యానమథనంచేత, భక్తిచేత, సంకల్పశక్తివల్ల సకలుడు అవుతున్నాడు. అందువల్ల అగ్నినుండి విస్ఫులింగములు భిన్నములైనట్లుగా బ్రహ్మ ఈశానాది దేవతారూపములతో భిన్నత్వం కలవాడై, కుమ్మరి సారెయందలి మట్టినుండి కుండ, శరావం మున్నగు భేదములు ఉత్పన్నములగునట్లే భావించిన రూపమునకు అనుగుణమైన రూపంకలవాడై విష్ణువే ప్రకాశించుచున్నాడు. 'అంతటా కన్నులు కలవాడు, అంతటా ముఖముకలవాడు, అంతటా చేతులు కలవాడు, దగ్గరగా అవుతున్న ద్యావాపృథువులను తన బాహువులతో దూరంగా విసరివేసి, పుట్టించేవాడు దేవుడుఒక్కడే' అని వేదం. కాగా, అంతటా వ్యాపించిన శరీరంకల పరమాత్మయే అన్ని ప్రాణులకు ఉత్పత్తి - స్థితి-సంహారకారణమైన శరీరంకలవాడుగా అవుతున్నాడు. 'దేవతలలో అగ్ని కనిష్ఠుడు, విష్ణువు జ్యేష్ఠుడు. ఈ ఇరువురి మధ్యలో తక్కినదేవతలు' అని బ్రాహ్మణము. కావున ప్రధానుడు, పరముడు, అవ్యయుడు, విష్ణువు, ఆ పురుషుడే. సమస్తమునకు స్రష్ట, రక్షకుడు, సంహర్త అయనయే; తద్భిన్నులు పురుషులు (= జీవులు).

ఆ విష్ణువుయొక్క విభూతియే శ్రీదేవి. ఆమె నిత్య, ఆద్యంతరహిత, అవ్యక్తరూపిణి, ప్రమాణ అప్రమాణములందు సమానంగా ఉండేది, విష్ణు సంకల్పానురూప, నిత్యానందమయి, మూలప్రకృతి రూపశక్తి. ఆమెకంటె భిన్నురాలు ప్రకృత్యంశభూత పౌష్ణి. ఆమెకంటె భిన్నురాండ్రు స్త్రీలు. తదాత్మిక అయిన మాయ, ప్రకృతి; మాయి విష్ణువు. ప్రకృతి పురుషులు-ఈ ఇరువురుఅనాదులు; ఈ ఇరువురిచేతనే లోకప్రవృత్తి జరుగుతున్నది. అన్ని వికార గుణములు ప్రకృతి నుండియే ఉత్పన్నములు. కార్యకారణకర్తృత్వ విషయమున హేతువు ప్రకృతి. సుఖ-దుఃఖముల భోక్తృత్వ విషయమున పురుషుడు హేతువు. ప్రకృతితో ఉన్న పురుషుడే ప్రకృతిజములైన గుణములను అనుభవించును. ఆ ప్రకృతి-చేతన, అచేతన అని రెండువిధాలు. పంచభూతములు మనో-బుద్ధి-అహంకారములు అనే రూపాలతో ఎనిమిది విధములుగా ఉన్నది 'అచేతన'.

అన్యా జీవభూతా చేతనేతి, తథా ప్రకృత్యా సదా సంశ్లిష్టాః పురుషాః, ప్రకృతిస్థాః జీవాత్మనః క్షేత్రజ్ఞాః బహవః, తేఽపి నిత్యా అనాద్యవిద్యాసంచిత పుణ్యపాపఫలం భోక్తుం బహువిధం దేహం ప్రవిశ్య తత్తదాత్మాఽభిమానినః తత్ర శుభా ఽశుభకర్మాణి కృత్వా తత్తత్ఫలానురూపం దేహం పునః పునః ప్రాప్య వర్తంత ఇతి విజ్ఞాయతే.

అథాతః పరమాత్మనః సకాశాద్ధిరణ్మయ మండమభవత్, తదంతర్గ తానాం సర్వేషామండానాముపరి సనాతన మచింత్యం దేవైరప్యనభిలక్ష్యం నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావపురుషై రనుభూయమానం వైష్ణవాండమ్. తత్ర విష్ణులోకాశ్చత్వారః, ఆమోదః, సంమోదః, ప్రమోదః, వైకుంఠమితి.

ఏకైకస్యోపరి యథా క్రమేణ భవతి. తస్మిన్ హేమమయ ప్రాకార గోపురతోరణశతసహస్రైః కనకకమల కుసుమాదిభిరపి అలంకృతే, అమృత జలపూర్ణై శ్శతసహస్రైశ్చ సరితాం ప్రభాసమానే దివ్యే లోకే సహస్రా దిత్యసంకాశం హేమమయం ద్వాదశతలైర్యుతవిమానం, నిత్యజ్ఞానక్రియైశ్వర్య బ్రహ్మాది దేవఋషిభిః నిత్యపరిజనైర్యుతమ్ మందిరమ్. తస్మిన్ వ్యోమ నిలయే పరమాత్మా స్వసంకల్పేన దేవీభూషణాయుధైః సహ ఆమోదే విష్ణుః, ప్రమోదే మహావిష్ణుః, సంమోదే సదావిష్ణుః, వైకుంఠే సర్వవ్యాపీ నారాయణ ఆసీనో భవేత్.

ఇతరమైన జీవభూతమైనది 'చేతన'. అట్లా ప్రకృతిచేత ఎల్లప్పుడు సంశ్లిష్టులైన పురుషులు ప్రకృతిస్థులైన జీవాత్మలు, క్షేత్రజ్ఞులు, బహుసంఖ్యాకులు. వారు కూడా నిత్యులే. అనాది అయిన అవిద్యా సంచితములైన పుణ్యపాపముల ఫలమును అనుభవించుటకై బహువిధదేహములను ప్రవేశించి, ఆయాఆత్మలుగా తమను అభిమానించుకొనుచు, అచ్చట శుభాశుభకర్మలను చేసి, వాటివాటి ఫలములకు అనురూపమైన దేహములను మరలమరల పొందుతూ ఉంటారని తెలియుచున్నది.

తరువాత, ఆ పరమాత్మ నుండి, బంగారుమయమైన 'గ్రుడ్డు' పుట్టెను. దానిలోపలి అన్ని అండముల ఊర్ధ్వమున సనాతనము, అచింత్యము, దేవతలకు కూడా అనభిలక్ష్యము, నిత్యశుద్ధబుద్ధ ముక్త స్వభావులగు పురుషులు అనుభవించే వైష్ణవాండం ఉంటుంది.

అచ్చట విష్ణులోకాలు నాలుగు-ఆమోదం, సంమోదం, ప్రమోదం, వైకుంఠం-అని. ఇవి, క్రమంగా ఒక దానికంటె ఇంకొకటి ఉన్నత స్థానమున ఉండును. అందులో హేమమయప్రాకార-గోపురతోరణ శతసహస్రములతోను, కనకకమలకుసుమాదులతోను, అలంకరింపబడిన, నూర్ల వేలకొలది అమృత జలపూర్ణములైన నదులకాంతులతో సమానమైన దివ్యలోకమున వేలకొలది ఆదిత్యులవలె ప్రకాశించే స్వర్ణమయమైన ద్వాదశతలములుగల విమానం ఉంటుంది. అందులో నిత్యజ్ఞాన- క్రియా-ఐశ్వర్యములుకల బ్రహ్మాది దేవతలతో, ఋషులతో, నిత్యపరిజనులతో కూడిన మందిరం ఉంటుంది. దానియందలి ఆకాశస్థానమున పరమాత్మ, స్వసంకల్ప శక్తిచేత దేవీ- భూషణ- ఆయుధములతో కూడినవాడై ఆమోదంలో విష్ణువుగా, ప్రమోదంలో మహావిష్ణువుగా, సమ్మోదంలో సదావిష్ణువుగా, వైకుంఠంలో సర్వవ్యాపి అయిన నారాయణుడుగా ఆసీనుడై ఉంటాడు.

అథాతో దేహలక్షణం వక్ష్యే-

స్వాంగులీభిః షణ్ణవత్యంగులో దేహః. తద్ద్వాదశాంగులాధిక ప్రమాణః ప్రాణః ప్రాణాయామేన సమోభవతి. (వహ్ని మండలమ్, తత్స్వరూపః) (గుదాదారభ్య ద్వ్యంగులాదూర్ధ్వం మేఢ్రం మేఢ్రాత్తద్వ్యంగులాధస్తాన్మ ధ్యేకాంగులం దేహః) గుదాత్ ద్వ్యంగులాదూర్ధ్వం దేహమధ్యమ్. తస్మిన్ హేమాభం త్రికోణం వహ్నిమండలమ్. తన్మధ్యే బిందునాదేనసహ రేఫబీజం జ్వలతి. తన్మధ్యే మండల పురుషో యజ్ఞమూర్తిః పింగలాభః ద్విశీర్షః చతుశ్శృంగః షణ్ణేత్రః సప్తహస్తో దక్షిణే అభయస్రక్‌శక్తి ఖడ్గయుతః వామే వరదస్రుక్ ఖేటయుతః, త్రిపాదః, పీతాంబరధరః, శ్రీవత్సాంకః, కిరీటకే యూరహారాది సర్వాభరణ యుక్తః, దక్షిణ వామయోః స్వాహా స్వధాభ్యాం సహితః సర్వదేవైః పరివృతః స్థితః.

తదూర్ధ్వే నవాంగులం కందస్థానం. చతురంగులోత్సేధాయామం, త్వగాది సప్తధాతుభిర్వ్యాపితం, అండాకృతికం, కందమధ్యే నాభిః నాభౌ ద్వాదశార యుతం చక్రం, తత్ర చక్రే పుణ్యపాప ప్రచోదిత స్తంతు పంజరమధ్యస్థో లూతిక ఇవ ప్రాణారూఢః ప్రవర్తతే జీవః.

తస్యోర్ధ్వే నాభేః తిర్యగ్గతా అధ ఊర్ధ్వంగతా అష్టప్రకృతి రష్టధా కుటిలా నాగరూపా విద్యాముద్యున్ముఖేన ఊర్ధ్వద్వారం సంరుధ్య, కందపార్శ్వే స్థితా కుండలీభూత సర్పఫణామణిమండల శ్రియముపేయుషీ కుండలినీశక్తిః ఆత్మనః ఫణేన బ్రహ్మరుద్రాఖ్యం సుషుమ్నానాడీరంధ్ర ముపగూహ్య తిష్ఠతి.

ఇంకదేహలక్షణమును చెప్పగలను:

మానవునకు, తనవ్రేలి అంగుళపు కొలతతో 96అంగుళముల శరీరం ఉంటుంది. దానికంటె 12 అంగుళముల అధికప్రమాణంగా ప్రాణం ఉంటుంది. ప్రాణాయామంతో అది సమానమవుతుంది. (వహ్నిమండలం, తత్స్వరూప మండలం) (గుదము మొదలుకొని రెండు అంగుళములు ఊర్ధ్వమున మేఢ్రము, మేఢ్రము కంటె రెండు అంగుళములు క్రింద మధ్యమున ఏకాంగుళ దేహం). గుదముకంటె రెండు అంగుళముల ఊర్ధ్వమున దేహమధ్యభాగము, దానియందు బంగారంవలె ప్రకాశించే త్రికోణాకారమయిన వహ్నిమండలం, దానిమధ్యమున బిందునాదంతో కూడా రేఫబీజం (=రం) జ్వలించుచుం డును. దానిమధ్యలో మండలపురుషుడగు యజ్ఞమూర్తి ఉండును. ఆయన పింగలకాంతికలవాడు, రెండు శిరస్సులు నాలుగు కొమ్ములు అరునేత్రములు ఏడుచేతులు కలవాడు. కుడివైపు నాలుగు చేతులలో అభయం, మాలిక, శక్తి, ఖడ్గం కలవాడు. ఎడమవైపు మూడు చేతులలో వరదము, స్రుక్కు, ఖేటము కలవాడు. మూడు పాదములు కలవాడు. పీతాంబరుడు, శ్రీవత్సాంకుడు, కిరీటకేయూర హారాది సర్వాభరణ భూషితుడు, దక్షిణవామపార్శ్వములందు స్వాహా-స్వధలుకలువాడు. అందరు దేవతలచేత పరివృతుడైనవాడు.

దానికి ఊర్ధ్వమందు 9 అంగుళముల మీద కందస్థానం ఉంటుంది. అది నాలుగు అంగుళముల ఎత్తువెడల్పు కలది. త్వక్కుమున్నగు సప్త ధాతువులతో భూషితమైనది. అండాకృతికలది. కందమధ్యమున నాభి, నాభియందు 12 అరలు కల చక్రం ఉంటాయి. ఆ చక్రమందు పుణ్యపాప ప్రచోదితుడై, తంతుపంజర మధ్యమందున్న సాలీడు వలె ప్రాణారూఢుడైన జీవుడు ప్రవర్తిల్లు చుండును.

ఆ నాభికి ఊర్ధ్వమున-అడ్డంగా, క్రిందుగా, ఊర్ధ్వంగాపోయే ఎనిమిది ప్రకృతులుకల ఎనిమిదివంకరలుకల నాగరూపం ఉంటుంది. అది, విద్యను ఊర్ధ్వముఖంతో ఊర్ధ్వద్వారమును అడ్డగించి, కందమునకు పార్శ్వమున ఉన్నది. వలయములుకలదై, సర్పం యొక్క ఫణామణిమండల శోభతో కూడిన కుండలినీశక్తి, తనయొక్క ఫణముతో బ్రహ్మ రుద్రాఖ్యమైన సుషుమ్నా నాడీరంధ్రమును ఆలింగనంచేసికొని ఉంటుంది.

నాభ్యా ఉపరి వితస్త్యా హృదయం. తత్ర సర్వం ప్రతిష్ఠితం. హృదయే అర్కబింబః తస్మిన్ సకారబీజాన్వితం సహస్రజ్వాలాయుతం జ్యోతి ర్జ్వలతి. తన్మధ్యే మండలపురుషో విష్ణుమూర్తిః తరుణాదిత్య సంకాశో హేమమయో హిరణ్య శ్మశ్రుకేశ నఖయుతః పీతాంబరధరః శ్రీవత్సాంకః చతుర్భుజః శంఖచక్రధరః అభయకట్యవలంబితహస్తః రక్తాస్యనేత్ర పాణిపాదః సౌమ్యః సుప్రసన్నముఖః కిరీటకేయూరహారకటిప్రలంబ యజ్ఞోపవీతాది సర్వాభరణ భూషితః సృష్టిస్థిత్యంతకారణః దేవీభ్యాం పార్శ్వస్థాభ్యాం సహితః స్థితః.

తదూర్ధ్వే నాసాగ్రే శుద్ధస్ఫటిక సంకాశం చంద్రబింబం. తస్మిన్ ఋకార బీజాన్వితమ్ అమృతం స్రవంతం శ్వేతరోచిషం ధ్యాత్వా, తన్మధ్యే మండల పురుషో నారాయణమూర్తిః శుద్ధ స్ఫటిక సంకాశః పీతాంబరధరః శ్రీవత్సాంకశ్చతుర్భుజః శంఖచక్రధరః అభయకట్యవలంబితహస్తః పద్మోదరదళాభనేత్రో రక్తాస్యపాణిపాదః కిరీట కేయూరాది సర్వాభరణ భూషితః స్మేరముఖః దేవీభ్యాం పార్శ్వస్థాభ్యాం సహిత స్థితః తస్యోపరి మూర్ధ్ని సుషుమ్నాయా అగ్రే ముక్తిద్వారం. తస్మిన్ శిరః పద్మమ్ అధోముఖమూర్ధ్వమూలమ్ షోడశదలయుతం తస్మిన్ స్థితం అమృతధారాభిః సహస్రాభిరాప్లావ్యమానం మండలపురుష వాసుదేవం ధ్యాయేదితి విజ్ఞాయతే.

నాభికి ఊర్ధ్వమున వితస్తి (= 12అంగుళముల) దూరంలో హృదయం ఉంటుంది. అక్కడ సర్వమూ ప్రతిష్ఠితమై ఉంటుంది. హృదయంలో అర్కబింబం, దానియందు సకారబీజయుతం సహస్రజ్వాలాయుతం అయిన జ్యోతి జ్వలిస్తూ ఉంటుంది. దానిమధ్యలో మండల పురుషుడగు విష్ణుమూర్తి ఉంటాడు. ఆయన-తరుణాదిత్య సంకాశుడు, హేమమయుడు, హిరణ్మయ శ్మశ్రు- కేశ-నఖోపేతుడు, పీతాంబరధరుడు, శ్రీవత్సాంకుడు, చతుర్భుజుడు, శంఖచక్రధరుడు, కుడివైపు అభయహస్తం కటియందు వామహస్తం కలవాడు, ఎల్లని ఆస్య-నేత్ర - పాణి-పాదములు కలవాడు, సౌమ్యుడు, సుప్రసన్నముఖుడు, కిరీట-కేయూర-హార-కటి ప్రలంబ యజ్ఞోపవీతాది సర్వాభరణ భూషితుడు, సృష్టి-స్థితి-సంహారకారణుడు, ఇరువురు దేవేరులచేత పారిషదులచేత పరివృతుడు.

దానిమీద నాసాగ్రమున శుద్ధ స్ఫటిక సంకాశమైన చంద్రబింబం ఉంటుంది. దానియందు ఋకారబీజాన్వితం, అమృతస్యంది అయిన శ్వేతకిరణుని (= చంద్రుని) ధ్యానించవలెను. దానిమధ్యలో మండల పురుషుడగు నారాయణ మూర్తి ఉంటాడు. ఆయన శుద్ధస్ఫటిక సంకాశుడు, పీతాంబరధరుడు, శ్రీవత్సాంకుడు, చతుర్భుజుడు, శంఖచక్రధరుడు, కుడివైపు అభయహస్తం ఎడమవైపు కటిమీద ఉంచిన హస్తంకలవాడు, పద్మోదరదలముల వంటి నేత్రములుకలవాడు, ఎల్లని ఆస్య-పాణి-పాదములు కలవాడు, కిరీటకేయూరాది సర్వాభరణ భూషితుడు, స్మేరముఖుడు, ఇరువురు దేవేరులతోను పారిషదులతోను కూడిఉన్నవాడు.

దానికి ఊర్ధ్వమున, మూర్ధమున, సుషుమ్న అగ్రమందు ముక్తిద్వారం ఉంటుంది. దానియందు శిరఃపద్మం అధోముఖంగాను, ఊర్ధ్వమూలంగాను, షోడశదలయుతమై ఉంటుంది. దానియందు, వేలకొలది అమృతధారలచేత ముంచబడుతున్న మండల పురుషుడైన వాసుదేవుని ధ్యానించవలెను అని తెలియుచున్నది.

అథ కందాదుత్థితం ద్వాదశాంగులం సుజ్ఞాననాలం అణిమా మహిమా లఘిమా గరిమా ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం వశిత్వ మిత్యష్టైశ్వర్య దలోపేతం ప్రకృత్యాత్మిక కర్ణికం విద్యాకేసర సంయుక్తం, అధోముఖం హృదయకమలం ప్రాణాయామైర్వికసితం ఊర్ధ్వముఖం భవతి. తస్యాంతః కర్ణికామధ్యే మహానగ్నిర్జ్వలన్ విశ్వార్చిః విశ్వతోముఖః ఆపాదతలమస్తకం సంతాపయతి. తన్మధ్యే పీతాభా నీవారశూకవత్తన్వీ వహ్నిశిఖా. తస్యాః శిఖాయా మధ్యే ప్రజ్వలితజ్యోతిరూపమేవ స్వసంకల్పేన తప్తజాంబూనదప్రభః పీతాంబరధరః పద్మాక్షః రక్తాస్యపాణిపాదః చతుర్భుజః చక్రశంఖధరోఽభయ కట్యవలంబితహస్తః శ్రీవత్సాంకః సుప్రసన్నః శుచిస్మితః సర్వాభరణభూషితః హృదిస్థితః పరమాత్మా. దక్షిణవామయో (శ్రీభూమిభ్యాం) విభూతిమా యాభ్యాం పరిషత్భ్యః సహసంస్థితః. 'నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూ పమా తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః' ఇతి శ్రుతిః. తం విష్ణుం జిజ్ఞాసుః ధ్యానయోగేన జ్ఞానచక్షుసా పశ్యేత్.

తరువాత కందస్థానం నుంచి ఉత్పన్నమైన 12 అంగుళాల సుజ్ఞాన నాళం కలది, అణిమ-మహిమ- లఘిమ-గరిమ-ప్రాప్తి-ప్రాకామ్యం-ఈశత్వం-వశిత్వం అనే అష్టైశ్వర్య దళోపేతమైనది, ప్రకృత్యాత్మకమైన కర్ణికకలది, విద్యాకేసరములు కలది, అధోముఖం అయిన హృదయ కమలం ప్రాణాయామం చేత వికసించి ఊర్ధ్వముఖమవుతుంది. దానిలోపల కర్ణికామధ్యమందు మహాగ్ని జ్వలిస్తూ, అంతటా కిరణములు కలిగి, విశ్వతోముఖమై ఆపాదతలమస్తకంగా సంతాపం కలుగజేస్తూ ఉంటుంది. దానిమధ్యలో పీతవర్ణంకలది, వరినూగువలె సూక్ష్మమైనది అగు వహ్నిశిఖ ఉంటుంది. ఆ శిఖామధ్యమందు పరమాత్మ ప్రజ్వలితజ్యోతిరూపమై స్వసంకల్పంతో ఉంటాడు. ఆయన-తప్తస్వర్ణకాంతియుతుడు, పీతాంబరధరుడు, పద్మాక్షుడు, రక్తాస్యపాణిపాదుడు, చతుర్భుజుడు, శంఖచక్రధరుడు, కుడివైపు అభయహస్తం కటిమీద వామహస్తం కలవాడు, శ్రీవత్సాంకుడు, సుప్రసన్నుడు, శుచిస్మితుడు, సర్వాభరణభూషితుడు, హృదయస్థితుడు. ఆ పరమాత్మ దక్షిణవామ భాగములందు (శ్రీ-భూదేవులతో) విభూతి- మాయలతో, పారిషదులతో పరివృతుడై ఉంటాడు. 'నీవార...వ్యవస్థితః' అని వేదం. ఆ విష్ణువును తెలిసికొనగోరువ్యక్తి, ధ్యానయోగంతో, జ్ఞాననేత్రంతో చూడవలెను.

[సూచన: దేహలక్షణము చెబుతాను- అప్పటి నుండి ఇంతవరకు చెప్పినది మనోమయమైన భావన అని గ్రహించవలెను- అనువాదకుడు]

'సదా పశ్యంతి సూరయ' ఇతి శ్రుతిః. విశ్వవ్యాపినం విష్ణుం ధ్యాన మథనేనా ౽ ౽ విర్భూతం తేజోభాసురం భక్త్యా సకలం సంకల్ప్య ఆవాహ్య అభ్యర్చయేదితి. "ప్రవః పాంత మంధసో ధియాయతే మహే శూరాయ విష్ణవేచార్చత" ఇతి శ్రుతిః. తస్మాద్విష్ణ్వర్చనమేవ ద్విజైరహ రహః కర్తవ్యమితి విజ్ఞాయతే.

జీవాత్మ అంజనాభః నిత్యశుద్ధః (బుద్ధః బోధనిర్వికారః నిత్యాణుప్ర మాణః) సర్వగత ఇత్యేవంభూతం దేహం ప్రవిశ్య శుభా౽శుభకర్మాణి కరోతి.

తత్కర్మ ద్విధా భవతి ఐహికమాముష్మికం చేతి తత్రైహికం భోజనా౽ ౽చ్ఛాదన స్థాన గమనా౽ ౽సనశయనాదికమ్. ఆముష్మికం అహింసా దానధర్మపరోపకారభగవదారాధనాది పుణ్యపాపాని సర్వాణి భవంతి. దైవయో గాద్దేహావసానే స్వకర్మానురూపం పరలోకం ప్రాప్య తత్తత్కర్మఫలం భుక్త్వా క్షీణేఫలే నివృత్య ఆకాశం ప్రవిశతి.

వాయుర్భూత్వా అగ్నిం ప్రవిశతి. ధూమో భూత్వా అపః ప్రవిశతి. అపో భూత్వా అభ్రం ప్రవిశతి. అభ్రం భూత్వా భూమౌ వర్షతి. భూమ్యా ఓషధి వనస్పతీన్ ప్రవిశతి. ఓషధీభ్యో ౽న్నమ్. అన్నాచ్ఛుక్లశోణితా చ భవతః. తతః స్వవిషయాం యోనిం ప్రవిశ్యతి. ప్రతిదివసవృద్ధ్యా పరిణతో జాయతే చ. ఏవం క్షేత్రక్షేత్రజ్ఞయోశ్చ పరస్పరం సంబంధాదనంత సంసార స్థావర జంగ నరమృగపశుపక్షిజరాయుజాండజ స్వేదజోద్భిజ్జభేదా బహవో భవంతి ఇతి విజ్ఞాయతే.

'వివేకులు ఎల్లప్పుడు చూతురు అనివేదం విశ్వవ్యాపి అయిన విష్ణువును, ధ్యానమనే మథనంతో ఆవిర్భూతుడైనవానిని తేజోభాసురునిగా సకలునిగా భక్తితో సంకల్పించి, ఆవాహనంచేసి అర్చించాలి. 'ప్రవః...విష్ణవేచార్చత' అని వేదం. అందువల్ల ద్విజులు ప్రతిదినం విష్ణ్వర్చననే చేయవలెనని తెలియుచున్నది.

జీవాత్ముడు, కాటుకవంటి కాంతిగలవాడై, నిత్యశుద్ధుడు (బుద్ధుడు, బోధనిర్వికారుడు, నిత్యుడు, అణుప్రమాణుడు) సర్వగతుడు-ఈప్రకారముగు దేహమును ప్రవేశించి శుభాశుభకర్మలను చేస్తాడు.

ఆ కర్మ రెండు విధాలు-ఐహికం, ఆముష్మికం. భోజనం, ఆచ్ఛాదనం, స్నానం, గమనం, ఆసనం, శయనం మున్నగునవి ఐహికములు. అహింస, దానం, ధర్మం, పరోపకారం, భగవదారాధన మున్నగు పుణ్యపాప కర్మలన్ని యును ఆముష్మికములు. దైవయోగమున, దేహావసానమునందు, స్వకర్మాను రూపమైన పరలోకమును పొంది, తత్తత్కర్మ ఫలమనుభవించి, ఆఫలానుభవం క్షీణించిన తరువాత, మరలి, ఆకాశమునందు ప్రవేశించును.

అచ్చట వాయువై, అగ్నిని ప్రవేశించును. ధూమమై, నీటిని ప్రవే శించును. నీరై, మేఘమును ప్రవేశించును. మేఘమై, భూమియందు వర్షించును. భూమినుండి ఓషధి-వనస్పతులలో ప్రవేశించును. ఓషధులనుండి అన్నమును ప్రవేశించును. అన్నమునుండి శుక్లశోణితములగును. తరువాత తనకర్హమైన గర్భములో ప్రవేశించును. ప్రతిదినవృద్ధితో పరిణామంచెంది, జన్మించును. ఇట్లా క్షేత్ర (= శరీరం)-క్షేత్రజ్ఞుల (=జీవాత్ముని) యొక్క పరస్పర సంబంధమువలన అనంత సంసార స్థావర-జంగమ-నర - మృగ- పశు -పక్షి - జరాయుజ - అండజ - స్వేదజ - ఉద్భిజ్జ భేదములు బహుసంఖ్యాకములగునని తెలియుచున్నది.

ఈశరీరము జన్మనుపొంది, భార్యామయపాశముచేత నిబద్ధమై, భగవన్మాయచేత మోహితమై, కామ-క్రోధ - లోభ - మోహ - మద - మాత్సర్య - హింసాదులకు లోనగును. యోనిద్వారమున బయటపడి, మరల పాపిష్ఠమైన యోనిని ఆశ్రయించి మరలపుట్టుచు స్వర్గనరకములు ఫలములుగా గల ఆయా కర్మలందు ప్రవృత్తికలవాడగుచున్నాడు. ఇట్లా భగన్మాయచేత మోహితుడు కావటంవల్ల, ఆ భగవంతునినే ఆశ్రయించి, భక్తితో నారాయణుని ఉపాసించవలెను.

ఆ ఉపాసనవల్ల ఆ నారాయణుడు కూడా, భక్తవత్సలుడు కావటంచేత, భక్తులమీది దయలో, తనమాయను విమోచనముచేయును. అప్పుడు, జీవాత్మ, సమ్యక్ జ్ఞానమును పొందును. తరువాత, ఆశ్రమధర్మయుక్తుడై, భగవదారాధన చేస్తూ ఉండవలెను.

ఆ ఆరాధనచేత సంసారసముద్ర నిమగ్నుడైన జీవాత్మ, పరమాత్మ అయిన నారాయణుని చూచును; ఆ నారాయణుడు అపునరావృత్తి (= మోక్షం) కలిగించును; జీవుడు కృతకృత్యుడగును.

సంసారబంధములనుండి విడివడుటయే మోక్షం. అదికూడా, సమారాధనలలోని భేదాలవల్ల నాలుగువిధాలు అవుతుంది-సాలోక్యం, సామీప్యం, సారూప్యం, సాయుజ్యం. ఆమోదలోక ప్రాప్తి సాలోక్యం, ప్రమోదలోకప్రాప్తి సామీప్యం, సంమోదలోక ప్రాప్తి సారూప్యం, ఇంక వైకుంఠ ప్రాప్తి సాయుజ్యం. ఇది అమృతరసపానమువలె నిత్యానందమయం. 'అవిష్ణువు యొక్క పరమపదమును వివేకులు ఎల్లప్పుడును చూతురు' అనికదా వేదం. కాగా, భగవంతుని వేరొక విధంగా పొందటం సాధ్యంకాదని తెలియుచున్నది.

అథ భగవత్సమాశ్రయణం చతుర్విధం భవతి (సమారాధన మిత్యామ నంతి). జపహుతా ఽర్చనాధ్యాన మితి. సావిత్రీపూర్వం వైష్ణవీమృచమ్, అష్టాక్షరం వా, భగవంతం 'ధ్యాత్వా అభ్యసేత్ స జపః; అగ్నిహోత్రేత్యాది హోమే యత్ హ్రూయతే తద్ధుతం హోమః; గృహే దేవాయతనే వా వైది కేనమార్గేణ ప్రతిమాదిషు పూజయేత్ తదర్చనమ్; నిష్కలసకల విభాగంచ జ్ఞాత్వా అష్టాంగయోగమార్గేణ పరమాత్మానం జీవ ఆత్మనా చింతయేత్ తద్ ధ్యానమితి. తేష్వర్చనం సర్వార్థసాధనం స్యాత్. తత్ర పరమాత్మైవ పంచధా భవతి. 'సవా ఏష పురుషః పంచధా పంచాత్మే' తి శ్రుతిః.

తస్మాదాకాశాది మహాభూతానాం (క్రమేణ) పరమాత్మని భేద ఏవ. సభ్యాఽఽహవనీయా న్వాహార్య గార్హపత్యా ఽఽవసథ్యాయిత పంచాగ్నివత్ పంచధాగ్నీన్ వ్యక్రమద్విరాట్ ప్రస్తే తి శ్రుతిః. ప్రాణాదిపంచవాయుభేదై రివ పంచమూర్తి భేదై ర్విద్యతేతి. 'హాపూయమానః పంచభిః స్వగుణైః ప్రసన్నైః సర్వానిమాన్ ధారయిష్యసీ' తి శ్రుతిః.

తస్మాత్ విష్ణుపురుషసత్యా ఽచ్యుతానిరుద్ధా' ఇతి మూర్తీనాం పంచానాం ఆదిమూర్తి ర్విష్ణుః తద్భేదాశ్చ చతస్రోమూర్తయః. 'తద్విష్ణోః శ్రమాపదాయ చతుర్గుణాయే' తి శ్రుతిః. తస్మాత్ బ్రహ్మ చతుష్పాత్ భవతి. పాదాదర్ధాత్ త్రిపాదాత్ కేవలాచ్చ క్రమేణ ధర్మజ్ఞానైశ్వర్య వైరాగ్యైరితి విషయగుణైః చతుర్భిః మూర్తయో భవంతి. ఆదిమూర్తే శ్చతుర్మూర్తి త్వాత్ క్రమేణ విష్ణుర్మహావిష్ణుః సదావిష్ణుర్వ్యాపీ నారాయణ ఇతి చతుర్మూర్తయో త్రిగుణా త్మకో విష్ణుః పరమాత్మా తిష్ఠతి. తస్యా శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః. స బ్రహ్మ స శివ ఇతి శ్రుతిః. ఏవం నిష్కలమితి విజ్ఞాయతే.

విష్ణోరంశః పురుషః, మహావిష్ణోరంశః సత్యః, సదా విష్ణోరంశః అచ్యుతః వ్యాపినో ఽంశో ఽనిరుద్ధః. ఇతి ధర్మాది బ్రహ్మగుణైశ్చతుర్ధా భిద్యతే.

ఇంక, భగవత్సమాశ్రయణం (= దీనిని సమారాధనమని పరంప రగా చెప్పుచున్నారు) నాలుగువిధాలు-జపం, హుతం, అర్చన, ధ్యానం. సావిత్రీ పూర్వకంగా విష్ణు సంబంధిఅయిన ఋక్కునుకాని, అష్టాక్షరినికాని, భగవంతుని ధ్యానించుచు, పునశ్చరణ చేయటమే జపం. అగ్నిహోత్రాది హోమములందు హోమంచేయటమే హుతం. గృహమునందుకాని, దేవాయత నమందుకాని వైదిక మార్గం ప్రకారం ప్రతిమాదులను పూజించటం అర్చన. నిష్కల సకలవిభాగం గుర్తెరిగి, అష్టాంగయోగమార్గంలో పరమాత్మను జీవాత్మతో చింతించటం ధ్యానం. ఈనాలుగింటిలో అర్చన సర్వార్థసాధ కము. అక్కడ పరమాత్మయే పంచవిధములుగా ఉండును. 'ఈపురుషుడే అయిదువిధములుగా, పంచాత్మకుడుగా ఉండును' అనివేదం.

అందువలన, ఆకాశాదిమహాభూతములు క్రమంగా పరమాత్మయందలి భేదములు మాత్రమే-సభ్య- ఆహవనీయ-అన్వాహార్య-గార్హపత్య-అవసథ్యములు అనే పంచాగ్నులవలె. 'విరాట్ స్రష్ట అగ్నులను అయిదు విధముల విక్రమించెను' అని వేదం. ప్రాణాదిపంచవాయుభేదములవలె పంచమూర్తి భేదములచేత పరమాత్మ భిన్నుడగుచున్నాడు. 'ప్రసన్నములైన అయిదుస్వగు ణములచేత పవిత్రుడవై వీటిని అన్నింటిని ధరించుచున్నావు' అనివేదం.

అందువల్ల, విష్ణువు, పురుషుడు, సత్యుడు, అచ్యుతుడు, అనిరుద్ధుడు అనే అయిదు మూర్తులలో ఆదిమూర్తి విష్ణువు. ఆయన భేదముతే తక్కిన నాలుగుమూర్తులు. 'ఆదివిష్ణువు యొక్క శ్రమాపనోదనము కొరకు, చతుర్గుణములకొరకు' అని వేదం. కాగా, బ్రహ్మచతుష్పాత్తు అగుచున్నాడు. అర్ధపాదమునుండి, కేవలమగు, మూడు పాదముల నుండి క్రమంగా ధర్మం, జ్ఞానం, ఐశ్వర్యం, వైరాగ్యం అనే నాలుగు విషయగుణములతో నాలుగు మూర్తులు కలుగుచున్నవి. ఆదిమూర్తి చతుర్మూర్తులు కలవాడు-విష్ణువు, మహావిష్ణువు, సదావిష్ణువు, వ్యాపియగు నారాయణుడు అని. వీటియందు త్రిగుణాత్మకుడైన విష్ణువు, పరమాత్మ ఉంటాడు. 'ఆశిఖయొక్క మధ్యలో పరమాత్మ ఉండును. ఆయనయేబ్రహ్మ, ఆయనయే శివుడు' అని వేదం. ఇట్లు నిష్కలత్వం తెలియుచున్నది.

విష్ణువు యొక్క అంశము పురుషుడు, మహావిష్ణువు యొక్క అంశము సత్యుడు, సదావిష్ణువు యొక్క అంశము అచ్యుతుడు, వ్యాపియొక్క అంశము అనిరుద్ధుడు. ఇట్లా ధర్మాది బ్రహ్మగుణములచేత చతుర్విధ భేదయుక్తుడగు చున్నాడు.

పురుషః పురుషాత్మకః పరమపురుషః ధర్మమయ ఇతి, సత్యః సత్యాత్మకః జ్ఞాన స్సర్వతోమయ ఇతి, అచ్యుతో ఽపరిమితః ఐశ్వర్యః శ్రీపతిరితి, అనిరుద్ధః మహాన్ వైరాగ్యస్సర్వసంహార ఇతి. ఏవం పంచమూర్తి నామభిర్భేదైః గురూపదేశేన అష్టాంగ యోగమార్గేణ ధ్యాత్వా అవాహ్య అర్చయేదిత్యాహ మరీచిః.

పురుషుడు, పురుషాత్మకుడు, పరమపురుషుడు, ధర్మమయుడు అనీ; సత్యుడు, సత్యాత్మకుడు, జ్ఞానుడు, సర్వతోమయుడు అనీ; అచ్యుతుడు,అపరిమితుడు, ఐశ్వర్యుడు, శ్రీపతి అనీ; అనిరుద్ధుడు, మహానుడు, వైరాగ్యుడు, సర్వసంహారుడు అనీ-ఇట్లా నామభేదములతో పంచమూర్తులను గురూపదేశంతో అష్టాంగయోగమార్గంలో ధ్యానించి, ఆవాహనచేసి, అర్చించవలెనని మరీచి చెప్పెను.

యో గురౌ మానుషం భావం
శిలాభావం చ దైవతే ।
మంత్రేషు జీవికాభావం
హింసాభావం మఖేషుచ ॥
పూజకేషు చ పూజాయాం
నీరసం భావమేతి సః ।
సర్వథా నిందితవ్యోహి
జీవితం తస్యనిష్ఫలమ్ ॥

- (చూ.పుట -153)

హారీతుడు--

వానప్రస్థుడు గ్రామ్యములగు ఓషధులను వర్జింపవలెను. త్రేతాగ్నుల స్థానంలో శ్రామణికాగ్నిని అధానంచేసి, వల్కలములు, జనపనార, చర్మము, కుశలు, ముంజనార, వెదురు మున్నగునవి ధరిస్తూ వైఖానస విధానముతో వానప్రస్థుడైనవాడు విఖనసుడే అవుతాడు. మరియు అనుజ్ఞాయికుడు, అనుప్రస్థాయికుడు కావాలి.

వసిష్ఠుడు--

శ్రామణిక విధానంతో అగ్న్యాధానం చేసిన ఆహితాగ్నియై, వృక్షమూల స్థితుడు కావాలి.

బోధాయనుడు--

వానప్రస్థుడు వైఖానసశాస్త్ర సంప్రదాయాచారం కలవాడు కావాలి.

ఆపస్తంబుడు--

వానప్రస్థుడు ఏకాగ్ని, అనికేతనుడు కావాలి.

దీనికి ధర్మకపర్ది వ్యాఖ్య ఇట్లా ఉన్నది--

గార్హపత్యాది త్రేతాగ్నులస్థానంలో వానప్రస్థునకు ఒకటే- ఔపాసనాగ్నియే- ఉంటుంది అని వైఖానససూత్రమున కనబడుతున్నది కావున, ఔపాసనాగ్ని వివాహము నిమిత్తము వచ్చినది కావున.

జైమినీయ సూత్రమున, సౌమిక చాతుర్మాస్యప్రకరణమున–

భారద్వాజ పూర్వకంగా కాని, వైఖానస పూర్వకంగా కాని, అయిదవది.

ఇక్కడ రెండు స్థలములందు అత్రి వ్యాఖ్యానమిట్లున్నది--

16గురు ఋత్విక్కుల మధ్యలో ప్రస్తోతగా భారద్వాజసూత్రానుయాయిని, ప్రతిహర్తగా వైఖానససూత్రానుయాయిని ఋత్విగ్వరణము చేయవలెను.

కపింజల సంహితలో--

యజ్ఞములు చేయించటం, అధ్యాపనం చేయటం, శిష్యానుగ్రహం, మంత్రతంత్రపరాయణత్వం - ఇవి ఆచార్య లక్షణములని తెలియవలెను. ఆశ్రమంలోకాని, వనంలోకాని, భార్యాపుత్రసమేతుడై, నిత్యము అష్టాక్షర పరుడైనవాడు వైఖానసుడని చెప్పబడుతున్నాడు.

అష్టాక్షరపరో నిత్యం స వైఖానస ఉచ్యతే ॥
గ్రామ్యధర్మాణి సర్వాణి వర్జయేద్వనవాసకః ।
వల్కాలాజిన సంవీతః స మౌనీత్యభిధీయతే ॥ ఇతి.

పాద్మే ద్వాదశాక్షర ప్రకరణే-
.....................పుత్రదారసమన్వితః ।
వనే వా పత్తనే వాపి జపే ద్వైఖానసః శుచిః ।
వియుక్తః పుత్రదారాద్యైః స్వయమేవ వనే స్థితః ॥ ఇతి.

అన్యైరప్యేవమేవోక్తమ్.

అఖిలశిష్ట పరిగ్రహే కో విశేష ఇతి చేత్ - అఖిలశిష్టపరిగ్రహాత్ ప్రామాణ్యాతిశయోఽస్తీ త్యవగమ్యతే. అతః శ్రుతిస్మృతిపురాణాదిభిః ప్రామాణత్వేనావగతస్య శ్రీవైఖానససూత్రస్య అఖిలశిష్టపరిగ్రహాత్ ప్రామాణ్యాతిశయోఽస్తీతి మన్వాద్యైస్స్వీకృతత్వా దితి నిరూపితో ఽష్టమో హేతుః.

# నవమో హేతుః

అథేదానీమాపస్తంబాది సూత్రాంతరనిష్ఠానాం సూత్రకారాదారభ్య అవచ్ఛిన్నత్వేన పరంపరయా ఏకాంతిత్వం నా స్తీతి జ్ఞాపయితుం వైఖానససూత్రిణామేవ తత్ సంభవతీతి దర్శయితుం -

ప్రత్యక్షమనుమానం చ శాస్త్రంచ వివిధాగమమ్ ।
త్రయం సువిదితం జ్ఞేయం ధర్మసిద్ధి మభీప్సతా ॥

ఆ వనవాసి సమస్త గ్రామధర్మములను విసర్జించవలెను. వల్కలములు, అజినము ధరించవలెను. అతనిని మౌని అని చెప్పెదురు.

పద్మపురాణంలో ద్వాదశాక్షర ప్రకరణంలో--

.... భార్యాపుత్రులతో కూడినవాడై వనంలోకాని, పట్టణంలోకాని, వైఖానసుడు శుచియై జపించాలి, లేదా భార్యాపుత్రాదులు లేకుండా స్వయంగా వనంలో ఉండవచ్చు. ఇతరులచేత కూడా ఇట్లే చెప్పబడినది.

అఖిలశిష్టులు పరిగ్రహించటం చేత ఏమి విశేషం అంటే ప్రామాణ్యం అధికమవుతుందని అవగతమవుతున్నది. అందుచేత శ్రుతి స్మృతి పురాణాదులచేత ప్రమాణంగా చెప్పబడిన శ్రీవైఖానససూత్రమునకు అఖిలశిష్టులు పరిగ్రహించటం చేతకూడా ప్రామాణ్యం అధికమైనదని, మన్వాదులచేత స్వీకరింపబడినది కావటంవల్ల అనే అష్టమహేతువు నిరూపితమైనది.

# నవమహేతువు

ఇప్పుడు ఆపస్తంబాది ఇతర సూత్రానుయాయులకు ఆయా సూత్రకారులతో ప్రారంభమైన పరంపర అవిచ్ఛిన్నంగా ఏకోన్ముఖంగా లేదని తెలుపుటకై, వైఖానససూత్రులకే అది సంభవించును అని ప్రదర్శించుటకై "ప్రత్యక్షం, అనుమానం, వివిధాగమశాస్త్రం అనే మూడింటిని ధర్మసిద్ధిని కోరే వ్యక్తి చక్కగా తెలిసికోవలెను"

ఇతి మనుస్మరణానుసారేణ, ప్రత్యక్షాదిభిరవగమయితుంచ అఖిలజగదేక కారణభూత శ్రీమన్నారాయణైకపరత్వాదితి నవమో హేతు ర్నిరూప్యతే.

అస్య సూత్రస్య నారాయణైక పరత్వే-

'ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతా ఫలమ్ ।
అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే' ॥

ఇత్యుక్తాని షడ్విధాని తాత్పర్యలింగాని సంతి.

తథా హి - ఆద్యప్రశ్నే ప్రథమఖండే నారాయణపరాయణ ఇత్యుక్తమ్. ఏవం సదాఽఽధ్యాత్మరతో ధ్యానయోగీ నారాయణపరం బ్రహ్మ పశ్యన్ ధారణాం ధారయేదక్షరం పరం బ్రహ్మాప్నోతి నారాయణపరం బ్రహ్మేతి శ్రుతిః ఇత్యుపసంహారే సన్న్యాసవిధౌ ప్రతిపాదితమ్.సంధ్యోపాసనాది పుణ్యాహ ఘారాంతహోమ-నాందీముఖోపనయన - పాణిగ్రహణపర్యంతేషు అంతకర్మణి చ అతోదేవాది వైష్ణవా మంత్రాః వినియుక్తాః. ఏవం ఆఘారప్రకరణే 'శరో ఽంగారేఽగ్నౌ జుహుయా' దితి సూత్రేణ ఇధ్మాధానం తైత్తిరీయ బ్రాహ్మణవాక్యానుసారేణ పరబ్రహ్మాగ్నౌ విహితమ్.

పరబ్రహ్మ శబ్దాభిధేయశ్చ భగవాన్ నారాయణ ఏవేతి వేదాంతేషు నిర్ణీతమ్.

తథాహి - 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్' ఇత్యాదిభిః ప్రతిపన్నస్య అభిన్ననిమిత్తోపాదాన కారణస్య యతో వా ఇమాని భూతాని జాయంతే-తద్బ్రహ్మే త్యాదినా జగత్కారణత్వం బ్రహ్మశబ్ద వాచ్యత్వం చ ప్రతిపాద్యతే. తస్య సత్యం జ్ఞానమనంతం బ్రహ్మే త్యాదినా శోధకవాక్యేన స్వరూపం నిరూప్యతే.

సత్యత్వాదివిశిష్టస్య తస్య 'ఆనందో బ్రహ్మ' ఇతి నిరతిశయానంద రూపత్వంప్రతిపాద్యతే. ఏతాదృశ బ్రహ్మరూపం వస్తు 'నారాయణ పరం బ్రహ్మ', 'తత్త్వం నారాయణః పరః', 'ఏకోహ వై నారాయణ ఆసీత్', 'అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః' ఇత్యాది వాక్యైః శ్రీమన్నారాయణ ఏవేతి నియమ్యతే. ఏవం చ 'అధ్యాహంతే' ఇతి తైత్తిరీయవాక్యశేషస్థ బ్రహ్మశబ్దోఽపి నారాయణపర ఏవేతి. ప్రకృత సూత్రోక్తేధ్మాధానమపి నారాయణ పరమేవ.

అనే మనుస్మృతి ప్రకారం ప్రత్యక్షాదులచేత అవగతం చేయుటానికై, 'అఖిల జగదేకకారణభూతుడైన శ్రీమన్నారాయణైక పరము' అనే నవ మహేతువు నిరూపింపబడుతున్నది. ఈ సూత్రము నారాయణైకపరము అనుటకు ఉపక్రమం, ఉపసంహారం, అభ్యాసం, అపూర్వతాఫలం, అర్థవాదం, ఉపపత్తి అనునవి తాత్పర్య నిర్ణయమునకు లింగములు (= సహకారులు) అని చెప్పబడిన ఆరువిధములగు తాత్పర్యలింగములు ఈ సూత్రమునందున్నవి.

అది యుక్తమే. ఆదిప్రశ్న ప్రథమఖండమున 'నారాయణపరము' అని చెప్పబడినది. ఇట్లే, ఎల్లప్పుడు అధ్యాత్మరతుడు, ధ్యానయోగియునై నారాయణుడగు పరబ్రహ్మను చూస్తూ, ధారణను ధరింపవలెను. అప్పుడు అక్షరమైన పరబ్రహ్మను పొందును. 'నారాయణుడు పరంబ్రహ్మ' అని వేదం. ఇట్లా ఉపసంహారమున సన్న్యాస విధియందు ప్రతిపాదింపబడినది. సంధ్యోపాసనాది పుణ్యాహ-అఘారాంత - హోమ-నాందీముఖ-ఉపనయన-పాణిగ్రహణాంతములగు కర్మలయందును, అంత్యేష్టియందును, 'అతోదేవ' మున్నగు వైష్ణవ మంత్రములు వినియోగింపబడినవి. ఇట్లా, అఘార ప్రకరణమందు 'అంగారాగ్నియందు శరమును హోమము చేయవలెను' అనే సూత్రం చేత ఇధ్మాధానం (= సమిధలను ఉంచటం), తైత్తిరీయ బ్రాహ్మణ వాక్యానుసారంగా పరబ్రహ్మాగ్నియందు విహితమైనది. పరబ్రహ్మశబ్దంచేత వాచ్యుడైనవాడు నారాయణుడే అని వేదాంతములందు నిర్ణయింపబడినది. అది యుక్తమే.

'ఓ సోమ్యుడ! ఇది అంతా మొదట సత్తు (= అస్తిత్వం) కలది గానే ఉండెను; ద్వితీయం లేని ఒకటేవస్తువు- ఇత్యాదులచేత తెలిసిన అభిన్న నిమిత్తమైన ఉపాదానకారణమునకు (ఉదా: కుండకు మట్టి ఉపాదానకారణము) దేనినుండి ఈ వస్తువులు (= ప్రాణులు) పుట్టుచున్నవో, అది బ్రహ్మ - ఇత్యాది ఉపనిషద్వాక్యములచేత జగత్కారణత్వం, బ్రహ్మ శబ్దవాచ్యత్వం ప్రతిపాదింపబడుచున్నది. అట్టి వస్తువునకు, సత్యం, జ్ఞానం, అనంతం, బ్రహ్మ ఇత్యాది శోధకవాక్యములచేత స్వరూపనిరూపణ జరుగుతున్నది.

సత్యత్వాది విశిష్టమైన ఆ పదార్థము 'ఆనందమే బ్రహ్మ' అని నిరతిశయానందరూపమని ప్రతిపాదింపబడుతున్నది. ఏతాదృశబ్రహ్మరూపమైన వస్తువు 'నారాయణుడు పరబ్రహ్మ', 'తత్త్వము పరుడైన నారాయణుడు', 'నారాయణుడు ఒక్కడే ఉండెను', 'పాపములులేని దివ్యుడు దేవుడు నారాయణుడు ఒక్కడే' ఇత్యాది వాక్యములచేత శ్రీమన్నారాయణుడే అని

ఏవమాధానే - 'ధ్యాయన్నారాయణముపోష్య' ఇతి, అగ్ని హోత్రే - 'భూమానం విష్ణుం ధ్యాయేత్' ఇతి. దర్శపూర్ణమాసే - 'ఉదిత ఆదిత్యే ధ్యాయన్నారాయణం' 'విష్ణోర్నుక మితి జపిత్వా' ఇతి. సోమే చ - 'నారాయణ పరాయణ స్త్వాష్ణీమాస్తే' ఇతి చ సర్వత్రాపి అభ్యాసేన నారాయణ పరత్వేనోక్తత్వాత్ ఇదం సూత్రం నారాయణపరమేవ.

'అంగాన్యన్యాదేవతా' ఇతి అంగభూతానాం బ్రహ్మరుద్రాదీనామపి యజ్ఞాంశ భాక్త్వం భగవత్ప్రసాదలబ్ధమితి భారతాదినాऽవగమ్యతే.

తథాహి--

తతస్తే చ సురాస్సర్వే బ్రహ్మా తే చ మహర్షయః ।
వేదదృష్టేన విధినా వైష్ణవం క్రతుమారభన్ ॥
తస్మిన్ సత్రే తథా బ్రహ్మా స్వయం భాగమకల్పయత్ ।
దేవా మహర్షయశ్చైవ సర్వే భాగానకల్పయన్ ॥
తే కార్తయుగధర్మాణో భాగాః పరమసంస్కృతా ।
ప్రాపురాదిత్యవర్ణం తం పురుషం తమసః పరమ్ ॥

శ్రీభగవాన్--

యేన యః కల్పితో భాగః స తథా సముపాగతః ।
ప్రీతోऽహం ప్రదిశామ్యద్యఫల మావృత్తిలక్షణమ్ ॥
యజ్ఞాన్ యే చాపి యక్ష్యంతి సర్వలోకేషు వై సురాః ।
కల్పయిష్యంతి వో భాగాంస్తే నరా వేద కల్పితాన్ ॥
యో మే యథా కల్పితవాన్ భాగమస్మిన్ మహాక్రతౌ ।
స మహాయజ్ఞభాగార్హో వేదసూత్రే మయా కృతః । ఇతి.

నిర్ణయముచేయబడుచున్నది. ఇట్లా 'ఊహిస్తున్నారు' అనే తైత్తిరీయంలోని వాక్యశేషమందలి బ్రహ్మశబ్దం కూడా నారాయణపరమే. ప్రకృతసూత్రంలో చెప్పబడిన ఇధ్మాధానం కూడా నారాయణ పరమే అని అవగతమవుతున్నది.

---

ఇట్లో ఆధానప్రకరణంలో, 'నారాయణుని ధ్యానిస్తూ ఉపవసించెదను' అని, అగ్నిహోత్రప్రకరణంలో, 'భూమియగు విష్ణువును ధ్యానింపవలెను' అని, దర్శపూర్ణమాసప్రకరణంలో 'సూర్యుడు ఉదయింపగా నారాయణుని ధ్యానించుచు', 'విష్ణోర్నుకం' అనే మంత్రమును జపించి అని, సోమయాగప్రకరణంలో, 'నారాయణ పరాయణుడై ఊరక ఉండవలెను' అని, అంతటాకూడా అభ్యాసం (= మరల మరల చేయుటం)తో నారాయణ పరముగా చెప్పబడటంవల్ల ఈ సూత్రంకూడా నారాయణపరమే.

'ఇతరదేవతలు అంగములు' - అంగభూతులైన బ్రహ్మ - రుద్రాదులు కూడా యజ్ఞభాగములు పొందటం భగవంతుని ప్రసాదం వల్లనే సాధ్యమైనది అని భారతాదులవల్ల అవగతమవుతున్నది.

తరువాత, దేవతలందరు, బ్రహ్మమహర్షులు వేదోక్తవిధి ప్రకారం విష్ణుదేవతాకమగు క్రతువును ప్రారంభించినారు. ఆ యజ్ఞమున బ్రహ్మస్వయంగా భాగముకల్పించెను. దేవతలు, మహర్షులందరు ప్రత్యేకభాగములు కల్పించిరి. కృతయుగ ధర్మము కల్గిన ఆ భాగములన్నియు ఉత్తమ సంస్కారం కలవి. అవి అన్నీ ఆదిత్యవర్ణుడు, చీకటికి అవలివాడు అయిన ఆ పరమ పురుషుని పొందెను.

శ్రీ భగవంతుడు--

ఎవరు ఏ భాగమును ఎట్లా కల్పించినారో, అవి అట్లే నన్ను చేరినవి. నేను ప్రీతుడనైతిని. ఇప్పుడు మీ అందరకు అవృత్తి లక్షణమైన ఫలమును కల్పింతును. సర్వలోకములందు ఓ దేవతలారా! నరులు యజ్ఞములు చేయగలరు. ఇట్లా వేదకల్పితములైన భాగములను నరులు మీకు కల్పింపగలరు. ఈ మహాక్రతువునందు మీరు నాకు ఏయే భాగములను అర్పించినారో, ఆ భాగములు అట్లాగే మీకు చెందును గాక - అని వేదసూత్రమున నేను ఏర్పాటుచేసితిని.

శ్రీ భాగవతే--

'అహం భవో దక్షభృగుప్రధానాః ప్రజేశ భూతేశ సురేశముఖ్యాః ।
సర్వే వయం యన్నియమం ప్రసన్నా మూర్ధ్నాఽర్పితం లోకధురం వహామః' ॥ ఇతి.

ఏవం చ భవాదీనామపి నారాయణాంగత్వేన పూజార్హత్వావగమాత్.

'అంగభావేన దేవానామర్చనం న నిషిధ్యతే ।
స్వతంత్ర్యబుద్ధ్యా కుర్వన్ హి బ్రాహ్మణో నరకం వ్రజేత్ ॥
బ్రహ్మాణమింద్రమగ్నిం వా హరేరావణం వినా ।
యస్తు సంపూజయేద్విప్రః స పాషండీ భవేద్ ధ్రువమ్ ॥

ఇత్యాదినా అంగభావేన తేషామర్చనం కుర్వతో దోషాభావస్మరణాచ్చ సూత్రే తథోక్తిః.

తథా-

'అన్యత్ర త్వాం సమారోప్య యద్యుపాసనా విధీయతే ।
సా వృత్తిః ప్రచ్యుతా ప్రోక్తా తవ తత్వం తథైవ చ ॥
త్వయి సర్వం సమారోప్య యద్యుపాసా విధీయతే ।
సా వృత్తిః సకలా జ్ఞేయా తవ తత్వం తథైవ హి' ॥

ఇతి జ్ఞానకాండే కశ్యపేనోపాసన స్వరూపభేద ప్రదర్శనాత్ 'సర్వదేవార్చా భవతీ' తి ముఖ్యత్వేన సూత్రే ప్రతిపాదితత్వాత్ ప్రచ్యుతి ఫల ప్రదత్వాభావాచ్చ తేషా మంగభావేన పూజనం యుజ్యతే.

ఆపస్తంబాది సూత్రేషు సర్వసంస్కారాణాం సద్వారకత్వేన ప్రతిపాదనాత్ నారాయణైకపరత్వేన సకృదపి స్మరణాభావాత్ తేషాం న నారాయణైక పరత్వమ్.

శివశేఖర తంత్రమందు రుద్రుడు-

ఓ దేవి! సమాహితురాలవై వినుము. కర్మదేవలకులు, కల్పదేవలకులు, శుద్ధదేవలకులు అని దేవలకులు మూడువిధాలు.

స్వయంగా అదీక్షితుడై, ఇతరసూత్రాల ప్రకారం ఒక సంవత్సరం పూజ చేసిన వ్యక్తి కర్మదేవలకుడు. ఓ శైలసుత! ఈప్రకారం మూడు సంవత్సరాలు పూజచేసిన వ్యక్తి కల్పదేవలకుడు. ఆచార్యుని అనుమతి లేకుండా ఆగమమును విన్నవాడు, కేవలం శీలరీత్యా (= ఏకలవ్యునివలె) అతని శిష్యుడైనవాడు- ఈ ఇరువురు శుద్ధదేవలకులు. ఇట్లా మూడు విధాలైన దేవలకత్వం విష్ణు విషయంలో వర్తించదు; ఇది రుద్రుడు, కాళి మున్నగువారి విషయముననే; ఇది ఆగమసమ్మతం.

ఇతరస్మృతిలో-

శర్వుని, సూర్యుని, చంద్రుని, దుర్గాది రుద్రదేవతలను అర్చించటానికి పణంకోరితే, అట్టివాడు వెంటనే పతితుడు అవుతాడు. దుర్గ, భద్రకాళి, బుద్ధుడు, క్షేత్రపాలకుడు, పంచాయతనం- ఈపూజలు చేసేవారు ఐదుగురు దేవలకులే. ఆదిత్యుడు, అంబిక, విష్ణువు, గణనాథుడు, మహేశ్వరుడు-అనే ఈపంచాయతనమును గృహమందు పూజించేవారు కూడా పంచదేవలకులలోని వారే.

విష్ణుధర్మోత్తరే-
చండికాయాశ్చ దుర్గాయా జ్యేష్ఠాయా భైరవస్య చ ।
రుద్రస్య పూజకా యే వై తే వై దేవలకాః స్మృతాః ॥ ఇతి.
విష్ణుః-
'దేవార్చనపరో యోఽపి పరార్థం విత్తకాంక్షయా ।
చతుర్వేదధరో విప్రః స చండాలసమో భవే' దితి ॥

ఏవ మేభిర్వచనైః శాస్త్రాననుమతమార్గేణ పూజకానాం దేవతాంతర పూజకానామేవ చ దేవలకత్వం సిద్ధ్యతీతి స్ఫుట మవగమ్యతే.

హారీతః-
'వైఖానసాస్తు యే విప్రా హరిపూజనతత్పరాః ।
న తే దేవలకాః ప్రోక్తా విష్ణుపాదాబ్జసంశ్రయాత్' ॥ ఇతి.

స్మృత్యర్థసారే-అత్రిః -
'వైదికేనైవ విధినా దంభలోభవివర్జితః ।
పూజయే ద్భక్తితో విష్ణుం స హి దేవలకో నవై' ॥ ఇతి.

అన్యథా శ్రుత్యుక్తమార్గేణాలయార్చకానామపి దేవలకత్వే తాదృశాల యార్చన ప్రతిపాదకానాం శ్రుతిస్మృతి పురాణాదివచనానాం వ్యర్థతా స్యాత్.

విష్ణుధర్మోత్తరపురాణంలో-

చండిక, దుర్గ, జ్యేష్ఠ, భైరవుడు, రుద్రుడు-వీరిని పూజించేవారు కూడా దేవలకులే.

విష్ణువు-

'ధనకాంక్షతో పరార్థం దేవతార్చన చేసే వ్యక్తి, చతుర్వేదధరుడైన విప్రుడైనప్పటికీ, చండాలసముడవుతాడు' - ఈ పైవాక్యాల వల్ల, శాస్త్రాను మతిలేని మార్గంలో పూజించే వారు, ఇతర దేవతాపూజకులును దేవలకులు అవుతారని స్పష్టంగా అవగతమవుతున్నది.

హారీతుడు-

'వైఖానసులైన విప్రులు విష్ణుపాదాలను ఆశ్రయించిన వారు కావటంచేత, విష్ణుపూజాతత్పరులైనప్పటికీ దేవలకులుకారు.

స్మృత్యర్థసారమందు అత్రి-

'వైదికమార్గంలో, దంభవివర్జితుడై, విష్ణువునుభక్తితో పూజించేవ్యక్తి దేవలకుడు కాడు! అట్లాకాకపోతే, వేదోక్తప్రకారంగా ఆలయార్చన చేసేవారు కూడా దేవలకులు అయితే, ఇంక ఆ ఆలయార్చనను ప్రతిపాదించే శ్రుతి-స్మృతి-పూరాణాదుల వచనములు వ్యర్థములు అవుతాయి.

నను-అజ్ఞానతః కృతమపి భగవదారాధన మపవర్గ ప్రదంచేత్ - వినా శాస్త్ర అనధికారిణాపి కృతం తత్ అపవర్గప్రదం కిం న స్యాదితి చేత్-న. భగవదాజ్ఞాభంగాపత్తేః. యథోక్తం భగవతా-

'యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్' ॥ ఇతి.
'శ్రుతి స్మృతీ మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్య వర్తతే ।
అజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ మద్భక్తోఽపి న వైష్ణవః' ॥ ఇతి.
'మమ చాపి ప్రియం విష్ణోర్దేవదేవస్య శార్ఙ్గిణః ।
మానుషో వైదికాచారం మనసా ఽపి న లంఘయేత్' ॥ ఇతి.

అతః అనధికారిణా కృతం శాస్త్రసమ్మతమితి తంత్రోక్త ప్రకారేణ కృతమపి తత్ నాపవర్గప్రదమ్.

ప్రథమం మంత్రసిద్ధాంతం ద్వితీయం చాగమాహ్వయమ్ ।
తృతీయం తంత్ర సిద్ధాంతం తంత్రాంతరమతః పరమ్ ॥ ఇతి.

చతుర్విధేషు సిద్ధాంతేషు-

'ఏకత్ర దీక్షితస్తంత్రే సిద్ధాంతే వా ద్విజోత్తమ ।
క్రియాం న కుర్యాదన్యత్ర కర్షణాది చతుర్ముఖ ॥
ఆచార్యమథార్త్విజ్యం పూజాం చ మధువిద్విషః ।
మంత్రే దేవే చ సిద్ధాంతే తదేవాస్య హి యుజ్యతే ॥ ఇతి.

ఆక్షేపణ- అజ్ఞానంతో భగవదారాధన చేసినప్పుడు కూడా ముక్తి లభించేటప్పుడు, అనధికారి అయిన వ్యక్తి శాస్త్రమార్గం విడిచి, భగవదారాధనచేసినప్పుడు వానికి అపవర్గం ఎందుకు లభించదు? ఇదితప్పు; భగవదాజ్ఞాభంగం సంభవిస్తుంది కావున.

భగవంతుడు ఎట్లు చెప్పెననగా-

'శాస్త్రవిధిని విడిచి, తన ఇష్టంవచ్చినట్లు అరాధనచేసేవానికి సిద్ధి లభించదు; సుఖము, ఉత్తమగతి లభించవు. శ్రుతిస్మృతులు నా అజ్ఞలే. వాటిని ఉల్లంఘించి నడచుకొన్నవాడు, నా ఆజ్ఞాచ్ఛేదం చేసిన చేసినవాడే. నాకు ద్రోహి. అతడు నాభక్తుడైనప్పటికీ వైష్ణవుడు కాడు.

అందువల్ల, అనధికారి అయిన వానిచేత చేయబడేది శాస్త్ర సమ్మతం కాదు. కావున, తంత్రోక్తప్రకారం చేసినా అది అపవర్గప్రదంకాదు.

మంత్రసిద్ధాంతం ప్రథమం, (వైఖానస) ఆగమం ద్వితీయమే, తంత్ర సిద్ధాంతం ( = పంచరాత్రం) తృతీయం, తక్కినవన్నీ ఇతర తంత్రములు-అనే ఈ చతుర్విధ సిద్ధాంతములలో ఒక తంత్రమున కానీ, ఒక సిద్ధాంతం ప్రకారం కానీ దీక్షితుడైన వ్యక్తి, భిన్నతంత్రముల ప్రకారం ఆచరింపరాదు. విష్ణువు యొక్క పూజకాని, యజ్ఞములందలి ఋత్విక్కుతనంలోకాని, ఆచార్యకత్వంలోకాని, మంత్రవిషయంలో దేవవిషయంలో సిద్ధాంతవిషయంలో ఇతరములు పనికిరావు.

ఇతర సూత్రిణాం కథమితి చేత్- స్వాశ్రమ ధర్మాచరణేనైవ భగవదారాధనఫలం సిద్ధ్యతి. యథాచోచ్యతే:

స్మృతిషు-

'బహ్వల్పం వా స్వగృహ్యోక్తం యస్య కర్మ ప్రచోదితమ్ ।
తస్య తావతి శాస్త్రార్థే కృతే సర్వం కృతం భవేత్ ॥' ఇతి.

శ్రీవిష్ణుపురాణే-

'వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్ ।
విష్ణురారాధ్యతే పంథా నాన్యస్తత్తోషకారకః' ॥ ఇతి.

తథా ऽన్యత్ర-

'వర్ణాశ్రమేషు యే ధర్మాః శాస్త్రోక్తా మునిసత్తమ ।
తేషు తిష్ఠన్నరో విష్ణుమారాధయతి నాన్యథా ॥
యే యజంతి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాంశ్చ హుతాశనమ్ ।
సర్వభూతాంతరాత్మానం విష్ణుమేవ యజంతి తే ॥' ఇతి.

పురాణాంతరే-

'అగ్నికార్యం జపం స్నానం తపస్స్వాధ్యాయమేవ చ ।
తమేవోద్దిశ్య దేవేశం కురు నిత్యమతంద్రితః ॥
ప్రాతరుత్థాయ విధివత్ స్నాత్వా నిత్యం సమాహితః ।
యజేత కర్మభిస్తైస్తైః విష్ణుం దేవాది సంజ్ఞితమ్ ॥ ఇతి.

ఇంక ఇతర సూత్రానుయాయులగతి ఎట్లు అంటే-తమతమ ఆశ్రమ ధర్మములను ఆచరించటంవల్లనే వారికి భగదారాధన ఫలం సిద్ధిస్తుంది.

స్మృతులందు ఇట్లా చెప్పబడినది కూడా - 'స్వగృహ్యసూత్రములందు ఉపదేశింపబడినది, అది అల్పమైనను అధికమైనను, అంతమాత్రమే చేసినచో, అంతాచేసినట్లే అవుతుంది'.

శ్రీవిష్ణుపురాణమందు-

'వర్ణాశ్రమాచారములను పాటించే పురుషుడు పరమపురుషుడైన విష్ణువునే ఆరాధించుచున్నాడు. అన్యమైనది ఆయనకు తృప్తికరంకాదు'.

అట్లే ఇతర స్థలములందును-

'వర్ణాశ్రమములందు, శాస్త్రోక్తములైన ధర్మములను ఆచరించే వ్యక్తి, ఓ మునిసత్తమా! విష్ణువునే ఆరాధించిన వాడు అవుతున్నాడు; ఇతర ప్రకారం చేస్తే తప్పు. పితృదేవతలను, దేవతలను, బ్రాహ్మణులను, అగ్నిని ఆరాధించేవారు సర్వభూతాంతరాత్ముడైన విష్ణువునే ఆరాధించు చున్నాడు'.

ఇతరపురాణంలో-

'అగ్నికార్యం, జపం, స్నానం, తపస్సు, స్వాధ్యాయం- వీటిని, సోమరి తనంలేకుండా, నిత్యం, దేవేశుడైన ఆ విష్ణువును ఉద్దేశించియే చేయుము. ప్రాతః కాలముననే లేచి, విధిప్రకారం స్నానంచేసి, సమాహితమైన మన స్సుతో, ఆయాకర్మలద్వారా దేవాదిసంజ్ఞితుడైన విష్ణువును యజించవలెను'.

శాండిల్యః-

ప్రవృత్తైశ్చ నివృత్తైశ్చ స్వర్గదైర్మోక్షదైరపి ।
ఆరాధ్యో భగవానేవ వేదధర్మైస్సనాతనైః ॥
స ఏవ సర్వథోపాస్యో నాన్య స్సంసారతారకః ।
ఉభాభ్యాం జ్ఞానకర్మభ్యా మారాధ్యో భగవాన్ హరిః ॥ ఇతి.

'విఖనసా ప్రణీతత్వాత్' ఇతి ప్రథమో హేతుః నిరూపితః.

# ద్వితీయో హేతుః

అథాస్య వైఖానస సూత్రస్య సర్వసూత్రాణామాదిత్వం నిరూప్యతే.
తథా హి బ్రహ్మవైవర్తే-

యథా మునీనాం విఖనా ఆదిభూత ఉదాహృతః ।
సూత్రాణాం తత్ప్రణీతం తు తథా శ్రేష్ఠతమం స్మృతమ్ ॥ ఇతి.

పురాతంత్రే భృగుః-

వేదానాం వ్యాసనాదర్వాక్ ప్రాగ్రూపం మిలితంతు యత్ ।
తాంతు వైఖానసీం శాఖామితి వేదవిదో విదుః ॥

ఇత్యారభ్య-

వైష్ణవం సూత్రమేతద్ధి సర్వసిద్ధికరం పరమ్ ।
ఆద్యత్వాత్సర్వసూత్రాణాం వైష్ణవత్వాచ్చ తత్తు వై ॥
మయా ఽనువర్తితం తద్వత్కాశ్యపాత్రిమరీచిభిః ॥ ఇతి.

స్కాందేచ-

వైఖానసీం మహాశాఖాం స్వసూత్రే వినియుక్తవాన్ ।

శాండిల్యుడు-

ప్రవృత్తికరములు, నివృత్తికరములు, స్వర్గదాయకములు, మోక్షదాయక ములు అయిన సనాతనవేదధర్మములచేత భగవంతుడే ఆరాధింపదగినవాడు. అన్నివిధాలుగా ఆయనయే ఉపాస్యుడు. సంసారతారకుడు. ఆయనకాక మరి యొకడులేడు. జ్ఞాన-కర్మలు రెండింటిచేతను భగవంతుడైన హరియే ఆరాధ్యుడు.

కాగా, 'విఖనసుడు రచించినాడు' అనే మొదటి హేతువు నిరూపితమైనది.

# ద్వితీయ హేతువు

ఈ వైఖానససూత్రం అన్ని సూత్రములకు మొదటిదని నిరూపింప బడుతున్నది. ఎట్లనగా-

బ్రహ్మవైవర్తమునందు-

మునులలో విఖనసుడు ఆదిభూతుడు. ఆయనచేత ప్రణీతములైన సూత్ర ములు అన్నింటికంటె శ్రేష్ఠమైనవి.

పురాతంత్రమున భృగువు-

వేదముల విభజనకు పూర్వంఉన్న రూపమునకు 'వైఖానసీ శాఖ' అనిపేరు- ఇది వేదవేత్తలకు తెలుసును అని ప్రారంభించి;

ఈ సూత్రం వైష్ణవం, పరమమైనది, సర్వసిద్ధికరమైనది. సర్వసూ త్రములకు ఆదిమమైనది. వైష్ణవమైనది. అందుచేత నేను కాశ్యపాత్రి మరీచులు - మేం నలుగురం దీనిని ప్రవర్తింపజేసినాము.

స్కాందమునందును-

పరముడు పద్మభవుడు అయినధాత, స్వసూత్రమున 'వైఖానసి' అనే మహావేదశాఖను వినియోగించుకొనెను.

**పద్మభూః పరమో ధాతా తస్మిన్నారాధనత్రయమ్ ॥**
**ఉక్తవాన్ నిగమార్థానామాచారం ప్రవిభాగశః ॥ ఇతి.**

సూత్రార్థపర్యాలోచన యాఽపి సర్వసూత్రాదిత్వ మస్యావగమ్యతే. యథా- 'ముఖాదింద్రశ్చాగ్నిశ్చ' ఇతి భగవన్ముఖాదగ్ని సృష్టిః శ్రూయతే. ఏవం పరమ పురుషముఖాజ్జాతస్యోపాసనాగ్నేః కుండవిధానాదికమత్రైవ సూత్రే ప్రతిపాదితమ్. కించ నవగ్రహమఖే సవితృమండలస్య చతురశ్రత్వ ముచ్యతే 'చతురశ్రవృత్త' మిత్యాదినా (సూత్రే). అదౌ చతురశ్రస్య సతో రవిమండలస్య కాలాంతరే వృత్తత్వకల్పనమ్ ప్రమాణైరవగమ్యతే.

ఏవం చ సూర్యసావర్ణిక మన్వంతరమారభ్య రవిమండలస్య వృత్తాకారప్ర తీతిః. తదనుసారేణ బోధాయనాదిభిః వృత్తాకారత్వం రవిమండలస్యోక్తమ్. తతః పూర్వం చతురశ్రత్వమేవ తదేవాస్మిన్ సూత్రే ప్రతిపాదితమ్. ఏవం 'వానప్రస్థో వైఖానసశాస్త్ర సముదాచారో వైఖానస' ఇతి వైఖానస సూత్రమనుస్మృత్య తృతీయాశ్రమధర్మాన్ బోధాయనః ప్రతిపాదయతి.

తథా అగ్ని వైశ్యసూత్రే అథాతస్సూత్రగణనాం వ్యాఖ్యాస్యామః. బోధా యనమాపస్తంబం సత్యాషాఢంద్రాహ్యాయణమాగస్త్యం శాకల్యమాశ్వలాయనం శాంభవీయం కాత్యాయనమితి నవాని పూర్వసూత్రాణి. వైఖానసం శౌన కీయం భారద్వాజమాగ్నివైశ్యం జైమినీయం వాధూలం మాధ్యందినం హిరణ్యకేశీయం కౌషీతకమితి నవాన్యపరసూత్రాణి. ఏవమష్టాదశ సూత్రాణ్య ష్టాదశ సూత్రకారశ్చ. ఏతాని చతుర్వేదమూలాని పూర్వసూత్రాణి శారీరాణి సామాన్యాని భవంతి. ఉత్తర సూత్రాణి వైఖానసాదీని విష్ణుసంబంధీని దైవికానీతి వైఖానస సూత్రస్యాదిత్వం వైష్ణవత్వం చోచ్యతే.

వైఖానసీశాఖలో ఆరాధనాత్రయం ఉంది; వేదార్థముల యొక్క ఆచారం విభక్తపూర్వకంగా వివరింపబడింది.

వైఖానస సూత్రార్థమును పర్యాలోచనం చేసినా, అదిసర్వ సూత్రములకు మొదటి సూత్రమని అవగతమవుతున్నది. ఎట్లనగా- 'ముఖాదింద్రశ్చాగ్నిశ్చేతి' (= ముఖం నుంచి ఇంద్రుడు, అగ్ని అని) అంటే భగవంతుని ముఖం నుంచి అగ్ని సృష్టి అయినదని వేదం చెప్పుచున్నది. అట్లాగే పరమపురుషుని ముఖం నుంచి పుట్టిన ఔపాసనాగ్నికి కుండవిధానాదులు ఈ సూత్రమందే ప్రతిపాదింపబడినవి.

మరియు, నవగ్రహ మఖంలో సూర్యమండలం చతురశ్రమని చెప్ప బడినది - 'చతుశ్రం వృత్తం' (= చతురశ్రమైన వృత్తము) ఇత్యాదిగా. ఈ సూత్రమున- మొదట చతురశ్రంగా ఉన్న రవిమండలం కాలాం తరమున వృత్తత్వమును చెందినదని ప్రమాణములతో అవగతమవుతున్నది. ఇట్లే సూర్యసావర్ణిక మన్వంతరం మొదలు సూర్యమండలం వృత్తాకారంగా ప్రతీతమవుతున్నది. తదనుసారంగా బోధాయనాదులు రవిమండలం వృత్తా కారమని చెప్పినారు; అంతకుపూర్వం చతురశ్రమే- ఇదే ఈ సూత్రంలో ప్రతిపాదింపబడినది. అట్లాగే వానప్రస్థుడు వైఖానసశాస్త్ర సముదాచారుడు "వైఖానసుడు" అని వైఖానససూత్రమును అనుసరించి బోధాయనుడు తృతీయాశ్రమ ధర్మములను బోధించెను.

ఇంక అగ్నివైశ్యసూత్రమందు, ఆ సూత్రగణనను వ్యాఖ్యానిస్తాము.

బోధాయనం, ఆపస్తంబం, సత్యాషాఢం, ద్రాహ్యాయణం, అగస్త్యం, శాకల్యం, అశ్వలాయనం, శాంభవీయం, కాత్యాయనం- అనే తొమ్మిది పూర్వసూత్రములు. వైఖానసం, శౌనకీయం, భారద్వాజం, అగ్నివైశ్యం, జైమినీయం, వాధూలం, మాధ్యందినం, హిరణ్యకేశీయం, కౌషీతకం-అనే తొమ్మిది అపరసూత్రములు. ఇట్లా సూత్రములు పదునెనిమిది; సూత్రకారులు పదునెనమంద్రు. ఇవి చతుర్వేద మూలకములు. పూర్వసూత్రములు శారీరములు, సామాన్యములు ఉత్తర సూత్రములు అయిన వైఖానసాదులు విష్ణుసంబంధులు, దైవికములు- ఇట్లా వైఖానస సూత్రం యొక్క ఆదిమత్వం, వైష్ణవత్వం చెప్పబడినది.

# తృతీయో హేతుః

అథాస్య శ్రీవైఖానససూత్రస్య సూత్రాంతరాపేక్షయా వైలక్షణ్యాపాదకం ప్రత్యక్ష శ్రుతిమూలకత్వమస్తీతి జ్ఞాపయితుం 'సర్వకర్మసు శ్రుతిమార్గానుసారిత్వా' దితి తృతీయో హేతుర్నిరూప్యతే.

తథాహి-

శుద్ధాచమనవిధౌ 'యత్ త్రిరాచామతి తేన ఋచః ప్రీణాతి' ఇత్యాది శ్రుత్యనుసారేణసూత్రే 'ఋగ్వేదః ప్రీణా' తీత్యాదినా శుద్ధాచమనముక్తమ్.

నను-బోధాయనేనాపి శుద్ధాచమనవిధిరుక్త ఇతి చేత్ సత్యమ్. 'ఆచమనవిధిం వ్యాఖ్యాస్యామః' ఇత్యారభ్య 'గోకర్ణబద్ధహస్తేన త్రిరాచామేత్ ప్రథమం యత్పిబతి తేన ఋగ్వేదం ప్రీణాతి యద్ద్వితీయం తేన యజుర్వేదం యత్ తృతీయం తేన సామవేదం ప్రీణాతీ' త్యాచమనేన ఋగ్వేదాదీనాం ప్రీతిర్భవతీత్యుక్తమ్. న తు మంత్రః.

శ్రుతిస్మృతి సూత్రవిహితస్య సంధ్యోపాసనస్య ప్రధానభూతార్ఘ్య ప్రదానాదికమత్రైవ ప్రతిపాదితమ్. 'ప్రాతస్సూర్యశ్చే త్యాదినాఽఽచమ్య ఆపో హిష్ఠాదిభిః తిసృభిః ప్రోక్ష్య గాయత్ర్యాఽపోఽభిమంత్ర్య ఆదిత్యాభిముఖం విక్షిప్య ప్రదక్షిణం కరోతి' ఇత్యాది. శ్రుతిమార్గానుసారిత్వే కో విశేష ఇతి చేత్- ఉచ్యతే. శ్రుతిమూలత్వే హి ప్రామాణ్యాతిశయసంభవః.

యథాహ మునిః-

**వేదస్స్మృతి స్సదాఽఽచారః స్వస్యచప్రియమాత్మనః ।**
**ఏతచ్చతుష్టయం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్ ॥**

# తృతీయ హేతువు

తరువాత, ఈ వైఖానససూత్రం ఇతరసూత్రములదృష్టితో విలక్షణమైన ప్రత్యక్ష శ్రుతిమూలకత్వం కలదని తెలుపుటకై 'అన్నికర్మలయందు వేదమార్గమును అనుసరించునది కావటంచేత' అనే తృతీయ హేతువు నిరూపింపబడుతున్నది.

అట్లెకదా-

శుద్ధాచమనవిధియందు 'మూడుసార్లు అచమనం చేయుటం వల్ల ఋక్కులకు ప్రీతి కలుగుతుంది' అనేవేదవాక్యమును అనుసరించి, ఈసూత్రమందు ఋగ్వేదము ప్రీతి చెందునుగాక' ఇత్యాదిగా శుద్ధాచమనము ఉపదేశింపబడినది.

'ఓయి! బోధాయనుడు కూడా శుద్ధాచమనవిధిని బోధించినాడు కదా?' అంటే, అది సత్యమే. 'అచమనవిధిని వ్యాఖ్యానిస్తాము' అనిప్రారంభించి, 'గోకర్ణమువలె బద్ధమైన హస్తంతో మూడుసార్లు అచమించవలెను. ప్రథమ పానముతో ఋగ్వేదము ప్రీతిచెందును. 'ద్వితీయంవల్ల యజుర్వేదం, తృతీయంవల్ల సామవేదం ప్రీతిచెందును' అని అచమనం చేత ఋగ్వేదాదులకు ప్రీతికలుగునని చెప్పబడినది; మంత్రము చెప్పబడలేదు.

శ్రుతి-స్మృతి-సూత్ర విహితమైన సంధ్యోపాసనలో ప్రధానభూతమైన అర్ఘ్యప్రదానాదులు ఇందులోనే ప్రతిపాదింపబడినవి. "ప్రాతఃకాలమున 'సూర్యశ్చ' ఇత్యాది మంత్రములతో అచమించి, అపోహిష్ఠాది మూడు ఋక్కులతో మార్జన చేసుకొని, గాయత్రిమంత్రంతో జలములను అభిమంత్రించి, అదిత్యాభిముఖంగా, పైకిచల్లి, ప్రదక్షిణము చేయుచున్నాడు" ఇత్యాదులు. వేదమార్గమును అనుసరించటంలో విశేషం ఏమిటి? అంటే, వేదమూలకమైనప్పుడే ప్రామాణ్యాతిశయం సంభవించును.

మనువుకూడ ఇట్లాగే చెప్పినాడు-

'వేదము, స్మృతులు, సదాచారము, తన అంతరాత్మప్రీతి-ఈనాలుగును సాక్షాత్తుగా ధర్మం యొక్క లక్షణములు'.

సర్వంతు సమవేక్ష్యేతదఖిలం జ్ఞానచక్షుషా ।
శ్రుతి ప్రామాణ్యతో విద్వాన్ స్వధర్మే నివిశేతవై ॥ ఇతి.

శ్రీభారతే-

'వేదప్రణిహితో ధర్మో హ్యధర్మస్తద్విపర్యయః ।
వేదో నారాయణస్సాక్షాత్స్వయంభూరితి శుశ్రుమ' ॥ ఇతి.

ప్రచేతాః-

'అమీమాంస్యా బహిశ్శాస్త్రాయో చాన్యే వేదవర్జితాః ।
యత్తద్ బ్రూయుర్న తత్కుర్యాద్వేదాద్ధర్మో విధీయతే' ॥ ఇతి.

స్మృత్యంతరే-

'ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమం శ్రుతిః ।
ద్వితీయం ధర్మశాస్త్రంతు తృతీయం లోకసంగ్రహః' ॥ ఇతి.

ఏతావతా సర్వకర్మసు శ్రుతిమార్గానుసారిత్వరూపః తృతీయో హేతుర్నిరూపితో భవతి. తథాచ శ్రుతిమార్గానుసారిత్వాదస్య సూత్రస్య సర్వసూత్రోత్తమత్వం సిద్ధ్యతి ఇతి నిరూపిత స్తృతీయోహేతుః.

# చతుర్థో హేతుః

ఇదానీం తావత్ వైఖానససూత్రోక్తధర్మానుష్ఠానేన అనంతస్థిరఫలప్రాప్తిః సత్కులీనత్వం ఫలభూయస్త్వమపి భవతీతి జ్ఞాపయితుం 'సమంత్రకసర్వక్రియా ప్రతిపాదకత్వా' దితి చతుర్థో హేతుర్నిరూప్యతే.

దీనినంతటిని జ్ఞాననేత్రంతో బాగాపరిశీలించి, విద్వాంసుడైనవాడు వేద ప్రామాణ్యంతో స్వధర్మమునందు ప్రతిష్ఠితుడు కావాలి.

శ్రీ భారతమునందు--

వేదప్రణిహితమైనదే ధర్మం. తద్విరుద్ధమధర్మం. వేదము సాక్షాత్తుగా స్వయంభువు అయిన నారాయణుడే అని వింటిమి.

ప్రచేతుడు-

వేదవిరుద్ధములైన బయటి శాస్త్రములను చర్చింపరాదు. అవి చెప్పినవి ఆచరింపరాదు. వేదమువలననే ధర్మము విధింపబడినది.

ఇతరస్మృతియందు--

'ధర్మం తెలిసికొనగోరువారికి మొదటి ప్రమాణం వేదం. ద్వితీయమే ధర్మశాస్త్రం. తృతీయం లోకం'.

ఇంతటితో, 'అన్ని కర్మలందును వైఖానససూత్రం వేదమార్గమును అనుసరించును' అనే తృతీయ హేతువు నిరూపితమైనది. అందుచేత శ్రుతిమార్గమును అనుసరించే ఈ సూత్రము సర్వ సూత్రములకంటె ఉత్తమమైనది అని సిద్ధించుచున్నది. ఇట్లా తృతీయహేతువు నిరూపితమైనది.

# చతుర్థ హేతువు

ఇప్పుడు వైఖానససూత్రోక్త ధర్మానుష్ఠానంచేత అనంత స్థిర ఫలప్రాప్తి, సత్కులీనత్వం, ఫలబాహుల్యం కలుగునని తెలుపుటకై సమంత్రక సర్వక్రియా ప్రతిపాదకం కావటం అనే చతుర్థహేతువు నిరూపింపబడుతున్నది.

తద్యథా-

అత్ర సూత్రే నిత్యానుష్ఠానవిధౌ 'ఇంద్రో౽హాముభాభ్యామి' త్యారభ్య కరప్రక్షాలనాదీని సమంత్రకత్వే నోక్తాని. బ్రహ్మయజ్ఞే ఋతంచ సత్యంచే త్యాది విశేషః. పుణ్యాహే సమంత్రకత్వం స్పష్టమ్. సూత్రాంత రేష్వనుక్త మౌపాసనాగ్నికుండవిధానం ప్రతిపాదితమ్. ఆఘారవిధౌ సమంత్రకత్వం సిద్ధమ్. అంతహోమే తథైవ. నాందీముఖపూర్వకోపనయనాదిషు శారీరేషు సమంత్రకత్వం ప్రత్యక్షమ్. స్థాలీపాకాదిషు పూర్వవ దిత్యనేన పూర్వం విస్తరేణ ప్రతిపాదితస్యాఘారవిధేః ప్రయోగసౌకర్యార్థం సంక్షేపేణ ప్రతిపాదనమ్. అపరక్రియాయామప్యస్తి సమంత్రకత్వమ్. తత్రక్వచిత్ 'తూష్ణీ' మిత్యుక్తత్వాత్ సమంత్రకత్వం నాస్తీతి స్వయమేవాశంక్య ప్రకారాంతరేణ సమంత్రకత్వం ప్రత్యపాదయత్. తత్ర తత్ర క్వచిత్ మంత్రయోగ్యతాభా వేపి విహితవిషయే సర్వత్ర సమంత్రకత్వమస్తీత్యవగమ్యతే. సూత్రాంతరేషు విహితవిషయేష్వపి సమంత్రకత్వానుక్తేః తేషాం సమంత్రక సర్వక్రియాత్వం నాస్తి తత్ర అపరక్రియాయామపి సూత్రాంతరాన పేక్షా దృశ్యతే. బోధా యనేన అగ్నిముఖాదిషు పరిధిపరిస్తరణాదిక్షేపణం తూష్ణీమేవోక్తమ్. అతః శారీరేషు సమంత్రకసర్వక్రియా ప్రతిపాదనాత్ పూర్ణత్వం, పూర్ణత్వాదేవ సర్వసూత్రోత్తమత్వం చాస్య సూత్రస్య సిద్ధమితి నిరూపితః చతుర్థో హేతుః.

ఎట్లనగా

ఈ సూత్రమున నిత్యానుష్ఠానవిధియందు- 'రెండింటిచేతను నేను ఇంద్రుడను' అని ప్రారంభించి, హస్తప్రక్షాళనాదులు సమంత్రకంగానే విధింపబడినవి. బ్రహ్మయజ్ఞంలో 'ఋతంచ సత్యంచ' అనే మంత్రం అధికంగా ఉన్నది. పుణ్యాహవాచనములందు సమంత్రకత్వం స్పష్టమే- ఇతర సూత్రములందు లేని ఔపాసనాగ్ని కుండవిధానం ప్రతిపాదించబడింది. అఘారవిధియందు సమంత్రకత్వం సిద్ధంగా ఉన్నది. అంతహోమమందును ఇట్లే. నాందీముఖ పూర్వకములైన ఉపనయనాది శారీరములందు సమంత్రకత్వం ప్రత్యక్షంగా కనపడుతున్నది. స్థాలీపాకాదులందు 'పూర్వమువలెనే' అని చెప్పినవాక్యంచేత పూర్వం సవిస్తరంగా ప్రతిపాదితమైన అఘారవిధి ప్రయోగ సౌకర్యార్థం సంక్షిప్తంగా ప్రతిపాదితమైనది. అపరక్రియలయందు కూడా సమంత్రకత్వమే ఉన్నది. అక్కడ క్వాచిత్కంగా 'తూష్ణీం' ( = మంత్రంలేకుండా ఊరక) అని చెప్పటంవల్ల సమంత్రకత్వంలేదని తాను స్వయంగా శంకించి, ప్రకారాంతరంగా సమంత్రకత్వమును ప్రతిపాదించినాడు. అక్కడక్కడ క్వాచిత్కంగా మంత్రయోగ్యత లేకపోయినా, విధించిన విషయములందంతటా సమంత్రకత్వమున్నదని అవగతమవుతున్నది. ఇతర సూత్రములందన్ననో, విధించిన విషయములలోకూడా సమంత్రకత్వం చెప్పకపోవటంచేత అవి సమంత్రక సర్వక్రియలుకలవి అని చెప్పటకు వీలులేదు. వాటిల్లో, అపరక్రియలయందు కూడా ఇతర సూత్రములను ఆశింపకుండటం గోచరిస్తున్నది.

బోధాయనుడు అగ్నిముఖాదులయందు పరిధులను వేయటం ( = ఒక్కొటొక్కటిగా పలాశసమిధులను అగ్నిచుట్టూ పరచటం), పరిస్తరణలను వేయటం ( = 16 దర్భలను అగ్నిచుట్టూ పరచటం) అమంత్రకంగానే చెప్పినాడు. అందువల్ల శారీరములైనసంస్కారములందు సమంత్రకంగా సర్వక్రియలను ప్రతిపాదించేదికావున ఈ సూత్రముపూర్ణమైనది. కనుకనే అన్ని సూత్రములలో ఉత్తమమైనది అని సిద్ధించినది. ఇట్లా చతుర్థహేతువు నిరూపితమైనది.

# పంచమో హేతుః

అథాస్య శ్రీవైఖానససూత్రస్య సర్వోత్తమత్వే తత్సూత్రోక్తధర్మానుష్ఠాతౄణామపి సర్వోత్కృష్టత్వే చ ఇతరసూత్రేషు ముఖ్యత్వేనానుపపన్నం నిషేకాదిసంస్కారాదిమత్త్వమస్య సూత్రస్య ముఖ్యత ఏవోపపద్యత ఇతి జ్ఞాపయితుం నిషేకాది సంస్కారాదిమత్త్వాదితి పంచమో హేతుర్నిరూప్యతే.

యథా-

'అథ నిషేకాదిసంస్కారాన్ వ్యాఖ్యాస్యామః, ఋతుసంగమనే', త్యుపక్రమ్య ప్రాణిగ్రహణా న్త్యంతేన శరీరసంస్కారా నిషేకసంస్కారపూర్వకత్వేన ప్రతిపాదితాః.

నను- జాతకోపనయన వివాహోనాంతరభావినో నిషేకస్య కథమాదిత్వం ప్రతిపాద్యతే? తథా 'బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్' 'మనసైవ భూతాని పూర్వం దక్షోఽసృజత్తదా' ఇత్యాది శ్రుతిస్మృతిషు నిషేకేన వినా ఉత్పత్తి దర్శనాచ్చ నిషేకస్య కిమర్థమాదిత్వం ప్రతిపాద్యతే. జాతకస్యాదిత్వం శ్రీభారతే చావగమ్యతే.

'జాతకర్మాదిభిర్యస్తు సంస్కారైః సంస్కృతశ్శుచిః ।
వేదాధ్యయన సంపన్నష్షట్సు కర్మస్వవస్థితః ॥
శౌచాచారరతస్సమ్యక్ విఘసాశీ చ గురుప్రియః ।
నిత్యవ్రతస్సత్యపరః స వై బ్రాహ్మణ ఉచ్యతే' ॥ ఇతి.

ఏవం హరివంశే-

'శ్వ దా[illegible] బావవిపర్యయః ।

# పంచమ హేతువు

ఈ వైఖానససూత్రం సర్వోత్తమం కావటం, ఆసూత్రోక్తధర్మానుష్ఠాతలు సర్వోత్కృష్టులు కావటం, ఇతరసూత్రానుయాయులకు ముఖ్యంకాని నిషే కాది సంస్కారములు ఈ సూత్రమునందే ముఖ్యములుకావటం తెలుపుటకై 'నిషేకాది సంస్కారములు కలది కావటం వల్ల' అనే పంచమ హేతువు నిరూపింపబడుతున్నది.

ఎట్లనగా--

"తరువాత నిషేకాది సంస్కారాలను వ్యాఖ్యానింతుము అని ప్రారంభించి 'ఋతుసంగమనమందు' అని ఉపక్రమించి, పాణిగ్రహణము అంతమందుగల శరీరసంస్కారములు నిషేకసంస్కారముతో ప్రారంభింపబడుతున్నవి" అని ప్రతిపాదింపబడినది.

ఓయి! జాతకునియొక్క ఉపనయన వివాహానంతరం సంభవించే నిషే కము మొదటిది ఎట్లగును? అది అట్లే. 'బ్రాహ్మణుడు ఆయన ముఖమాయెను', 'పూర్వం అప్పుడు దక్షుడు ప్రాణులను మనస్సుచేతనే సృజించెను'- ఇత్యాదిగా శ్రుతిస్మృతులందు నిషేకములేకుండనే జన్మలు వర్ణింపబడినవికదా! మరి నిషేకము ఎట్లు మొదటిదగును?

అంతేకాదు. జాతకర్మ మొదటిదని శ్రీభారతంవల్ల అవగతమవుతున్నది.

'జాతకర్మాదిసంస్కారములచేత, సంస్కృతుడై, శుచియై, వేదాధ్యయన సంపన్నుడై, షట్కర్మలయందు నియతుడై, శౌచాచారవ్రతుడై, భిక్షార్థియై, గురుప్రియుడై, నిత్యవ్రతుడై, సత్యపరుడైనవాడు బ్రాహ్మణుడు' అని చెప్ప బడుతున్నది కదా?

ఇట్లే హరివంశమున--

భార్యలెక్కడ? సంపర్కమెక్కడ? భావ విపర్యయమెక్కడ? ఈప్రజ అంతా బ్రహ్మమనస్సుచేత మానసప్రజగా, సృష్టింపబడినది.

యదియం బ్రహ్మణాః సృష్టా మనసా మానసీ ప్రజా ॥
యద్యస్తి తపసో వీర్యం యుష్మాకం విదితాత్మనామ్ ।
సృజధ్వం మానసాన్ పుత్రాన్ ప్రాజాపత్యేన కర్మణా ॥

ఇతి నిషేకం వినాపి ఉత్పత్తిః శ్రూయతే ఇతి నిషేకస్యాదిత్వం న సంభవతి ఇతి చేత్ తదసత్.

నిషేక విరహే ఽపి ఉత్పత్తి స్సంభవతీత్యేతన్నోపపద్యతే ।

తపోబలాద్యోగబలాచ్చ భగవతోనారాయణస్య బ్రహ్మణో మహర్షిణాం వా మానసప్రజాసృష్టౌ శక్తిస్సంభవతి. నాన్యేషామ్.

యథా

శ్రీవిష్ణుపురాణే -

'సంకల్పాద్దర్శనాత్ స్పర్శాత్ పూర్వేషామభవన్ ప్రజాః ।
తపోవిశేషైరిద్ధానాం తదాఽత్యంతతపస్వినామ్' ॥
'యుగే యుగే భవంత్యేతే దక్షాద్యామునిసత్తమాః ।
పునశ్చైవనిరుధ్యంతే విద్వాంస్తత్ర న ముహ్యతి ॥
కనిష్ఠ్యం శ్రైష్ఠ్యమప్యేషాం పూర్వం నాస్తి ద్విజోత్తమ ।
తప ఏవ గరీయో ఽభూత్ ప్రభావశ్చైవ కారణమ్' ॥ ఇతి.

అథ నిషేకాదిత్వే కో విశేష ఇతిచేత్ -ఉచ్యతే. నిషేకాదిక్రియావతామేవ శ్రోత్రియత్వం ధర్మశాస్త్రాధికారిత్వం బ్రహ్మశరీరత్వం చ బోధాయనాదిభిరుక్తమ్.

యథా-

నిషేకే గర్భసంస్కారే జాతకర్మక్రియాసు చ ।
విధివత్సంస్కృతా మంత్రైఃచీర్ణా వ్రతసమాపనాత్ ॥

ఆత్మవేత్తలగు మీరు తపశ్శక్తి ఉంటే ప్రాజాపత్య కర్మ ద్వారా మానస పుత్రులను సృజింపుడు అని- నిషేకము లేకుండనే ఉత్పత్తి జరుగగలదని తెలియుచున్నది కాన నిషేకమునకు ఆదిమత్వం సంభవించదు అని అంటే, ఈ భావంతప్పు. నిషేకములేకుండా ఉత్పత్తి సంభవించుననే భావం పొసగదు. తపోబలంవల్ల, యోగబలంవల్ల, భగవంతుడగు నారాయణునకు, బ్రహ్మకు మహర్షులకు మానసప్రజాసృష్టియందు శక్తి ఉంటుంది. ఇతరులకు ఉండదు.

ఎట్లనగా

శ్రీవిష్ణుపురాణమందు-

'సంకల్పంవల్ల, దర్శనంవల్ల, స్పర్శమువల్ల, తపోవిశేషములచేత, పూర్వులకు సంతానం కలిగింది. వారు ఉజ్జ్వలములైన అత్యంత తపస్సిద్ధులు కలవారు. ప్రతియుగమందు దక్షుడుమున్నగు మునిసత్తములు కలుగుచుందురు. మరల నిరోధింపబడుచుందురు. విద్వాంసులు వారి విషయములలో మోహించెందరు. వీరికి పూర్వం కనిష్ఠత్వం, శ్రేష్ఠత్వం కూడా లేదు. తపస్సు, ప్రభావం - ఈ రెండే వారి కనిష్ఠత్వ-శ్రేష్ఠత్వములకు కారణం'.

ఒకవేళ నిషేకము ప్రారంభమున ఉన్నంతమాత్రమున ఈ సూత్రమునకు కలిగే గొప్పతనం ఏమిటి? అంటే, ఆ విషయంచెప్పబడుతున్నది.

నిషేకముతో ప్రారంభమైన సంస్కారములు కలవారలకే శ్రోత్రియత్వం, ధర్మశాస్త్రాధికారిత్వం, బ్రహ్మశరీరత్వం కలుగునని బోధాయనాదులు చెప్పినారు.

ఎట్లనగా--

గర్భసంస్కారమగు నిషేకమునందును, జాతకర్మాదిసంస్కారములందును, శాస్త్రప్రకారం వేదమంత్రములతో సంస్కృతులైనవారే వ్రతమును పూర్తిచేసినవారు కావటంచేత పూర్ణులు.

శ్రోత్రియా ఇతి విజ్ఞేయాః శాఖాపారాశ్చ యే ద్విజాః ।
విధివత్ గృహ్యతే పాణిమ్మృతా చీర్ణవ్రతాస్తుతే ॥
మంత్రవత్సంప్రయోగేన బ్రాహ్మణ్యం గర్భమాదధుః ।
నిషేకాద్యాః శ్మశానాంతాః సత్క్రియా బ్రాహ్మణాశ్రితాః ॥ ఇతి.

యాజ్ఞవల్క్యః--

నిషేకాద్యాః శ్మశానాంతాః తేషాం వై మంత్రతక్రియాః ।
గర్భాధానమృతౌ పుంసవనం స్పందనాత్పురా ॥ ఇతి.

మనుః--

నిషేకాది శ్మశానాంతాః మంత్రైర్యస్యోదితాః క్రియాః ।
తస్య శాస్త్రేఽధికారోఽస్మిన్ జ్ఞేయో నాన్యస్య కస్యచిత్ ॥ ఇతి.

బోధాయనే--

యతో ఏతద్ధత మిత్యాదినా సూత్రాదౌ వివాహపూర్వకత్వేనోక్తమ్.

ఆపస్తంబేన-- అథ కర్మాణ్యాచారాద్యాని గృహ్యంతే ఇత్యారభ్య ఉపనయనం వ్యాఖ్యాస్యామ ఇతి.

భారద్వాజ సత్యాషాఢాభ్యామాశ్వలాయనేన చ--

ఉక్తాని వైతానికా ని త్యారభ్య వైశ్వదేవ పూర్వకత్వేన.

ద్రాహ్యాయణేన-- అథాతో గృహ్యకర్మాణి ఉదగయన-పూర్వపక్ష ఇత్యారభ్య ఆచారాదిత్వేన.

కాత్యాయనశ్చ--

అథాతో గృహ్యస్థాలీపాకానాం కర్మే త్యారభ్య ప్రతిపాదితవాన్. అథ నిషేకాది సంస్కారాన్ వ్యాఖ్యాస్యామ ఇత్యారభ్య నిషేకపూర్వకత్వేన భగవతా విఖనసైవ ప్రతిపాదితమ్.

ఏవం చ నిషేకపూర్వకత్వేనోక్తత్వాదస్య సూత్రస్య సర్వసూత్రోత్తమత్వం ..తత్సూత్రోక్త ధర్మానుష్ఠానేనైవ తత్సూత్రిణాం సర్వోత్కృష్టత్వంచోప ..్యతే ఇతి శ్రుతి స్మృతి పురాణాది ముఖేన ప్రతిపాదితమితి నిరూపితః ..మో హేతుః.

స్వశాఖాపారంగతులైన ద్విజులు శ్రోత్రియులనబడతారు. వారు వ్రత మును సాంగముగ అనుష్ఠించినవారు కావున, సుసమయమున పాణిగ్రహణం చేసికొంటారు. వేదోక్తప్రకారమైన సంస్కారంతో బ్రాహ్మణస్త్రీయందు గర్భమును ఆధానంచేస్తారు. నిషేకాది శ్మశానాంతములగు సత్కర్మలు బ్రాహ్మణాశ్రితములు.

యాజ్ఞవల్క్యుడు- నిషేకాది శ్మశానాంతములగు సంస్కారములు బ్రాహ్మ ణులకు వేదమంత్రములతో చేయాలి. ఋతుకాలంలో గర్భాధానం, గర్భస్పందనకు పూర్వం పుంసవనం ఉంటాయి.

మనువు- నిషేకాది శ్మశానాంతములగు క్రియలు సమంత్రకంగా జరిగిన వారికే ఈ శాస్త్రమందు అధికారం. ఇతరులకు ఎవ్వరికీ ఆ అధికారంలేదు.

బోధాయనుడు- ఎందువలన ఇది హోమం చేయబడినదో ఇత్యాదిగా సూత్రాదియందు వివాహపూర్వకత్వముగా చెప్పినాడు.

ఆపస్తంబుడు- తరువాత ఆచారాది కర్మలు తీసికొనబడుచున్నవి- అని ప్రారంభించి, ఉపనయనమును వ్యాఖ్యానింతుము అని చెప్పినాడు.

భారద్వాజ సత్యాషాఢులు, ఆశ్వలాయనుడు-

ఇంతవరకు వైతాలిక విలువలు (– యజ్ఞశాలయొక్క పందిరిలో చేసే కర్మలు) చెప్పబడినవి- అని ప్రారంభించి వైశ్వదేవపూర్వకంగా అని చెప్పినారు.

ద్రాహ్యాయణుడు- తరువాత, ఇందువల్ల, గృహ్యాకర్మలు, ఉదగయన పూర్వ (= ఉత్తరాయణ శుక్ల) పక్షములందు అని ప్రారంభించి ఆచారాదిగా చెప్పెను.

కాత్యాయనుడు కూడా, తరువాత గృహ్యాస్థాలీపాక కర్మలు అని ప్రారం భించి ప్రతిపాదించెను.

తరువాత నిషేకాది సంస్కారములను వ్యాఖ్యానింతుము అని ప్రారం భించి, భగవంతుడైన విఖనసుడొక్కడే నిషేకపూర్వకంగా ప్రతిపాదించినాడు. ఇట్లు నిషేక పూర్వకత్వం ప్రతిపాదించినది కావటం చేత ఈ సూత్రము ఇతర సూత్రములన్నింటికంటె ఉత్తమమైనది. ఈ ప్రకారం ధర్మం అనుష్ఠిం చటం చేతనే ఈ సూత్రానుయాయులు అందుఱంటె ఉత్కృష్టులవుతున్నారు అని శ్రుతి స్మృతి పురాణాది ముఖంగా ప్రతిపాదింపబడినది. ఇట్లా పంచ మహేతువు నిరూపితమైనది.

# షష్ఠో హేతుః

అథేదానీం శ్రీ వైఖానససూత్రోక్తధర్మానుష్ఠాతౄణామేవ సర్వేభ్యః శ్రేష్ఠతమత్వం సూత్రాంతరేష్వనుక్తం శ్రుతి సిద్ధాష్టాదశ సంస్కారవత్త్వం క్రియాబాహుల్యం చ సంభవతీతి జ్ఞాపయితుం అష్టాదశ సంస్కారప్రతిపాదకత్వాదితి షష్ఠో హేతుర్నిరూప్యతే.

తథా హి--

అథ నిషేకాది సంస్కారాన్ వ్యాఖ్యాస్యామః-

ఋతుసంగమన - గర్భాధాన - పుంసవన-సీమంత - విష్ణుబలి - జాతకర్మోత్థాన - నామకర- ణాన్నప్రాశన - ప్రవాసాగమన - పిండవర్ధన - చౌలోపనయన - పారాయణ - వ్రతబంధవిసర్గోపాకర్మ - సమావర్తన - పాణిగ్రహణా నీత్యష్టాదశశ్రుతిసిద్ధాః.

యథా ముండోపనిషది-ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్తమవరం యేషు కర్మ. ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా జరామృత్యుం తే పునరేవాపియంతి. ఇతి.

శ్రీ వైఖానసే తు క్రియాబాహుల్యమప్యస్తి. తథా హి. అష్టాదశ సంస్కారాః పాకయజ్ఞాశ్చ పృథక్త్వేనోపపాదితాః. వర్షవర్ధనాద్యాస్తు విశేషాః. పంచమహాయజ్ఞ సహితా ద్వావింశద్యజ్ఞాః పంచమహాయజ్ఞానామేకత్వమ్. అప రాశ్చాష్టాదశవ్యతిరిక్తా ఇతి. క్రియాబాహుల్యేన కిమాధిక్యమితి చేత్ ఉచ్యతే. ముండోపనిషది - క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః ఇతి....

# షష్ఠ హేతువు

తరువాత, ఇప్పుడు, శ్రీవైఖానస సూత్రోక్తధర్మములను అనుష్ఠించిన వారే అందరికంటె శ్రేష్ఠతములు, ఇతర సూత్రములందు లేని వేద సిద్ధములైన అష్టాదశ సంస్కారములు, క్రియాబాహుల్యం కలవారు అని తెలుపుటకై, 'అష్టాదశ సంస్కారములు ప్రతిపాదించునది కావటంచేత' అనే షష్ఠహేతువు నిరూపింపబడుతున్నది.

అదియుక్తమే.

తరువాత, నిషేకాది సంస్కారములను వ్యాఖ్యానింతుము-

ఋతుసంగమం, గర్భాధానం, పుంసవనం, సీమంతం, విష్ణుబలి, జాతకర్మ, ఉత్థానం, నామకరణం, అన్నప్రాశన, ప్రవాసాగమనం, పిండ వర్ధనం, చౌలం, ఉపనయనం, పారాయణం, వ్రతబంధం, విసర్గోపాకర్మ, సమావర్తనం, పాణిగ్రహణం- ఈ పదునెనిమిది సంస్కారములు వేదసిద్ధములు.

ఎట్లనగా, ముండకోపనిషత్తులో-

ఇవి తెప్పలు, అదృఢములైన యజ్ఞరూపాలు పదునెనిమిది చెప్పబడి నవి. వీటియందు కర్మకలాపము తక్కువగా ఉంటుంది. ఈ శ్రేయస్సును అభినందించే మూఢులు మరల మరల జరామృత్యువులను పొందుతూ ఉంటారు.

శ్రీవైఖానసమందైతే కర్మకలాపము ఎక్కువగా ఉన్నది. అది యుక్తమే. అష్టాదశసంస్కారములు, పాకయజ్ఞములు, వేర్వేరుగా ప్రతిపాదింపబడినవి. వర్షవర్ధనాదులు ( = ఆయుష్షను పెంచేవి) విశేషములు. పంచమహాయజ్ఞ ములతో కూడిన 22యజ్ఞములు - వీటికి ఏకత్వం చెప్పబడినది. మరియును అష్టాదశసంస్కారములకంటె అధికంగా చెప్పబడినది.

క్రియాబాహుల్యం చేత ఈ సూత్రమునకు వచ్చే ఘనత ఏమిటి? అంటె వినుడు.

క్రియావంతః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః స్వయం జుహ్వత ఏకర్షిం శ్రద్ధయంతః. తేషామేవైతాం బ్రహ్మవిద్యాం వదేత ఇతి చ శ్రూయతే.

బోధాయనః --

తస్మాద్యః కశ్చన క్రియావాన్ సతామనుమతాచారస్య శ్రోత్రియస్య ఏవ విజ్ఞేయః ఇతి. కించ-కర్మభూయస్త్వాత్ ఫలభూయస్త్వంచ యథోపాసనం ఫలమితి న్యాయాత్ సిద్ధ్యతి.

అతః - అష్టాదశసంస్కార ప్రతిపాదకత్వాదస్య సూత్రస్య శ్రేష్ఠత్వం ఏతత్సూత్రిణాం సర్వోత్కృష్టత్వం చోపపద్యత ఇతి నిరూపితః షష్ఠో హేతుః.

# సప్తమో హేతుః

అథ శ్రీ వైఖానససూత్రస్య ఇతరసూత్రాపేక్షాభావాత్ స్వాతంత్ర్య మస్తీతి జ్ఞాపయితుం సాంగక్రియాకలాపవత్త్వాదితి సప్తమో హేతుః నిరూప్యతే. తథాహి - అత్ర సూత్రే అష్టాదశ సంస్కారాః శారీరాః ప్రసిద్ధాస్సాంగాః ఏవ ప్రతిపాదితాః. అథాంకురార్పణ విధిం వ్యాఖ్యాస్యామః ఇత్యారభ్య ఖండద్వయేనాంకురార్పణ ముక్తమ్. సాయం స్థండిలే సహస్రం పిష్టేన సోమరూపాణి కరో తీత్యత్ర విశేషేణ స్థండిలాది ప్రతిపాదనమ్. శతాభిషేకం పూర్వాహ్ణే పుణ్యాహం ద్విజభోజనమ్.

ఇత్యారభ్య -

**సాయం గోమయసంలిప్తే స్థండిలే ప్రాగనున్నతే ।**
**ప్రాచీరేఖా ద్విపంచాశత్సంఖ్యయా తత్ర సంలిఖేత్ ॥**
**ఉదీచీశ్చ తథా రేఖా ద్వాత్రింశత్సంఖ్యయా లిఖేత్ ।**

క్రియావంతులు, శ్రోత్రియులు, బ్రహ్మనిష్ఠులు, ఒక్క ఋషిపైన శ్రద్ధకలవారై స్వయంగా హవనం చేస్తారు. అట్టివారికే బ్రహ్మవిద్యను ఉపదేశింపవలెను అని వినబడుచున్నది.

బోధాయనుడు--

అందువల్ల ఎవడైనా సరే ! క్రియావంతుడైనవాడు, సత్పురుషులకు సమ్మతమైన ఆచారపరుడైన శ్రోత్రియుని నుండియే తెలుసుకోవలెను. మరియును, కర్మ బాహుల్యంవల్ల ఫలబాహుల్యం కూడా ఉంటుంది. కావున, ఉపాసనకొద్దీ ఫలం అనే న్యాయంచేత ఈ విషయం సిద్ధమవుతున్నది. ఇట్లా అష్టాదశసంస్కార ప్రతిపాదకం కావటంచేత ఈ సూత్రశ్రేష్ఠత్వం, ఈ సూత్రానుయాయుల సర్వోత్కృష్టత్వం ఉపపన్నమవుతున్నది. ఇట్లా షష్ఠహేతువు నిరూపితమైనది.

# సప్తమ హేతువు

ఈ వైఖానససూత్రం ఇతరసూత్రములపై ఆధారపడదు కావున ఇది స్వతంత్రమనే విషయం తెలుపుటకై 'సాంగక్రియాకలాపం కలది' అనే సప్తమహేతువు నిరూపించబడుతున్నది.

అది యుక్తమే.

ఈ సూత్రములోని అష్టాదశసంస్కారములు ప్రసిద్ధములు; సాంగములుగా ప్రతిపాదింపబడినవి.

తరువాత అంకురార్పణ విధిని వ్యాఖ్యానిస్తాము అని ప్రారంభించి, అంకురార్పణ విధిని రెండుఖండములలో చెప్పినాడు. సాయంత్రం స్థండిలము (= మట్టి, దానిపై బియ్యపు పిండి పరచి సిద్ధం చేసిన చిరువేదిక) నందు పిష్టం (= పిండి) తో వేయి సోమరూపములు చేయుచున్నాడు అనుచోట స్థండిల విషయం కూడా సాంగంగా ప్రతిపాదింపబడినది. పూర్వాహ్ణమున శతాభిషేకము, పుణ్యాహం, ద్విజభోజనం అని ప్రారంభించి, సాయంత్రం గోమయంతో అలికిన స్థండిలమందు- అది తూర్పున తగ్గగా ఉండాలి- 52 సంఖ్యగల రేఖలను తూర్పుదిశను గీయవలెను. ఉత్తరపు దిశను 32రేఖలను గీయవలెను.

ఇత్యాదినా శతాభిషేక ప్రయోగశ్చ ఉక్తః.

తథా-

ధౌత వస్త్రధారిణౌ స్యాతా మిత్యారభ్య
దీపాద్యలంకృతే గేహే ప్రీహినాస్త్యర్య తత్రవై ।
చర్మాభావే కటం వాపి తదూర్ధ్వే వస్త్రమాస్తరే దితి ॥
శేష హోమాంత హోమాంతే ఆసీనా తత్ర చర్మణి ।
విసృజామి వ్రతంచేతి తద్వృతం చర్మ సంత్యజేత్ ॥
ఇత్యాదినా అగ్నిద్వయ సంసర్గ ప్రకారశ్చ ప్రతిపాదితః ॥

పుత్రపరిగ్రహ ప్రకారశ్చ--

త్యాగవిషయదానేషు ప్రోక్తేష్వపి తతస్స్మృతౌ ।
ఏకం న దద్యాన్నో గృహ్యాత్ న స్త్రీ భర్తృరనుజ్ఞయా ॥

ఇత్యాదినా బ్రహ్మమేధవిధిస్తు--

సంస్కారో బ్రహ్మనిష్ఠానాం సదాచారవతామపి ।
బ్రహ్మమేధో ఽతి ఫలదో న సర్వేషాం ద్విజన్మనామ్ ॥

ఇత్యాదినా వృషోత్సర్గవిధిస్తు--

వృషోత్సర్గవిధిం వక్ష్యే యేన ప్రేతత్వమోచనమ్ ।
స్నాత్వా ఽథ వాస్తుహోమాంతే ప్రేతత్వస్య విముక్తయే ॥

ఇత్యాదిభిః ఏవం అత్రానుక్తాని సర్వాణి గృహ్య పరిశిష్టే ప్రోక్తాని ఇతి వేదితవ్యమ్. అనేన అనంతస్థిరఫలప్రాప్తిదర్శితా. అతః సూత్రాంతర నైరపేక్ష్యాత్ సర్వసూత్రోత్తమత్వం స్వాతంత్ర్యం చ ఘటత ఇతి నిరూపిత స్సప్రమో హేతుః.

ఇత్యాదిగా శతాభిషేక ప్రయోగం వివరింపబడినది.

ఉదుకబడిన వస్త్రములు ధరించినవారు (ఇరువురు) కావలెను అని ప్రారంభించి, దీపాదులచేత అలంకరింపబడిన గృహమున, బియ్యముపరచి, దానిపై చర్మమునుగాని చాపనుగాని పరచి, దానిపై వస్త్రమును పరచవలెను. శేషహోమాంతమగు హోమాంతమందు, ఆచర్మము మీద ఆ ఇరువురు కూర్చుండి, ఈ వ్రతమును విసర్జించుచున్నాము అని ఆ వ్రతమును చర్మమును విసర్జించవలెను. ఇత్యాదిగా అగ్నిద్వయ సంసర్గ ప్రకారం కూడా ప్రతిపాదింపబడినది.

పుత్రపరిగ్రహ (= దత్తస్వీకార) ప్రకారంకూడా--

త్యాగవిషయక దానములు స్మృతులయందు వర్ణింపబడినను భర్త అనుమతి లేకుండా స్త్రీ ఒక్కణ్ణి ఇవ్వకూడదు, తీసుకోకూడదు. ఇత్యాదిగా దత్తస్వీకారం వర్ణింపబడినది.

బ్రహ్మమేధవిధి అయితే--

సదాచారవంతులైన బ్రహ్మనిష్ఠుల సంస్కారం బ్రహ్మమేధం. అది మహాఫలదాయకం. ఇది అందరు ద్విజులకు వర్తింపదు. ఇత్యాదిగా వర్ణింపబడినది.

వృషోత్సర్గ విధి అయితే--

వృషోత్సర్గ (=ఎద్దును అంబోతుగా విడిచిపెట్టడం) విధిని చెబుతాము. దాని వలన ప్రేతత్వ విమోచనమగును. స్నానంచేసి, శాస్త్ర హోమాంతమందు ప్రేతత్వ విముక్తికై వృషోత్సర్గమును చేయవలెను (అపరకర్మలో 11వ రోజున దీనిని చేస్తారు). ఇట్లా ఇక్కడ చెప్పబడిన విషయములన్నియు ఈ సూత్రం యొక్క పరిశిష్ట భాగమైన గృహ్యప్రకరణమందు వర్ణింపబడనవని తెలియవలెను. వీటిచేత అనంతస్థిరఫలప్రాప్తి చూపబడినది. అందుచేత ఇతర సూత్రములను కోరకుండా అన్నియు ఇందున్నవి కావున ఈ సూత్రము ఉత్తమమైనది, స్వతంత్రమైనది అనే సప్తమ హేతువు నిరూపింపబడినది.

# అష్టమో హేతుః

ఇదానీం తావత్ శ్రుతిస్మృతిపురాణాదిభిః సర్వోత్తరత్వే నావగతస్య శ్రీవైఖానససూత్రస్య అఖిల శిష్టపరిగృహీతత్వమస్తీతి దర్శయితుం మన్వాద్యైః స్వీకృతత్వాదితి అష్టమో హేతుః నిరూప్యతే.

తథాహి—

మనుః—

అతః పరం ప్రవక్ష్యామి ధర్మం వైఖానసాశ్రయమ్ ।
ఇత్యారభ్య పుష్పమూలఫలైర్వాపి కేవలైర్వర్తయేత్సదా ।
కాలపక్వైః స్వయం శీర్ణై ర్వైఖానసమతే స్థితః ॥ ఇతి.

వ్యాసః—

మూలైరేకే ఫలైరేకే పుష్పైరేకే దృఢవ్రతాః ।
వర్తయంతి యథాన్యాయం వైఖానసమతే స్థితాః ॥ ఇతి.

గౌతమః—

శ్రామణకేనాగ్నిమాధాయాఽగ్రామ్యభోజీ. ఇతి.

యమః—

శ్రామణకవిధానేన సాయం ప్రాతరుపస్పృశేత్ ఇతి.

శంఖలిఖితౌ—

శ్రామణకేనాగ్ని మాధాయ కాలే కురువింద వేణు శ్యామాక నీవారాదిభిర్వర్తయేత్. ఇతి.

# అష్టమ హేతువు

శ్రుతిస్మృతి పురాణాదులచేత సర్వోత్తమమైనదని అవగతమైన వైఖానస సూత్రం అఖిల శిష్టపరిగృహీతమని చూపుటకై 'మన్వాదులు స్వీకరించినది కావటంచేత' అనే అష్టమ హేతువు నిరూపింపబడుతున్నది.

అది యుక్తమే.

మనువు --

అటుతరువాత, వైఖానస విధానమైన ధర్మమును తెలుపుదును అని ప్రారంభించి, పుష్ప-మూల- ఫలములతోనూ, కేవలం కాలపక్వములై స్వయంగా రాలిపడిన వాటితోనూ జీవిక నిర్వహించుకొంటూ వైఖానసమతమున ఉండవలెను.

వ్యాసుడు--

వైఖానస మతంలో ఉన్నవారై, దృఢవ్రతులైన కొందరు మూలముల తోనూ, మరికొందరు ఫలములతోనూ, ఇంకా కొందరు పుష్పములతోనూ శాస్త్రం ప్రకారం జీవిక నిర్వహించుకొంటారు.

గౌతముడు--

శ్రామణక విధానంతో అగ్న్యాధానం చేసి, అగ్రామ్య భోజికావాలి.

యముడు--

శ్రామణక విధానంతో ప్రాతః సాయంకాలములందు స్నానం చేయవలెను.

శంఖలిఖితులు--

శ్రామణక విధానంతో అగ్న్యాధానం చేసి, భోజన సమయంలో కురువింద వేణు - శ్యామాక - నీవారాదులతో గడుపవలెను.

హారీతః--

వానప్రస్థో గ్రామ్యా ఓషధీః పరివర్జయేత్. త్రేతాగ్నీనాం స్థానే శ్రామణకం వాఽగ్నిమాధాయ వల్కల శాణ చర్మ కుశ ముంజ విదలకం వా వసానో వైఖానస ప్రోక్తేన విధినా వానప్రస్థో విఖనా భవతి. అనుజ్ఞాయి కోఽనుప్రస్థాయిక శ్చేతి.

వసిష్ఠః—

శ్రామణకేనాగ్ని మాధాయా ఽహితాగ్ని వృక్షమూలికః. ఇతి.

బోధాయనః--

వానప్రస్థో వైఖానసశాస్త్ర సముదాచార ఇతి.

ఆపస్తంబః--

ఏకాగ్నిరనికేతః స్యా దితి.

అస్య ధర్మకపర్దీ–

గార్హపత్యాదినాం త్రేతాగ్నీనాం స్థానే. యస్యైకోఽగ్నిః ఔపాసన ఏవ వైఖానస సూత్రే దృష్టత్వాత్. పాణిగ్రహణ నిమిత్తత్వాదౌపాసనస్య.

జైమినీయసూత్రే సామిక చాతుర్మాస్యప్రకరణే-

భారద్వాజపూర్వం యథా వైఖానసపూర్వం పంచమేతి.

అత్రోభయత్ర అత్రివ్యాఖ్యానమ్-

షోడశర్త్విజాం మధ్యే భారద్వాజ సూత్రిణం ప్రస్తోతారం, వైఖానస సూత్రిణం ప్రతిహర్తారం వరయేత్ ఇతి.

కపింజల సంహితాయామ్–

యాజనాధ్యాపనయుతః శిష్యానుగ్రహకారకః ।
ఆచార్య ఇతి విజ్ఞేయో మంత్ర తంత్ర పరాయణః ॥
ఆశ్రమే వా వనే వాపి పుత్రదార సమాహితః ।

T.T.D. Religious Publications Series No. 432

Price : Rs. 25/-



## తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
## తెలుగు ప్రచురణలు



| | | |
|---|---|---|
| 1. | సప్తపది | 5-00 |
| 2. | పురుషసూక్తములు | 5-00 |
| 3. | నారాయణీయం | 45-00 |
| 4. | యోగసర్వస్వము | 40-00 |
| 5. | గీతారహస్యం-సంపుటం.1 | 40-00 |
| 6. | గీతారహస్యం-సంపుటం.2 | 45-00 |
| 7. | గీతారహస్యం-సంపుటం.3 | 35-00 |
| 8. | కళ్యాణ సంస్కృతి | 7-00 |
| 9. | భజగోవిందం | 5-00 |
| 10. | తిరుమలలో తిరుప్పావై | 5-00 |
| 11. | శ్రీమద్భాగవతం-రెండవ స్కంధము | 55-00 |
| 12. | రామాయణము-ఉషశ్రీ | 35-00 |
| 13. | భారతీయ సంస్కారములు | 25-00 |
| 14. | తిరుమల సమయాచారములు | 15-00 |
| 15. | లలితా సహస్రనామం | 10-00 |
| 16. | రామచరిత మానసము | 40-00 |
| 17. | శ్రీ వేంకటేశ్వర వైభవం | 40-00 |
| 18. | యజ్ఞోపవీ తత్త్వ దర్శనం | 10-00 |
| 19. | అద్వైతాక్షర మాలిక | 75-00 |
| 20. | ఆర్ష విజ్ఞాన సర్వస్వం - సంపుటం 1 | 50-00 |
| 21. | మహాభారతం అరణ్యపర్వం-1 | 125-00 |
| 22. | మహాభారతం అరణ్యపర్వం-2 | 150-00 |
| 23. | మహాభారతం విరాటపర్వం | 160-00 |
| 24. | దయాశతకం | 15-00 |

For further Titles/Copies please contact The P R O , Sales Wing of publications, T T Ds , Tirupati - 517 501